R/R Through

C. Form

Case No.

TR. or RR. or Challan No.

Dated

Checked by

TOTAL Rs.

E. & O.E.

60 సంవత్సరముల పంచాంగము

# సిద్ధాంతసరళి

※

గ్రంథకర్త :

నిమ్మగడ్డ వేంకట శివరామబ్రహ్మశాస్త్రి

※

పుస్తకాలయము,
నిజామాబాద్.

కొండా శంకరయ్య
సికింద్రాబాదు - హైదరాబాదు & వరంగల్.

1982 Rs. 15-00

# ప్రార్థన

శ్లో॥ అచింత్యావ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే
సమస్త జగదాధార మూర్తయే బ్రహ్మణేనమః॥

ఊహింప నలవిగాని యగోచర రూపముగల గుణాతీతంబై సచ్చిదానంద స్వరూపుడును లోకాధారమూర్తియైన పరమేశ్వరునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే
యంనత్వా కృతకృత్యా స్స్యు స్తం నమామి గజాననం.

బ్రహ్మాది దేవతలు, తమ తమ కార్యారంభమున నెవనికి నమస్కరించి ధన్యులైరో ఆ గజముఖదేవునికి నమస్కరించుచున్నాను.

శ్లో॥ చివుకులవంశ సముద్భవ మమలమతిం సారశాస్త్రపారీణం
వేంకటరమణ సుధీంద్రం విజ్ఞానాబ్ధిం నమామి గురువర్యం
గోళాగమ నిష్ణాతం గ్రహతారా దర్పణ ప్రకర్తారం
పంచాంగ బోధకారం శ్రీ వేంకటరమణసూరిణం వందే॥

చివుకులవారి వంశమం దుద్భవించినట్టియు, నిర్మలమనస్కులును సూర్యసిద్ధాంతాది జ్యోతిషశాస్త్రవిశారదులును, విజ్ఞాననిధులును, గ్రహతారాదర్పణ, పంచాంగ బోధ, కల్యాణగణితాది గ్రంథకర్తలును, దైవజ్ఞసార్వభౌమ బిరుదాంకితులునగు వేంకటరమణశాస్త్రి గురువర్యులకు నమస్కరించుచున్నాను.

## ఇష్టదేవతా ప్రార్థన

శ్లో॥ అభినవజలదాభం మందహాసాభిరామం
కలిత కనకచేలం పాలితాశేషలోకం
నిజతను సువిలాసాలంకృతాశేషభూషం
తిరుమల నగవాసం వేంకటేశం భజేహం.

శ్లో॥ కలక్వాణాం వీణాం కనకమయశోణాం ధృతవతీం
లసద్వేణీం వాణీ మధరజితబింబా మనుదినం
శరచ్చాంద్రచ్ఛాయా విబుధజనవంద్యాం స్మితదృశాం
విధేర్జాయాం ధ్యేయాం నిగమగుణమేయామనుమహే.



## గమనిక :—

పాఠకులారా !

మేము కొన్నేండ్లనుండి "శాస్త్ర గ్రంథములు" అచ్చొత్తించి ఆంధ్రలోకమున కందజేయవలయు నను తలంపుతో "నీ ఆర్షవైదిక గ్రంథమాలను" స్థాపించి ఇదివరకు పన్నెండు గ్రంథములను వెలువరించితిమి. ఆంధ్రములో పంచాంగము వ్రాయు క్రమముగల పుస్తకములు లేనందున, ఈ గ్రంథము వ్రాయుటకు తగినవారెవ్వరాయని విచారించి, సుప్రసిద్ధ పంచాంగకర్తలును, మహాపండిత ప్రకాండులునునగు బ్రహ్మశ్రీ నిమ్మగడ్డ వేంకటశివ రామబ్రహ్మశాస్త్రిగారిచే వ్రాయించి, వారిచే సర్వ హక్కుల సహా నీ 'సిద్ధాంతసరళి' మా ఆర్షవైదిక గ్రంథ మాలలో త్రయోదశ భూషణముగా వెలువరించుటకు అనుమతి పొందియున్నాము. ఈ గ్రంథమాలా సంపాదకులచే చక్కగా పరిష్కరింపజేసి, విశేష ధన వ్యయ ప్రయాసముల కోర్చి, మీ కరకమలముల కందించితిమి. ఇందు కొంత గాని, అంతయు గాని, మార్పులుచేసి గాని అచ్చొత్తించువారిపై మాకు గలుగు నష్టమును సివిల్, క్రిమినల్ చర్యల ద్వారా రాబట్టుకొనబడునని యిందు మూలముగా హెచ్చరించడమైనది.

6—2—1951 ఇట్లు

సికింద్రాబాద్. కాపీరైటు హక్కుదారులు,

ప్రకాశకులు

శ్రీరస్తు

# సిద్ధాంత సరళి ప్రశస్తి

శ్లో॥ సిద్ధాన్తసంహితా హోరారూప స్కన్ధత్రయాత్మకమ్
వేదస్య నిర్మలం చక్షు ర్జ్యోతిశ్శాస్త్ర మనుత్తమమ్.

ఈ జ్యోతిశ్శాస్త్రము వేదపురుషునకు తేజోవంతమగు నేత్రము. ఇది వేదమునందలి కర్మభాగమును, ఉపాసనాభాగమును, ఏ సమయమున జేయవలయును. ఎవ్వి తన కనుకూలలు, వీటిని నిర్ణయించును. గ్రుడ్డివాఁడు నడచునపుడు యెత్తుపల్లములలో రాళ్ళ ముండ్లలోను బాధపడుచు బురద, పేడ మొదలగు వాటిలో కాలిడుచు పలుమారు దుఃఖించు నటుల—ఎవరైనను మంచి సమయమును విచారించక కార్యము లొనర్చుచో కష్టపడుదురు. మఱియు తన కనుకూలము గాని మంత్రోపాసనఁ జేయుటచే దుఃఖించుచుందురు. కాన, తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాది శుభలగ్నమున కర్మానుష్ఠానముఁ జేయువానికి సకల సంపదలు సిద్ధించును. సిద్ధారి చక్రశోధనతో నుపదేశయోగ్య నక్షత్రములందు మంత్రము నుపాసించుటవలన కోరిన ఫలమును పొందుదురు.

## జ్యోతిశ్శాస్త్ర విశేషము.

జన్మించిన తోడనే ఆ శిశువునకు రాబోవు కష్టసుఖములను దెలిసికొని వాటిలో జాగ్రతగా సంచరించుచు సుఖించవచ్చును. పుట్టిన తరువాత (౧౬) సంస్కారముల నే సమయమున జేయవలయు ననువిజ్ఞానమును బొంది అదే రీతిగా నడచి తమ శిశువులను ధర్మవీరులనుగా నొనర్పవచ్చును. నానావిధములగు కార్యములనుగూర్చి ప్రశ్నించి సమాధానమును బడయుచు నా పనులను నిర్వహించుకొనవచ్చును.



## పంచాంగముల కలత.

జ్యోతిశ్శాస్త్రమునందున్న పై విశేషములలో పంచాంగ విషయమునందలి సమస్త విషయములను గుర్తించుట ప్రథమ సోపానము. ఇదియిట్లుండ ప్రస్తుత కాలమున పంచాంగముల నచ్చువేయించు సిద్ధాంతు లాంధ్రదేశమున విశేషముగా నగపడుచున్నందుకు సంతోషమునకు మారుగా పరితాపమే గలుగుచున్నది. ఎందుకనగా:—(1) పంచాంగములను జేయువారిలో నెక్కువ సంఖ్యాకులు గణితముజేయు పరిపాటియే లేనివారు. (2) స్వల్పముగా గణితము దెలిసినను సుప్రసిద్ధ పంచాంగములను కాపీ నొనర్చువారును. (3) గణకానందరీత్యా కొంతవఱకు పంచాంగమును సిద్ధపరచినను నిర్ణయములను స్పష్టముగా వ్రాయలేనివారును. (4) బద్ధకముతో నెక్కువ కాలము కూర్చొని వ్రాయజాలక నేదోయొకటి వ్రాసి పంచాంగమును పూర్తిఁజేసి ధనము నార్జించువారును బయలుదేరుచుండిరి. ఈ వికృతి సంవత్సర విజయదశమియందు "త్యాజ్యఘటికలను" కొందరు వ్రాయనేలేదు. మరికొందరు రెండు పర్యాయములు వ్రాసిరి. కొన్ని పంచాంగములలో ప్రాతఃకాలమున వ్రాసిరి. మఱికొన్నిటిలో వేరు సమయమున వ్రాసిరి. ఈరీతిగా పలువురు సిద్ధాంతులు పలు రకములుగా వ్రాయుటవలన పాఠకులకు పంచాంగములపై విశ్వాసము దొలఁగుచున్నది. విజయదశమి విశేష దిన మగుటచే ననేక పంచాంగములను చూడవలసివచ్చినది. ఈరీతిగా పంచాంగములపై విమర్శనఁజేయ మొదలిడినచో ననేక కలతలు లభించును.

## పంచాంగ స్వరూపము.

ఆదిపురుషుడు మహాకాలము నాధారముగా దీసికొని మూలప్రకృతిని గుణవైషమ్యముగా నొనర్చి చతుర్ముఖునిద్వారా ననేక బ్రహ్మాండములను సృష్టించెను. ఇందుగల సమస్త ప్రాణికోటియు కాలాధీనముగా నడచుచున్నది, ఇందుకు చంద్రసూర్యులు, గ్రహతారలును, ఆకసమున నిదర్శనములు. జీవనదులు ప్రవహించుట, కొండలు సముద్రములు నిలిచి యుండుట, ఇవి భూభాగమున దృష్టాంతములు. ఇట్టి కాలగతికి విరుద్ధముగా నడచువార లెట్టి మేధావంతులైనను. బలశాలులైనను క్లిష్టపరి

స్థితిని పొందుదురు. భారతీయులకు పాశ్చాత్యులు స్వరాజ్యము నొసంగిన సమయమే వీరి కింతవరకును యిక్కట్టులను బ్రసాదించుచున్నది. కాలప్రభావము వ్యర్థమగునా ?

పంచాంగములవలన లాభములు.

ప్రతి మానవుని జీవనముగూడ కొన్ని సంవత్సరములని కాల పరిమితిలోనే జేరినది.

1. తనకుగా నేర్పడిన ఆ క్లుప్తసమయమున నెట్టి మహోన్నత కార్యముల నేరీతిగా నెపుడు జేయవలయును ?
2. జాతకర్మాది సంస్కారము లే సమయమునఁ జేసినచో శిశువులు నీతివర్తనపరులగుదురు ?
3. ఏ ముహూర్తమున నక్షరాభ్యాసము జరిపిన ప్రపంచ విజ్ఞాన నిధులును, వేదాన్తనిష్ణాతలును కాగలరు ?
4. ఏ కార్యము నెపు డొనర్చిన విజయమును పొందెదరు ?
5. ఎట్టి యోగములలో వర్షములు కురియును ?
6. ఏ సంవత్సరమున నే పంటలు విశేషముగా పండును ?
7. ధర లే నెలలలో మార్పుజెందును ?
8. పుణ్యకాల మెప్పుడు ?
9. విషఘటికాది దుష్కాల మే సమయమున ?
10. ఏ వ్రతము నెపుడు జేయుచో సర్వసుఖములు గలుగును ?
11. సంవత్సరాది మొదలు హోళికాపూర్ణిమవఱకుగల పండుగ లెప్పుడు ?
12. పితృదేవతల తృప్తికిగాను దర్శాది శ్రాద్ధదినములెవ్వి ?

అను ప్రశ్నలకు పంచాంగమే సరియగు ప్రత్యుత్తరమిచ్చును. ఇట్టివిశేష ప్రశ్నలను నిర్ణయించుటకై భారతదేశమున పంచాంగప్రచారము ప్రబలముగా నున్నది. వాటిని సక్రమముగా లిఖించుటకై విశేషసహాయము జేయు నీ "సిద్ధాంత సరళి" మానవులకుమహోన్నతకీర్తినిసనుకూర్చును.

మఱియొక విశేషము.

ఇట్టి పంచాంగములు, ముఖ్యమైన కొన్ని జాతక విషయములు, కొన్ని ముహూర్తములును గలిగినవై యుండుచో నవి సంపూర్ణాంగ



శోభితముగా లోకహితప్రవర్తనమునకు మార్గదర్శకములగును. ఇంతియేగాం మహర్షుల యుపదేశరూపములగు ధర్మశాస్త్రనిర్ణయముల నచ్చటచ్చట నలంకరింపఁ జేసినయెడల — మహాకాలస్వరూపుడగు పరమాత్మను పంచాంగ రూపములో విశేషముగా సత్కరించి వారి సహాయమున జన్మరహితులగుదురు. కాన పంచాంగములకు గల ప్రశస్తి విశేషములను గమనించి పంచాంగముల నిర్మించుదురుగాక.

గ్రంథ స్వరూపము.

ప్రస్తుత మీ "సిద్ధాంత సరళి" యను గ్రంథములో ౧ వ అధ్యాయమున షష్టి సంవత్సర ఫలములు, ౨ వ అధ్యాయమున నవనాయకులు, ఉపనాయకులు, వీరల ఫలములు, వర్షాది భాగములు, రవ్యాది గ్రహముల చార ఫలములు, సంక్రాంతి పురుష ఫలములును నిర్ణయింపబడినవి. ఇకముందు 3 వ అధ్యాయమున గ్రహణనిర్ణయములు, వ్రత నిర్ణయములు. వర్ష యోగములు, అర్ఘవిచారము, ఇవి చేరియుండును. ఇక ౪ వ అధ్యాయమున ఆయాతిథులలో వ్రాయఁదగిన విశేషములు, ధర్మశాస్త్ర నిర్ణయములు, ముహూర్తసారము, సంగ్రహ జాతక పరిజ్ఞానము, ప్రశ్న భాగము, మంత్రార్వణము, ఈ విషయములు జేరియుండును.

ఇట్టి విశేష గ్రంథమును ధార్మికజనులు విమర్శించి సర్వాంగ సుందరమగు పంచాంగముల నిర్మించుచు లోకహితప్రవర్తనపరులై దేశసేవలో పాల్గొని ధన్యులగుటకీ "సిద్ధాంత సరళి" సంపూర్ణ సహాయము జేయుననుటలో సంశయములేదు. కావున సుధీజను లీ గ్రంథమును మిగుల నాదరించుదురు గాక యని ప్రార్థన.

ఇట్లు

శ్రీ వైదికకళాభూషణ, సుధీరత్న,
ప్యారకపురి భట్టర్ శ్రీరామాచార్యులు.
ఆర్ష వైదిక గ్రన్థమాలా సమ్పాదకులు.

---

# విషయానుక్రమణిక


| విషయము. | పుట. |
|---|---|
| 1. గురు ప్రార్థన | 3 |
| 2. ఇష్టదేవతా ప్రార్థన | 4 |
| 3. గమనిక | i |
| 4. సిద్ధాంత సరళి ప్రశస్తి | ii |
| 5. విషయానుక్రమణిక | vi |
| 6 ప్రస్తావన | 5 |
| 7. కర్మసాక్షియగు సూర్యుడే కాలస్వరూపుడు | 13 |
| 8. వైవస్వతమనువుయొక్క కాలనిర్ణయము | 26 |
| 9. కలియుగమునందలి శకపురుషులు | 28 |
| 10. పంచవత్సరాత్మకయుగము | 32 |
| 11. ప్రభవాది సంవత్సర ఫలములు | 33 |
| 12, బార్హస్పత్యమానాబ్ద నిర్ణయము | 75 |
| 13. నవవిధ మానములు | 79 |
| 14. గురూదయాబ్ద నిర్ణయ ఫలములు | 82 |
| 15. బార్హస్పత్యమానాబ్దమున క్షయసంవత్సరము | 88 |
| 16. చైత్రద్వయమున సంవత్సరాది నిర్ణయము | 88 |
| 17. చైత్రాదిమాసములకు వైదిక నామములు | 93 |
| 18. ప్రత్యబ్ద నవనాయక నిర్ణయము | 94 |
| 19. ఉపనాయక నిర్ణయము. | 96 |
| 20 రాజగ్రహఫలములు (చైత్రశుక్ల ప్రతిపద్వారేశుడు) | 97 |
| 21. మంత్రిగ్రహఫలములు (మేషసంక్రమణవారేశుడు) | 103 |
| 22. గ్రహములకు రాజ మంత్రిత్వఫలము | 106 |
| 23, సేనాధిపతి ఫలములు (సింహసంక్రమణవారేశుడు) | 106 |
| 24. సస్యాధిపతి ఫలములు (కటకసంక్రమణవారేశుడు) | 109 |
| 25, ధాన్యాధిపతి ఫలములు (ధనుస్సంక్రమణవారేశుడు) | 112 |
| 26. అర్ఘాధిపతి ఫలములు (మిథునసంక్రమణ వారేశుడు) | 114 |
| 27. మేఘాధిపతి ఫలములు (ఆర్ద్రాప్రవేశకాలికవారేశుడు) | 116 |
| 28. రసాధిపతి ఫలములు (తులాసంక్రమణవారేశుడు) | 117 |





| | |
|---|---|
| 29. నీరసాధిపతి ఫలములు (మకరసంక్రమణవారేశుడు) | 121 |
| 30. పురోహితాద్యుపనాయకుల ఫలములు | 123 |
| 31. నవమేఘ ఫలములు | 127 |
| 32. వాయు ప్రమాణ నిర్ణయము | 130 |
| 33. వర్షపరిమాణ నిర్ణయము | 130 |
| 34. ఆఢకధారుని నిర్ణయము | 133 |
| 35. వాయుఫలములు | 136 |
| 36. విద్యుత్ నిర్ణయము | 138 |
| 37. గర్జిత నిర్ణయము | 140 |
| 38. సముద్రి నిర్ణయము | 142 |
| 39. భూవాహక శేషాది నిర్ణయము | 144 |
| 40. పశుపాలకాది నిర్ణయము | 150 |
| 41. స్థానరక్షకుని నిర్ణయము | 151 |
| 42. గోష్ఠాద్బహిష్కర్త నిర్ణయము | 152 |
| 43. పశునాయక ఫలము | 156 |
| 44. వర్షాదుల నిర్ణయము | 161 |
| 41. గోమాయువృద్ధ్యాదుల నిర్ణయము | 166 |
| 46. పశువిప్రాదుల వృద్ధిక్షయ నిర్ణయము | 169 |
| 47. రాజపూజ్యావమానముల నిర్ణయము | 175 |
| 48. ఫలవృక్షవృద్ధ్యాదుల నిర్ణయము | 179 |
| 49. అధికమాస నిర్ణయ ఫలములు | 184 |
| 50. క్షయమాస నిర్ణయ ఫలములు | 189 |
| 51. సంక్రాంతి నిర్ణయ ఫలములు | 191 |
| 52. ఆర్ద్రాప్రవేశ ఫలము | 195 |
| 53. సముద్రచక్రే రోహిణీవాస ఫలము | 204 |
| 54. జ్యేష్ఠశుక్ల ప్రతిపద్యుక్తవారఫలము | 206 |
| 55. ఆషాఢశుక్లపంచమీయుక్తవారఫలము | 208 |
| 56. ఆషాఢశుక్లస్వాతీయుక్త తిథి ఫలము | 208 |
| 57. ఆషాఢ కృష్ణపక్ష రోహిణీయుక్త తిథి ఫలము | 210 |
| 58. పౌష్య అమావాస్యాయుక్తవారఫలము | 210 |

59. దర్శయుక్తవారఫలము 210
60. చంద్రశృంగోన్నతి నిర్ణయము 212
61. చంద్రోదయలగ్నఫలము 216
62. చంద్రాస్తమయ లగ్నఫలము 217
63. కుజచార ఫలము 218
64. బుధ, గురు, శుక్రచారఫలములు 221
65. శని, రాహు, కేతుచార ఫలములు 222
66, దేశారిష్ట, అనావృష్టి యోగములు 222
67. సంక్రాంతులనుబట్టి ధరలు 228
68. గ్రహస్థితిచే ధరల నిర్ణయము 232
69. సంక్రాంతి ముహూర్త నిర్ణయము 233
70. సంక్రాంతి పురుష నామరూపాది విచారము 244
71. కందాయ నిర్ణయ ఫలములు 268
72. ఆదాయవ్యయ వివేకము 273
73. అగస్త్యాస్తమయోదయములు 284
74. నదీపుష్కర కాలనిర్ణయము 287
75. గురురాశిచార ఫలములు 288
76. శని నక్షత్రచార ఫలములు 293
77. కూర్మచక్ర శని స్థిత రాశి ఫలములు 304
78. నక్షత్రకూర్మచక్ర ఫలములు 305
79. మధ్య దేశములు (జనపదములు) 306
80. తూర్పు దేశములు (జనపదములు) 306
81. ఆగ్నేయదిశ దేశములు (జనపదములు) 306
82. దక్షిణదిశ దేశములు (జనపదములు) 306
83. నైఋతిదిశయందున్న దేశములు (జనపదములు) 307
84. పశ్చిమదిశయందున్న దేశములు 307
85. వాయువ్యదిశయందున్న దేశములు (జనపదములు) 308
86. ఉత్తరదిశయందున్న దేశములు (జనపదములు) 308
87, ఈశాన్యదిశయందున్న దేశములు (జనపదములు) 309

# ప్రస్తావన.

ప్రపంచములోని దేశములకును, మతములకును పితృస్థానము నొందిన దేశము హిందూదేశము. హిందూదేశస్థుల మతము వైదిక మతము. ఈ హిందూదేశమున నివసించువారిని హిందువులని వ్యవహరించుట గలదు. “హీనం చ దూషయ త్యేవ హిందు రిత్యభిధీయతే” అను మేరుతంత్రాదులలో హీనదూషకులగుటను హిందువులని వ్యుత్పత్తి నిరూపించబడినను కేవల యౌగికము కాక నార్యులయందే రూఢముగ నీ శబ్దము ప్రయోగింపఁబడుచున్నది. ఆర్యశబ్దము మహర్షులచే విస్తరించి రూఢశబ్దముగా వాడబడినది. ఆర్యులకందరికి (హిందూదేశస్థుల కందరికి) మతగ్రంథములు తొలుత వేదములు. పిమ్మట వాని యర్థములను వివరించు సకల శాస్త్ర పురాణేతిహాసాదులును. ఇవ్వి సర్వమానవ సాధారణ ధర్మములునుగా, నహింసా సత్యాస్తేయాదులనే గాక, ఆర్యజాతీయ విశేష ధర్మములునుగా వర్ణాశ్రమధర్మాదులను మొత్తముమీద కర్మ భక్తి జ్ఞానయోగములను వివిధాంగ విషయములతో నిరూపించుచున్నవి. ఇందైహికాముష్మిక నిర్వాణరూపసుఖ త్రయప్రాప్తిసాధనములను అధ్యాత్మికాది దైవికాదిభౌతికరూపదుఃఖ త్రియ నివారణోపాయములను, బహు మార్గములతో విస్తరించి నిరూపించుచున్నవి. కాని యిందలి వర్ణాశ్రమాది విశేషధర్మములను మాత్రము అనార్యదేశీయులకు నిషేధించుటచే వారు వీనిని గ్రహించనందున మతాంతరులైరి. హిందూమతము వర్ణాశ్రమాది విశేష ధర్మబద్ధమగుటచే మతాంతరుల కన్న విశిష్టతను సంపాదించినది. కనుక వర్ణాశ్రమాది విశేష ధర్మశూన్యులు ఆర్యులుకాని, హిందువులు కాని కారు. హిందూమతగ్రంథములన్నియు బ్రాహ్మణాది శుద్ధ జాతీయులకును, అనులోమ ప్రతిలోమ సంకీర్ణజాతీయులకును జాతిభేదములబట్టి వారి వారి కనువగు కర్మకాండను విధించుచున్నది. అట్టులా గ్రంథ జాలముచే బేర్కొనబడిన చండాలాంత జాతీయులకును విధించబడిన

కర్మజాలమును ముఖ్యమగు దానిని విడువక నిషేధించబడినదాని నాచరింపక మతగ్రంథ విశ్వాసముతోనున్నవా రందరును హిందువు లనబడుదురు. మతగ్రంథ విశ్వాసముగాని, మతగ్రంథోక్త కర్మకాండమునుగాని విడనాడి మతాంతర విశ్వాసముతో మతాంతరాచారముల నవలంబించు వారే మతమునందైనను స్వమతభ్రష్టులగుదురు.

ప్రపంచమునందలి ప్రతి మతమునను, మతముతో సంబంధించిన, కర్మకాండ కొంతయైనను లేనివారు లేరు. ఏ మతమునందైనను తప్పొప్పులను దెలిసికొనుటకు శాస్త్రమే యాధారముకాని వేరు గతిలేదు. కనుకనే "తస్మా చ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ" అని గీతలో భగవంతుడు చెప్పుచున్నాడు.

హిందూమతము సృష్ట్యాదినుండియు, నేర్పడిన సకల మతములకును ప్రకృతియగుచున్నది. కావున నిది నిత్యసిద్ధము, అనాది నిధనములు నగు వేదముల నాధారపరచికొనియున్నది. ఇట్టి హిందూమతస్థుల కేర్పడిన కర్మకాండను విధించునదియే హిందూధర్మశాస్త్రము.

శాస్త్ర మనఁగా శాసించునది. వేదమతస్థులగు హిందువులకుగల ధర్మములను శాసించునది గనుక హిందూధర్మశాస్త్రమని చెప్పఁబడుచున్నది. ఇట ధర్మ మనఁగా "అభ్యుదయనిశ్శ్రేయసే సాధకత్వేన ధారయతీతి ధర్మః" అను వ్యుత్పత్తిచేత నభ్యుదయమును, నిశ్శ్రేయస మనఁగా మోక్షమును, దన ననుష్ఠించువారికి ప్రాప్తింపఁజేయునదికనుక ధర్మమని నిరూపించబడుచున్నది.

పరమేశ్వరుఁడు తాత్వికముగ నిర్గుణబ్రహ్మమే యయ్యును "ఉపాసకానాం క్షేమార్థం బ్రహ్మణో రూపకల్పనా" అని ఉపాసకుల ననుగ్రహించుటకే సగుణత్వమును గ్రహించి నామరూపాత్మకుఁడయ్యెను. ఆ పరమేశ్వరుని నామమే ప్రథమమున ఓంకారమై తరువాత వేదరాశిగా వ్యక్తమాయెను. ఇట్లు పరమేశ్వరుఁడు వేదరూపముగా భాసించుటచేతనే "అస్య మహాతో భూతస్య నిశ్శ్వసితం యదేతదృగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వవేదః । యస్య నిశ్శ్వసితం వేదాః యో వేదోభ్యోఽఖిలం జగ న్నిర్మమే" ఇత్యాది వాక్యములు వేదములు పరమేశ్వరుని నిట్టూర్పులని వర్ణింపఁబడినవి. వేదములు పర



మేశ్వరునివలన వ్యక్తమైనవి. వేదమే పరమేశ్వరుఁడు. పరమేశ్వరుఁడే వేదము మనకు ఉచ్ఛ్వాసనిశ్వాసములు లేకుండ గతియే లేదుగదా! మనము ఉచ్ఛ్వాసనిశ్వాసములకు కర్తల మెట్లు కామో అటులనే పరమేశ్వరుఁడుకూడా వేదములకు కర్తగాడు. అందువల్లనే "నకశ్చిత్ వేద కర్తా చ" అని మనువు నుడివెను. వేదమునకును పరమేశ్వరునకును అవినాభావ సంబంధ ముండుటఁజేసి వేదము అనాది యనియు, అపౌరుషేయమనియు స్వతః ప్రమాణమనియు విరాజిల్లుచున్నది.

వేదములో "ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా" యని గలదు అనఁగా సర్వజగత్తునకును ధర్మమే ఆధారము. సర్వజగత్తుసక్రమముగ నడచుటకు వేదోక్తధర్మమే మూలాధారము. వైదికధర్మానుష్ఠానమే జగత్కల్యాణకారణమని స్పష్టమగుచున్నది.

వేదములోని ఉత్తరకాండము జ్ఞానయును బోధింప అట్టి జ్ఞానమునకు సాధనమగు కర్మకాండము లేక ధర్మమును, పూర్వకాండము బోధించుచున్నది. ఈ ధర్మానుష్ఠానమువలన జీవునికి చిత్తశుద్ధిగలిగి తద్ద్వారా జ్ఞానబోధ కర్హుడగుచున్నాడు. ఈ ధర్మమే వర్ణాశ్రమధర్మమని పేర్కొనబడుచున్నది. ఈ ధర్మమంతయు జన్మాంతర మున్నదను మూలసిద్ధాంతముపై యాధారపడియున్నది. జన్మాంతరముమీదనే వేదవాఙ్మయమంతయు నాధారపడియున్నది. క్రైస్తవ మహమ్మదీయాది వేదబాహ్యమతముల ప్రకారము జన్మాంతరములేదు. ఆ మతములు ప్రతి జీవునికిని ఒకటే జన్మయనియును, ఆయాజీవులందరిని ఈశ్వరుడే సృష్టించినాడనియు చెప్పును. ఈశ్వరునిచే సృష్టింపఁబడిన జీవులలో కొందరు భాగ్యవంతులుగను, మరికొందరు నిర్భాగ్యులుగను, ఇంక కొందరు కురూపులుగను, గ్రుడ్డివారు, మూగవారుగను, మరికొందరు సౌందర్యవంతులుగను, కొందరు మూఢులుగను మరికొందరు ప్రజ్ఞావంతులుగను సృష్టింపఁబడుట ఎట్లు సంభవించును? ఈశ్వరునకు పక్షపాతబుద్ధి యుండుటకు సాధ్యమా? అట్టి వైషమ్య నైర్ఘృణ్యాదోష భూయిష్ఠుడగువాఁడు ఈశ్వరుడగుటకు వీలుగలుగదుగదా! ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, దయామయుడు అని ప్రతిమతమువారును అంగీకరించుచునే యున్నారుగదా! అట్టియెడ ఈ విషమ సృష్టికి ఈశ్వ

రుకు కానిచో జీవుడే కారణమని చెప్పవలెను. జీవునికి పూర్వజన్మ లేనిచో తన పరిశ్రృత దైన్యాది స్థితులకు కారణమేమి ? ఎవరికి వారు కష్టజీవిగా నుండవలెనని వాంఛింపడుగదా ? కనుక ప్రతి జీవునకు ఈ జన్మకు పూర్వమందు జన్మయుండి తీరవలెను, ఒకే జన్మ యనినచో కొంతమంది బాల్యములోనే అత్యద్భుతమైన ధీశక్తిని తెలివితేటలను వ్యక్తముచేయుచుండుటకు కారణమేమి ? ఇట్టిది పూర్వజన్మార్జితము గానిచో ఎట్లు ప్రాప్తించినది ? కనుకనే "ప్రపేదిరేప్రాక్తనజన్మవిద్యా" "పూర్వదత్తాచయా విద్యా" అను నార్యోక్తులు గలవు. మరియు ఒకే జన్మలో జీవుడు తా ననుభవించిన పుణ్యపాపకర్మములనుబట్టి స్వర్గనరకములు ప్రాప్తించవలెను. ఏ కర్మను ఆచరించుటకు తగినబుద్ధికుశలతయు లేని పసితనములో మరణించినవారికి స్వర్గప్రాప్తియా? నరకప్రాప్తియా? ఇట్టి సమస్యలకు వైదికకర్మసిద్ధాంతమే జవాబు చెప్పగలుగును. "జాతస్యహిధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ" అను భగవద్వాక్యముచే ప్రతి జీవుడును తాను పూర్వజన్మలో చేసిన కర్మానుసారముగా జన్మమెత్తుననియు. ఈ జన్మలో చేసిన కర్మనుబట్టి ముందు జన్మనిర్ధారితమగుననియు, ఇట్టిజన్మపరంపరలో వేదోక్తకర్మానుష్ఠానము వలన చిత్తశుద్ధిగలిగి ఉపనిషత్ జ్ఞానబోధకు అర్హుడై శ్రవణాదులవలన మోక్షమునుపొందుననియు వేదమత సిద్ధాంతము.

ఇట్టి కర్మసిద్ధాంతముమీద వర్ణాశ్రమధర్మసౌధము నిర్మింపబడి యున్నది. ఇయ్యది మానవకృతముకాదు. కేవల వేదోక్తమును, ఈశ్వర నిర్మితమునై విరాజిల్లుచు లోకకల్యాణార్థమై యేర్పడినది. "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః" అను గీతలోని భగవద్వాక్యముచే పూర్వజన్మకర్మనుబట్టియు, గుణమునుబట్టియు చాతుర్వర్ణ్య విభాగము పరమేశ్వరునిచేతనే చేయబడినదని స్పష్టీకరింపఁబడియుండగ కొందరు అట్టి విభాగము మానవనిర్మితమని వాదించుట కేవల హాస్యాస్పదము అవివేకము మౌర్ఖ్యము నగును.

వేదోక్త కర్మానుష్ఠానమునకు భరతఖండముమాత్రమే యోగ్య దేశము. హిందూదేశమే కర్మభూమి. ప్రపంచములోని భూభాగములలో భరతఖండేతర భాగములన్నియు భోగభూములేగాని కర్మభూములు కావు. కనుక ఆయా భూములలో వేదోక్తకర్మానుష్ఠానమునకు అర్హత



లేదు. భరతఖండములోని వర్ణాశ్రమ ధర్మవ్యవస్థయొక్క వైలక్షణ్యమును లోకోపకారకత్వమును విచారించి దీనిని ముగింతము. బ్రాహ్మణ క్షత్రియాది శబ్దములు జాతివాచకములు. ప్రపంచములో శబ్దములన్నియు నాల్గువిధములుగ విభజింపఁబడియున్నవి. జాతి వాచకములు, గుణవాచకములు, క్రియావాచకములు, సంజ్ఞావాచకములని. గోవు గోజాతిలో పుట్టినది గనుక గోవు అని పిలువబడుచున్నది. అంతేగాని దానియొక్క చలనాది క్రియలవలనగాని, క్షీరమునిచ్చుగుణమువలనగాని, రంగువలనగాని ఇంకేవిధముగను దానిని వర్ణించుటకు సాధ్యముకాదు. అటులనే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాదులు ఆయాజాతులలో జన్మించుటచేతనే వారు ఆయానామములచేత ఆయాజాతులవారని వ్యవహరించుచున్నారు ఈ కారణమువల్లనే "సర్వేషాం జన్మనా జాతిః" అని శాస్త్రము చెప్పుచున్నది.

ఒకే వ్యక్తి బ్రాహ్మణజాతిలో పుట్టినను కొన్ని సంవత్సరములు క్షత్రియగుణములకు పౌరుషాదులను, కొంతకాలము వాణిజ్యాది వైశ్య వృత్తులను అవలంబించినచో ఆ వ్యక్తిని ఏ జాతివాడని చెప్పుటకు సాధ్యమగును ? కనుక జన్మచేతనే గాని గుణములచేగాని, వృత్తులచే గాని జాతి కాదని యుక్తిచేతను అనుభవముచేతను స్పష్టమగుచున్నది.

ఒక బ్రాహ్మణునికి బ్రాహ్మణ లక్షణములు లేక అతడు ఇతర గుణములతోను, ఇతర వృత్తులలోను ప్రవర్తించినయెడల అతనికి ముందు జన్మలో బ్రాహ్మణజన్మ రానేరదు, ఈ జన్మలోని బ్రాహ్మణత్వము పోనేరదు. ఈ బ్రాహ్మణత్వము పూర్వజన్మకర్మానుసారముగ వచ్చియుండుటచేత ఈ జన్మలో నుండియే తీరవలెను. ఏ జన్మలోని కర్మవలన ఆ జన్మ ఎన్నటికి మారదు. అట్టి కర్మవలన ముందు జన్మ నిర్ధారణమగును.

ప్రపంచములోని మానవజాతి యంతయు స్వభావసిద్ధముగనే నాల్గు విధములుగ విభజింపఁబడియున్నది. 1. కష్టజీవి, 2. భాగ్యవంతుడు, 3. అధికారి, 4. జ్ఞాని, నాల్గవ తరగతిలోనివారే బ్రాహ్మణజాతి, 3 తరగతివారు క్షత్రియులు, 2. తరగతివారు వైశ్యులు, మొదటి తరగతివారు శూద్రులు. ఈ విభాగము మానవ ప్రకృతిలోనే యున్నది.

పాశ్చాత్య అర్థశాస్త్రవేత్తలు వస్తువుల ఉత్పత్తికి (Land) భూమికి నాయకుడు క్షత్రియుడు (Labour) పరిశ్రమకు భాజకుడు శూద్రుడు, (Capital) అనగా ధనమునకు స్వామి వైశ్యుడు, (Organaisation) అనగా నిర్మాణమునకు నేత అనఁగా నిర్మాత బ్రాహ్మణుడు. ఇట్టి చతుర్విధ భాగము ప్రతి దేశములోను ప్రతి మతములోను ఏదోవిధముగ తప్పని సరిగ యుంఁడుచునే యున్నది.

ప్రపంచమంతయు ధర్మముమీఁద నే యాధారపడియున్నది. "కర్మణామీ భాంతి దేవాః పరత్రకర్మణై వేహప్లవతే మాతరిశ్వా, అహోరాత్రిం విదధ త్కర్మణైవ । అతన్ద్రితశ్శశ్వదు దేతిసూర్యః॥ మాసార్ధ మాసానథ నక్షత్రయోగానదన్ద్రిత శ్చంద్రమాశ్చాభ్యుపైతి। అతన్ద్రితో దదతేజాత వేదా స్సమిద్యమానః కర్మకుర్వన్ ప్రజాభ్యః అతన్ద్రితాభార మిమం మహాన్తం బిభర్తి దేవీ పృథివీ బలేన ! అతన్ద్రితా శ్శీఘ్రమపో వహన్తి స న్తర్పయన్త్య స్సర్వభూతాని నద్యః ॥ హిత్వా సుఖం మన సశ్చా ప్రియాణి దేవ శ్శక్రః కర్మణా శ్రైష్ఠ్యమాస ॥ బృహస్పతి ర్బ్రహ్మచర్యం చ చార సమాహిత స్సంశితాత్మాయ థావత్ । హిత్వాసుఖం ప్రతిరుధ్యేంద్రియాణి తేన దేవానామగ మద్గౌరవం సః । తథా నక్షత్రాణి కర్మణా ముత్రభాంతి రుద్రాదిత్యావసవోఽథాపి విశ్వే॥ ఇత్యాది వచనములచేత ధర్మముయొక్క జగత్ప్రతిష్ఠా హేతుత్వము దృఢీకరింపఁబడుచున్నది.

కర్మవిశేషముననే దేవతలు లోకాంతరమున ప్రకాశించుచున్నారనియు, వాయువు వీచుట, యహోరాత్రముల నధిష్ఠాన దేవతలు ప్రవర్తింపఁజేయుట యలసట లేకుండ నెల్లపుడు సూర్యచంద్రనక్షత్రాదులుదయించి లోకమును ప్రకాశింపజేయుచు మాసార్ధమాసాదుల ప్రవర్తింపజేయుట యతిభారమును ఈభూదేవత వహించుచుండుట, నదులుదకముల బ్రవహింపజేయుచు సకల భూతముల దృప్తిపరచుచుండుట మున్నగునవియన్నియు కర్మవిశేషముననే యనియు, కర్మవిశేషముననే యింద్రుడు సకల సుఖములను వీడి యింద్రియనిగ్రహముతో చిరకాలము బ్రహ్మచర్యమునొనర్చె, బృహస్పతి దేవగురుత్వమును గర్మవిశేషముచేతనే చెందెననియు. ఏకాదశరుద్రులును, ద్వాదశాదిత్యు



లష్టవసువులు విశ్వే దేవతలు మున్నగువారందరు కర్మవిశేషమువల్లనే యున్నత పదవుల నందిరనియు గనుకనే కర్మయే జగత్ప్రతిష్ఠాదికారణమనియు నుద్ఘోషించుచున్నవి. ఇచట కర్మయన ధర్మరూపమని దెలియుచున్నది. ఇట్లు ప్రాణికోటి సుఖదుఃఖహేతువులగు ధర్మాధర్మముల నన్నిటిని వేదములను పురస్కరించుకొని శాసించునదియే హిందూ ధర్మశాస్త్రము.

గర్భాధానము మొదలుగ నంత్యకర్మాంతము మానవుని బాహ్యాన్తశ్శుద్ధులను బోధించు సంస్కారకాండము. పుట్టినది మొదలు గిట్టువరకును నిత్యజీవితము నెటుల గడపవలయునో గార్హస్థ్యకర్మల నెటుల జరుపవలెనో బోధించు నాహ్నికకాండము, సాముదాయకాచారకాండము. వ్యామోహప్రమాదాదులవలన దుఃఖజనకములగు నిషిద్ధకర్మల నాచరించినను విహితకర్మల జేయకున్నను వానివలన గలుగు దుఃఖముల నంటనీయకుండ విశుద్ధత గలుగజేయు ప్రాయశ్చిత్తకాండము, జననమరణాదులవలన అస్పృశ్యస్పర్శనాదులవలన మానవునికి సంభవించునట్టి యశుచిని దాని నివారణమార్గములను బోధించునా శౌచకాండము, మరణానంతర సుఖదాయకమగు శ్రాద్ధకాండమును పాపపరిణామములుగా నేర్పడిన రోగముల నివృత్తిమార్గములబోధించు కర్మవిపాకకాండము, ఐహికాముష్మికసుఖసంధాయకమగు వ్రత, దానకాండము, వివాదములు వచ్చినపుడు పరిష్కరించుట, ఆస్తిసంక్రమణము, అపరాధములు జరిగినపుడు చేయువానిని మంచిమార్గముల ప్రవేశింపజేయుటకు వలయు శిక్షాకాండము, రాజుయొక్క సంచారము నిబంధించు రాజధర్మకాండము, మున్నగువానితో లోకవ్యవహార నిబంధించు వ్యవహార కాండము, మొదలుగాగల వివిధ విషయములను పరాపేక్ష లేకుండ మానవుల కావశ్యకములగువానిని బోధించు నిట్టి ధర్మశాస్త్ర మెచటనైన, గలదా? ఉపలోచనము లేనిదే యెదుట నున్న వస్తువులనుగూడ గనుగొనలేని చర్మచక్షుష్కులమగు మనము అతీంద్రియములగు ధర్మాధర్మములను మేధావిశేషమున గనుగొన గలుగుదుమనుటకన్న నహంభావ పరాకాష్ఠ వేరొండు గలదా?

ఏ మతమైనను స్వధర్మశాస్త్రమును ప్రాణమును వీడిన వ్రతము కాదా ? స్వధర్మశాస్త్రము లేని మత మెద్దియు లేదు, "స్వధర్మే నిధనం శ్రేయః" అను భగవద్వాక్యమును స్మరించుము. స్వధర్మ నిరతానుష్ఠానము చేయుచు, అవైదిక ప్రచారములను ప్రతిఘటించుచు, వేద ధర్మరక్షణార్థము చేయు యుద్ధమందు మరణించినను మేలే యని తలంచెదరు గాక! "తస్మాత్ శాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి" అను భగవద్వాక్యము ననుసరించి ఏది చేయవలెను. ఏది చేయరాదు అని నిర్ణయించుటకు నీవు శాస్త్రమునే ప్రమాణముగ గ్రహింపవలయును. శాస్త్రమున చెప్పబడినదాని నెఱింగి తదనుసారముగ గర్మల జేయుట యీ లోకమున నీకు కర్తవ్యము. "యః శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః । న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్॥ ఎవడు శాస్త్రవిధిని వదలి స్వేచ్ఛానుసారముగా చేయుచున్నాడో వానికి సిద్ధి లభింపదు. సుఖము లేదు. ఉత్తమ గతియు లభింపదు.

ఓం తత్సత్

స్వస్తి సర్వేషాం సమస్త సన్మంగళాని భవంతు.

---



# సిద్ధాంత సరళి

—♦ కర్మసాక్షియగు సూర్యభగవానుడే కాలస్వరూపుడు. ♦—

శ్లో॥ చేతనాచేతనద్రవ్యపరావర్తనహేతవః ।
సదానుమేయ లక్ష్యోహి కాలః కేవల ఉచ్యతే।
సతుద్విధాపరిణతోఽఖండః ఖండస్స్వయం విభుః ।
ఆద్యోహి సచ్చిదానందలక్షణ స్తేజసాం నిధిః॥

కాల మనునది నరాది ప్రాణులు, వృక్షాది జడపదార్థములనబడు గుణాశ్రయవస్తువులయొక్క పరిణామమునకు కారణభూతమై యుండుటచే నెల్లప్పుడు నూహించి తెలిసికొనదగిన కేవల పరబ్రహ్మస్వరూప మనబడును. అయ్యది అఖండకాలమనియును, ఖండకాలమనియును ద్వివిధపరిణామముగలది. అందు అఖండకాలము సర్వవ్యాపకమైన సచ్చిదానంద స్వరూపమే యగును అయ్యదియే వెల్గులగనియైన సూర్యభగవానుడు.

"సవిశ్వకృత్సం విదాత్మయోనిర్జ్ఞః కాలః కాలగుణీ సర్వవిద్యః ప్రధానం క్షేత్రజ్ఞ స్సనిర్గుణోఽపి సంసారమోక్షస్థితిబంధహేతుః" అని శ్రుతి. అఖండకాలము ప్రపంచ నిర్మాతయు, జ్ఞానస్వరూపమును, స్వయంభువును, యజ్ఞస్వరూపమును, భూతాదికాలము లుపసర్జనము కాగలదియు, సర్వజ్ఞమును, ప్రకృతి స్వరూపమును, క్షేత్రజ్ఞస్వరూపమును నగుచు స్వాభావికముగ నిర్గుణమైనదైనను సంసారబంధమోక్షములకు కారణమై యున్నది.

శ్లో॥ కల్పనా సర్వభూతానాం బ్రహ్మాదీనాం నిమేషతః ।
కాలశబ్దేన నిర్దిష్టం హ్యఖండానంద మద్వయం ।
కాల స్సృజతి భూతాని కాలః సంహరతి ప్రజాః ।
కేవలాకార రూపోఽస్మి తుర్యాతీతోఽస్మి కేవలః ।

సర్వాంతర్యామి రూపోహం సర్వసాక్షిత్వలక్షణః ।
అహం కాలస్వరూపోస్మి ॥ ఇత్యాది వేదాంతవచనజాతాత్.

శ్లో॥ అనాదిరేష భగవాన్కాలోనంతోఽక్షరః పరః ।
సర్వగత్వా త్స్వతంత్రత్వా త్సర్వాత్మత్వా న్మహేశ్వరః ।
బ్రహ్మణో బహవో రుద్రా అన్యే నారాయణాదయః ।
ఏకోహి భగవానీశః కాలః కలిరితి స్మృతః ।
బ్రహ్మనారాయణేశానాం త్రయాణాం ప్రకృతౌ లయః ।
ప్రోచ్యతే కాలయోగేన పునరేవచ సంభవః ।
పరబ్రహ్మ చ భూతాని వాసుదేవోపి శంకరః ।
కాలేనైవచ సృజ్యంతే స ఏవ గ్రసతే పునః ।
తస్మా త్కాలాత్మకం విశ్వం స ఏవ పరమేశ్వరః ॥

కాలము ఆద్యంతములులేనిది నాశరహితమైనది సర్వోత్కృష్టమైనదియు నగుచున్నది. సర్వవ్యాపకమైనదగుటచేతను, స్వతంత్రమైనదగుటచేతను, సర్వాత్మకమైనదగుటవల్లను, ఇదియే మహేశ్వర స్వరూపము. బ్రహ్మవిష్ణురుద్రాదులను, తదితరులగు ఇంద్రాదిదేవతలను, అనేకులను సృజించు కాలస్వరూపుడగు పరమేశ్వరుడు మాత్ర మొక్కడే యగును. బ్రహ్మవిష్ణురుద్రాదులకు ప్రకృతియందు లయము కలుగును. కాలయోగముచేతనే దిరిగి యుత్పత్తి నందెదరు. కావున బ్రహ్మవిష్ణురుద్రాదులు కాలముచేతనే సృజింపఁబడుచు కాలముచేతనే మ్రింగబడుచున్నారు. అట్లగుటను ప్రపంచమంతయు కాలస్వరూపమేయగును. ఆ కాలమే పరమేశ్వరుడని దెలియనగును.

శ్లో॥ అనాది నిధనః కాలో రుద్రస్సంకర్షణః స్మృతః ।
కలనా త్సర్వభూతానాం సకాలః పరికీర్తితః ।
కర్షణా త్సర్వభూతానాం సతు సంకర్షణః స్మృతః ।
సర్వభూత సమత్వాచ్చ సరుద్రః పరికీర్తితః ।
అనాది నిధనత్వేన స మహా న్పరమేశ్వరః ॥

ఆద్యంతరహితములులేని యీ కాలము సర్వభూతములను లెక్కించునది యగుటచే కాలమనియును, సమస్త జీవకోటియొక్క జనన మరణ ప్రవాహమునుగర్మానుసారముగ నటునిటులాగునదియగుటచే సంకర్షణుడనియును, సర్వభూత సమత్వముగలదియగుటచే రుద్రుడనియును, ఉత్పత్తి వినాశములులేనిదగుటచే పరమేశ్వరుడనియు చెప్పఁబడుచున్నది.



శ్లో॥ నిత్యో జన్యశ్చకాలాద్వ్యాతయోరాద్యః పరేశ్వరః ।
సోఽవాఙ్మనసగమ్యోఽపి దేహీ భక్తానుకంపయా ॥

నిత్యకాలము జన్యకాలము నని కాలము రెండువిధములు. దీనికే అఖండకాలము, ఖండకాలము ననుట గలదు. అందు మొదటిదగు నిత్యకాలము (అఖండ కాలము) పరమేశ్వర స్వరూపమైనది. ఇయ్యది వాక్కుచేగాని మనస్సుచేగాని గోచరింపనిదయ్యును భక్తానుగ్రహముకొఱకు దేహమును ధరించుచున్నది. భక్తుల ననుగ్రహింప గోర్కెచే గ్రహింపఁబడిన రూప మిట్టిదని నొక నియమమేలేదుకదా! కనుకనే భగవద్గీత ౭ అధ్యాయం ౨౧-౨౨ శ్లోకములలో

శ్లో॥ యోయోయాంయాంతనుం భక్తశ్శ్రద్ధయార్చితు మిచ్ఛతి ।
తస్యతస్యాచలాం శ్రద్ధాంతామేవవిదధామ్యహం ॥
సతయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధనమీహతే ।
లభతే చ తతః కామాన్మయైవవిహితాన్ హితాన్ ॥

ఏ యేభక్తులేయేరూపమును అనఁగా దేవతలను శ్రద్ధతో నుపాసింపగోరుచున్నారో ఆయాభక్తునకాయాదేవతయందలి శ్రద్ధను నేను స్థిరపరచుచున్నాను. ఆ భక్తుడు నాచే యివ్వఁబడిన శ్రద్ధతోగూడినవాడై ఆ దేవతయొక్క ఆరాధనము చేయుచున్నాడు. పిమ్మట ఆయాదేవతకంతర్యామిగనున్న నాచే ఆదేవతద్వారా నివ్వఁబడిన యభీష్టకామములను పొందుచున్నాడు.

కాలస్వరూపుడగు పరమేశ్వరునే ఋగ్వేదులు గొప్పదైన యుక్థమునందును, యజుర్వేదు లగ్నియందును, సామవేదులు మహావ్రతమునందును విచారించుచున్నారు. ఈ పరమేశ్వరుని భూలోకమునందును, స్వర్గలోకమునందును, వాయువునందును, ఆకాశమునందును, ఓషధులయందును, వనస్పతులయందును, చంద్రునియందును, నక్షత్రములయందును, సర్వభూతములయందును, అంతర్యామి యనియు పరబ్రహ్మయనియు జెప్పుచున్నారు. ఈ కాలస్వరూపుడగు పరమేశ్వరుని

సర్పములు విషమనియు, సర్వజ్ఞులు సర్వస్వరూపుడనియు, దేవతలు అమృతమనియు, మనుష్యులు ధనమనియు, రాక్షసులు మాయయనియు, పితృదేవతలు స్వధాకారమనియు, దేవజనవేత్తలు దేవజనమనియు, గంధర్వులు రూపమనియు, అప్సరసలు గంధమనియు, నుపాసించుచున్నారు. ఆ పరమేశ్వరుని నెవ రేయేవిధముగా నుపాసించుచున్నారో వారి కదిగా నగుచున్నాడు. ఇట్లగుటజేసి ఎవ్వరేరీతిని నేకర్మ నారంభించుచున్నారో వారాయారీతిని యాకర్మయం దుపకరించెడి కాలాత్మకుండగు పరమేశ్వరునియొక్క మూర్తిని నిష్టదేవతారూపముగా ధ్యానము చేయవలయును. కనుకనే మంత్రశాస్త్రములయందు పలు విధములఁగ ధ్యానము లుపదేశింపఁబడియున్నవి.

అందువలననే ఆరంభింపఁబడుచున్న కర్మలయొక్క ఫలము నొసగునట్టియు దన యిష్టదేవతారూపమగు కాలమును కర్మారంభములయ దు స్మరింపఁదగినది. సర్వేశ్వరస్వరూపమైన యఖండకాలము సమస్త కర్మారంభములయందును స్మరింపఁదగినది. కనుకనే శిష్టులు పుణ్యాహవాచనాదులయం దీశ్వరుని స్మరించుచున్నారు.

శ్లో॥ యస్య స్మృత్యాచ నామోక్త్యా తపోయజ్ఞ క్రియాదిషు ।
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందేత మచ్యుతం ॥

అనఁగా తపస్సు, యజ్ఞము, మొదలగు సమస్త కర్మలయం దెవని స్మరణముచేతను, నామోచ్చారణముచేతను పొరపాటున గలిగిన లోటుపాటులన్నియు జక్కఁబడుచున్నవో, అట్టి కాలస్వరూపుడగు విష్ణువును గూర్చి నమస్కరించుచున్నాము అని ధ్యానించుట లోకవ్యవహారమున గలదు.

జన్యకాలము (ఖండకాల స్వరూపము)

అఖండకాల స్వరూపుడగు పరమేశ్వరునివల్ల జనించిన సూర్య భగవానునిచే త్రుటి మొదలు కల్పాంతమువరకు వ్యావహారికముగా కల్పింపఁబడినదియే జన్యకాలము లేక ఖండకాల మనబడును.

శ్లో॥ తీక్ష్ణసూచ్యాబ్జ పుష్పస్య దళవేధ స్త్రుటి ర్భవేత్ ।
తచ్ఛతం లవ ఇత్యుక్తం తత్త్రింశ న్నిమిష స్స్మృతః ।
నిమేషః సప్తవింశత్యా కాలో గుర్వక్షరస్యతు ।
దశగుర్వక్షరోచ్చారకాలః ప్రాణోభిధీయతే ॥



సూటియైనదియు, మిక్కిలి పదునుగల సూదితో నొక తామరపూవుయొక్క దళమును గ్రుచ్చిన అందు సూదిమొన ఒక దళమును విడిచి రెండవ దళము నంటుకొనుటకు ఎంతకాలముపట్టునో యాకాలమునకు త్రుటి యని పేరు. 100 త్రుటులు ఒక లవము. 30 లవములు ఒక నిమేషము, 27 నిమేషములు ఒక గుర్వక్షరోచ్చారణకు పట్టు కాలము. పది గుర్వక్షరోచ్చారణకాలము ప్రాణకాల మనబడును.

"త్రుట్యాదయః ఖండకాలా స్సూక్ష్మాశ్చామూర్తసంజ్ఞికాః"
త్రుటి, లవ, నిమేష, గుర్వక్షరోచ్చారణ కాలములనబడు ఖండకాలము అస్పష్టము కావున సూక్ష్మము లనబడుచున్నవి.

"ప్రాణాదయః ఖండకాలాజ్ఞేయా స్స్థూలాశ్చమూర్తకాః"
ప్రాణాదిగ నీ దిగువ చెప్పబోవు ఖండకాలము స్పష్టమైనది కావున స్థూలము లనబడుచున్నవి.

ప్రాణకాలమునే అసువుగా వ్యవహరించుచుండుటయు గలదు

"వినాడికాతుషట్ప్రాణాస్తత్షష్ట్యా నాడికా స్మృతాః ।
అహోరాత్రంతు తత్షష్ట్యా నిత్యమే తత్ప్రకీర్తితం ॥

ఆరు ప్రాణములు (అసువులు) ఒక వినాడి (వికల) యనబడును. 60 వినాడులు (వికలలు) ఒక నాడి (కల) యనబడును.

(6 ప్రాణములు=ఒక విఘడియ; 60 విఘడియలు=1 ఒక ఘడియ యగును.)

60 నాడికలు (కలలు) లేక ఘడియలు అహోరాత్రకాలము లేక ఒక రోజు యగును.

శ్లో॥ అక్షిపక్ష్మ పరిక్షేపో నిమేషః పరికీర్తితః ।
ద్వౌ నిమేషౌ త్రుటిర్నామ ద్వే త్రుటీతులవస్మృతః ।
ద్వౌలవౌ క్షణ ఇత్యుక్తః కాష్ఠాప్రోక్తా దశక్షణాః ।
త్రింశత్కాష్ఠా కళాప్రోక్తా కళా త్రింశ న్ముహూర్తకః
తేచ త్రింశదహోరాత్రమిత్యాహ భగవాన్మనః॥

—గార్గః.

కనురెప్పపాటు కాలమే నిమేష మనబడును. రెండు నిమిషములు ఒక త్రుటి. రెండు త్రుటులు ఒక లవము. రెండు లవములు ఒక క్షణము. పది క్షణములు ఒక కాష్ఠ. 30 కాష్ఠలు ఒక కళ. 30 కళలు ఒకముహూర్తము. 30 ముహూర్తము లొక దినము (అహోరాత్రము).

ముహూర్త మనఁగా రెండు గడియల కాలము. అనగా 48 నిమిషములని ప్రకృత కాలమున గడియారముల ననుసరించి తెలియనగుచున్నది. కాని గర్గవాక్యముచే ముహూర్తకాలము 30 కళలుగా విభజింపఁబడెను. ఇయ్యది ప్రాచీన ఋషిసాంప్రదాయములోనిదగుట పరిగ్రాహ్యము.

ఒక ఘడియకు 24 నిమిషముల కాలమునకు=15 కళలు.

కళ యనగా 1 నిమిషము 36 సెకనులగును. లేక 96 సెకనులు,

పాశ్చాత్యులు సెకనుల వరకే కాలమును గణించిరి. హిందూదేశమందలి వైదిక ఋషులు మహానుభావులగుటచే పాశ్చాత్యులకంటె మిక్కిలి సూక్ష్మకాలమునుకూడా గ్రహించి ప్రవర్తింపజేసిరి.

1 కళ=96 సెకనులు 1 కాష్ఠ=3, 1/5 సెకనులు.

క్షణము=8/25 సెకను.

లవము=5/25 సెకను.

త్రుటి=2/25 సెకను.

నిమేషము=1/25 సెకను.

"సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి । కలాముహూర్తాః కాష్ఠాశ్చాహోరాత్రాశ్చ సర్వశః । అర్ధమాసా మాసా ఋతవస్సంవత్సరశ్చ కల్పంతాం ॥ తైత్తిరీయశాఖాయాం నారాయణీయే కాలస్యోత్పత్తి రామ్నాయతే,"

నిమి యనగా జనకునకు పూర్వీకుడగు మిథిలానగరాధిపతి. "నిమిః సీదతి యేషు తే నిమిషాః" అని వ్యుత్పత్తి. కావున ఆ నిమి, దేవతలయొక్క వరప్రసాదమువలన, నేరెప్పపాటులయందుండునో, నా రెప్పపాటులు నిమిషములనియు, నిమేషములనియు ననబడును. ఇచ్చట నిమేష శబ్దమునకు రెప్పపాటు పరిమితిగల కాలమని యర్థము. నిమే



షముకంటె పెద్దవగు కలలు, కాష్ఠలు, ముహూర్తములు, అహోరాత్రములు, పక్షములు, మాసములు, ఋతువులు, సంవత్సరములు ఇవన్నియు స్వయంప్రకాశమానుడును, పరిపూర్ణుడునునగు పరమేశ్వరుని వలన బుట్టినవి. పరమేశ్వరునివలన బుట్టుటచేతనే యీ సంవత్సరాదులన్నియు తమ తమ ప్రయోజనములందు సమర్థములగుచున్నవి.

కాలవిశేషమునందు సంవత్సరము ప్రధానమైనది. మిగిలినవన్నియు నప్రధానములని తైత్తిరీయారణ్యకములో అరుణకేతుకమునం దిట్లు చెప్పఁబడెను. "నదీవప్రభవాత్కాచిత్, అక్షయ్యాత్స్యందతే యథా । తాం సద్యోఽభి సమాయంతి, సోరుస్సతీన నివర్తతే, ఏవం నానాసముత్థానాః, కాలాస్సంవత్సరగ్ంశ్రితాః । అణుశశ్చ మహాశశ్చ సర్వే సమవ యంత్రితం, స్తైస్సర్వై స్సమావిష్టఊరూస్సన్న నివర్తత"

భాగీరథీ, గోదావరీ మొదలగు నదులవలె నీకాలము వినాశరహితమైన యొకానొక యుత్పత్తిస్థానమునుండి పుట్టి బయలుదేరుచున్నది. ఆ యుత్పత్తి స్థానము సాంఖ్యులచే చెప్పబడిన ప్రకృతిగాని, శైవాగమమునందు చెప్పబడిన మాయగాని, శ్రుతిస్మృతులందు చెప్పబడిన నిత్యకాలాత్మకుడైన నీశ్వరుడుగాని, కాగలదు. ఏవిధముగా గంగాదిమహానదులు యితరములగు అల్పనదులతోగూడి విశాలములై ఎప్పుడును ఎండిపోక ప్రవహించుచున్నవో అటులనే అనేక విధములగు రూపములతో నేర్పడిన కాలవిశేషములు సంవత్సర మను పేరుగల ప్రధాన కాలము నాశ్రయించియున్నవి.

నిమేషము మొదలుకొని అయనమువరకునుగల కాల విశేషములు సంవత్సరముకంటె నణువులు. యుగము మొదలుకొని పరార్ధము వరకు గల కాలవిశేషములు సంవత్సరముకంటె గొప్పవి. అవన్నియు సంవత్సరముననే బాగుగ ప్రవేశించియున్నవి. ఎట్లనిన అణుకాలములు సావత్సరము అను శరీరికి అవయవములగుటచే శరీరమునందు ప్రవేశించుచున్నవి. యుగాది మహాకాలములు సంవత్సరముయొక్క ఆవృత్తిచే నేర్పడుచున్నందున యుగాది మహాకాలములకు అధ్యక్షము సంవత్సరమే యగుటచే నందు ప్రవేశము చెప్పఁబడుచున్నది.

"సంవత్సరః ప్రజాపతిః ప్రజాపతిర్యజ్ఞః । యజ్ఞోవై ప్రజాపతిః" అను తైత్తిరీయసంహితా బ్రాహ్మణములం దనేక స్థలములలో "సంవత్సరము, యజ్ఞము" అను రెండు పదములను సమానార్థకములుగా చెప్పఁబడియున్నది. కనుక వేదకాలారంభమునుండి (సృష్ట్యాదినుండి) యు వైదికులు తమ గృహములందు సదా అగ్నిహోత్రము నుంచు కొనెడివారనియు, ఆ యగ్నిహోత్రమునందు సంవత్సరము పొడుగునను హోమము లర్పించుచు, కాలమానము ననుసరించి యజ్ఞయాగాది క్రతువుల నొనర్చుచుండెడివారనియు స్పష్టమగుచున్నది.

ఋత్విజ్ (ఋతు+యజ్) అను పదముయొక్క వ్యుత్పత్త్యర్థము ననుసరించి ఋతువులకు యజ్ఞములకును సన్నిహిత సంబంధమున్నట్లు స్పష్టమగుచున్నది. దీనినిబట్టి సంవత్సరమునకును యజ్ఞమునకునుగూడ సంబంధమున్నదని వేరుగ చెప్ప నవసరమేలేదు. సంవత్సర పదముయొక్క వ్యుత్పత్త్యర్థ మేమి? "సంవత్సరోనామాయనాద్యవయవయుక్తోఽవయవీకాలవిశేషః సమ్యగ్వసంత్యస్మిన్నయనర్తుమాసాదయ ఇతి వ్యుత్పత్తేః" అని విద్యారణ్యస్వాములు కాలమాధవీయమం దుదహరించియున్నారు. అనఁగా అయనము, ఋతువు, మాసము మొదలగునవి దీనియందు బాగుగ నివసించుచున్నవి కాన ఇయ్యది సంవత్సర మనబడుచున్నదని వ్యుత్పత్త్యర్థము.

వార్షిక సత్రములే వేదకాలమునాటి పంచాంగముయొక్క ప్రథమ దశయని స్ఫురించుచున్నది. పూర్వకాలమున మన యాజ్ఞికులు యజ్ఞముచేయుటయే గాక కాలమానముల దెల్పు పంచాంగమును సంరక్షించుటగూడ విధ్యుక్తధర్మమై యుండెడి దనుట స్పష్టము. ఇట్లుగ నెంతయో వ్రాయవచ్చును. ప్రకృతమునకు వత్తము.

## బ్రహ్మదేవుని ఆయుఃపరిమాణము.

శ్లో॥ షష్టిః షష్ట్యా చ గుణితాః పునః షష్ట్యా చ నిఘ్నతా ।
వస్వంగాబ్ధియమై ర్నిఘ్నం క్రమాద్యుగ చతుష్టయం ।
మహాయుగాః కృతా దీనాం చతుర్ణాం యోగ ఉచ్యతే ।
యుగానాం సప్తతి స్సైకామన్వంతర మిహోచ్యతే॥



కృతాబ్దసంఖ్యా తస్యాంతే సంధిః ప్రోక్తోజలప్లవః
ససంధయస్తే మనవః కల్పేజ్ఞేయా శ్చతుర్దశ
కృతప్రమాణం కల్పాదౌ సంధిః పంచదశస్మృతః
ఇత్థం యుగసహస్రేణ భూతసంహారకారకః ॥
కల్పో బ్రాహ్మమహః ప్రోక్తం శర్వరీ తస్య తావతీ
పరమాయు శ్శతం తస్య తయాఽహోరాత్రసంఖ్యయా॥
శతం హితస్య వర్షాణాం పరమిత్యభిధీయతే
పంచాశద్భిస్తథావర్షైః పరార్ధ మితి కీర్త్యతే।

అరువదిని అరువదిచే గుణించి, మరల 60 చే గుణించగా వచ్చు మొత్తమును నాల్గు ప్రదేశములందుంచి క్రమముగా ౮,౬,౪,౨ చేత గుణించినయెడల వచ్చు సంఖ్యలు క్రమముగా కృత, త్రేత, ద్వాపర, కలి యుగ ప్రమాణ సంవత్సరములగును. కృత త్రేత ద్వాపర కలియుగ మను నాల్గుయుగములయొక్క కూడికయే మహాయుగ మనబడును. డెబ్బదియొక్క మహాయుగములు ఒక మన్వంతర మనబడును. కృతయుగపరిమితిగల సంవత్సర సంఖ్యయే మను సంధికాలము. ఇట్టి సంధికాలములు ప్రతి మనువునకు ముందు వెనుకలయందు ౧౪ సంధులుండును. మన్వంతర సంధికాలమే జలప్రళయమని చెప్పుదురు. ౧౪ మన్వంతరములు, ౧౫ సంధులు చేరి ఒక కల్పమనబడును. లేక వేయి మహాయుగములు కల్పమనియు చెప్పనగును. కల్పము బ్రహ్మకు ఒక పగలు లేక రాత్రి యగును. పగటి కల్పము ప్రారంభము కాగానే బ్రహ్మ నిదురనుండి లేచి ధ్యానయోగమందు కొంతకాలముండి తరువాత సమస్త చరాచరాత్మకమును సృజింప మొదలిడును. రాత్రి కల్పము ఆరంభము కాగానే బ్రహ్మ నిదురించును. బ్రహ్మ నిదురించుకాలమున సమస్త చరాచర ప్రపంచము నశించును. పగటి కల్పము, రాత్రి కల్పము రెండును చేరి బ్రహ్మ కొక దినమగును. 30 దినము లొక మాసము. 30 మాసము లొక ఋతువు. 6 మాసము లొక అయనము. 12 మాసము లొక సంవత్సరము నగును. బ్రహ్మ నూరు సంవత్సరములు జీవించును. బ్రహ్మయొక్క నూరు సంవత్సరముల ఆయుర్దాయమును పరమందురు. మొదటి ఏబది సంవత్సరములు ప్రథమపరార్థ

మనియు, రెండవ ఏబది సంవత్సరములు ద్వితీయపరార్థమనియు చెప్పబడుచున్నది.

60×60×60=3600×60=216000

| | | |
|---|---|---|
| 216000×8 | 1728000 | కృతయుగప్రమాణము |
| 216000×6 | 1296000 | త్రేతాయుగపరిమాణము |
| 216000×4 | 864000 | ద్వాపరయుగప్రమాణము |
| 216000×2 | 432000 | కలియుగ పరిమాణము |
| | 4320000 | మహాయుగ ప్రమాణము. |

మన్వంతర కాలము=4320000×71=306720000

౧౪ మన్వంతరములకాలము=306720000×14=4294080000

౧౪ మన్వంతరములకు మధ్యనున్న సంధులు ౧౫ అగును. కనుక ౧౪ మన్వంతరముల సంధికాలము 1728000×15=25920000

కల్పము=౧౪ మన్వంతరములు×౧౫మన్వంతరసంధులు=4320000000

కల్పము=మహాయుగము×1000=4320000000 (వేయిమహాయుగముల కాలము కల్పమగును,

బ్రహ్మ అహోరాత్రపరిమాణము=8640000000=బ్రహ్మదినము.

బ్రహ్మమాసము=259200000000=బ్రహ్మమాసము.

బ్రహ్మసంవత్సరము=3110400000000=బ్రహ్మ సంవత్సరము.

బ్రహ్మయొక్క వెయ్యి దినములు విష్ణువునకొక ఘడియ కాలమగును. విష్ణువుయొక్క ఘడియలు ౧౨౦౦౦౦౦ అయినచో రుద్రునకొక అర్థకలాకాలమగును. రుద్రునియొక్క అర్బుదఅర్థకలలకాలము పరబ్రహ్మమునకు ఒక అక్షరకాలమగును. (ఒక లఘు అక్షరము నుచ్చరించుట కెంతకాలమగునో అంతకాలమన్నమాట.)

బ్రహ్మయొక్క పూర్ణాయుర్దాయము=311040000000000 సౌరసంవత్సరములగును. ఇందులకు పరిమాణ శ్లోకము:—

శ్లో॥ పద్మత్రయం మహాఖర్వం ఖర్వ మేక మనంతరం
అర్బుదాని చ చత్వారి పరమాయు స్స్వయంభువః॥



శ్లో॥ పితామహ సహస్రేణ విష్ణోశ్చ ఘటికాస్మృతా
విష్ణోర్ద్వాదశలక్షాణికలార్థం రౌద్ర ముచ్యతే
రుద్రస్యార్బుదసంఖ్యాభిస్తైశ్చ బ్రహ్మాక్షరం భవేత్.

వర్తమానకాలమందు సృష్టికర్తయగు బ్రహ్మకు ఇయ్యది ఏడవ జన్మము. ఈ బ్రహ్మ మహావిష్ణువుయొక్క నాభికమలమందు జన్మించుటచేత పద్మజుడని పిలువబడుచున్నాడు. ఇతనికి పూర్వమున, మానసము, చాక్షుసము, వాచికము, శ్రావణము, నాసత్యము, అండజము అను ఆరు జన్మములు గతించినవి.

పద్మజుడను నేటి కాలమున నున్న బ్రహ్మయొక్క ఆయుర్దాయములో ఏబది సంవత్సరములు గతించినవి. అనగా సగ మాయుస్సు గతించెను. ఏబదియొకటవ సంవత్సరములో ప్రథమకల్పమగు శ్వేత వరాహకల్పమునందు స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుష మను ౬ మన్వంతరములు గడచిపోయెను. ఏడవ మన్వంతరమగు వైవస్వతమన్వంతరములో ౨౭ మహాయుగములు గడచెను. ౨౮ వ మహాయుగములో కృత, త్రేత, ద్వాపర యుగములు గతించినవి. ఈ కాలమువరకు వర్తమాన బ్రహ్మయగు పద్మజుని వయోగత సంవత్సరములు సౌరమానముచే ఎన్ని యగునో దిగువ వివరించుచున్నాను.

| | | |
|---|---|---|
| బ్రహ్మసంవత్సరములగు సౌరాబ్దములు | | 3110400000000 |
| బ్రహ్మ ౫౦ం సంవత్సరములకు | ,, | 155520000000000 |
| మన్వంతరమునకు సౌరాబ్దములు | | 306720000 |
| ౬ మన్వంతరములకు | ,, | 1840320000 |
| మన్వంతర సంధికి | ,, | 1728000 |
| ౭ మనుసంధులకు | ,, | 12096000 |
| ౧ మహాయుగమునకు | ,, | 4320000 |
| ౨౭ మహాయుగములకు | ,, | 116640000 |
| బ్రహ్మకు ౫౦ం సం॥రములకు సౌరాబ్దములు | | 155520000000000 |
| కల్పాదినుండి గతించిన ౬ మన్వంతరములకు | | 1840320000 |
| ,, | ౭ సంధులకు | 12096000 |
| ,, | ౨౭ మహాయుగములకు | 116640000 |

గతించిన కృతయుగమునకు 1728000
,, త్రేతాయుగమునకు 1296000
,, ద్వాపరయుగమునకు 864000
కలియుగారంభమునకు బ్రహ్మ ఆయుస్సులో
గతించిన సౌరాబ్దములు 155521970944000

ద్వాపరయుగాంతమువరకు చూపిన బ్రహ్మవయోగత సౌరాబ్దములకు కలియుగములో గతించిన సౌరాబ్దములు చేర్చినచో అభీష్ట కలివత్సరమునకు బ్రహ్మవయోగత సౌరాబ్దములు వచ్చును.

బ్రహ్మ వయోగతాబ్దములు ద్వాపర
యుగాంతమువరకు గతించిన సౌరా
బ్దములు 155521972944000
సర్వజిత్ సంవత్సరారంభమునకు కలి
గతాబ్దములు 5048
సర్వజిద్వత్సరారంభమునకు బ్రహ్మ
వయోగత సౌరాబ్దములు 155521972949048

—♦ కల్పాదినుండిసృష్ట్యారంభకాల నిర్ణయము. ♦—

కల్పాదినుండి గతించిన ౬ మన్వంతరములకు
సౌరాబ్దములు 1840320000
౭ సంధులకు సౌరాబ్దములు 12096000
౨౭ మహాయుగములకు ,, 116640000
గతించిన కృతయుగమునకు ,, 1728000
గతించిన త్రేతాయుగమునకు ,, 1296000
గతించిన ద్వాపరయుగమునకు ,, 864000
కలియుగమందు గతించిన ,, 5048

1972949048
బ్రహ్మధ్యానగతమందుండిన కాలమునకు సౌరాబ్దములు 17064000

సృష్ట్యాది గత సౌరాబ్దములు సర్వజిద్వత్స
రారంభమునకు మాత్రమే 1955885048.



ఒక్కొక్క కల్పమందు దేవలోకమున ౧౪ ఇంద్రులు అధికారమును వహించెదరు. భూలోకమున ౧౪ మనువులు అధికారమును వహించియుండెదరు.

బ్రహ్మ అహోరాత్రమునకు కల్ప మందురు. ఇదియే సృష్ట్యాదియనబడును.

కల్పముల పేర్లు :—1. శ్వేతవరాహకల్పము. 2. నీలలోహిత కల్పము. 3. వామదేవకల్పము. 4. రాథాంతర కల్పము. 5. రౌరవ కల్పము. 6. దేవకల్పము. 7. బృహత్కల్పము. 8. కందర్పకల్పము. 9. సద్యస్కల్పము. 10. ఈశాన కల్పము. 11. తమస్కల్పము. 12. సారస్వత కల్పము. 13. ఉదాన కల్పము. 14. గారుడ కల్పము. 15. కౌర్మ కల్పము. 16. నారసింహ కల్పము. 17. సమాన కల్పము. 18. ఆగ్నేయ కల్పము. 19. సోమ కల్పము. 20. మానవ కల్పము. 21. తత్పురుష కల్పము. 22. వైకుంఠ కల్పము. 23. లక్ష్మీకల్పము. 24. సావిత్రీకల్పము 25, ఘోరకల్పము. 26. వరాహకల్పము. 27. వైరాజకల్పము. 28. గౌరీకల్పము. 29. మాహేశ్వరకల్పము. 30. పితృకల్పము.

ఇంద్రుల పేర్లు :—1. విశ్వభుక్. 2. విపశ్చిత్. 3. సుశాంతి. 4. శిబి. 5. విభు. 6. మనోజవ. 7. పురందర. 8.
9. 10. 11. 12.
13. 14.

మనువుల పేర్లు :—1. స్వాయంభువ, 2. స్వారోచిష. 3. ఉత్తమ. 4. తామస. 5. రైవత. 6. చాక్షుస. 7. వైవస్వత. 8. సూర్యసావర్ణి. 9. దక్షసావర్ణి. 10. బ్రహ్మసావర్ణి. 11. ధర్మసావర్ణి. 12. రుద్రసావర్ణి. 13. రౌచ్య (దేవ) సావర్ణి. 14. భౌత్య (ఇంద్ర) సావర్ణి.

మన్వంతరాధిపతియు, ఒక్కొక్క యింద్రుడును, 71 మహాయుగముల కాలము అధికారము వహించెదరు. స్వమానముచే యింద్రునకు, మనువునకు నూరు సంవత్సరము లాయుర్దాయము.

## —♦ వైవస్వత మనువుయొక్క కాల నిర్ణయము. ♦—

| | |
|---|---|
| మన్వంతరమునకు సౌరాబ్దములు | 306720000 |
| ౨౭ మహాయుగములు గతించినందున | 116640000 |
| ౨౮ మహాయుగములో కృతయుగము | 1728000 |
| ,, త్రేతాయుగము | 1296000 |
| ,, ద్వాపరయుగము | 864000 |
| కలియుగములో గతించిన సౌరాబ్దములు సర్వజిదారంభమునకు | 5048 |
| వైవస్వతమనువుయొక్క వయోగత సౌరాబ్దములు | 120533048 |

ప్రతి మహాయుగమునందును శ్రీమహావిష్ణువు వేదవ్యాసరూపమున అవతరించి వేదములను లోకమునందు వ్యాపింపజేయును. ఇంతవరకు ౨౭ మహాయుగములు గడచినవి, ౨౭ గురు వ్యాసులు గతించిరి.

వ్యాసుల పేర్లు :—1. స్వాయంభువుడు. 2. ప్రజాపతి. 3. ఉశనుడు. 4. బృహస్పతి. 5. సవిత. 6. మృత్యువు. 7. ఇంద్రుడు. 8. వసిష్ఠుడు. 9. సారస్వతుడు. 10. త్రిధాముడు. 11. త్రివృషుడు. 12. భరద్వాజుడు. 13. అంతరిక్షకుడు. 14. ధర్ముడు. 15. త్రయ్యారుణి 16. ధనంజయుడు. 17. కృతంజయుడు. 18. సంజయుడు. 19. భరద్వాజుడు 20. గౌతముడు. 21. ఉత్తముడు (హర్యాత్ముడు) 22. వేనుడు (వాజశ్రవుడు) 23. సోమశుష్మాయణుడు (తృణబిందువు) 24. ఋక్షుడు (వాల్మీకి) 25. శక్తి. 26. పరాశరుడు. 27. జాతూకర్ణి యనువారుగతించిరి. 28. మహాయుగమున కృష్ణద్వైపాయనుడు వేదవ్యాసుడగును. వర్తమాన 28 మహాయుగమునందలి వేదవ్యాసుడు కృష్ణద్వైపాయనుడే. 29. మహాయుగమున అశ్వత్థామ వేదవ్యాసుడగుచున్నాడు.

శ్రీమజ్జగద్గురు శ్రీమచ్ఛంకర భగవత్పాదపూజ్యావతారాబ్దములు ౨౦౧౯ శ్రీభాష్యకార శ్రీభగవద్రామానుజపాదపూజ్యావతారాబ్దములు ౯౩౦ శ్రీమధ్వాచార్యపాదపూజ్యావతారాబ్దములు ౮౨౯. ఇది సర్వజిద్వత్సరారంభమునకు చూపబడినవని గ్రహించవలెను.



కలియుగమునందు యుధిష్ఠిర విక్రమార్క శాలివాహన విజయాభినందన నాగార్జున కల్కి యను ౬ గురు శకపురుషులుందురు. అందు యుధిష్ఠిరశకము ౩౦౪౪. విక్రమార్కశకము ౧౩౫. శాలివాహనశకము ౧౮౦౦౦ విజయాభినందన శకము ౧౦౦౦౦. నాగార్జునశకము ౪౦౦౦౦౦. కలిశకము ౮౨౧ సంవత్సరముల ప్రమాణముగల్గియుండును. అందు యుధిష్ఠిర, విక్రమార్క శకములు గతించినవి. శాలివాహనశకమందు శ్రీ సర్వజిత్ వత్సరారంభమునకు ౧౮౬౯ సౌరాబ్దములు గడచెను. ఇంక శాలివాహనశకము ౧౬౧౩౧ సంవత్సరములు గడువవలసియున్నది. కలిగతాబ్దములు ౫౦౪౮ ఇంకను కలియుగములో ౪౨౬౯౫౨ సంవత్సరములు గడువవలసియున్నది.

వర్తమాన బ్రహ్మ ఆయుర్దాయములో ౫౧ సం॥రమందు ప్రథమ దినములో ఘ ౧౩-౪౨ విఘ ప్రాం గుర్వ కి ని ౧౯ ల ౧౭ తృ ౨౦ గడచెను. వ్యయసంవత్సరారంభము నకు 21 త్రుటిలో గత సౌరమాసాదిగా ౧ మా ౧ ది ౬ ఘ ౪౦ విఘడియలు మాత్రమై యున్నవి.

### యుగ ప్రమాణ శ్లోకము.

శ్లో॥ కృతప్రమాణం గగనాభ్రిఖాష్టకరాద్రిచంద్రాః ప్రవదంతిసంతః
త్రేతాయుగఃఖాభ్రవియద్రసాత్మభూశరే ందవశ్శిష్టజనావదంతి
ద్వాపరాహ్వయస్యఖాంబరాభాబ్ధితర్కవసవశ్చ వత్సరాః
తద్వ దేవకలిమానవత్సరాఃఖాంబరాంబరకరాగ్నిసాగరాః.

కృతయుగ ప్రమాణ సౌరాబ్దములు 1728000. త్రేతాయుగప్రమాణ సౌరాబ్దములు 1296000. ద్వాపరయుగప్రమాణ సౌరాబ్దములు 864000 కలియుగ ప్రమాణ సౌరాబ్దములు 432000.

శ్లో॥ కార్తికే శుక్లపక్షే చ నవమ్యాం జ్ఞేచ విష్ణుభే
ధృతియోగేచ మధ్యాహ్నే కృతాంఘ్రేస్స్యాత్ప్రవర్తనం,

కార్తిక శుక్ల నవమీ బుధవారమందుశ్రవణనక్షత్రము, ధృతినామ యోగమున్న సమయములో మధ్యాహ్నకాలమందు కృతయుగము

ప్రవేశించినది. కృతయుగమందే మత్స్య కూర్మ వరాహ నారసింహావతారములు సంభవించెను.

శ్లో॥ వైశాఖే శుక్లపక్షే చ తృతీయాయాం గురోర్దినే
ధాతృభే ధృతియోగేచ త్రేతాంఘ్రిస్స్యాత్ప్రవర్తనమ్॥

వైశాఖ శుక్ల తదియా గురువారమందు రోహిణీనక్షత్రము, ధృతియోగమున్నకాలమందు త్రేతాయుగము ప్రవేశించెను. ఈయుగమునందు వామన, పరశురామ, రామచంద్ర, అను మూడవతారములు సంభవించెను.

శ్లో॥ మాఘకృష్ణ అమావాస్యాం భృగువారేచ వాసవే
వరీయానేనిశాయాంతు ద్వాపరస్య ప్రవర్తనం.

మాఘ కృష్ణ అమావాస్య శుక్రవారమందు ధనిష్ఠానక్షత్రము, వరీయాన్ యోగముండు సమయములో రాత్రియందు ద్వాపరయుగారంభమయ్యెను. ఈ యుగములో కృష్ణావతారము, బౌద్ధావతారములు సంభవించెను.

శ్లో॥ భాద్ర కృష్ణ త్రయోదశ్యాం రవివారేచ సార్పభే
వ్యతీపాతేఽర్ధరాత్రౌచ కలేః పాదప్రవర్తనం.

భాద్రపద బ ౧౩ ఆదివారమున ఆశ్రేషానక్షత్రమువ్యతీపాతయోగమున్న సమయములో అర్ధరాత్రియందు కలియుగము ప్రవేశించెను. కలియుగమున సమలదేశమందు గౌడబ్రాహ్మణ విష్ణునామకుడనువానికి కల్కి జనించును.

### కలియుగమందలి శక పురుషులు.

శ్లో॥ కలౌతు షట్ఛకాః ప్రోక్తా శృణునామాన్యథా క్రమం
యుధిష్ఠిరో విక్రమార్క శ్శాలివాహన ఏవచ
విజయాభినందన శ్చైవ నాగార్జున కలీ ఉభా
ధర్మరాజశక స్సాగరార్ణవాంబరవహ్నయః॥
విక్రమార్కశకః పంచ రామచంద్రాః ప్రకీర్తితాః



శాలివాహనశకః ఖాభ్రఖాష్టేందవ ఇతీరితః॥
విజయాభినందనాభ్రఖాంబరాంబర చంద్రమాః
నాగార్జునశ్చతుర్లక్షః కలీందుకరదిగ్గజాః॥

యుధిష్ఠిర శక ప్రమాణ సౌరాబ్దములు 3044 విక్రమార్కశక ప్రమాణ సౌరాబ్దములు 135 విజయాభినందనశక ప్రమాణ సౌరాబ్దములు 10000 శాలివాహనశకప్రమాణ సౌరాబ్దములు 18000 నాగార్జునశక ప్రమాణ సౌరాబ్దములు 400000 కలిశకప్రమాణ సౌరాబ్దములు 821.

శ్లో॥ భరతాబ్దా వసుజినైర్యుక్తాస్స్యుః కలివత్సరాః
కల్యబ్దా రూపరహితం పాండవాబ్దాః ప్రకీర్తితాః॥
కలేర్గతాః గుణాబ్ధిగుణదస్రోనా శూద్రకాబ్దాః
కలేర్గతాః గుణాబ్ధివ్యోమరామోనా విక్రమాబ్దాః॥
కలేర్గతాః ఖాక్షయుచ్ఛకవర్షాభోజరాజస్య॥

కలి గత వత్సరములలో 248 చేర్చగా భరతుడు రాజ్యపాలన గత వత్సరములు వచ్చును. భరతు డనగా దుష్యంతుని కుమారు (శకుంతలా పుత్రు) డని గ్రహించవలెను. శ్రీరామచంద్రుని తమ్ముడగు భరతుడు కాడు. కలి వత్సరములలోనుండి ఒకటి తగ్గించినచో పాండవాబ్దములగును. కలి గతాబ్దములలో 2843 తీసివేసినయెడల శూద్రకమహారాజ పాలన గతాబ్దములగును. కలి గతాబ్దములలో 3043 తీసివేయగా విక్రమశక గతాబ్దములు వచ్చును. శాలివాహన శకాబ్దములలో 20 కలిపిన భోజమహారాజాబ్దములు వచ్చును.

శ్లో॥ కరాబ్ధి శశినందేందు గజరామాశ్విభిర్యుతాః
సప్తాబ్ధి గజనాగేందు షడ్గుణేందుభి సంయుతాః
ఖాక్షా వ్యోమా ఖరామాష్ట సూర్యైస్సుః కలిసంయుతా
హరిశ్చంద్ర నలాధీశ కార్తవీర్యసమాః క్రమాత్
ఖత్రయాబ్ధిరసబాణభాస్కరాః రావణాబ్ద సహితా స్సమాః
ఖచతుష్కద్వితత్త్వైక రామరావణయుద్ధతాః
ఖత్రయాంకే వ్యోమబాణ సూర్యాస్స్యుః కలిసంయుతాః
రాఘవేంద్ర సమాబ్దాస్తే భవం త్యేక సమా స్సమాః॥

కలి గతాబ్దములలో 23819142 చేర్చగా హరిశ్చంద్ర మహారాజాబ్దములగును. 13618847 చేర్చగా నలమహారాజాబ్దములగును. 12880[illegible]0 చేర్చగా కార్తవీర్యార్జునాబ్దములగును. కలి గతాబ్దములలో 12564000 చేర్చగా రావణాబ్దములగును. 12520000 చేర్చగా రామరావణయుద్ధకాలాబ్దములు వచ్చును. 12600000 చేర్చగా శ్రీరామచంద్రరాజ్యాంత వత్సరము లగును.

శ్లో॥ బాణాబ్ధ్యంక చంద్రోనా తేభ్య శ్శూద్రకసమాః ప్రకీర్తితాః
తేభ్య విక్రమసమాభవంతివై నాగనంద గగనేందువర్జితాః॥

కలి గతాబ్దములలో 1945 తీసివేయగా శూద్రకమహారాజాబ్దములగును. శూద్రకమహారాజాబ్దములలో 1093 తీసివేయగా విక్రమార్కాబ్దములు వచ్చును.

శ్లో॥ నందాద్రిచంద్రానలనాగరంధ్రశకేంద్రయోనందశశాంకబ్రుందే
శకాన్వితే సృష్టిగతాభవంతి నందాద్రిచంద్రానలసంఖ్యకాశ్చ
శకాన్వితే తే కలి వత్సరే గతాబ్దాః॥

శాలివాహనశక వత్సరములయందు 1955883179 చేర్చిన సృష్టిగతాబ్దములు వచ్చును. శకాబ్దములలో 3179 చేర్చిన కలి గతాబ్దములు వచ్చును.

## —♦ ప్రభవాద్యబ్దాయనము. ♦—

శ్లో॥ శకభూప సమాస్సార్క షష్టిభక్తావశేషితాః
భవంతి ప్రభవాద్యబ్దాస్తన్నామాని క్రమా ద్భవేత్॥

శాలివాహన గతాబ్దములతో ౧౨ చేర్చి ౬౦ చే భాగించగా శేషసంఖ్య ననుసరించి ప్రభవాదిగ సంవత్సరము వచ్చును.

## —♦ పంచవత్సరాత్మక యుగము. ♦—

శ్లో॥ యుగంభవే ద్వత్సరపంచకేన యుగానితు ద్వాదశవర్షషష్ట్యా॥

ప్రభవ మొదలగు నరువది సంవత్సరములను 12 భాగములు చేయగ ప్రతి భాగమున్ను యుగ మను సంజ్ఞ గల్గియున్నది. పంచవత్సరాత్మక యుగములో



శ్లో॥ సంవత్సరస్తు ప్రథమో ద్వితీయః పరివత్సరః
ఇదా వర్ష స్తృతీయస్తు చతుర్థ శ్చానువత్సరః
ఇద్వత్సరః పంచమస్తు తత్సంఘో యుగ సంజ్ఞికః॥
సంవత్సరోగ్నిః పరివత్సరోర్క ఇదాదిక శ్శీతమయూఖమాలీ
ప్రజాపతిస్స్యా దనువత్సరస్స్యాదిద్వత్సర శ్శైలసుతాపతిశ్చేత్
సంవత్సరేతు దాతౄణాం తిలదానం మహాఫలం
పరిపూర్వేచ యద్దానం యవానాం ద్విజసత్తమ
ఇదా పూర్వే చ వస్త్రాణాం ధాన్యానాం చానుపూర్వకే
ఇత్పూర్వే రజితస్యాపి దానం పూర్ణం మహాఫలం॥

పంచవత్సరాత్మక యుగమందలి ప్రథమము సంవత్సర మనబడు. రెండవది పరివత్సరము. మూడవది ఇదావత్సరము. నాల్గవది అను వత్సరము. అయిదవది ఇద్వత్సరము అను పేర్లు గలిగియున్నవి. సంవత్సరమునకు అగ్నియు, పరివత్సరమునకు సూర్యుడు, ఇదా వత్సరమునకు చంద్రుడు, అనువత్సరమునకు ప్రజాపతియు, ఇద్వత్సరమునకు రుద్రుడును అధిపతు లగుదురు. సంవత్సరమున నువ్వులదానము, పరివత్సరమున యవలు (లోక గోధుమలు). ఇదా వత్సరమున వస్త్రములు, అనువత్సరమున ధాన్య ...ను, ఇద్వత్సరమున రజిత (వెండి) దానమును చేయుట మహాఫలదము. ఆయాసంవత్సరములయం దాయాదేవతలను పూజించి ఆయా సంవత్సరములయందు చెప్పబడిన దానములు చేయుటచే గొప్ప ఫలము కలుగును. స్వర్గము లభించును.



| సంవత్సరము అగ్ని. | పరివత్సరము సూర్యుడు. | ఇదావత్సరము చంద్రుడు. | అనువత్సరము ప్రజాపతి. | ఇద్వత్సరము రుద్రుడు. |
|---|---|---|---|---|
| ప్రభవ | విభవ | శుక్ల | ప్రమోదూత | ప్రజోత్పత్తి |
| అంగీరస | శ్రీముఖ | భావ | యువ | ధాత |
| ఈశ్వర | బహుధాన్య | ప్రమాధి | విక్రమ | వృష |
| చిత్రభాను | సుభాను | తారణ | పార్థివ | వ్యయ |
| సర్వజిత్ | సర్వధారి | విరోధి | వికృతి | ఖర |
| నందన | జయ | విజయ | మన్మథ | దుర్ముఖ |
| హేవలంబి | విలంబ | వికారి | శార్వరి | ప్లవ |
| శుభకృత్ | శోభకృత్ | క్రోధి | విశ్వావసు | పరాభవ |
| ప్లవంగ | కీలక | సౌమ్య | సాధారణ | విరోధికృత్ |
| పరీధావి | ప్రమాదీ | ఆనంద | రాక్షస | నల |
| పింగళ | కాళయుక్తి | సిద్ధార్థి | రౌద్రి | దుర్మతి |
| దుందుభి | రుధిరోద్గారి | రక్తాక్షి | క్రోధన | అక్షయ |
| తిలదానం. | యవదానం. | వస్త్రదానం | ధాన్యదానం | రజతదానం |



# ప్రభవాది సంవత్సర ఫలములు.

## ప్రభవ సంవత్సర ఫలములు.

శ్లో॥ క్వచిద్వృద్ధిః క్వచిద్ధానిః క్వచిదీతిః క్వచిద్గదః
తథాఽపిమోదతే లోకః ప్రభవాబ్దే విమత్సరః॥

శ్లో॥ ఈతయశ్చాగ్నికోపశ్చ వ్యాధయః ప్రచురా భువి
ప్రభవాబ్దే మందవృష్టి స్తథాపి సుఖినో జనాః॥

కొన్ని ప్రదేశములందు ప్రజావృద్ధియు, కొన్ని ప్రదేశములందు ప్రజాక్షయమున్ను, ఈతిబాధలు, రోగపీడలు, అగ్నిబాధలు, అల్పవృష్టియు ఉండును, ఇట్లున్నను ప్రజలు విమత్సరులై సుఖసౌఖ్యముల ననుభవించెదరు.

శ్లో॥ అథ విస్తరతః షష్టివర్షాణాం స్పష్టతా ఫలే
ప్రాచీన వచనైరేవ గద్యరీత్యాని గద్యతే॥

ప్రభవాది అరువది సంవత్సరములయొక్క విశేష ఫలములను ప్రాచీన వచనముల ననుసరించి విస్పష్టముగా వచన రూపమున వ్రాయుచున్నాను.

ప్రభవ సంవత్సరాధిపతి బ్రహ్మ. చైత్రవైశాఖమాసములందు సుభిక్ష క్షేమారోగ్యములుండును. సమస్త వస్తువుల ధరలు సరసము. జ్యేష్ఠాషాఢ శ్రావణ మాసములయందు ఆహార ధాన్యములు, అపర ధాన్యముల ధరలు బాగుగా పెరుగును భాద్రపదమాసమునను శుభము సుభిక్షముండును. ఆశ్వయుజమాసమునందు కొన్ని ప్రదేశములందు ధాన్యాది ధరలు పెరుగును. రోగపీడలుండును. కార్తిక, మార్గశిర, పౌష మాఘ, ఫాల్గుణమాసములందు సర్వవస్తువుల ధరలు సరసముగా నుండును. ధరలు కొన్ని ప్రదేశములందు పెరిగి నిలబడియుండును.

శ్లో॥ అబ్దే ప్రవృత్తే ప్రభవేఽగ్నికోపః సంతీతయః పైత్తకఫాశ్చ రోగాః । స్తోకం జలంముంచతివారివాహాః సదా ప్రమోదంతి జనాశ్చ సర్వే॥

ప్రభవ సంవత్సరమందు అగ్నిప్రకోపము, ఈతిబాధలు, పైత్యోద్రేక వ్యాధులు, పిత్త, కఫరోగములు ప్రబలియుండును. మేఘములుచక్కగా వర్షించుటచే సస్యములు చక్కగా ఫలించి జనులు సుఖసౌఖ్యముల నను భవించెదరు.

### —♦ విభవ సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ వృష్టిః ప్రభూతాఖిల సస్యవృద్ధిర్జనానురాగం విభవే ప్రవృత్తే
అన్యోన్యయుద్ధైః క్షితిపాలకానాంనదుఃఖమాప్నోతిజనాస్తథాపి॥

శ్లో॥ నిష్పన్న శాలీక్షుయవాదిసస్యాభయై ర్విముక్తాచప్రశాంతవైరా
సంహృష్టలోకాకలిదోష ముక్తాస్యాదద్భుత ధాత్రీవిభవాఖ్యవర్షే॥

శ్లో॥ దండనీతి పరాభూపాః బహుసస్యార్ఘ వృష్టయః
విభవాబ్దేఽఖిలాలోకాః సుఖ న స్స్యుర్వివైరిణః

రాజులు దండనీతి ప్రవర్తకులైయుందురు.సస్యానుకూల వర్షము లుండుటచే సస్యములు చక్కగా ఫలించును. ఆహారధాన్యముల ధరలు సరసము. ప్రశాంతముగా ప్రజలు జీవనము చేయుచుండెదరు.

విభవ సంవత్సరాధిపతి విష్ణువు. రోగములు వ్యాపించును. నాగపూర్ ప్రాంత మధ్యదేశములందు ప్రజాక్షోభ ముండును. త్రిలింగ, మగధ. చీనాదేశములందు సమస్త పదార్థముల ధరలు పెరిగియుండును. పంజాబు సరిహద్దు ప్రాంతములందు ప్రజాకల్లోలములు. కలహములు, ప్రజాక్షయము సంభవించును. బెంగాలు, బొంబాయి, సింధుప్రాంతములందును, బీహారునందును కొట్లాటలు సంభవించును. మిగతాప్రాంతములందు సౌమ్యముగా నుండును. చైత్రాది మూడుమాసములు ధాన్యాది వస్తువుల ధరలు పెరుగును. ఆషాఢాది మూడుమాసములలో వర్షములుండును. ఆశ్వయుజమాసమున రసవస్తువుల ధరలు పెరుగును. తరువాత ధరలు మందమగును. మేఘాడంబరము గాలివాన లుండును. కార్తిక, మార్గశిర, పౌష, మాఘ, ఫాల్గుణమాసములందు ఆహార ధాన్యముల ధరలు తగ్గియుండును. సమస్త పదార్థముల ధరలు సరసము.



### —♦ శుక్ల సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ అన్యోన్యరత్యాతిశయా దజస్రం రామాః ప్రపంచే రమయంతి రామాన్ । గోధూమశాలీక్షుమతీ ధరిత్రీ నివృత్తవైరా భువి శుక్లవర్షే॥

శ్లో॥ సకలత్రాత్మజాన్-శశ్వల్లాలయం త్యఖిలా జనాః
రాజానో యుద్ధనిరతాః పరస్పరజయైషిణః॥

శ్లో॥ రోగా బహువిధాః ప్రోక్తా మానవాశ్చాపి కుంజరాః
సర్వే చైవ ప్రణశ్యంతి శుక్లాబ్దే చ వరాననే॥

స్త్రీపురుషులు కామాచార ప్రవర్తకులై దారేషణ, పుత్రేషణగల్గియుందురు. ఆహార ధాన్యములు చక్కగా ఫలించును. రాజులు పరస్పర జయాభిలాషులై కలహించెదరు. ప్రజలు, నానావిధ రోగపీడలు గల్గియుందురు పశువులకు రోగము లతిశయించి క్షయించును.

శుక్ల సంవత్సరాధిపతి రుద్రుడు. మ్లేచ్ఛదేశములందు ఛత్రభంగము, ప్రజాక్షయ ముండును. మంత్రియే రాజరికము వహించును. చైత్రవైశాఖజ్యేష్ఠమాసములందు ధరలు సరసముగా నుండును. ఆషాఢ, శ్రావణ, భాద్రపదములందు సువృష్టి యుండును, ఆశ్వయుజ మాసములో ప్రజారోగ్యము చెడును. రోగపీడలు, కలరావ్యాధి యుండును. నూనె గింజలు, నూనెలు, వెన్న, నెయ్యి ధరలు మందము. మిగతా పదార్థము లన్నిటికి ధరలు పెరుగును. కార్తిక, మార్గశిర, పౌష, మాసములలో సమస్త ధాన్యముల ధరలు మందమగును. ఫాల్గుణమాసములో ప్రపంచమందంతటను ప్రజాక్షోభ, యుద్ధభీతి, ప్రజానాశము, చోరరోగాగ్నిశస్త్రాస్త్రభయము లుండును. గ్రామములు నశించును. గ్రామములు నిర్మానుష్యమై యుండును.

### —♦ ప్రమోద సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ ప్రమోదాబ్దే ప్రమోదంతే రాజానో నిఖిలా జనాః
వీతరోగా వీతభయా ఈతివైరి వివర్జితాః॥

శ్లో॥ ప్రమోదవర్షే సుజనా నృపాశ్చ మోదంతి పాపాభిరతాః సచోరాః
సీదంతి పృథ్వీ బహుసస్యపూర్ణా ద్విజవైరిణః సర్వజనా ధరిత్ర్యాం॥

రాజులు, ప్రజలు సుఖముగా జీవించెదరు. ప్రజలు రోగములు, భయములు లేకయుందురు. సస్యానుకూల వర్షములుండును. పంటలు చక్కగా ఫలించును. సుభిక్ష క్షేమారోగ్యము లుండును.

ప్రమోద వత్సరాధిపతి సూర్యుడు. మధ్యమ వర్షములు. ప్రజలకు మనశ్శాంతి యుండదు. మ్లేచ్ఛజాతికి హాని యధికము. మ్లేచ్ఛదేశములందు ఛత్రభంగము. ప్రజానాశ మండును. పర్వతప్రాంతీయములందు ప్రజాక్షయ కల్లోలము లుండును. త్రిలింగదేశమున రాజకీయ బాధలుండును. ఆంధ్రదేశమందు ప్రజారోగ్యము బాగుండదు. చైత్రవైశాఖమాసములందు సమస్త పదార్థముల ధరలు పెరిగియుండును. జ్యేష్ఠమాసమునరోగచోరాగ్నిభయములుండును. ఆషాఢాదిమాసత్రయమందు అల్పవృష్టి, ఆశ్వయుజమాసమందు మధ్యమ వర్షములు. ధాన్యాది ధరలు కొలదిగ పెరుగును. కార్తికాది మాసచతుష్టయమందు సమస్త రసవస్తువుల ధరలు పెరుగును. ఫాల్గుణమాసమందు సమస్త వస్తువుల ధరలు నిలబడియుండును.

—♦ ప్రజాపతి సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ నచలంత్యఖిలాలోకాః స్వస్వమార్గాత్కథంచన
అబ్దే ప్రజాపతౌ నూనం బహుసస్యార్ఘవృష్టయః॥
సువర్ణం సర్వధాన్యాని సులభాని యయుర్నరాః
దర్పితాస్సర్వసంపద్భిః క్షేమారోగ్యం ప్రజాయతే॥

స్వస్వమార్గములనుండి ప్రజలు చలించరు. సస్యానుకూల వర్షములు, బంగారం, వెండి, సర్వధాన్యములకు ధరలు సరసమై యుండును. సర్వసంపదలతో గూడినవారై ప్రజలు గర్విష్ఠులైయుందురు. సుభిక్ష క్షేమారోగ్య పశువృద్ధి యుండును.

ప్రజాపతి సంవత్సరాధిపతి చంద్రుడు :— పన్నెండు మాసములందును సుభిక్ష క్షేమారోగ్యములుండును. కాని అల్పవృష్టి. ఆశ్వయుజ



మాసమున రోగములు ప్రబలును. ధాన్యముల ధరలు పెరుగును. కార్తికమార్గశిరమాసములందు ధాన్యాదులకు ధరలు తగ్గును. పౌషాది మాసత్రయమందు ప్రజారిష్టములు, భయోత్పాతములుండును.

—♦ అంగిరా సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ అన్నాద్యం భుంజతే శశ్వజ్జనైరతిథిభిః సహ
అంగిరాబ్దేఽఖిలాలోకా భూపాశ్చ కలహోత్సుకాః॥

శ్లో॥ బహువర్షతి పర్జన్యః క్షీరధాన్య సమృద్ధయః
ఉత్సాహినో జనపదా సర్వేఽప్యాంగీరస ప్రజాః॥

అతిథి అభ్యాగతులతోగూడి ప్రజలు నిరంతరము సుఖముగావిందులు భోజనములు చేయుచుండెదరు. రాజులు కలహశీలులై యుందురు. సస్యానుకూలవృష్టి యుండును. పశువృద్ధి, సస్యవృద్ధియుండును. ప్రజలు ఉత్సాహవంతులై సుఖజీవనము చేయుదురు.

అంగిరాధిపతి కుజుడు :—ఈ సంవత్సరమందు అగ్నిబాధ లుండును. చైత్రవైశాఖములందు సమస్త వస్తువుల ధరలు మందము. జ్యేష్ఠమాసమునందు వడగాడ్పు లధికము. అగ్నిబాధ లతిశయించును. ఆషాఢమాసమందు మేఘాడంబరము సువృష్టియుండును. శ్రావణాది మాసత్రయమందు రోగపీడలుండును. కార్తికమున ఆహారధాన్యముల ధరలు సరసమై యుండును. మార్గశిరమున ధాన్యాదుల ధరలు పెరుగును. పౌషాదిమాసత్రయమందు ధాన్యాదుల ధరలు మందగించును. సరసమై యుండును.

—♦ శ్రీముఖాబ్ద ఫలములు. ♦—

శ్లో॥ శ్రీముఖాబ్దే దుగ్ధపూర్ణా గోకర్ణవలయే వభూః
సస్యపీతావరావారిగావస్తుంగపయోధరాః॥

గొల్లవాండ్రకు అభివృద్ధియు, పశువుల యభివృద్ధియును, సస్యానుకూల వర్షము లుండును. గోవులు చక్కగా పాలిచ్చును. (అనగా పంటల యభివృద్ధి యుండుననుమాట.)

శ్లో॥ విచిత్ర సస్యాంబర చిత్రవర్ణా గుల్మస్తనీ పూర్ణతటాగపూర్ణా
క్రీడావనాఢ్యా ఫలపుష్పవక్త్రా భూః శ్రీముఖేబ్దేవనితేవభాతి॥

శ్లో॥ శ్రీముఖాబ్దేతు సంపూర్ణతటాకాచాంగనేవభూః
సస్యపీతాంబరాభాతి గోత్రోత్తుంగ పయోధరా॥

చిత్రవిచిత్రములగు సస్యములతో గూడిన వస్త్రమునుధరించినదియు, చెఱువులు నిండునటుల వర్షములుండుటచేత గుల్మమువంటి స్తనములతో గూడినదియు, క్రీడావనములుగలదియు, ఫలపుష్పములతో శోభాయమానముగా నుండు శ్రీముఖాబ్ద కన్యక ప్రకాశించుచున్నది. శ్రీముఖాబ్ద మనెడు కన్యక సంపూర్ణావయవములు గలిగి పండిన పంటలు వోలె నున్న పీతాంబరధారియై పర్వతములవలె ఎత్తైన గంభీర పయోధరములు గల్గియున్నది.

శ్లో॥ శ్రీముఖాబ్దేఽఖిలా ధాత్రీ బహు సస్యార్ఘ సంయుతా
అధ్వరే నిరతా విప్రావీతరోగా విప్రైరిణః॥

సస్యసమృద్ధి, ధరలు సమృద్ధి యుండును. బ్రాహ్మణులు యజ్ఞయాగాది క్రతువులను చేయుచుందురు. తదితరజాతులు పరస్పర విరోధములు లేక సుఖజీవనము చేయుదురు. ప్రజారోగ్యముండును.

శ్రీ ముఖాబ్దపతి బుధుడు :—చైత్రాదిమాసత్రయమందు సమస్త ధాన్యముల ధరలు పెరుగును జ్యేష్ఠమాసములో పూర్ణిమ తరువాత, ఆషాఢమాసమునందును మంచి వర్షములు కురియును. శ్రావణమాసమున ఆహార ధాన్యముల ధరలు పెరుగును. ధాన్యము, నెయ్యి, వెన్న, నూనెగింజల ధరలు బాగుగా పెరుగును. వ్యాపారస్థులకు పీడ లతిశయించును. శ్రావణమాసములో తూర్పు, పశ్చిమదేశములందు, పంజాబు సరిహద్దు, బెంగాల్, బొంబాయి, హైదరాబాదు దేశములందు ప్రజా కల్లోలములు, భయోత్పాతము లుండును. భాద్రపదమాసమున మంచి వర్షములుండును. ఆశ్వయుజాదిమాసషట్కమందుప్రజాక్షోభము తగ్గును.

—♦ భావ సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ భావాబ్దే ప్రచురా రోగా మధ్య సస్యార్ఘ వృష్టయః
రాజానో యుద్ధనిరతా స్తథాపి సుఖినో జనాః॥

రోగము లధికము. వర్షములు తక్కువ. పంటలు మధ్యమముగా నుండును. రాజులు పరస్పర జయాభిలాషులై యుద్ధము చేయుదురు. ప్రజలు సుఖజీవనము చేయుచుండెదరు.



భావాబ్దపతి గురుడు :—పాడిపంటలు సమృద్ధిగా నుండును. సమస్త వస్తువుల ధరలు పెరుగును. వర్షము లధికము ఉత్తర హిందూస్థానము, శ్రీనగర్, అయోధ్యా, పాట్నా, పంజాబ్, ప్రాంతములందు రాజకీయ కల్లోలము లుండును. ప్రజాక్షోభము, జనధనమానహాను లుండును. నెయ్యి, బెల్లం, నల్లమందు, నూనె గింజలు, నూనెలు, పక్కలు, పసుపు, మిర్చి, కందులు, చందనము, సుగంధ ద్రవ్యములు, ఆహార ధాన్యములు, అపర ధాన్యముల ధరలు పెరుగును. చైత్రమాసమున ధాన్యాదుల ధరలు సరసము. వైశాఖమున ధరలు పెరుగును. ధాన్యము ధర బాగా పెరుగును. జ్యేష్ఠాషాఢమాసములందు ధరలు పెరిగియే యుండును. శ్రావణమున స్వల్పవృష్టి. భాద్రపదమున అతివృష్టి. ఆశ్వయుజమున రోగములు ప్రబలును. కార్తికమున సుభిక్షము. మార్గశిరాది నాల్గుమాసములందు ధాన్యాదుల ధరలు సరసముగా నుండును. రాజకీయ వడిదుడుకు లధికము.

—♦ యువ సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ ప్రభూత కామాః ప్రమదాయువాబ్దే గోధూమశాలీక్షుతులాని
భుంక్త్వా । చోరామయవ్యాళభయం ప్రభూతం తథాపి విందం
తిన దుఃఖ మేతాః॥

స్త్రీలు అత్యధిక కామాసక్తులై యుందురు. గోధుమలు, ధాన్యము, బియ్యం, జొన్నలు, చెఱకు, బెల్లం ధరలు సరసము. ఆహార ధాన్యములు బాగుగా ఫలించును. చోరులు, రోగములు, పాములు, తేళ్ళు, దుర్మార్గులవల్ల బాధలున్నను జనులు సుఖము ననుభవించెదరు.

శ్లో॥ హాహాభూతం జగత్సర్వం సర్వధాన్య మహార్ఘతా
తైలం ఘృతం సమం యాతి యువా సంవత్సరే ప్రియే॥

ప్రపంచమందంతటను ప్రజాక్షోభము హాహాకారములుండును, సమస్త ధాన్యముల ధరలు పెరుగును. నెయ్యి, నూనె గింజలు, నూనెల ధరలు సరసముగా నుండును.

యువసంవత్సరాధిపతి శుక్రుడు :—ఈ సంవత్సరమున భూకంపములుండును. ఉల్కాపాత భయోత్పాతములుండును. చైత్రి వైశాఖ

మాసములయందు భయోత్పాతములు, జ్యేష్ఠమున రోగములు, ఆషాఢమున వర్షాధిక్యత, శ్రావణమున గాలితోగూడిన వర్షములు, తుపాను గాలి వీచును. ఆహారధాన్యముల ధరలుపెరుగును. భాద్రపదమునవర్షము లధికము. ప్రజాకల్లోలములు. ఉత్తరదేశములందు అకాల పరిస్థితులు, దుర్భిక్షము, తూర్పుదేశములందు వరదలవల్లను, అధిక వర్షమువల్లను తుపానువల్లను పంటలు నష్టమగును. దక్షిణదేశమందు ప్రజా కలహములు, ఆశ్వయుజ కార్తికములందు విషమ పరిస్థితులుండును. మార్గశిరమున పౌషమున పరిస్థితులు కొంత చక్కబడును. మాఘఫాల్గుణములందు కొన్ని కష్టనష్టము లుండును. పూర్తిగా తొలగిపోవు.

## ధాతృవత్సర ఫలములు.

శ్లో॥ ధాతృవర్షేఽఖిలాః క్ష్మేశాః సదా యుద్ధపరాయణాః
సంపూర్ణా ధరణీభాతి బహుసస్యార్ఘ వృష్టిభిః॥

రాజులు యుద్ధనిరతులై యుందురు. సస్యానుకూల వర్షములుండి సస్యములు చక్కగా ఫలించును. "ధాత్రీ ధాత్రీవలోకానామభయాయ భయప్రదా." ధాతృసంవత్సరమున శాంతియున్నట్లున్నను భయమును కలుగజేయునని భీతితో ప్రజ లుందురు.

ధాతృవత్సరాధిపతి శని:—చైత్రవైశాఖములలో సమస్తధాన్యములకు ధరలు పెరుగును. జ్యేష్ఠమున ధాన్యాదుల ధరలు సరసమగును. ఆషాఢమున స్వల్పవృష్టి, నెయ్యి, నూనెగింజలు, నూనెలు, ప్రత్తి, దూది, పసుపు, మిర్చి, వక్కలు, వేరుశనగ ధరలు పెరుగును. శ్రావణమున ఆహారపదార్థముల ధరలు పెరుగును. భాద్రపదమున పురుషులు పౌరుషహీనులై యుందురు. పశ్చిమదేశములందు వర్షము లధికము. ధాన్యాదుల ధరలు పెరుగును, ఉత్తర దక్షిణదేశములందు అధికవర్షము లుండును. ఆశ్వయుజమున రసవస్తువుల ధరలు పెరుగును. కార్తికమాసమున ఆహారధాన్యముల ధరలు తగ్గును. మార్గశిరాదిమాస చతుష్టయమందు ధాన్యాదుల ధరలు అస్థిరమై యుండును.



## ఈశ్వర సంవత్సర ఫలములు.

శ్లో॥ సుభిక్షం క్షేమమారోగ్యం కార్పాససస్య మహార్ఘతా
లవణం మధుగవ్యంచ ఈశ్వరే దుర్లభం ప్రియే॥

శ్లో॥ ఈశ్వరాబ్దే స్థిరాః క్ష్మేశాజగదానందినీ మహీ
అధ్వరే నిరతా విప్రాః స్వస్వమార్గరతః పరే॥

సుభిక్ష క్షేమారోగ్యములుండును. ప్రత్తి, ఉప్పు, వెండి, తేనె, పంచదార, పాలు, పెరుగు, వెన్న, నెయ్యి ధరలు, పశువుల ధరలు పెరుగును. రాజులు స్థిరబుద్ధిగలిగి ప్రజాభీష్టపాలన గావించెదరు. బ్రాహ్మణులు కర్మతత్పరులై యుందురు. బ్రాహ్మణేతర జాతులు స్వవర్ణాచారము ననుసరించి ప్రవర్తించెదరు.

ఈశ్వరవత్సరాధిపతి రాహువు:—ఉత్తరదేశములందు దుర్భిక్షము. తూర్పుదేశములందు సుభిక్షము. పశ్చిమదేశములందు కలహములు, యుద్ధము ఉండును. చైత్రవైశాఖములందు ఆహారధాన్యముల ధరలు పెరుగును. జ్యేష్ఠాషాఢములందు అల్పవృష్టి సమస్త ధాన్యముల ధరలు పెరుగును. శ్రావణభాద్రపదములందు అత్యధిక వర్షములు. సమస్త వస్తువులు, ధాన్యముల ధరలు పెరుగును. ఆశ్వయుజమున నెయ్యి, వెన్న, నూనెలధరలు పెరుగును. కార్తికమున దుర్భిక్ష భయోత్పాతములుండును. పసుపు, మిర్చి, ఉప్పు, వెండి, బంగారం, వక్కలు, కొబ్బరి, మొదలగు వస్తువుల ధరలు పెరుగును. మార్గశిరాది నాల్గు మాసములందును దుర్భిక్ష భయోత్పాతములు, జనహాని, కలహములు, సమస్త ధాన్యములు, వస్తువుల ధరలు బాగా పెరిగియుండును.

## బహుధాన్య సంవత్సర ఫలములు.

శ్లో॥ బహుధాన్యాబ్దే సతతం బహుధాన్యయుతం ధరాతలం నిఖిలం
పిత్తకఫానిలజాతా బహుధా రోగాస్తథావిధాస్తత్ర॥

ప్రపంచమున ధనధాన్యసంపత్తియుండును. పిత్త, కఫ, అగ్నిమాంద్య రోగము లుండును. అగ్నిబాధ లుండును. ప్రజలు నానావిధరోగపీడితు

లయి యుందురు. పశువులకు రోగములుండును. రాజులు వైరవర్జితులై యుందురు.

బహుధాన్యవత్సరాధిపతి కేతువు :—పురుషులు నిర్వీర్యులై యుందురు. పశ్చిమదేశములందు సుభిక్షము. మధ్యమ దక్షిణదేశములందు ప్రజాకల్లోలములు, భయోత్పాతములుండును. ఉత్తరదేశములందు అరిష్టములుండును. తూర్పుదేశములలో దుర్భిక్షము. ఆహారధాన్యములను సేకరించుట మంచిది. చైత్రవైశాఖములందు ఆహారధాన్యముల ధరలు కొలదిగ పెరుగును. జ్యేష్ఠమాసమున ఆహారధాన్యముల ధరలు బాగా పెరుగును. ఆషాఢ శ్రావణమాసములందు వర్షము లధికము. ఆహారధాన్యముల ధరలు పెరుగును. మంచి పెరుగుదల యేర్పడును. భాద్రపద ఆశ్వయుజములందు అత్యధిక వర్షము, వరదలు. సమస్త ధాన్యముల ధరలు సరసమగును. కార్తికాది మాస చతుష్టయమందు ధాన్యాదుల ధరలు మందగించియుండును. ఫాల్గుణమున ధాన్యాదుల ధరలు పెరుగును.

—♦ ప్రమాథి సంవత్సర ఫలములు ♦—

శ్లో॥ బలాహకానముంచన్తి కుత్రచిత్ప్రచురం పయః
పరిమాథ్యబ్దే వీతరాగాస్తథాపి సుఖనోజనాః॥

శ్లో॥ రాజ్యనాశోఽథ దుర్భిక్షం తథా తస్కరతో భయం
క్వచి త్సౌఖ్యం క్వచి ద్దుఃఖం ప్రవృత్తేఽబ్దే ప్రమాథిని॥

శ్లో॥ నిఖిలాధరణీసహితా రథతురగగజాదిభి ర్బహుభిః
కుత్రచిదర్ఘం ప్రచురం న కుత్రచిద్ధనరసం పరిమాథ్యబ్దే॥

మేఘములు ఒకానొకచో వర్షించును. ఒక్కొకచో వర్షించదు. మరొకచోట అధిక వర్షముల నొసంగును. ప్రజలు పరస్పర స్నేహానురాగము లేనివారయ్యును సుఖముగా జీవింతురు. ఒక్కొకచో రాజహాని, దుర్భిక్షము, చోరులచే భయము. ఒకప్పుడు సుఖము, మరొకప్పుడు దుఃఖము లుండును. భూమి రథగజాశ్వములచే సమృద్ధిగ



నుండును. ఒకచో ధాన్యాదుల ధరలు తగ్గును. మరొక్కచో ధరలు పెరుగును.

పరిమాథివత్సరాధిపతిసూర్యుడు:—చైత్రాదిమూడుమాసములందు వడిదుడుకులుండును. ఆషాఢశ్రావణభాద్రపదములందు స్వల్పవృష్టి. చైత్రమున ఆహారధాన్యముల ధరలు పెరుగును. వైశాఖజ్యేష్ఠమాసములయందు సమస్త పదార్థముల ధరలు పెరుగును. భాద్రపద బహుళమందును ఆశ్వయుజమాసమునను వర్షము లధికము, కార్తికమాసము నుండి ౫ మాసములవరకు ఆహారధాన్యము, రసవస్తువులు, వెండి, బంగారం ధరలు, అపర ధాన్యములు, పసుపు, వేరుశనగ, వక్కలు, ఇంగువ, లక్క, కుంకుమ, కస్తూరి, సుగంధద్రవ్యములు, నూలు, రంగులు, వస్త్రములు, కొబ్బరికాయలు, మొదలగు వస్తువుల ధరలు పెరుగును.

—♦ విక్రమ సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ ప్రవహంతిజలం స్వచ్ఛం స్రవంతి ప్రచురం పయః
విక్రమాబ్దేఽఖిలాః క్ష్మేశా విక్రమాక్రాంత భూమయః॥

శ్లో॥ అనుపమ విక్రమధరణీనాథై రాక్రాంత వసుమతీ సకలా
విక్రమవర్షే సుజనావర్ధంతే విక్రమైః స్వైః స్వైః॥

వర్షములు బాగుగా వర్షించును. నదులు చక్కగా ప్రవహించును. రాజులు సాహసముచే భూమిని ఆక్రమించెదరు. సాటిలేని సాహసముగలవారు అభివృద్ధి నందెదరు. రాజు లత్యంత సాహసముగలవారై శత్రుభూముల నాక్రమించెదరు.

విక్రమ వర్షాధిపతి చంద్రుడు :—రాజులు ప్రజాభీష్ట పరిపాలనాసక్తులై యుందురు. చైత్రవైశాఖములందు ధాన్యాదుల ధరలు పెరుగును. మ్లేచ్ఛ యవనజాతుల భయముచే నగరములు నిర్మానుష్యమగును. వైశాఖముననే వడగాడ్పు లధికమగును. భూకంపము, అగ్నిబాధ లుండును. ప్రజలు స్ఫోటకాగ్నిశస్త్రభయములు గల్గియుందురు. జ్యేష్ఠాషాఢమాసములందు భయోత్పాతములు, దుర్భిక్షము. శ్రావణ భాద్రపదమాసములందు అధిక వర్షములు ప్రజాసుఖము, సమస్త ధాన్య

ముల ధరలు సరసము. ఆశ్వయుజమున రోగపీడలు రసవస్తువుల ధరలు సరసమగును. కార్తికాది మాసపంచకమున సర్వత్రసుభిక్షము. ధాన్యాదుల ధరలు సరసముగా నుండును.

### —♦ వృషాబ్ద ఫలములు. ♦—

శ్లో॥ కోద్రవాః శాలి ముద్గాశ్చ యవాశ్చ ద్విదళం తథా
సుభిక్షం వరధాన్యం చ వృషాబ్దే శుభలోచనే॥
వివిధై రన్నపానాద్యై ర్హృష్టపుష్టాంగచేతసః
మదోన్మత్తాఖిలా లోకా వృషాబ్దే వృషసన్నిభాః॥

కోద్రవ, వడ్లు, పెసలు, యవలు, గోధుమలు, అపరధాన్యములు బాగుగా ఫలించును. వివిధాన్నపానములచే సంతుష్టియు, పుష్టియుగల్గి మదోన్మత్తులై ప్రజలు రాజులు యుండెదరు.

వృషాబ్దపతి కుజుడు :—రాజులకు పీడ, వర్షములుండును. చైత్రమున ఛత్రభంగము. వైశాఖమున అగ్నిబాధలు, ప్రజాక్షోభ యుండును. జ్యేష్ఠమాసమున ఆహారధాన్యముల ధరల నిలకడయుండదు. పెరుగును. ఆషాఢమున ఆహారపదార్థముల ధరలు పెరుగును. శ్రావణ భాద్రపదములం దధికవర్షము లుండును. ఆశ్వయుజమున సర్వధాన్యముల ధరలు సరసమగును. నెయ్యి, వెన్న, నూనెగింజలు, నూనె ధరలు పెరుగును. పశ్చిమదేశములం దాహారపదార్థాల ధరలు పెరుగును. దుర్భిక్షముండును. అధిక వర్షములు. కార్తికమున స్వల్పారిష్టములు. సర్వవస్తువుల ధరలు సరసమగును. మార్గశిరమున దుఃఖములు. అవినీతి ప్రవర్తన లుండును. పౌషాది మాసత్రయమున సమస్త వస్తువుల ధరలు నిలకడలేక హెచ్చుతగ్గులుగా నుండును.

### —♦ చిత్రభాను సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ చణకా ముద్గమాషాశ్చ కంగున్యశ్చ తథైవచ
విచిత్రా జాయతే వృష్టి శ్చిత్రభానౌ న సంశయః॥



శ్లో॥ నానావిధైః సస్యవిచిత్రితాభూర్వై చిత్రభానౌ భువిచిత్రవృష్టిః
అన్యోన్యయుద్ధైః క్షితిపాలకానాం కపాలకే శాస్థికబంధచిత్రా॥

శనగలు, వేరుశనగ, పెసలు, మినుములు, కందులు, ఉలవలు మొదలగు అపర ధాన్యములు బాగుగా ఫలించును. చిత్రవిచిత్రవర్షము లుండును. రాజులకు పరస్పరయుద్ధములు సంభవించి కపాలములు, ఎముకలు, మొండెములచేత భూమి నిండియుండును.

చిత్రభాను సంవత్సరాధిపతి బుధుడు :—చైత్రమాసమున సుభిక్షం. వైశాఖమున ఆహారపదార్థముల ధరలు సరసమై యుండును. జ్యేష్ఠాది మూడుమాసములందు సర్వధాన్యములకు ధరలు పెరుగును. వర్షములుండును. భాద్రపదాశ్వయుజములందు రోగారిష్టములు కార్తికమున మహామారీ భయోత్పాతములు మార్గశిర పౌషములందు అరిష్టములు. మాఘఫాల్గుణములందు, సమస్త ధాన్యములకు, రసవస్తువులకు ధరలు పెరుగును. ప్రజలు రోగపీడితులై యుందురు.

### —♦ సుభాను సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ సుభానువత్సరే భూమా భూమి పానాం చ విగ్రహః
జాయతే ఘోరరూపేణ సర్వభూత భయంకరః॥

సర్వభూత భయంకరయుద్ధము లుండును.

సుభాను వత్సరాధిపతి గురుడు :—తూర్పుదేశములందు దుర్భిక్షము చైత్రమున ధాన్యాదుల ధరలుపెరుగును. వైశాఖజ్యేష్ఠములందు రోగములు ప్రబలును. ఆహారధాన్యముల ధరలుతగ్గియుండును. శ్రావణ భాద్రపదములందు వర్షము లధికము. ఆశ్వయుజ కార్తికములందు సర్వవస్తువుల ధరలు పెరుగును. మార్గశిరమున ప్రజలకు రాజకీయ కష్టములు. పౌషాది మాసత్రయమందు రోగములు, భయోత్పాతములు

### —♦ తారణాబ్ద ఫలములు. ♦—

శ్లో॥ ప్రతరం త్వ్యాడుపోహాయై స్సరితోర్థాయ సంతతం
తారణాబ్దే త్వతులితా అర్ఘవంతోహి జంతవః॥

వ్యాపారముచే నావికాయాత్రచేసి ధనార్జన చేయుదురు. వర్షము లధికము. వ్యాపారస్థులు మంచి ధనలాభముగలవారై యుందురు.

శ్లో॥ కథం చిన్నిఖిలా లోకాస్తరంతి ప్రతి పట్టణం
రోగశోకసమావేగా త్ప్రూర్కారే తారణకాబ్దకే॥

లోకమున రోగ శోకము లుండును. ప్రతి పట్టణమందు జనులు తిరుగుదురు

తారణాబ్దపతి శుక్రుడు :—గాలి యధికము. పరస్పర యుద్ధము లుండును. చైత్రమున రోగములు. వైశాఖమున సర్వవస్తువుల ధరలు సరసమై యుండును. జ్యేష్ఠమున సర్వవస్తువులకు ధరలు పెరుగును. వడగాడ్పు లధికము. ఆషాఢమున అల్పవృష్టి. శ్రావణభాద్రపదములందధిక వర్షములు మేఘాడంబరము. ఆశ్వయుజమున ఆహారధాన్యముల ధరలు పెరుగును. రసవస్తువుల ధరలు మందము. కార్తికమున రసవస్తువుల ధరలుపెరుగును. మార్గశిరమున కలహములు, యుద్ధతీవ్రత. ధాన్యాదుల ధరలు పెరుగును. మ్లేచ్ఛభయముండును. పౌషమున కలహములు పశ్చిమదేశములందు ఆహారపదార్థముల ధరలు పెరుగును. ఉత్తరదేశములందు దుర్భిక్షము. మాఘఫాల్గుణములయందు సమస్త ధాన్యములు, రవవస్తువుల ధరలు నిలబడియుండును. తూర్పుదక్షిణదేశములందు ఆహార పదార్థముల ధరలు పెరుగును. దుర్మార్గులచే ప్రజాపీడన యుండును. పశ్చిమదేశములందు యుద్ధతీవ్రత, కలహములు జననష్టముండును. సర్వవస్తువుల ధరలు తగ్గియుండును.

—♦ పార్థివాబ్ద ఫలములు. ♦—

శ్లో॥ పృషద్వర్షం సుసస్యం చ వృద్ధిర్జన చతుష్పదాం
కీర్తివాహా నృపావైరి ప్రలుప్తాశ్చైవ పార్థివే॥

తుషారవృష్టి సస్యసమృద్ధియుండును జనులకు పశువులకు వృద్ధియుండును. రాజులు యుద్ధమందు శత్రువులను నిర్జించి కీర్తివంతులగుదురు.



పార్థివాబ్దపతి శని :—ధరోత్పాతము లధికము. చైత్రవైశాఖములందు సమస్త వస్తువుల ధర లధికమై యుండును. నానాముఖముల యుద్ధతీవ్రత యుండును. జ్యేష్ఠమున రోగపీడలు. యుద్ధమందు రాజులు శత్రువుల నోడించెదరు. ఆషాఢమున స్వల్పవృష్టి ధాన్యాదుల ధరలు పెరుగును. శ్రావణమున ఖండవృష్టి. భాద్రపదాశ్వయుజములందు సువృష్టి ఆహారపదార్థముల ధరలు పెరుగును. కార్తికమార్గశిరములందు అపరధాన్యముల ధరలు పెరుగును. రోగములు ప్రబలును. పౌషమాఘములందు సర్వవస్తువుల ధరలు బాగా పెరుగును, ఫాల్గుణమున ధరలు సరసమై యుండును.

—♦ వ్యయాబ్ద ఫలములు. ♦—

శ్లో॥ దీప్యతే వసుధా వీరభట వారణ వాజిభిః
వ్యపేత వ్యాధయః సర్వే వ్యయాబ్దేతు వ్యయాన్వితా॥

శూరులు, వీరులు, గజాశ్వములచే భూమి నిండియుండును. ప్రజలు రోగపీడలు లేక సుఖింతురు. ధనవ్యయాధిక్యత యుండును.

శ్లో॥ వ్యయాన్వితా సర్వజనా వ్యయాబ్దే
నిరంతరం వారిమయా ధరిత్రీ
ధర్మప్రసక్తాః ఖలు పార్థివేంద్రాః
సీదంతియే పాపపరాస చోరాః॥

రాజులు ధర్మాసక్తులై యుందురు. దుర్మార్గుల నరికట్టెదరు. ప్రజాసౌకర్యములకు ధనమును వ్యయముచేయుదురు. సస్యములు సామాన్యముగా ఫలించును.

వ్యయాబ్దపతి రాహువు :—అనావృష్టి, దుర్భిక్షము. చైత్రమున ధరలు సరసము. వైశాఖమున ధరలు పెరుగును. జ్యేష్ఠాషాఢమాసములయందు ప్రజాకల్లోలములు, కొట్లాటలు, అల్పవృష్టి. శ్రావణమున దుర్భిక్షము, ప్రజాకలహములు. భాద్రపదమున ఆహారధాన్యముల ధరలు పెరుగును. ఖండవృష్టి. ఆశ్వయుజమున రోగపీడలు. తూర్పుదేశములందు ప్రజా కలహములు, జనక్షయము, ఆహారధాన్యముల

కారత ధరలు పెరుగును. కార్తికమున రోగములు. మార్గశిరమున ఆహారపదార్థముల ధరలుపెరుగును. మధ్యదేశమున ప్రజాకల్లోలములు. పౌషమాఘములందు సమస్త పదార్థముల ధరలు బాగుగా పెరుగును. ఫాల్గుణమున ధరలు తగ్గును.

—♦ సర్వజిద్వత్సర ఫలములు. ♦—

శ్లో॥ సర్వజిద్వత్సరే సర్వే జనాస్త్రిదశసన్నిభాః
రాజానో విలయం యాంతి భీమసంగ్రామకాంక్షిణః॥

జనులు దేవతాసములై యుందురు. అనఁగా దుర్మార్గుల నణచివైతురు. రాజులు యుద్ధాభిలాషచే యుద్ధములందు నశింతురు. ప్రజాభీష్టములు నెరవేరును.

సర్వజిదబ్దపతి బ్రహ్మ:—చైత్రాది మాసత్రయమందు ధరలు సరసము. ఆషాఢమున స్వల్పవృష్టి. శ్రావణమున మేఘాడంబరము అతివృష్టి. సమస్త ధాన్యముల ధరలు సరసము. నూతన పరిపాలనారంభము. ప్రజలు రాజులు కలహించెదరు. భాద్రపదమున వర్షము లధికము. ఆహార పదార్థముల ధరలు పెరుగును. ఆశ్వయుజమున రోగపీడలు. ధరలు సరసముగా నుండును. కార్తికమున ప్రజాభీష్ట పరిపాలనారంభమగును. ఆహారధాన్యముల ధరలు పెరుగును. మార్గశిరమున సుభిక్షము. పౌషమున సర్వలోక సుఖము. మాఘమున పసుపు, మిర్చి, పచారీ దినుసులు, వక్కల ధరలు పెరుగును. ఫాల్గుణమున సర్వవస్తువుల ధరలు తగ్గును.

—♦ సర్వధారి సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ సర్వధార్యబ్దకే భూపాః ప్రజాపాలనతత్పరాః
ప్రశాంతవైరాః సర్వత్ర బహుసస్యార్ఘవృష్టయః॥

రాజులు ప్రశాంతమనస్కులై ప్రజాభీష్టముగా పరిపాలన చేయుదురు. సర్వత్ర సస్యములు బాగుగా ఫలించును. మంచి ధరలు వర్షములు ఉండును.



సర్వధార్యబ్దపతి విష్ణువు:—రాజులు రాజ్యపాలన ప్రజాభీష్టముగా చేయుదురు. ప్రజలు సుఖింతురు. చైత్రమున ధాన్యాదుల ధరలు సరసము. ఉత్తరదేశములందు దుష్టఫలములు కల్గును. వైశాఖమున ధరలు పెరుగును. జ్యేష్ఠమున భయోత్పాతములు, కలహములు, అగ్నిభయము లుండును. ఆషాఢమున మేఘాడంబరము, స్వల్పవృష్టి. శ్రావణమున ఖండవృష్టి ఆహార పదార్థముల ధరలు పెరుగును. భాద్రపదమున దుర్భిక్షము. ఆశ్వయుజమున రోగారిష్టములుండును, ధరలుతగ్గును. రాజులు ప్రజాపీడన గావించెదరు. కార్తికమున ధరలు పెరుగును. మార్గశిరమున సుభిక్షము. పౌషమున ప్రజోత్సాహకార్యములుండును. మాఘమున సుభిక్ష క్షేమారోగ్యములుండును. ఫాల్గుణమున ధాన్యాదులధరలు పెరుగును,

—♦ విరోధి సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ ప్రజావికలతా ఘోరాపీడితా వ్యాధి తస్కరైః
అల్పక్షీరప్రదా గావో విరోధీ వత్సరే ప్రియే॥
విరోధం సతతం కుర్వంత్యన్యోన్యం భూమిపాః ప్రజాః
విరోధి వత్సరే భూమి ర్భూరివారి ధరైర్వృతా॥

ప్రజలు రోగములచేతను, దుర్మార్గులచేతను, చోరులవల్లను పీడింపఁబడుటచే కలతజెందెదరు. పశువులు అల్పక్షీరము లొసంగును. రాజులు ప్రజలు కలహించెదరు. అధిక వర్షము లుండును. సస్యములు బాగుగా ఫలించును.

విరోధి వత్సరాధిపతి ఈశ్వరుడు:—చైత్రాది మాసత్రయమున ధాన్యాదివస్తువుల ధరలు బాగుగా పెరుగును. ఆషాఢ శ్రావణ మాసములందు వర్షము లధికమగును. భాద్రపదమున ఖండవృష్టి. మాసత్రయ పర్యంతము భయోత్పాతములుండును. కొన్నిచోట్ల సుభిక్షముగ నుండును. ధాన్యాది ధరలు కొన్ని ప్రదేశములందు పెరుగును. మరి కొన్ని ప్రదేశములందు ధరలు సరసముగా నుండును. ఆశ్వయుజమున సమస్త వస్తువుల ధరలు సరసమగును. కార్తిక మార్గశిరములందు రోగ

ములు ప్రబలును. పౌషాదిమాసత్రయమందు గుజరాత్, మరుదేశములందు ఆహార ధాన్యముల ధరలు పెరుగును.

## —♦ వికృతి సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ ఉపప్లవై ర్జగత్సర్వం వత్సరే శలభై స్సదా
విక్రుతా జలవృష్టిస్స్యా ద్వికృతౌ చ సుశోభనే॥

శ్లో॥ ప్రకృతిః ప్రయాతి వికృతిం వికృతిరపి ప్రకృతిమాయాతి
వర్షే వికృతౌ సుజనా నిశాచరార్త ప్రదా ధరణీ॥

ఇంచ॥ వికారా అల్పవృష్టిశ్చ వికృత్యబ్దే ప్రజారుజా॥

ప్రపంచమందంతటను రోగములచే ప్రజలు పీడింపఁబడుదురు. శలభమూషికాదులచే సస్యములు నశించును. అకాలమం దధిక వర్షములు. సకాలమున వర్షాభావముండును. ప్రకృతియంతయు వికారమునొందును. ప్రకృతి వికృతిగను, వికృతి ప్రకృతిగను యగును. సుజనులు దుర్మార్గులచే పీడింపఁబడుదురు. లోకమున చోరు లధికమగుదురు. ధాన్యాదివస్తువుల ధరలు పెరుగును. అల్పవర్షములు. ప్రజాకల్లోలములు, దుర్భిక్ష భయము, ఉత్పాతములు, వ్యాధిపీడలు ప్రబలమగును.

వికృతి సంవత్సరాధిపతి రవి :—అకాల వర్షములు, రాజకీయ కల్లోలములు, ప్రజాక్షోభము, కలహములు, దేశత్యాగముండును. మరుదేశము దుర్భిక్షము. చైత్రాది మాసచతుష్టయమందు ధాన్యాది వస్తువుల ధరలు బాగుగా పెరుగును. శ్రావణభాద్రపదములందు వర్షాభావము. కొన్ని ప్రదేశములందు ఖండవృష్టి యుండును. దుర్భిక్షము. ప్రజాకల్లోలములు, భయోత్పాతములుండును. ఆశ్వయుజమాసమున భయోత్పాతములు. తుపాను, భూకంపములుండును. కార్తికమున ఛత్రభంగము. సమస్త లోహముల ధరలు హెచ్చుతగ్గులధికమై తగ్గిపోవును. మార్గశిరాదిమాసచతుష్టయమందు ధాన్యాదుల ధరలు పెరుగును. అపరధాన్యములు, లోహములు, రసవస్తువుల ధరలు సరసము.



## —♦ ఖర సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ స్వల్పావృష్టిః స్వల్పధాన్యం ఖండవృష్టి ర్నృపక్షయః
ఛత్రభంగః ప్రజాపీడాఖరేఽబ్దే ఖరతాజనే॥

శ్లో॥ ఖరాబ్దే సతతం సమ్యగ్బధ్యం తేపశవః ప్రజాః
రాజానో విలయంయాంతి పరస్పరవిరోధతః॥

స్వల్పవృష్టి. పంటలు తక్కువ. అచ్చటచ్చట ఖండవృష్టి. రాజులు నశించెదరు. దేశోపద్రవము, ప్రజాక్షోభము, భయోత్పాతములుండును. దుర్మార్గులు ప్రబలుదురు. ప్రజలు, పశువులు క్షయించుదురు. రాజకీయ కల్లోలములు, ప్రజాకలహములు, యుద్ధభీతి యుండును.

ఖరసంవత్సరాధిపతి చంద్రుడు :—చైత్రాది మాస పంచకమున వర్షము లధికము సుభిక్ష క్షేమారోగ్యములుండును, భాద్రపదాశ్వయుజములందు ఖండవృష్టి. ఆహారధాన్యముల ధరలు సరసమగును. పసుపు కుంకుమ, వేరుశనగ మొదలగు వస్తువుల ధరలు బాగుగా పెరుగును. మ్లేచ్ఛులు నశింతురు. మరుదేశమందు ధాన్యాదుల ధరలు బాగా పెరుగును. కార్తికాది ఫాల్గుణ మాసాంతమువరకు ధాన్యాది ధరలు సరసముగా నుండును.

## —♦ నందన సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ ఆనందదాధరాజస్రం ప్రజాభ్యః ఫలసంచయైః
నందనాబ్దే స్వహానిః స్యాల్లోకే ధాన్యవినాశకృత్॥

శ్లో॥ సుభిక్షం క్షేమమారోగ్యం ప్రజానాం భవతి శోభనం
బహుక్షీరఘృతా గావోనందనే నందితాః ప్రజాః॥

ప్రజలు సుఖించెదరు. పాడిపంటల సమృద్ధియుండును. ప్రజలు సంతోషముగా జీవనము చేయుదురు. కాని వెండి, బంగారములు తరిగిపోవును. బ్యాంకు నాటాలు తగ్గును. ధాన్యముల ధరలు తగ్గును.

నందన సంవత్సరాధిపతి కుజుడు :—చైత్రవైశాఖములందు ధాన్యాదుల ధరలు పెరుగును. వడగాడ్పు లధికము. జ్యేష్ఠమున ఆహార ధాన్యముల ధరలు పెరుగును. స్ఫోటకాగ్నిభయములుండును. ఆషాఢ శ్రావణ భాద్రపద మాసములందు వర్షము లధికము. ఆశ్వయుజమున ఆహార ధాన్యముల ధరలు తగ్గును. ప్రజలు సుఖజీవనముచేయుదురు. కార్తికమున ధాన్యాదుల ధరలు సరసము. మార్గశిరాదిమాస చతుష్టయమందు ఆహార ధాన్యముల ధరలు పెరుగును. పసుపు, ఉప్పు, చింతపండు, మిర్చి ధరలు పెరుగును.

—♦ విజయ సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ క్షత్రియాశ్చ తథా వైశ్యాః శూద్రాశ్చ నటనర్తకాః
పీడ్యంతే ప్రచురై రోగై ర్విజయాబ్దేతు సుందరీ॥
శ్లో॥ విజయాబ్దేతు రాజానః జయసంఘోష తత్పరాః
సునందంతి ప్రజాః సర్వా బహుసస్యార్ఘ వృష్టిభిః॥

క్షత్రియ వైశ్య శూద్ర నటకుల రోగాదులచే పీడింపఁబడుదురు. కాని రాజులు యుద్ధమందు జయించెదరు. ప్రజలు సుఖించెదరు. పాడిపంటల సమృద్ధి యుండును. కాని కొన్ని ప్రదేశములందు "నశ్యతే వారిధారాభిః పూర్వకృష్యఖిలం ఫలం । రాజభిశ్చాపరం సర్వం విజయాబ్దేజయే ష్వభిః" అను నారదసంహితోక్తిచే వర్షములు తక్కువగుటచే పంటలు పండవు. రాజులు పరస్పరము కలహించుచుండెదరు. ప్రజాక్షోభముండును.

విజయ వత్సరాధిపతి బుధుడు :—సర్వదేశములందు మహా రోగాది పీడ లుండును. రాజులు పరస్పరము కలహించెదరు. ఆహార ధాన్యముల ధరలు పెరుగును. పశువులు నశించును. చైత్రమున వర్షము లుండును. వైశాఖ జ్యేష్ఠములందు ఆహారధాన్యముల ధరలు పెరుగును. ఆషాఢ శ్రావణములం దల్పవృష్టి. భాద్రపదమున వర్షము లుండును. ఆశ్వయుజమున వ్యాపారస్థులు పీడింపఁబడెదరు. ఆహార ధాన్యముల ధరలు అధికమగును. కార్తికాది ఫాల్గుణ మాసాంతమువరకు సమస్త



వస్తువుల ధరలు హెచ్చుతగ్గు లధికము. ప్రజాకల్లోలములు, దుర్భిక్షముండును.

—♦ జయాబ్ద ఫలములు. ♦—

శ్లో॥ యస్మిన్ జయాబ్దే విరలార్ఘ సస్యా బలాధికాగోఽజవృపాశ్చ
నాగాః । తథా ధరాధీశ మహారణైశ్చసీదంతి గౌడాః ఖలుగుర్జ
రాశ్చ॥

ధాన్యాదులకు, పశువులు, గుఱ్ఱములు, గజములకు ధరలు పెరుగును, రాజులు పరస్పర జయకాంక్షచే యుద్ధము చేయుదురు. గౌడదేశము గుర్జరదేశములందు ప్రజాక్షోభము, కల్లోలము లతిశయించును. "మానుషా దుఃఖ సంకష్టే జగద్వంద్య సమాకులం" అనుటచే ప్రపంచమందంతటను ప్రజలకు కష్టము లధికమగును. ప్రపంచయుద్ధ భయ మేర్పడును.

జయవత్సరాధిపతి గురుడు :—చైత్రమున ధాన్యాదుల ధరలు పెరుగును. వైశాఖ జ్యేష్ఠములందు ధాన్యాదుల ధరలు హెచ్చుతగ్గులధికమై సరసమగును. వడగాడ్పులు, అగ్నిరోగ భయములు. ఆషాఢమున వర్షములుండును. ఆహారధాన్యముల ధరలు పెరుగును. శ్రావణమున వర్షము లధికము. భాద్రపదమున శుక్లపక్షమం దధిక వర్షములు. ఆశ్వయుజమందు ఆహారధాన్యముల ధరలు తగ్గును. వెండి, బంగారముల ధరలు పెరుగును. కార్తికాది మాస పంచకమున ఆహార ధాన్యముల ధరలు సరసము. మిగతా వస్తువుల ధరలు బాగా పెరుగును, వెండి, బంగారము, మణులు. ముత్యములు, దూది ధరలు బాగుగా పెరుగుననుట తథ్యము. మార్గశిరమున రోగములు ప్రబలును. వ్యాపారమునందు వడిదుడుకు లధికము. పంజాబు, కాశ్మీరములందు రోగములచే ప్రజాక్షయ ముండును. ఛత్రభంగము, ప్రజాకల్లోలము లతిశయించును.

—♦ మన్మథ సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ మన్మథాబ్దే తథాలోకాస్సత్కే క్షీరసలోలుపాః
శాలీక్షు యవగోధూమై ర్నయనానందదాథరా॥

శ్లో॥ తుషధాన్యం క్షయం యాతి క్షోద్రివానాం మహర్ఘతా
వ్యవహారేతు జాయంతే మన్మథే దుఃఖితాః ప్రజాః॥

ప్రజలు నానావిధ సుఖసౌఖ్యముల భోగముల ననుభవించెదరు. పంటలు చక్కగా ఫలించును. కొన్ని ప్రదేశములందు పొట్టధాన్యములు ఫలింప నందున ధరలు పెరుగును, రాజకీయ కల్లోలము లుండుటచే ప్రజలు దుఃఖించెదరు.

మన్మథ సంవత్సరాధిపతి శుక్రుడు :—రాజులు పరస్పరము కలహించెదరు. ప్రజాపీడన యుండును. వర్షము లధికము. రోగములు ప్రబలును. చైత్రమున వర్షము భూకంపముండును. వైశాఖమున ఆహార ధాన్యముల ధరలు తగ్గును. జ్యేష్ఠాషాఢమాసములందు సమస్త వస్తువుల ధరలు పెరుగును. ఆహారధాన్యముల ధరలు బాగా పెరుగును. శ్రావణమున అల్పవృష్టి. భాద్రపదమున అధిక వర్షములు మేఘాడంబరము. ఆశ్వయుజమున రోగములు ప్రబలును. ఆహారధాన్యముల ధరలు పెరుగును. కార్తికమున సుభిక్షము. ధాన్యాదుల ధరలు సరసమగును. మార్గశీర్షాది మాసత్రయమందు ఆహారధాన్యముల ధరలు సరసము. సమస్త లోహముల ధరలు సరసమగును. ఫాల్గుణమాసమందు వస్త్రముల ధరలు బాగా పెరుగును.

—♦ దుర్ముఖాబ్ద ఫలములు. ♦—

శ్లో॥ పీడ్యంతే సర్వధాన్యాని వృష్టి ర్నైవ ప్రజాయతే
దుర్భిక్షం దుర్ముఖే నిత్యంమయాఽఽఖ్యాతం సులోచనే॥
శ్లో॥ దుర్ముఖాబ్దేఽగ్ని రోగాః స్యుః ప్రచురాన్నం తథేతయః
రాజానః సప్రజాస్తుష్టానిః స్వాస్థ్యే ద్విజసత్తమాః,
శ్లో॥ దుర్ముఖాబ్దే మధ్యవృష్టిరీతి చోరాకులాధరా
మహావైరా మహీనాథా వీరవారణ వాజిభిః॥

సస్యానుకూల వర్షములులేకను, ఈతిబాధ లధికమగుటచేతను పంటలు ఫలించవు. దుర్భిక్షము, రోగచోరాగ్నిభయములు, ప్రజాక్షోభము, యుద్ధము, రాజకీయకల్లోలములుండును. బ్రాహ్మణులు దరిద్రులగుదురు. ధరలు పెరుగును.



దుర్ముఖాబ్దపతి శని :—అల్ప మేఘములు, ప్రజాపీడ లధికము. రోగములు ప్రబలును. ఉత్తరాపథమున దుష్కాలము. పశ్చిమదేశములందు మహాపీడలు. పూర్వదేశములందు సుభిక్షం. మిగతా దిశలందున్న దేశములలో ధాన్యాదుల ధరలు పెరుగును. రాజులు ప్రజలను పీడించెదరు. చైత్రాది మాసత్రయమున ధాన్యాదుల ధరలు పెరుగును. ఆషాఢమున స్వల్పమేఘములు. శ్రావణమున వాయుసహితవృష్టి. తుపాను గాలి వీచును. సమస్త ధాన్యముల ధరలు పెరుగును. భాద్రపదమున ఖండవృష్టి. ఆశ్వయుజమున రోగములు సమస్త ధాతు పదార్థముల ధరలు సరసమగును. కార్తికాది మాసచతుష్టయమందు దుర్భిక్షము. ఫాల్గుణమున రోగములు. రాజులు ప్రజలను పీడించెదరు. ప్రజాక్షోభము, లోకపీడ, జనహాని యుండును.

—♦ హేవలంబ సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ ధరామరాగోకులరాజబృందాధర్మప్రసక్తాఖిలు హేవలంబే
సీదంతి సర్వే విరలార్ఘ సస్యైరవృష్టిభిః క్షుద్భయ పీడితాశ్చ॥
శ్లో॥ తస్కరైః పార్థివై ర్వివ్యాభిభూత మిదం జగత్
అర్ఘం భవతి సామాన్యం హేవలంబే మహాబాదయే॥
శ్లో॥ హేవలంబే త్వీతి భీతిర్మధ్య సస్యార్ఘ వృష్టయః
భాతి భూర్భ్యపతిక్షోభః ఖండ విద్యుల్లతాదిభిః॥

రాజులు ప్రజలను సక్రమముగా పరిపాలి౦చెదరు. కాని కొన్నిచోట్ల రాజకీయకల్లోలములుండును. చోరులు, దుర్మార్గులు ప్రబలుదురు. ధాన్యాదుల ధరలు సామాన్యముగా నుండును అల్పవర్షములు. ఆకలిబాధ దుర్భిక్షభయము, ఉరుములు, మెఱుపులతోగూడిన మేఘాడంబరమే గాలి సస్యానుకూలవర్షములు డవు.

హేవలంబ సంవత్సరాధిపతి రాహువు :—భయోత్పాతములు, రోగపీడలు, భూకంపము, వరదలు, వ్యాపారమునందు పడిదుడుకు లుండును. చైత్రవైశాఖములందు పీడలు. ధాన్యాది సమస్త పదార్థముల ధరలు తగ్గును. పరచక్ర భయము. జ్యేష్ఠాదిమాసత్రయమున ధాన్యాదుల ధరలు పెరుగును. భాద్రపదమున అధిక వర్షములు ధాన్యా

దుల ధరలు పెరుగును భాద్రపదమున అధిక వర్షములు ధాన్యాదుల ధరలుసరసముగా నుండును కాని పసుపు, మిర్చి, చింతపండు, ఉప్పు, మిరియాలు, దంతములు, వెండి, బంగారము ధరలు పెరుగును. కార్తిక మున ఛత్రభంగము, లోకపీడ, సర్వధాతువుల ధరలు సరసమగును. పశువులకు రోగములుండును. మార్గశీర్షాదిమాస చతుష్టయమున రాజులు స్వస్థచిత్తులై ప్రజాభీష్టముల నెరవేర్చెదరు.

—♦ విలంబ వత్సర ఫలములు. ♦—

శ్లో॥ విషమస్థం జగత్సర్వం వివిధోపద్రవైర్యుతం
మూషకైశ్చ ప్రపీడ్యంతే విలంబే చ సురేశ్వరి॥
శ్లో॥ విలంబవర్షే త్వరిబృందరోగైః స్వల్పార్ఘవృష్ట్యర్ధతచోరసంఘైః
నిస్వాః ప్రజాసత్వవిహీనమానవావి దేశగాఃస్వోదరపూరణాయ॥

ప్రపంచ పరిస్థితులు విషమముగా నుండును. వివిధోపద్రవయుతము సస్యములు బాగుగా ఫలించవు. మూషకాదులచే పీడ లధికము. రోగములు ప్రబలును. అల్పవృష్టి. చోరు లధికము. ప్రజా క్షయము. ప్రజలు ఉదరపోషణార్థము దేశదేశములను తిరిగెదరు. దుర్భిక్షముండును. ధాన్యాదుల ధరలు తగ్గియుండును. రాజులు పరస్పరము కలహించెదరు. ప్రజాక్షోభము యధికమగును.

విలంబవత్సరాధిపతి రవి :—చైత్రాదిమాసత్రయమున ధాన్యాదుల ధరలు సరసము. ఆషాఢమున అల్పమేఘములు. శ్రావణమున అత్యధిక వర్షములు. భాద్రపదమున వర్షము లధికము. ఆహారధాన్యముల ధరలు పెరుగును. పశ్చిమదేశములందు సుభిక్షము. రాజులు ప్రజలను పీడించెదరు. తూర్పుదేశములందు ఆహారధాన్యముల కొఱత యేర్పడును. ధరలు బాగా పెరిగిపోవును. దక్షిణదేశములందు రాజకీయ వడిదుడుకులు. ప్రజాకల్లోలములు, యుద్ధభీతి యుండును. ఆశ్వయుజమున ఆహారధాన్యముల ధరలు పెరుగును, రోగములు ప్రబలును. సర్వక్రియ (పచారీ దినుసులు వగైరా) ధరలు పెరుగును. కార్తికాది మాసపంచకమున ధాన్యాదుల ధర లధికమై యుండును. ఆహార పదార్థముల ధరలున్ను పెరుగును,



—♦ వికార్యబ్ద ఫలములు. ♦—

శ్లో॥ అల్పోదకో భవేన్మేఘో ధాన్యమాషధిపీడితం
దుర్భిక్షం జాయతే సర్వం వికారి వత్సరే భువి॥
శ్లో॥ వికారిణో వికార్యబ్దే పిత్తరోగాదిభి ర్నరాః
మేఘో వర్షతి సంపూర్ణం సముద్రవసన క్షితౌ॥

కొన్ని ప్రదేశములలో అల్పమేఘములు, సస్యహాని, దుర్భిక్షము కలుగును. మరికొన్ని ప్రదేశములందు పైత్యరోగ పీడలు, అధికవర్షములు, వరదలు, కలరావ్యాధియు ప్రబలును. వర్షాధిక్యతచే పంటలు నశించును. దుర్భిక్షభీతి యుండును.

వికార్యబ్దపతి చంద్రుడు :—ఆహార ధాన్యముల ధరలు బాగా పెరుగును. సమస్త వస్తువుల ధరలు పెరిగియుండును. చైత్రాదిమాసత్రయమున ధాన్యాదుల ధరలు పెరుగును. ఆషాఢ శ్రావణములం దధిక వర్షములు. భాద్రపదాశ్వయుజములం దల్పవృష్టి, రోగపీడలు, ఉత్పాతము లుండును. సమస్త వస్తువులధరలు పెరుగును. కార్తికాది మాసద్వయమున ధాన్యాదులకు ధరలు మందము. పౌషమున రోగపీడలు. మాఘఫాల్గుణములందు ధాన్యాదులకు ధరలు పెరుగును.

—♦ శార్వరి వత్సర ఫలములు. ♦—

శ్లో॥ మేదినీశుష్యతే సర్వా ధనధాన్య ప్రపీడనం
శార్వర్యాం వర్షతే క్వాపి పీడ్యంతే మానవాభువి॥
శ్లో॥ శార్వరీ వత్సరే సర్వసస్యవృద్ధి రనుత్తమా
రాజానో విలయంయాంతి పరస్పర జయేచ్ఛయా॥

ప్రపంచమందంతటను ధనధాన్యముల కొరత యేర్పడును, అకాలవర్షములును, రోగపీడ లుండును. రాజులు పరస్పర జయాభిలాషులై కలహించుచుందురు. ప్రజాహాని యుండును

శార్వరి వత్సరాధిపతి కుజుడు :—అల్పవృష్టి, ప్రజాక్షయము, రాజకీయ వడిదుడుకులు. చైత్రాది మాస త్రయమున ఆహార ధాన్య

ముల ధరలు సరసము. ఆషాఢాదిద్వయమున అధికవర్షములు. భాద్రపదమున వర్షావరోధములు, రాజకీయ కల్లోలములు, ప్రజాక్షోభము. ఆశ్వయుజమున రోగములు. పశ్చిమదేశములందు దుర్భిక్షము. తూర్పుదేశములందు సుభిక్షము, కార్తికాది మాసద్వయమున ఆహారధాన్యముల ధరలు పెరుగును. పౌషాదిమాసత్రయమున ఆహారధాన్యముల ధరలు సరసమగును.

—♦ ప్లవ సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ చలితాచలసంకాశైః పయోదైరావృతం నభః
దీవ్యంతే సతతం భూపాః ప్లవాబ్దే ప్లవగాజనాః॥

శ్లో॥ ధనధాన్య సమాయుక్తం జగత్సర్వం చరాచరం
మేఘాశ్చ ప్రబలాజ్ఞేయాః ప్లవ సంవత్సరే ప్రియే॥

పర్వతాకారములోనున్న మేఘములు ఆకాశమున సంచరించుచు మంచి వర్షముల నిచ్చును. రాజులు ప్రజలు సంతోషించెదరు. ధనధాన్య సమృద్ధి పాడిపంట లభివృద్ధియుండును. సుభిక్షక్షేమారోగ్యములుండును.

ప్లవసంవత్సరాధిపతి బుధుడు :—చైత్రమున వర్షములుండును. వైశాఖమున ప్రజాక్షోభము, ప్రజాకల్లోలములుండును. అగ్నిబాధలు, రోగపీడలు. జ్యేష్ఠమున ఆహార ధాన్యముల ధరలు సరసము. ఆంధ్ర దేశమునందు తూర్పుజిల్లాలలో ప్రజాకల్లోలములు. ఆషాఢమున వాయుసహిత వృష్టి, భయోత్పాతములు, రోగములు. శ్రావణమున అత్యధిక వర్షములు. భాద్రపదమున ధాన్యముల ధరలు తగ్గును. ఆశ్వయుజమున సమస్త వస్తువుల ధరలు సమస్త ధాతువుల ధరలు సరసము. ఆహార ధాన్యములకు మాత్రము ధరలు పెరుగును కార్తికమున ఆహారధాన్యముల ధరలు తగ్గును. పౌషాది మాస త్రయమున సుభిక్షక్షేమారోగ్యములుండును.

—♦ శుభకృద్వత్సర ఫలములు. ♦—

శ్లో॥ రాజతే పృథివీ సర్వా సతతం వివిధోత్సవైః
శుభకృద్వత్సరే వృద్ధిః ప్రజానాం పశుభి స్సహ॥



నానావిధములగు నుత్సవములతో ప్రపంచమందంతటను ప్రజలు సుఖ జీవనము చేయుదురు. ప్రజావృద్ధి, పశువృద్ధి యుండును. పాడిపంటల సమృద్ధియుండును.

శుభకృద్వత్సరాధిపతి గురుడు :—ఉత్తరాపథమున అగ్నిభయము. చైత్రవైశాఖములందు సమార్ఘము, జ్యేష్ఠాషాఢములందు స్వల్పవృష్టి సమార్ఘము. వెండి బంగారముల ధరలు సరసము. శ్రావణభాద్రపదములందు అధిక వర్షములు. ఆహారధాన్యముల ధరలు సరసము. నెయ్యి నూనె ధరలు సరసము. ఆశ్వయుజకార్తికములందు ధాన్యాదుల ధరలు సరసమై యుండును. మార్గశిరాదిత్రయమున ఆహారధాన్యములు, అపరాలు, వేరుశనగ ధరలు సరసము రాజకలహములు, ఫాల్గుణమున రోగోత్పాత భయములు.

—♦ శోభన వత్సర ఫలములు. ♦—

శ్లో॥ శోభనే వత్సరే సర్వసస్యానా మతి వృద్ధయః
నృపాణాం స్నేహ మన్యోన్యం ప్రజానాం చ పరస్పరం॥

సర్వ సస్యములు చక్కగా ఫలించును. రాజులు ప్రజలు పరస్పర స్నేహము కలిగి వర్తించెదరు. ప్రజాభీష్ట పరిపాలన ముండును.

శోభన వత్సరాధిపతి శుక్రుడు :—సస్యానుకూల వర్షములు. పాడిపంటల సమృద్ధి, పశువృద్ధి యుండును. చైత్రాదిమాసత్రయమున ధాన్యాదుల ధరలు సరసము. రాజకీయ వడిదుడుకులుండును. కొన్నిచోట్ల ఉత్పాతభయము లుండును. ఆషాఢమున స్వల్పవృష్టి. శ్రావణమున అధిక వృష్టి. ప్రజాపీడలు. భాద్రపదమున వర్షము లధికము. వరదలు. ఆశ్వయుజమున ఆహారధాన్యముల ధరలు మందము. కార్తికాది మాస పంచకమున రాజకీయ వడిదుడుకులు, ధాన్యాదుల ధరలలో హెచ్చుతగ్గులు సంభవించును. ప్రజాకలహములున్నను తీరిపోవును.

—♦ క్రోధి సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ అపిసంతీతయః క్రోధినవ్యబ్దే సస్యసమృద్ధయః
దంపత్యో ర్వైర మన్యోన్యం ప్రజానాం చ పరస్పరం॥

శ్లో॥ క్రోధ్యబ్దే సతతం రోగాః క్రోధలోభపరాయణాః
ఈతిదోషేణ సతతం మధ్య సస్యార్ఘ వృష్టయః॥

ప్రజలు రోగపీడితులగుదురు. క్రోధలోభపరాయణులై రాజులు ప్రజా పీడన గావించెదరు. ఈతిబాధలు, అల్పవృష్టి యుండుటచేత సస్యములు మధ్యమ ఫలదములు, ధాన్యాదుల ధరలు కొలదిగ పెరిగి నిలబడును. కుటుంబ కలతలు, భార్యాభర్తల కెడబాట్లు, విరోధము లధికమగును. రాజకీయ వడిదుడుకు లేర్పడును.

క్రోధ్యబ్దపతి శని :—ఈ సంవత్సరమంతయు ఆహారధాన్యముల ధరలు పెరిగియేయుండును. అచ్చటచ్చట హెచ్చుతగ్గులుండును. రాజులు ప్రజలు పరస్పరము కలహించెదరు. వ్యాపార వడిదుడుకు లధికమగును. చైత్రవైశాఖములందు వడగండ్ల వానలు స్ఫోటకాగ్నిభయములు, కలరా వ్యాధులు ప్రబలును. జ్యేష్ఠమున ధాన్యాదుల ధరలు బాగా పెరుగును. ఆషాఢమున ధరలు సరసము. అల్పవృష్టి. శ్రావణమున దుర్భిక్షభయోత్పాతములు. భాద్రపదమున ఖండవృష్టి. ఆహార పదార్థముల ధరలు పెరుగును. ఆశ్వయుజమున వర్షము లధికము. రసపదార్థముల ధరలు సరసము. కార్తికమున ధరలు సరసము. మార్గశిరాదిమాస చతుష్టయమందు ధాన్యాదుల ధరలు పెరిగి నిలబడును.

—♦ విశ్వావసు సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ అబ్దే విశ్వావసౌ శశ్వద్ఘోర రోగాకులాధరా
సస్యార్ఘ వృష్టయో మధ్యా కార్పా సస్య మహర్ఘతా॥

రోగములు ప్రబలును. మధ్యమవర్షములు. పంటలు మధ్యమముగా ఫలించును. దూది, నూలు, ప్రత్తి, వస్త్రములధరలు బాగా పెరుగును. రాజులు ప్రజా విశ్వాసమును పొందజాలరు,

విశ్వావసునామ వత్సరాధిపతి రాహువు :—వర్షములు తక్కువ. రోగములు ప్రబలును. ఆహారధాన్యముల ధరలు పెరుగును. చైత్రమున రాజకీయ కల్లోలములు, ధాన్యాదుల ధరలు పెరుగును. వైశాఖమున కలహములు. ప్రజాక్షోభము. మరుదేశమున దుర్భిక్షము. పశ్చిమమున



ఆహార పదార్థముల కొరతవల్ల ధరలు పెరుగును, జ్యేష్ఠమున రోగాగ్ని భయములు, కలహములు. ఆషాఢమున అల్పవృష్టి శ్రావణభాద్రపదము లందు దుర్భిక్షము కొన్ని ప్రాంతములలో సువృష్టి, సుభిక్షము. ఆశ్వయుజమున రోగపీడలు. పశువుల ధరలు పెరుగును. వెండి బంగారముల ధరలు సరసము. కార్తికాది మాసత్రయమున సమస్త వస్తువుల ధరలు సరసము, మాఘద్వయమున ధరలు పెరుగును.

—♦ పరాభవ సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ పార్థివై ర్మండలీకైశ్చ సామంతై ర్దండనాయకైః
పీడ్యంతేవై ప్రజాః సర్వాః క్షుధార్తాశ్చ పరాభవే॥
శ్లో॥ పరాభవాబ్దే రాజానః ప్రాప్నువంతి పరాభవం
ఆమయః క్షుద్రధాన్యాని ప్రభూతాని సువృష్టయః॥

రాజులు, సామంతులు, మాండలీకులు, దండనాయకులు, న్యాయాధికారులు, ప్రజలను నానావిధముల పీడించెదరు. ఆకలిబాధ లధికమగును రాజులు పరస్పరము కలహించి పరాభవమొందెదరు. క్షుద్రధాన్యములు (అపర ధాన్యములు బాగుగా ఫలించును.

పరాభవాబ్దపతి కేతువు :—మధ్యమ వర్షములు. చైత్రవైశాఖములందు ఆహారధాన్యముల ధరలు పెరుగును. మేఘాడంబరము. ఉరుములు, మెఱుపులుండును. వడగాడ్పు లధికము. జ్యేష్ఠమున వడగాడ్పు లతిశయించును. అగ్నిభయము లుండును. ఆషాఢమున అల్పవృష్టి., ఆహారధాన్యముల ధరలు పెరుగును. శ్రావణమున అత్యధిక వర్షములు! భాద్రపదమున ఖండవృష్టి. దుర్భిక్షము. ఆశ్వయుజమున ధాన్యములు ధాతువస్తువులు, రసవస్తువుల ధరలు పెరుగును. కార్తికాది మాసపంచకమున ధరలు సరసము. పశ్చిమదేశములందు ఆహారధాన్యముల ధరలు సరసము. సింధు, పంజాబ్, సరిహద్దు ప్రాంతములందుపంటలు బాగుగా ఫలించును.

—♦ ప్లవంగ సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ తుషధాన్యాని పీడ్యంతే గ్రీష్మే వర్షతి మాధవే
ప్లవంగే పీడితాః సర్వే సర్వద్వీపం సుమండలమ్॥

అబ్దే ప్లవంగే ప్రమదా జనాస్తు కుర్వంతి వైరం పురుషేషు నిత్యం
ధరాధిపక్షోభవిఘట్టితాభూ స్తదాన సంపూర్ణ ఫలప్రదాయినీ॥

ప్లవంగ సంవత్సరమున పొట్టుధాన్యములు నశించును. వైశాఖమాసమునందు వడగాడ్పు లధికమగును. సమస్త ప్రపంచము పీడింపఁబడును. స్త్రీలు పురుషులతో నిత్యము కలహించుచుండెదరు. రాజులు పరస్పరము కలహించుచుండెదరు. లోకమున రోగచోరాగ్నిభయములుండును. పంటలు మధ్యమఫలదములు. ప్లవంగాబ్దపతి బ్రహ్మ. చైత్ర వైశాఖమాసములం దత్యర్ఘము. జ్యేష్ఠమున రాజకీయకల్లోలములు. ఆషాఢమునఅల్పవృష్టి, భూకంపములు. పశువులకు రోగపీడలుండును. పశువుల ధరలు పెరుగును. శ్రావణమునందు అతివృష్టి. భాద్రపదమున సువృష్టి. ఆశ్వయుజమున రోగములు. రసవస్తువుల ధరలు పెరుగును. కార్తికాది మాసత్రయమందు సువృష్టి. వాయుసహితవృష్టి యుండును. ఫాల్గుణమున భయోత్పాతములు, రోగపీడలుండును.

—♦ కీలక సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ అవృష్టిచోరాహవ రోగ వహ్ని భీతాః
జనా న్వీత్య సుకీలకాబ్దే
భూర్జీవ యామీతి కథం విచార్య
విచిత్ర నానాకర దాచతేభ్యః॥

శ్లో॥ కీలకాబ్దే ఈతిభీతిః ప్రజాః క్షోభనృపాహవౌ
తథాపి వర్ధతే లోకః సమ ధాన్యార్ఘ వృష్టిభిః॥

శ్లో॥ ప్రచురాః పిత్తరోగాఃస్యు ర్మధ్యవృష్టిర హేర్భయం
కీలకాబ్దే ఈతిభయం ప్రజాక్షోభః పరస్పరం॥

కీలకాబ్దమున ఈతిబాధలు. ప్రజలు పిత్తరోగములచే పీడింపఁబడుదురు. మధ్యమ వర్షము. విషజంతుభీతి. ప్రజాక్షోభము. మధ్యమార్ఘ. రాజయుద్ధము. కొన్ని ప్రదేశములందు చోరాగ్నిభయములు, ప్రజాకలహము లుండును.



కీలకాబ్దపతి విష్ణువు :—మధ్యమ వర్షములు. చైత్రమున ధాన్యాదుల ధరలు పెరుగును. వైశాఖమున రోగాగ్నిభయములు. మరుదేశమున దుర్భిక్షము. పశ్చిమదేశములందు ధాన్యాదులకు సరసమైన ధరలుండును. జ్యేష్ఠమున ధాన్యము ధరలు తగ్గును. ఆషాఢశ్రావణములందల్పవృష్టి, ఆహారధాన్యముల ధరలు సరసమగును. భాద్రపదాశ్వయుజమాసములందు సువృష్టి. ఆహారధాన్యముల ధరలు పెరుగును. కార్తికాది మాసత్రయమందు ధాన్యాదుల ధరలు సరసమగును. మాఘమున ధాన్యాదులకు ధరలు పెరుగును. ప్రజలు రోగపీడితులై యుందురు, ఫాల్గుణ మాసములో అంతర్జాతీయ పరిస్థితులు విషమముగా నుండును. కాని ప్రజలు సుఖముగా జీవించెదరు.

—♦ సౌమ్య సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ అతివృష్టిరరోగత్వం ప్రజాః స్యుః స్వస్థచేతసః
సౌమ్యాబ్దే సతతం సర్వే శాంతవైరాః క్షితీశ్వరాః॥

అతివృష్టి, ప్రజారోగ్యము, ప్రజలు స్వస్థచిత్తులై యుందురు. రాజులు వైరభావమును వీడి శాంతచిత్తులై యుందురు.

సౌమ్యసంవత్సరాధిపతి రుద్రుడు :—అల్పవృష్టి. పశువులు అల్పక్షీరదములు. సస్యములు అల్పఫలదములు. చైత్రమం దత్యర్ఘము. వైశాఖమున వడగాడ్పు లధికము. ధాన్యాదులకు ద్విగుణలాభము. రసవస్తువులకు ధరలు పెరుగును. జ్యేష్ఠాదిమాసత్రయమందు రసవస్తువుల ధరలు పెరుగును, ధాన్యాదులకు ధరలు సరసమగును. భాద్రపదమున ఖండవృష్టి, ఆహారధాన్యముల కొరత యేర్పడును. ఆశ్వయుజమున రాజకీయ కల్లోలములు, ప్రజాక్షోభము, ధాన్యాదులకు ధరలు పెరుగును. రసవస్తువుల ధరలు సరసము. కార్తికాది మాస చతుష్టయమున ధాన్యాదుల ధరలు సరసముగా నుండును. రాజకీయకల్లోలములు, బాలురకు రోగపీడలుండును. ఫాల్గుణమాసములో సుభిక్షము. సింధు, పంజాబు, కాశ్మీర, సరిహద్దు ప్రాంతమందు రాజకీయ కల్లోలములు, ప్రజాకల్లోలము లుండును.

## —♦ సాధారణ సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ వివిధామయ చోరభయం మధ్యమవృష్ట్యర్ఘ సస్యభయం
భువి సాధారణ వర్షే నిఖిల జనానాం చ చోరభయం॥

నానావిధ రోగములచే ప్రజలు పీడింపఁబడుదురు. మధ్యమ వృష్టి. పంటలు మధ్యమముగా ఫలించును. లోకమున చోరుల భయము మెండగును. ధాన్యాదుల ధరలు మధ్యమముగా నుండును.

సాధారణ సంవత్సరాధిపతి రవి :—చైత్రమున ధాన్యాదుల ధరలు మందము, వైశాఖమునను, జ్యేష్ఠమునను ఉత్పాతములు. భూకంపము, రోగవృద్ధి, రాజకీయ కల్లోలములు, ధాన్యాదుల ధరలు పెరుగుట యుండును. ఆషాఢమున ప్రజాక్షోభము, కలహము లధికము. అల్పవృష్టి. శ్రావణమున అధిక వర్షములు. ధాన్యాదుల ధరలు సరసము. భాద్రపదాశ్వయుజములందు అల్పవృష్టి. కార్తికాదిమాసద్వయమున మధ్యార్ఘ వృష్టి, భూకంపము, అకస్మాత్తుగా రాజకీయ కల్లోలములు సంభవించును. పౌషాదిమాసత్రయమున ఆహారధాన్యముల ధరలు బాగా పెరుగును.

## —♦ విరోధికృద్వత్సర ఫలములు. ♦—

శ్లో॥ కలహో నిఖిల జనానామీతిభయంస్యాద్విరోధకృద్వర్షే
ధరణీ సస్యసమృద్ధాప్య వికల ఫలదాయినీ సతతం॥

ప్రజలు పరస్పరము కలహించుచుందురు. ఈతిభయములుండును. పంటలు చక్కగా ఫలించును. రాజకీయ కల్లోలములు, కొట్లాట లుండును. "అహిక్షేత్రేకాన్యకుబ్జేవిరోధా కృషి నాశకృత్" అనుటచేత నాగపూర్, కన్యాకుబ్జ దేశములందు సస్యహాని ప్రజాక్షోభ ముండును.

విరోధికృద్వర్షాధిపతిచంద్రుడు:—కొంకణ, పౌండ్ర మధ్య దేశములందు రాజకీయ కల్లోలములు, ప్రజాకలహములుండును. చైత్రాది మాసత్రయమున ఆహారధాన్యముల ధరలు సరసము. ఆషాఢమున అల్పవృష్టి. శ్రావణమున అతివృష్టి. ఆహారధాన్యముల ధరలు సరసము.



భాద్రపదమున ఆహారపదార్థముల ధరలు సరసము. వెండి, బంగారం మొదలగు ధాతుపదార్థముల ధరలు పెరుగును. ఆశ్వయుజాది మాసపంచకమున సువృష్టి, రోగములు, పశువులకు రోగపీడలుండును. ఫాల్గుణమాసమందు ప్రజాక్షోభ ముండును. రాజకీయ కల్లోలములు, చోరభీతి యుండును. పసుపు, వక్కలు, వేరుశనగ, ప్రత్తి, దూది, వస్త్రములు, నూలు, నార, దంతములు, పశువుల ధరలు బాగుగా పెరుగును. ఆహారధాన్యముల ధరలు మధ్యమము. రసవస్తువుల ధరలు సరసము.

## —♦ పరీధావి సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ అనర్థామయరోగేభ్యో భీతి రీతి నిరంతరం
పరీధావిని వర్షేతు నృణాం వృష్టిశ్చ మధ్యమం॥

ఆహార ధాన్యముల ధరలు బాగుగా పెరిగియుండును. రోగములు ప్రబలును. ఈతిబాధలుండును. ప్రజాకల్లోలములు భయోత్పాతము లుండును. మధ్యమ వర్షములుండును. "మధ్యదేశస్య నాశః స్యాత్" అనుటచేత మధ్యదేశమునందు ప్రజలు నశింతురు.

పరీధావి సంవత్సరాధిపతి కుజుడు :—చైత్రాదిమాస చతుష్టయమందు ఆహార ధాన్యముల ధరలు సరసము. ప్రజలు రోగపీడితులగుదురు. మరుదేశమున మారీస్ఫోటకాగ్నిభయములుండును. పశువులకు రోగములు ప్రబలును. శ్రావణభాద్రపదములందు ఖండవృష్టి. ఆహారధాన్యముల ధరలు పెరుగును. రసవస్తువుల ధరలు పెరుగును. ధాతుపదార్థములకు ధరలు సరసము. కార్తికాది మాసపంచకమందు ఆహారధాన్యముల ధరలు సరసము. రాజకీయ కల్లోలములు. పంజాబు, సింధు, సరిహద్దు, కాశ్మీర దేశములందు ప్రజాకల్లోలము లుండును.

## —♦ ప్రమాదీ సంవత్సర ఫలములు, ♦—

శ్లో॥ సస్యానామీతిభయం క్షుద్భయ మఖిల ప్రజానాం చ
చోరభయం ధనికానాం రాజభయం చ ప్రమాద్యబ్దే॥

సస్యములకు తెగుళ్లు పట్టును ఈతిభయం. ఆకలిబాధలుండును. ధనికులకు చోరబాధలుండును. రాజకీయ వడిదుడుకులుండును. కల్లోలములు ప్రజాక్షోభ ముండును.

ప్రమాదీ వత్సరాధిపతి బుధుడు :—కొంకణదేశమందు దుర్భిక్షము ప్రజాకలహములుండును. చైత్రమున ధాన్యాదుల ధరలు సరసము. వైశాఖజ్యేష్ఠములందు ధాన్యాదులను సంగ్రహించనగును. ఆషాఢమున అల్పమేఘములు. శ్రావణమున ఆహారధాన్యములధరలు బాగుగా పెరుగును. అతివృష్టి. భాద్రపదమున అతివృష్టి. ధాన్యాదుల ధరలు తగ్గును. ఆశ్వయుజ, కార్తిక. మార్గశిర, పౌష, మాఘ, ఫాల్గుణములందు సుభిక్షము. సర్వ రసవస్తువుల ధరలు బాగుగా పెరుగును ప్రజలు సుఖసౌఖ్యముల ననుభవింతురు.

### —♦ ఆనంద సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ ఆనందదః స్థావరజంగమానామానందవర్షే వివిధాన్నపానైః
తత్రాతిరోగైర్విలయం ప్రయాంతి కళింగవంగాఖశమాహి
షాశ్చ॥

స్థావర జంగమాదులు ఆనందము ననుభవించును. ప్రజలు నానావిధ సుఖసౌఖ్యములు గలిగి సంతోషముగా నుందురు. కాని కళింగ, వంగ, ఖశ, మహిష దేశములందు ప్రజలు రోగపీడితులై నశింతురు.

ఆనంద వత్సరాధిపతి గురుడు :—తృణధాన్యములు నశించును. ధాన్యముల ధరలు పెరుగును. నెయ్యి, పాలు, నూనె, నూనెగింజల ధరలు తగ్గును. చైత్రమున ధరలు సరసము. వైశాఖమున ఆహారధాన్యముల ధరలు సరసము. జ్యేష్ఠాషాఢమాసములందు మధ్యమవర్షములు. శ్రావణమం దధిక వర్షములు. భాద్రపదమందు ఖండవృష్టి, గోధుమలు బియ్యం, మొక్కజొన్న ధరలు పెరుగును. ఆశ్వయుజమున ఆహార ధాన్యముల ధరలు సరసము. ధాతుపదార్థముల ధరలు పెరుగును. కార్తికమున ఆకస్మికముగా భయోత్పాతములు, ప్రజాకల్లోలములు, తుపానుగాలులు వీచును. మార్గశిరమున ప్రజాపీడ. పౌష మాఘము



లందు ఖండవృష్టి, ఆహారధాన్యముల ధరలు సరసము. ఫాల్గుణమందు ఆహారధాన్యములకు ధరలు పెరుగును.

### —♦ రాక్షస సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ కోద్రవాః శాలిముద్గాది పీడితం చ వరాననే
సర్వధాన్యాని చార్ఘాంగీ రాక్షసే పీడితాః ప్రజాః॥

శ్లో॥ రథాశ్వహేమాంబర లోహకారా వృద్ధిం ప్రయాం త్యారక
జీవినశ్చ । విప్రాః క్షితీశాఃసుజనాః సువృత్తా యే రాక్షసాబ్దే
ప్రభవంతి నిస్వాః॥

కొఱ్ఱలు, వడ్లు, పెసలు, మొదలగు ధాన్యములు నశించును. అనగా యీ ధాన్యములు ప్రజలకు అందుబాటులో నుండవు. రోగములు ప్రబలును. సమస్తధాన్యముల ధరలు బాగుగా పెరుగును. రథకారులు, అశ్వవాహకులు, లోహకారులు వృద్ధినొందెదరు. బ్రాహ్మణులు, క్షత్రియులు, సుజనులు నశింతురు. రాక్షసులు ప్రబలుదురు. ప్రజాకల్లోలము లుండును

రాక్షస సంవత్సరాధిపతి శుక్రుడు:—ధాన్యసంగ్రహణము చేయనగును. చైత్రాదిమాసత్రయమున నూనెలు, నూనెగింజల ధరలు పెరుగును ఆషాఢమున పంచదార, చెఱకు, బెల్లం, పొగాకు, తేయాకు ధరలు పెరుగును. శ్రావణమున అల్పవృష్టి. ఆహారపదార్థములకు ధరలు పెరుగును, భాద్రపదమున అతివృష్టి. ఆశ్వయుజమున ధరలు సరసము. కార్తికమున రోగపీడలు. మార్గశిరమునుండి ఫాల్గుణాంతమువరకుగల కాలములో ధాన్యాదుల ధరలు సరసము. ప్రజలు సుఖింతురు.

### —♦ ఆనల సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ అనలాబ్దేఽనలభయం మధ్యవృష్టి రనర్ఘతా
నృపసంక్షోభసంభూతా భూరితస్కరభీతయః॥

అగ్నిభయములు, మధ్యమవృష్టి, అనర్ఘత, నృపసంక్షోభము. లోకమున చోరరోగాగ్నిభయోత్పాతములుండును.

అనలాబ్దపతి శని :—చైత్రమున రోగపీడలు. వైశాఖమున వడగాడ్పులుండును. ధాన్యసంగ్రహణము చేయనగును. జ్యేష్ఠమున రాజకీయ కల్లోలములు. ఆషాఢమున ధాన్యాదుల సంగ్రహణము చేయనగును. శ్రావణాది మాసత్రయమున వర్షము లధికము. కార్తికమాసమున ధాన్యాదులను అమ్మటవల్ల లాభము చేకూరును. మార్గశిరాది మాసత్రయమున ఆహారధాన్యముల ధరలు సరసమగును. ఫాల్గుణమున రోగములు ప్రబలును. చోరభీతి. ఉత్తరదేశమునందు దుష్టకాలము. తూర్పుదేశములందు దుర్భిక్షముండును.

## —♦ పింగళ సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ పింగళాబ్దే త్వీతి భీతిర్మధ్య సస్యార్ఘ వృష్టయః
రాజానో విక్రమాక్రాంతా భుంజంతే శత్రుమేదినీ॥

లోకమున ఈతిబాధ లుండును. సస్యములు మధ్యమముగా ఫలించును. మధ్యమవర్షములు. రాజులు ధైర్యసాహసములచే శత్రువుల నిర్జించెదరు.

పింగళాబ్దపతి రాహువు :—పంజాబు, ముల్తాన్, నాగపూర్, మరుదేశము, ఢిల్లీ, మధురా, కలకత్తా ప్రాంతములందు దుర్భిక్షము, ధాన్యాదుల ధరలు పెరుగును. ధాతువస్తువుల ధరలు సరసము. ప్రజాకల్లోలములు. గ్రామములు, పట్టణములందుండు ప్రజలు లేచిపోవుదురు. ప్రజలకు రోగపీడలుండును. గుజరాతుప్రాంతములందు ధాన్యాదుల ధరలు సరసము. సింధుదేశమునందు ధాన్యాదుల ధరలు పెరుగును. చైత్రమున ధాన్యాదుల ధరలు పెరుగును. ప్రజాపీడలు. వైశాఖాది మాసత్రయమున ఆహారధాన్యముల ధరలు సరసము. ప్రజాక్షయము. శ్రావణమున అల్పవృష్టి. ధాన్యాదులకు ధరలు బాగుగా పెరుగును. భాద్రపదమున ఖండవృష్టి. ఆశ్వయుజమున ధరలు సరసము. కార్తికాది మాసపంచకమున ప్రజాకల్లోలములు, కలహములు, ఆహారపదార్థములకు ధరలు పెరుగును. పశువులకు రోగము లుండును.



## —♦ కాలయుక్తి సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ ప్రజానాం జాయతే రోగః కాలయుక్తౌ విశేషతః
రాజయుద్ధం భవేద్ఘోరం ప్రజానాశో వరాననే॥

ప్రజలు రోగపీడితులై యుందురు. రాజకీయ కల్లోలములు. రాజయుద్ధం ప్రజానాశన ముండును.

కాలయుక్తి సంవత్సరాధిపతి కేతువు :—అల్పవృష్టి. చైత్రాది మాసత్రయమున ధాన్యసంగ్రహముచేయనగును. ఆషాఢమున అల్పవృష్టి. శ్రావణమం దతివృష్టి. ధాన్యాదుల ధరలు సరము. భాద్రపదమున ఖండవృష్టి. ఆశ్వయుజమున రోగపీడలు. ధాన్యాదులు ధరలు పెరుగును. రసవస్తువుల ధరలు పెరుగును. ధాతువుల ధరలు సరసము. కార్తికాదిమాసపంచకమున రాజకీయ కల్లోలములు. భయోత్పాతములు ప్రజాక్షయ ముండును.

## —♦ సిద్ధార్థి సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ సిద్ధార్థీ వత్సరే భూపాశ్చాన్యోన్యం స్నేహకాంక్షిణః
సంపూర్ణసస్యాం వసుధాం దుదుహుర్గాం యథా తథా॥

రాజులు పరస్పరము స్నేహము నపేక్షించెదరు. పంటలు చక్కగా ఫలించును. పశువులు చక్కగా పాలొసంగును.

సిద్ధార్థిసంవత్సరాధిపతి రవి:—సుభిక్షము. చైత్రాదిమాసద్వయమున లోకపీడ. జ్యేష్ఠాషాఢములందు వడగాడ్పులధికము. అగ్నిభయములుండును. శ్రావణమున అతివృష్టి. ఆహారధాన్యములకు ధరలు పెరుగును. భాద్రపదమున ఖండవృష్టి. ఆశ్వయుజమున ధరలు సరసము. కార్తికమున ధరలుకొలదిగ పెరుగును. మార్గశిరాదిమాసచతుష్టయమున సుభిక్షముండును. కాని ఫాల్గుణములో ప్రజాకల్లోలములు, పశువుల ధరలు పెరుగును.

## —♦ రౌద్రి సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ యుద్ధ్యంతి క్షితిపతయః పరస్పరం హంతుముద్యతాః సర్వే
కొంకణదేశ క్షితిపతినిధనం తత్రైవ రౌద్రాబ్దే॥

రాజులు పరస్పరము కలహించెదరు. కొంకణదేశాధిపతి మరణించును.

రౌద్రి సంవత్సరాధిపతి చంద్రుడు :—ప్రజాకలహములు, రాజయుద్ధము, పశుహాని, జనహాని, అల్పవృష్టి యుండును. చైత్రాదిమాసత్రయమునమహార్ఘము. ఆషాఢశ్రావణములందల్పవృష్టి. భాద్రపదమున అధిక వర్షములు. ధాన్యాదుల ధరలు సరసము. వక్కలు, పసుపు, పొగాకు, వేరుశనగ, లవంగాలు, మిర్చి, మిరియాలు ధరలు పెరుగును. పశువుల ధరలు సరసము. ఆశ్వయుజాది మాసషట్కమందు ధాన్యాదుల ధరలు సరసము.

### —♦ దుర్మతి సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ దుర్మత్యబ్దే దుర్మతయో భవం త్యఖిల భూమిపాః
తథాపి సుఖినో లోకాః సంగ్రామే నిర్జితారయః॥

రాజులు దుర్మతులగుదురు. అట్లున్నను ప్రజలు సుఖించెదరు. యుద్ధములందు శత్రువులు ఓడిపోయెదరు. (శత్రువులను నిర్జించెదరు.)

దుర్మత్యబ్దపతి కుజుడు :—చైత్రవైశాఖములందు ధాన్యాదుల ధరలు సరసము. జ్యేష్ఠమున ఆహారధాన్యములు, బియ్యం, గోధుమల ధరలు సరసము. ఆషాఢమున విపరీతమైన గాలి వీచును. శ్రావణమున అల్పవృష్టి. భాద్రపదమున సర్వధాతుపదార్థముల ధరలు సరసము. ఆశ్వయుజమున రసవస్తువులు, ధాన్యములకు ధరలు తగ్గును. కార్తికమార్గశిరములందు సమస్త పదార్థముల ధరలు తగ్గియుండును. రాజకీయముగ అభివృద్ధియుండును. గ్రామాభివృద్ధికై పాటుపడుట సంభవించును. పశువుల ధరలు పెరుగును. పౌషాది మాసత్రయమున ధాతుపదార్థముల ధరలు తగ్గి (నిలబడి) యుండును.

### —♦ దుందుభి సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ సర్వసస్యేన సంపూర్ణాధాత్రీ దుందుభి వత్సరే
రాజభిః పాల్యతే పూర్వదేశేశ్వర వినాశనం॥



పంటలు చక్కగా ఫలించును. రాజులు ప్రజాభీష్టముగా పాలించెదరు. తూర్పుదేశపు రాజులు నశింతురు.

దుందుభి సంవత్సరాధిపతి బుధుడు :—ఈసంవత్సరమున వర్షము లధికము. ఆహారపదార్థముల ధరలు సరసముగా నుండును. చైత్రాదిమాసత్రయమున ఆహార ధాన్యములధరలు సరసముగా నుండును. ఆషాఢమున ధరలు రెట్టింపుగా పెరుగునని తోచుచున్నది. అల్పవృష్టి. శ్రావణమునందు ౧౧ రోజులు మంచి వర్షములు కురియును. భాద్రపదమున ౯ రోజులు వర్షించును. ఆహార ధాన్యముల ధరలు మందము. ఆశ్వయుజమున ఆహార ధాన్యముల ధరలు సరసము. రోగములు ప్రబలును పసుపు, మిర్చి, మిరియాల ధరలు తగ్గును. కార్తికమున ఆహారధాన్యముల కొఱత ఏర్పడును. ధరలు పెరుగును. మార్గశిరమునసమార్ఘము. రాజులు పరస్పరము కలహించెదరు. పౌషాది మాసత్రయమున సమస్త పదార్థముల ధరలు మందముగ నుండును. పశువులు, పసుపు, మిర్చి, పొగాకు, మిరియాలు ధరలు పెరుగును.

### —♦ రుధిరోద్గారి సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ ఆహవేనిహతాః సర్వే భూపా రోగైస్తథాజనాః
తథాపి తత్రజీవంతి రుధిరోద్గారి వత్సరే॥

రాజులు యుద్ధమునందు మరణించెదరు. ప్రజలు రోగములచే మరణించెదరు. అట్లయ్యును కొందరు ఎట్లో జీవించెదరు.

రుధిరోద్గారి వర్షాధిపతి గురుడు :—రాజులు పరస్పరము కలహించెదరు. రాజకీయ కల్లోలములు, ప్రజాక్షోభ ముండును. ప్రజాక్షయము, దుర్భిక్షభయోత్పాతము లుండును. ఇతర దేశష లనుండి ఆహార ధాన్యములు లభించును. మ్లేచ్ఛులకు ఇతరదేశములనుండి ఆహార ధాన్యములు తెప్పించవలసివచ్చును. చైత్రాదిమాసత్రయమున ధరలు సరసము. ధాతుపదార్థముల ధరలు తగ్గును. ఉత్తరహిందూస్థానమున దుర్భిక్షము. పాశ్చాత్యదేశములందు సుభిక్షము. సింధు, పంజాబు దేశములందు ధాన్యములు బాగుగా లభించును. ఆషాఢ శుక్లపక్షమున

వర్షము లధికము. శ్రావణమున ౧౫ రోజులు మంచి వర్షములు. భాద్రపదమున ఖండవృష్టి. ధాన్యాదుల ధరలు మూడురెట్లు పెరుగును. ఆశ్వయుజమున ధాన్యముల ధరలు మందమగును. కార్తికాదిమాసపంచకమున రోగములు, ప్రజా కల్లోలములు, వరదలు, ఆహార ధాన్యముల ధరలు మందముగా నుండును.

—♦ రక్తాక్షి సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ రక్తాక్షివర్షే సతతం మహీశాః పరస్పరం క్రోధపరానయోధాః
విశ్వంభరాచోత్తమ సస్యపూర్ణా క్వచిత్తదానైవ మహీన సస్యా॥

రాజులు పరస్పరము కలహించెదరు. ప్రజాక్షయముండును. యుద్ధభీతియుండును. కొన్ని ప్రదేశములందు పంటలు నశించును. మరికొన్ని ప్రదేశములందు పంటలు బాగుగా ఫలించును.

రక్తాక్షి వర్షాధిపతి శుక్రుడు :—చైత్రాది మాసత్రయమున ఆహార ధాన్యముల ధరలు సరసముగా నుండును. ఆషాఢమున సువృష్టి. ధాన్యముల ధరలు మందము. శ్రావణమున అల్పవృష్టి. కొన్నిచోట్ల ప్రజా కల్లోలములు, యుద్ధభీతియు సంభవించును. భాద్రపదమున సౌరాష్ట్రదేశమందు వరదలు రోగపీడ లుండును. ఆశ్వయుజమున ఆహార ధాన్యములు, రసవస్తువుల ధరలు సరసము. కార్తికాదిమాసపంచకమున ధాన్యాదుల ధరలు పెరుగును. వివాహాది శుభకార్యములు హెచ్చుగా జరుగనేరవు. పశువులకు రోగపీడలు. పశువుల ధరలు పెరుగును.

—♦ క్రోధన సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ గోధూమశాల్యాది వరేక్షువాటనానావిధోద్యానతడాకవప్రైః
త్రైః క్రోధనాబ్దే సకలాధరిత్రీ తదాన సంతోషకరీ జనానాం॥

శ్లో॥ రోగో మరణదుర్భిక్షం వివిధోపద్రవైర్యుతం
క్రోధనే విషమం సర్వం మయాఖ్యాతం సులోచనే॥



గోధుమలు, బియ్యం, ధాన్యం, చెఱకు మొదలగు సమస్త పదార్థముల ధరలు పెరుగును. లోకమున దుర్భిక్షము, రోగములు ప్రబలును. భయోత్పాతములు, కలహములు, ప్రజాక్షయ ముండును.

క్రోధన వత్సరాధిపతి శని ,—ఈ సంవత్సరమున మధ్యమ వర్షములు, ప్రజాకల్లోలములు, జనహాని యుండును. ఉత్తరదేశమునకు దుష్కాలము. చైత్రాదిమాసద్వయమున అల్పవృష్టి. ఆహార ధాన్యముల ధరలు మందము. జ్యేష్ఠమున అగ్నిమాంద్యరోగములు ప్రబలును. ఆషాఢశ్రావణములందు అల్పవృష్టి. ధాన్యాదుల ధరలు ద్విగుణముగా పెరుగునని తోచెడిని. భాద్రపదమున ధాన్యాదుల ధరలుసరసము. ఆశ్వయుజమున రోగపీడలు, కార్తికమున ప్రజాకలహములు, యుద్ధభీతి యుండును. మార్గశిరమున ధాన్యాదుల ధరలు మందమగును. ఆకస్మికోపద్రవము లుండును, పౌషమున వ్యాపార కల్లోలములు, ఆహార ధాన్యములకు ధరలు పెరుగును, మాఘఫాల్గుణములందు ధాన్యాదుల ధరలు అస్థిరము.

—♦ క్షయ సంవత్సర ఫలములు. ♦—

శ్లో॥ కార్పాసగుడతైలేక్షు మధుసస్య వినాశనం
క్షీయమాణాశ్చ పినరాః జీవంతి క్షయ వత్సరే॥

శ్లో॥ మండలం కురుదేశం చ కలిం జర సమన్వితం
క్షయే క్షయంతి సర్వత్ర నాన్యథా నగనందిని॥

ప్రత్తి, దూది, నూలు, బెల్లం, చెఱకు, పంచదార, నూనెలు, నువ్వులు తేన, ధాన్యాదులకు ధరలు పెరుగును. ప్రజాక్షోభములున్నను ప్రజలు ఎట్లో జీవించెదరు. కురు, కళింగదేశములందు ప్రజాకల్లోలములు, జనహాని, మానహాని, ధనక్షయ ముండును. అల్పవృష్టి.

క్షయవత్సరాధిపతి రాహువు :—చైత్రమున వడగండ్ల వానలుండును. వైశాఖమున చోరరోగాగ్నియుద్ధభయములుండును. భూకంపాద్యుపద్రవము లుండును. జ్యేష్ఠాషాఢమాసములందు బాలురకు రోగపీడ లుండును. మారీస్ఫోటకాగ్నిభయములుండును. రాజకీయపరివర్తన

స్థితి యేర్పడును. నూతనాధికారము లభించును. ఆహార ధాన్యాదుల ధరలు సరసము. శ్రావణభాద్రపదములందు ఖండవృష్టి. పశువులకురోగ పీడలు. పశువుల ధరలు పెరుగును. ఆశ్వయుజమున రోగపీడలు. ఆహార ధాన్యములు, ధాతుపదార్థముల ధరలు సరసము. రాజకీయ కల్లోలము లుండులు. కార్తికాది మాసపంచకమున సింధు, పంజాబు, సరిహద్దు ప్రాంతములందు ఆహారధాన్యములు బాగుగా ఫలించును. ఆహారధాన్యాదుల ధరలు సరసముగా నుండును.

ఆనందాది ర్భవేద్బ్రహ్మా భావాదిర్విష్ణురుచ్యతే
జయాది ర్జాయతే రుద్రో వింశత్యాచక్రమా ద్భవేత్॥
—జ్యోతిర్నిబంధే ౨౯ పుట.

ఆనంద సంవత్సరము మొదలుకొని ౨౦ సంవత్సరములు అనగా శ్రీముఖ సంవత్సరమువరకు బ్రహ్మఖండము భావ సంవత్సరము మొదలుకొని విజయసంవత్సరమువరకు విష్ణుఖండము. జయసంవత్సరము మొదలుకొని ప్రమాదీ సంవత్సరమువరకు రుద్రఖండము.

ఇయ్యది సుప్రసిద్ధ నిమ్మగడ్డవంశజనితులగు సిద్ధాంతి
వేంకట శివరామబ్రహ్మశాస్త్రిగారిచే వ్రాయ
బడిన ప్రభవాది ౬౦ సంవత్సరముల
ఫలములు గల మొదటి
అ ధ్యా య ము
సమా ప్త ము.

పాఠకులకు ముఖ్య గమనిక :—

సౌర వత్సర ఫలములుకూడా పై మాదిరిగ యగుటచే తిరుగ వ్రాయక వదలివేయబడెను.



# సిద్ధాంతసరళి.

## రెండవ అధ్యాయము.

### —♦ బార్హస్పత్య మానాబ్ద నిర్ణయము, ♦—

శ్లో॥ శకేంద్రకాలః పృథగాకృతి (౨౨) ఘ్నః
శశాంకనందాశ్వియుగై (౪౨౯౧) స్సమేతః
శరాద్రివస్వింధు (౧౮౭౫) హృతస్సలబ్ధః
షష్ట్యాప్త శేషః ప్రభవా దయోబ్దాః॥

—జ్యోతిష రత్నమాలా.

శాలివాహన శకవర్తమానాబ్దములను రెండు ప్రతులుగా పెట్టి మొదటి ప్రతిని ౨౨ చే గుణించగా వచ్చు సంఖ్యకు ౪౨౯౧ చేర్చి ౧౮౭౫ చే భాగించగా వచ్చు లబ్ధమును రెండవ ప్రతిలో కలుపవలెను. శేషమును వదలివేయవలెను. అట్లు రెండవ ప్రతిలో కలుపగా వచ్చు సంఖ్యను ౬౦ చే భాగించగా వచ్చు లబ్ధమును వదలి శేష సంఖ్యకు సరివచ్చు ప్రభవాది సంవత్సర మేదియగునో అయ్యదియే బార్హస్పత్య మానాబ్ద మనబడును.

ఉదా :—సర్వజిత్ సం॥రమునకు శాలివాహనశక గతాబ్దములు ౧౮౬౯. వర్తమానాబ్దములు ౧౮౭౦. వర్తమానాబ్దములనే గ్రహించవలెను. గతాబ్దములనుగ్రహించుచో శేషమున్న గతాబ్దము లగును.

౧౮౭౦ మొదటి ప్రతి
౨౨
౩౭౪౦
౩౭౪౦
౪౧౧౪౦
+౪౭౯౧ చేర్చవలెను.
౪౫౯౩౧÷౧౮౭౫చే భాగించవలెను.

౧౮౭౫) ౪౫౯౩౧ ( ౨౪ లబ్ధం (దీనిని రెండవ ప్రతిలో కలుపవలెను.)
౩౭౫౦
౮౪౩౧
౭౫౦౦
౯౩౧ శేషం (వదలి వేయవలెను.)

౧౮౭౦ రెండవ ప్రతి.
౨౪ కలుపవలెను.
౬౦) ౧౮౯౪ ( ౩౧ లబ్ధం (వదలవలెను.)
౧౮౦
౯౪
౬౦
౩౪ శేషం గ్రహించవలెను.

౩౪ శేషము వచ్చెను కనుక ప్రభవాదిగా లెక్కింపగా శార్వరి సంవత్సరమగును. సర్వజిత్ సంవత్సరములో బార్హస్పత్యమానాబ్దము శార్వరియనుట కెట్టి సందియములేదు. బార్హస్పత్యమానాబ్దఫలములకు ప్రభవాది సంవత్సరఫలములనే గ్రహించి పరివర్తింపవచ్చును.

బార్హస్పత్యమానాబ్దము వర్తమాన శాలివాహనశకమున కేది యగునో చూపఁబడుచున్నది.



వర్తమాన శాలివాహన శకమునకు బార్హస్పత్యాబ్దము.

| వర్తమానశకం | బార్హస్పత్యాబ్దము | వర్తమానశకం | బార్హస్పత్యాబ్దము | వర్తమానశకం | బార్హస్పత్యాబ్దము. |
|---|---|---|---|---|---|
| ౧౮౭౦ | శార్వరి"న" | ౧౮౮౪ | ఆనంద | ౧౮౯౮ | విభవ |
| ౧౮౭౧ | ప్లవ | ౧౮౮౫ | రాక్షస | ౧౮౯౯ | శుక్ల |
| ౧౮౭౨ | శుభకృత్ | ౧౮౮౬ | అనల | ౧౯౦౦ | ప్రమోదూత |
| ౧౮౭౩ | శోభకృత్ | ౧౮౮౭ | పింగళ | ౧౯౦౧ | ప్రజోత్పత్తి |
| ౧౮౭౪ | క్రోధి"న" | ౧౮౮౮ | కాళయుక్తి | ౧౯౦౨ | ఆంగీరస |
| ౧౮౭౫ | విశ్వావసు | ౧౮౮౯ | సిద్ధార్థి"న" | ౧౯౦౩ | శ్రీముఖ |
| ౧౮౭౬ | పరాభవ | ౧౮౯౦ | రౌద్రి | ౧౯౦౪ | భావ |
| ౧౮౭౭ | ప్లవంగ | ౧౮౯౧ | దుర్మతి | ౧౯౦౫ | యువ"న" |
| ౧౮౭౮ | కీలక | ౧౮౯౨ | దుందుభి | ౧౯౦౬ | ధాతృ |
| ౧౮౭౯ | సౌమ్య | ౧౮౯౩ | రుధిరోద్గారి"న" | ౧౯౦౭ | ఈశ్వర |
| ౧౮౮౦ | సాధారణ | ౧౮౯౪ | రక్తాక్షి | ౧౯౦౮ | బహుధాన్య |
| ౧౮౮౧ | విరోధికృత్ | ౧౮౯౫ | క్రోధన | ౧౯౦౯ | ప్రమాథి"న" |
| ౧౮౮౨ | పరీధావి"న" | ౧౮౯౬ | క్షయ | ౧౯౧౦ | విక్రమ |
| ౧౮౮౩ | ప్రమాది"న" | ౧౮౯౭ | ప్రభవ | ౧౯౧౧ | వృష |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧౮౧౨ | చిత్రభాను | ౧౮౩౨ | శుభకృత్ | ౧౮౫౨ | దుందుభి |
| ౧౮౧౩ | సుభాను | ౧౮౩౩ | శోభకృత్ | ౧౮౫౩ | రుధిరోద్గారి''న్'' |
| ౧౮౧౪ | తారణ | ౧౮౩౪ | క్రోధి''న్'' | ౧౮౫౪ | రక్తాక్షి |
| ౧౮౧౫ | పార్థివ | ౧౮౩౫ | విశ్వావసు | ౧౮౫౫ | క్రోధన |
| ౧౮౧౬ | వ్యయ | ౧౮౩౬ | పరాభవ | ౧౮౫౬ | క్షయ |
| ౧౮౧౭ | సర్వజిత్ | ౧౮౩౭ | ప్లవంగ | ౧౮౫౭ | ప్రభవ |
| ౧౮౧౮ | సర్వధారి''న్'' | ౧౮౩౮ | కీలక | ౧౮౫౮ | విభవ |
| ౧౮౧౯ | విరోధి''న్'' | ౧౮౩౯ | సౌమ్య | ౧౮౫౯ | శుక్ల |
| ౧౮౨౦ | వికృతి | ౧౮౪౦ | సాధారణ | ౧౮౬౦ | ప్రమోద |
| ౧౮౨౧ | ఖర | ౧౮౪౧ | విరోధికృత్ | ౧౮౬౧ | ప్రజోత్పత్తి |
| ౧౮౨౨ | నందన | ౧౮౪౨ | పరీధావి''న్'' | ౧౮౬౨ | ఆంగీరస |
| ౧౮౨౩ | విజయ | ౧౮౪౩ | ప్రమాది''న్'' | ౧౮౬౩ | శ్రీముఖ |
| ౧౮౨౪ | జయ | ౧౮౪౪ | ఆనంద | ౧౮౬౪ | భావ |
| ౧౮౨౫ | మన్మథ | ౧౮౪౫ | రాక్షస | ౧౮౬౫ | యువ''న్'' |
| ౧౮౨౬ | దుర్ముఖి | ౧౮౪౬ | అనల | ౧౮౬౬ | ధాతృ |
| ౧౮౨౭ | హేవలంబ | ౧౮౪౭ | పింగళ | ౧౮౬౭ | ఈశ్వర |
| ౧౮౨౮ | విలంబ | ౧౮౪౮ | కాళయుక్తి | ౧౮౬౮ | బహుధాన్య |
| ౧౮౨౯ | వికారి''న్'' | ౧౮౪౯ | సిద్ధార్థి''న్'' | ౧౮౬౯ | ప్రమాథి''న్'' |
| ౧౮౩౦ | శార్వరి''న్'' | ౧౮౫౦ | రౌద్రి | ౧౮౭౦ | విక్రమ |
| ౧౮౩౧ | ప్లవ | ౧౮౫౧ | దుర్మతి | | |



## —♦ నవమానములు. ♦—

శ్లో॥ బ్రాహ్మం దైవం మానుషం చ పిత్ర్యం సౌరం చ సావనం
చాంద్రమార్క్షం గురోర్మాన మితిమానాని వై నవ॥

1. బ్రహ్మమానము. 2. దివ్యమానము. 3. ప్రజాపతిమానము. 4 పితృమానము. 5, సౌరమానము. 6. సావనమానము. 7. చాంద్రమానము. 8. నక్షత్రమానము. 9. బార్హస్పత్యమానము. ఈ శ్లోకమున మానముల క్రమములేకయున్నవి వాస్తవముగా

(1) నక్షత్రమానము :—అశ్వినీనక్షత్రము తూర్పున ఉదయించి నది మొదలు తిరిగి ఆ నక్షత్రమే తూర్పున ఉదయించుటకుగల మధ్య కాలమే నక్షత్రమానాబ్దము. దీనికి ౩౨౯ సావనదినములు. వర్షఫణి. మనుజుల ఆయుర్దాయమునకు ఈనక్షత్రమానమువ్యవహరింపఁబడును.

(2) సావనమానము :—సూర్యోదయమునుండిమరల సూర్యోదయమువరకుగల మధ్యకాలము సావనదినమని పేరు. ఇవి ౩౬౦ దినములగుచో ఒక సంవత్సరమగును, సావన మానముచే యుగాదులందు దిన గణనము, జాతమృతాశౌచాదులందు దినగణనము, గ్రహముల దినగతి, దిన, మాస, అబ్దాధిపతులసాధన, వృద్ధి (వడ్డీ) గణనము, స్త్రీగర్భదిన గణనము మొదలగునవి వ్యవహరింపఁబడును.

(3) చాంద్రమానము :—రవిచంద్రుల కలయిక రూపమగు దర్శాంతకాలమునుండి మరల దర్శాంతమువరకుగల మధ్యకాలమునకు చాంద్రమాసమని పేరు. అమావాసమందలి ౩౦ వంతగు తిథికే చాంద్రమాన దినమనిపేరు, చాంద్రాబ్దమునకు ౩౫౪ ది. ౨౨ ఘ. ౧౭ విఘడియలు మధ్యమమానముచే నగును. చాంద్రమాస దినములు ౫౯ ఘ ౩౦ విఘ ౫౭ చాంద్రదిన ఘటికాది ౫౯—౨ చంద్రస్ఫుటగతి ననుసరించి ఇవి మారుచుండును. చాంద్రమానముచే తిథినక్షత్రాదుల గణనము, సమస్త కర్మలు, వ్రతములు మొదలగునవి చేయుపట్ల నుపయోగించుట గలదు. అధిక మాసము వచ్చిన చాంద్రమాన సంవత్సరములో ౩౮౪ దినములుండును.

(4) సౌరమానము :—సూర్యుడు పౌష్ణాంతరూపశాస్త్రీయారంభస్థానమునుండి బయలుదేరి తిరుగుచు మరల ఆయారంభస్థానమునకు చేరు మధ్యకాలమునకు అనగా మేషసంక్రమణదినమునుండి మరల మేష సంక్రమణ దినమువరకు సౌరసంవత్సరమగును. సౌరవర్షప్రమాణము ౩౬౫ ది ౧౫ ఘ ౩౧ విఘడియలు. సౌరమాసము ౩౦ రోజుల ౨౬ ఘడియల ౧౯ విఘడియలకాలము. సూర్యుడు రెండు రాసులు నతిక్రమించు కాలము ఋతువున్ను, ఆరు రాసుల నతిక్రమించుకాలము అయనమున్ను అగును. మకర సంక్రమణ దినమునుండి కర్కాటకసంక్రణమువరకుగల ఆరుమాసములకాలముఉత్తరాయణము. కటకసంక్రాంతి దినమునుండి మకరసంక్రమణమువరకుగల ఆరుమాసములకాలము దక్షిణాయనము. సౌరమానముచే మహాయుగాది సంవత్సర గణనయు, అయనములు, సంక్రాంతులు, దినరాత్రి ప్రమాణసాధనయు, షడశీతులు మొదలగునవి వ్యవహరింపఁబడును. షడశీతి యనగా ౮౬. తులారాశిలో ప్రథమభాగమునుంచి ప్రతి ౮౬ భాగలకు ఒక్కొక్క షడశీతి యగును. కనుకనే ధనూరాశిలో ౨౬ భాగయు, మీనరాశిలో ౨౬ భాగయు, మిథునరాశిలో ౧౮ భాగయు, కన్యారాశిలో ౧౪ భాగయు షడశీతి పుణ్యకాలము లనబడుచున్నవి. కన్యారాశిలో మిగిలిన ౧౬ భాగలకు మహాలయములని పేరు. మేషతులా సంక్రమణములకు విషువత్పుణ్యకాలములనియు, వృషభ, సింహ, వృశ్చిక, కుంభసంక్రమణములకు విష్ణుపద (హరిపద) పుణ్యకాలములనియు, మిథున, కన్యా, ధనుస్సు మీనసంక్రమణములకు షడశీతి పుణ్యకాలములనియు, మకరసంక్రమణమునకు ఉత్తరాయణపుణ్యకాలమనియు, కటక సంక్రమణమునకు దక్షిణాయన పుణ్యకాలమనియు పేర్లు.

(5) బార్హస్పత్యమానము :—మధ్యమగురుని రాశి భోగకాలముచే బార్హస్పత్యమానాబ్దము ఏర్పడుచున్నది. మధ్యమగురుని ప్రవేశకాలమే బార్హస్పత్యాబ్దమునకు ఆరంభదినము. అభీష్టకాలమునకు సృష్ట్యాది గతాబ్దములను ౬౦ చే భాగించగా వచ్చు లబ్ధమును వదలి శేషమును విజయసంవత్సరాదిగ లెక్కించిన బార్హస్పత్యమానాబ్దము వచ్చును. బార్హస్పత్యమానముచే ప్రభవాది షష్ట్యబ్దగణనము వ్యవహరింపఁబడుచున్నది. మధ్యమ గురునకు రాశి ప్రవేశములేని చాంద్రసంవత్సరమున బార్హస్పత్యాబ్ద మధికమగును. ఒక చాంద్రసంవత్సరమందు మధ్యమ గురునకు రెండు రాశిసంక్రమణములున్నపుడా సంవత్సరమున బార్హస్పత్యాబ్దము క్షయించును.



(6) పితృమానము :—ఒక చాంద్రమాసము పితృదేవతలకు ఒక రోజగును. అందు అమావాస్య పితరులకు మధ్యాహ్నము. శుద్ధాష్టమీ సూర్యాస్తమయకాలము పూర్ణిమ అర్ధరాత్రి. కృష్ణాష్టమి సూర్యోదయము. ౪౩౨౦౦౦౦ సౌర సంవత్సరములుగల మహాయుగములో ౫౩౪౩౩౩౩౬ చాంద్రమాసములుండును. ఇవియే పితృలోక దినములగును. మహాయుగములో ౧౪౪౦౦౦ పితృసంవత్సరములు గలవు.

(7) దేవమానము (దివ్యమానము) ;—ఒక సౌరవత్సరము దేవతల కహోరాత్రమగును. అందు మేషాది ఆరు రాసుల కాలము పగలు. తులాది ఆరురాసులకాలము రాత్రి. మేష సంక్రమణకాలము దేవతలకు సూర్యోదయకాలము. కటక సంక్రమణము మధ్యాహ్నము. తులా సంక్రమణము సూర్యాస్తమయకాలము. మకరసంక్రమణము అర్ధరాత్రి కాలము నగును. మహాయుగమనగా ౪౩౨౦౦౦౦ దేవలోక దినములు అనగా ౧౨౦౦౦ సంవత్సరములు, వీనికే దివ్యాబ్దములని పేరు.

(8) ప్రజాపతి మానము :— డెబ్బదియొక్క మహాయుగములున్న, ఒక కృతయుగతుల్య సంధియుకలిసి మన్వంతరమగును. ఇదియే ప్రజాపతి లోకమునకు దినము. ప్రజాపతిలోక దినమునకు ౭౧౪౦౦ గురు సంవత్సరములు లేక ౮౫౬౮౦౦ దివ్యసంవత్సరములు లేక ౧౦౨౮౧౬౦౦ పితృసంవత్సరములు లేక ౩౦౮౪౪౮౦౦౦ భూలోక వత్సరములగును.

(9) బ్రహ్మమానము :—౧౪ మన్వంతరములున్న ఒక కృతయుగతుల్య సంధియు కలిసి బ్రహ్మకు ఒక పగలు. ఇదియే కల్పము. ఇంతియే రాత్రికాల ముండును. బ్రహ్మయొక్క అహోరాత్రములతో నొప్పు నూరుసంవత్సరములకాలముబ్రహ్మకుపరమాయుర్దాయకాలము.

భూలోకమున బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రు లనబడు చాతుర్వర్ణ్యముల పగిది చాంద్ర, సౌర, సావన, నాక్షత్రములను నాలుగు

మానములచే సకల వ్యవహారములు నడచును. పితృదేవాది మానములచే భూలోకమానములు సూచింపఁబడుచున్నవి.

## —♦ గురూదయాబ్ద నిర్ణయము. ♦—

శ్లో॥ కార్తికాదిషు సంయోగే కృత్తికాది ద్వయం ద్వయం
అంత్యోపాంత్యౌ పంచమ శ్చత్రిభి ర్మాసాస్త్రయస్మ్రృతాః॥
—ఇతి సూర్యసిద్ధాంతే.

శ్లో॥ స్యాదూర్జాదిషు మాసేషు వహ్నిభాది ద్వయం ద్వయం
ఉపాంత్య పంచమాంత్యేషు నక్షత్రాణాం త్రియం త్రయం
యస్మిన్నభ్యుదితో జీవ స్తన్నక్షత్రాఖ్య వత్సరాః
ఏషాం త్రియాణా మబ్దానాం ఫలం వక్ష్యే పృథక్ పృథక్॥

కార్తికాది శ్రావణమాసమువరకు కృత్తికాది రెండేసి నక్షత్రములను లెక్కింపగను. ఫాల్గుణమున పుబ్బ, ఉఫ, హస్తలను లెక్కింపగను భాద్రపదాశ్వయుజమాసములందు శతభిషాదిగ మూడేసినక్షత్రములను లెక్కింపగను ఏర్పడు మాసము ననుసరించియే గురూదయాబ్దము సంభవించును. గురుడు ఏ నక్షత్రమంగ దుదయించునో యానక్షత్రము ననుసరించియే గురూదయాబ్దము యేర్పడును. గురుడుదయించు రోజున నిత్యనక్షత్రమేదియగునో ఆ నక్షత్రము ననుసరించి గురూదయాబ్దమును నిర్ణయింపకూడదు.

శ్లో॥ నక్షత్రేణ సహోదయము స్తంవా యేనయాతి సురమంత్రి
తత్సంజ్ఞం వక్తవ్యం వర్షం మాస క్రమేణైవ॥

అను గ్రంథాంతరోక్తియు నిట ప్రమాణమగుచున్నది.

గురు డుదయించు కాలమున ఏ నక్షత్రమందు గురుడు సంచరించుచుండునో ఆ నక్షత్రము ననుసరించియేర్పడు గురూదయాబ్దములు యీ దిగువ చూపఁబడుచున్నది.



| గురూదయ నక్షత్రం. | గురూదయాబ్దము. |
|---|---|
| కృత్తిక—రోహిణి. | కార్తికాబ్దము |
| మృగశిర—ఆర్ద్ర. | మార్గశీర్షాబ్దము. |
| పునర్వసు—పుష్యమి. | పౌషాబ్దము. |
| ఆశ్రేష—మఘ. | మాఘాబ్దము. |
| పుబ్బ—ఉత్తర—హస్త. | ఫాల్గుణాబ్దము. |
| చిత్ర—స్వాతి. | చైత్రాబ్దము. |
| విశాఖ—అనూరాధ. | వైశాఖాబ్దము. |
| జ్యేష్ఠ—మూల. | జ్యేష్ఠాబ్దము. |
| పూర్వాషాఢ—ఉత్తరాషాఢ. | ఆషాఢాబ్దము. |
| శ్రవణం—ధనిష్ఠ. | శ్రావణాబ్దము. |
| శతభిషం—పూర్వాభాద్ర—ఉత్తరాభాద్ర. | భాద్రపదాబ్దము. |
| రేవతి—అశ్వని—భరణి. | ఆశ్వయుజాబ్దము. |

కొందరు గత వత్సరమున గురు డే నక్షత్రమందు సంచరించుచు ఉదయించెనో ఆ నక్షత్రము ననుసరించి గురూదయాబ్దమును నిర్ణయించుచున్నారు. అట్లు వ్రాయరాదు. వర్తమానవత్సరముననుసరించి వ్రాయవలెను.

## —♦ గురూదయాబ్ద ఫలములు, ♦—

(1) కార్తికాబ్ద ఫలము :—

శ్లో॥ పాపబుద్ధిరతాలోకా భవంతి కార్తికే సదా
దేవతానై వమన్యంతే రాజ్యం చ తస్కరైర్వృతం॥
శ్లో॥ పీడాస్యా త్కార్తికే వర్షే రథగోగ్న్యుపజీవినాం
క్షుచ్ఛస్త్రాగ్నిభయం వృద్ధిః పుష్పకౌసుంభజీవినాం॥

కార్తికాబ్దమున లోకమున పాపము ప్రబలును. ప్రజలు క్రూరకర్మలు చేయుదురు. దేవతారాధన యుండదు. నాస్తికవాదము ప్రబలును. రాజకీయ కల్లోలము లుండును. చోరరోగాగ్నిభయములుండును. వడ్రంగులు, కమ్మరులు, కుమ్మరులు, యంత్రాగారములందు పనిచేయు కార్మికులు, రైతులు, వ్యవసాయదారులు, కూలివారు వీరలకు పీడ లుండును. ఆకలి బాధలు, యుద్ధభయము, అగ్నిభయము లుండును. పువ్వులను, సుగంధ ద్రవ్యములను అమ్ముకొనువారు సుఖజీవనముచేయుచు వృద్ధికివచ్చెదరు. లోకమున రోగపీడలుండును. రంగులవర్తకముచేయువారికి అభివృద్ధి యుండును.

(2) మార్గశీర్షాబ్దఫలము :—

శ్లో॥ వర్షహంతా వ్యాధికరో మిథోభేద భయావహః
శలభాద్యాకులః సౌమ్యో దుర్భిక్షభయకారకః॥
—గర్గః.

శ్లో॥ కార్పాసాది మహార్ఘం స్యాద్గోధూమాష తిలాదికం
మేఘే వర్షతిదేవోవా మార్గశీర్షే విశేషతః॥
—గ్రంథాంతరే.

శ్లో॥ మార్గవర్షే త్వల్పవృష్టిః సస్యహాని రనేకధా
రాజానో యుద్ధనిరతా అన్యోన్యవధ కాంక్షిణః॥

మార్గశీర్షాబ్దమున అల్పవృష్టియుండును. వ్యాధులు ప్రబలును నానా విధములచే సస్యములకు హాని సంభవించును. ఈతిబాధలు, దుర్భిక్షము, భయోత్పాతములు, రాజకీయ వడిదుడుకులు: మిత్రభేదము లుండును. రాజులు పరస్పరము యుద్ధము చేయుదురు. ప్రత్తి, దూది, నూలు. వస్త్రములు, కంబళ్ళు, ఉన్ని, గోధుమలు. ఆహార ధాన్యములు, అపర ధాన్యములు, నువ్వులు. వేరుశనగలు, నూనెగింజలు, నూనెలకు ధరలు బాగుగా పెరుగును.

(3) పౌషాబ్దఫలము :—

శ్లో॥ జ్వరరోగక్షుధార్తాశ్చ నానాజనపదాః సదా
మహార్ఘంతు త్రిమోమాసా పౌషేస్యాత్సుఖం తథా పరమ్॥



శ్లో॥ శుభకృజ్జగతః పౌషో నివృత్తవైరాః పరస్పరం క్షితిపాః
ద్విత్రిగుణో ధాన్యార్ఘః పౌష్టికకర్మ ప్రసిద్ధిశ్చ॥

పౌషాబ్దమున మొదటి మూడుమాసములందు రోగములు, ఆకలిబాధలు ఆహార ధాన్యముల కొఱత. ధరలు పెరుగుట యుండును. తదనంతరమున సుభిక్ష క్షేమారోగ్యములుండును. రాజులు కలహించుటను మానెదరు. అభివృద్ధిదాయకమైన పనులను చేయుదురు. ధాన్యాదులకు ద్విత్రిగుణ మూల్య ముండుననుట సూచితము.

(4) మాఘాబ్దఫలము :—

శ్లో॥ సుభిక్షం పూర్వయామ్యాయాం మధ్యమం పశ్చిమే తథా
ఉత్తరేకారవం మాఘే వర్షే ధాన్య మహార్ఘతా॥

మాఘాబ్దమున తూర్పు దక్షిణ దేశములందు సుభిక్ష క్షేమారోగ్యము లుండును. పశ్చిమ దేశమున మధ్యమఫలము. ఉత్తర దేశములందు దుర్భిక్షము, భయోత్పాతము లుండును. ధాన్యాదుల ధరలు పెరుగును. సుభిక్షప్రాంతములందు ధాన్యాదుల ధరలు నిలబడియుండును.

(5) ఫాల్గుణాబ్ద ఫలము :—

శ్లో॥ ఫాల్గుణవర్షే వింద్యాత్ క్వచిత్ క్వచిత్క్షేమవృద్ధిసస్యాని
దౌర్భాగ్యం ప్రమదానాం ప్రబలా శ్చౌరా నృపాశ్చోగ్రాః॥
"క్వచిద్వృష్టిః క్వచిత్సస్యం క్వచిద్భీతయః క్వచిత్"—ఇతి.

శ్లో॥ అతివృష్టి రనావృష్టి ర్మూషకాః శలభాః శుకాః
అత్యాసన్నాశ్చ రాజానః షడేతా ఈతయః స్మృతాః॥

ఫాల్గుణాబ్దమున అతివృష్టి, అనావృష్టి, ఎలుకలు, మిడతలు, చిలుకల (సీతాకోక చిలుకల) బాధలు, రాజకీయ కల్లోలములు మొదలగు ఈతి బాధలుండును. అల్పవృష్టి, అల్పసస్యము లుండును. స్త్రీలు దౌర్భాగ్యము ననుభవించెదరు. లోకమున చోరులు ప్రబలుదురు, రాజులు ప్రజలను పీడించెదరు. తూర్పు దేశములందు భయోత్పాతము లధికమై యుండును. "పూర్వస్యాం కారవం ఘోరం ఫాల్గునే వత్సరే ప్రియే" అనుట ప్రమాణము.

(6) చైత్రాబ్దఫలము :—

శ్లో॥ చైత్రేఽబ్దే మధ్యమావృష్టి రుత్తమాన్నం సుదుర్లభం
సస్యార్ఘవృద్ధయః స్వల్పరాజానః క్షేమకారిణః॥
"వృద్ధిస్తుకోశ ధ న్యస్య భవతి పీడా చ రూపవతాం"
—ఇతి వరాహసంహితాయాం

చైత్రాబ్దమున మధ్యమవర్షములు. ఆహారధాన్యముల కొరతఏర్పడును. మంచి ధాన్యము లభించదు. సస్యార్ఘవృద్ధి స్వల్పములు. రాజులు ప్రజాహితముగా పరిపాలించెదరు. వ్యాపార వాటాలు, వ్యాపారము అభివృద్ధి గాంచును. రూపవంతులగు స్త్రీలకు పీడ లుండును.

(7) వైశాఖాబ్దము :—

శ్లో॥ వైశాఖే ధర్మపరావిగతభయాః ప్రముదితాః ప్రజాః సనృపాః
యజ్ఞక్రియా ప్రవృత్తి ర్నిష్పత్తిః సర్వసస్యానాం॥

వైశాఖాబ్దమున రాజులు, ప్రజలు పరస్పరవిశ్వాసముగల్గిన్యాయమార్గమున ప్రవర్తించెదరు. భయోత్పాతములు లేక ప్రజలు సుఖించెదరు. సమస్త ధర్మకార్యములు, యజ్ఞయాగాదిక్రతువులు చేయుటయుండును. సమస్త ధాన్యముల ధరలు సరసముగా నుండును. సస్యములు బాగుగాఫలించును.

(8) జ్యేష్ఠాబ్దఫలము :—

శ్లో॥ జ్యేష్ఠాబ్దే ధర్మతత్వజ్ఞాః సనృపాః పీడితాః పరైః
నచవర్షతివై మేఘో భవే త్సస్య వినాశనం॥
శ్లో॥ తస్కరైః పాపరోగైర్వా పీడ్యంతే పీడయా జనాః
భ్రమంతే స్వేచ్ఛయాభూమ్యాం నిర్ద్రివ్యైర్జ్యేష్ఠసంజ్ఞకే॥

జ్యేష్ఠాబ్దమున ధర్మమార్గ తత్వజ్ఞులు, రాజులు, దుష్టులచే పీడింపఁబడుదురు. వర్షాభావముచే సస్యములు నశించును. చోరులు, దుర్మార్గులు ప్రబలుదురు. రోగములు ప్రబలును. దారిద్ర్యముచే ప్రజలు దేశదేశములందు సంచరించుచు స్వేచ్ఛాప్రవర్తన గల్గియుందురు.

(9) ఆషాఢాబ్దఫలము :—

శ్లో॥ ఆషాఢే జాయంతే సస్యాని క్వచిద వృష్టి రన్యత్ర
యోగక్షేమం మధ్యం వ్యగ్రాశ్చ భవంతి భూపాలాః॥



ఆషాఢాబ్దమున సస్యములు బాగుగా ఫలించును కాని కొన్నిచోట్ల అల్పవృష్టిచే పంటలు నశించును. అలభ్యవస్తుసేకరణయు, లభ్యవస్తువుల రక్షణయు మధ్యమముగా నుండును. రాజులు వ్యగ్రచిత్తులై యుందురు. "ఆషాఢే స్వల్పవృష్టిశ్చతుష ధాన్యమహార్ఘతా" అనుగ్రంథాంతరోక్తిచే అల్పవృష్టియు, తోకగలధాన్యముల ధరలు పెరుగుటయు సంభవించును.

(10) శ్రావణాబ్ద ఫలము :—

శ్లో॥ అనేక సస్యసంపూర్ణా సురస్పర్ధిజనాకులా
పాపపాఖండహంత్రీభూః శ్రావణాబ్దే విరాజతే॥

శ్రావణాబ్దమున సస్యములు బాగుగా ఫలించును. నాస్తికులు ప్రబలుదురు. పాషండులు పీడింపఁబడుదురు. "ధాన్యం సమర్ఘతాం యాతి సమ్యగ్వర్షతి వాసవః" అను గర్గవచనముచే సస్యానుకూల వర్షములుండును. ధాన్యాదుల ధరలు సరసమై యుండును.

(11) భాద్రపదాబ్ద ఫలము :—

శ్లో॥ భాద్రపదే వల్లీజం నిష్పత్తిం యాతి పూర్వసస్యంచ
నభవత్యపరం సస్యం క్వచిత్ సుభిక్షం క్వచిచ్ఛభయం॥

భాద్రపదాబ్దమున పెసలు, మినుములు, ఉలవలు, బొబ్బర్లు, పూర్వసస్యములు బాగుగా ఫలించును అపరసస్యములగు సెనగలు, కందులు, వేరుశనగ, ఆముదాలు, జొన్నలు మొదలగునవి ఫలింపనందున ధరలు పెరుగును. కొన్ని ప్రదేశములందు సుభిక్షము. మరికొన్ని ప్రదేశములందు దుర్భిక్షభయోత్పాతములుండును.

(12) ఆశ్వయుజాబ్దఫలము :—

శ్లో॥ భవంత్యాశ్వయుజేవర్షే సంతుష్టాః సర్వజంతవః
మధ్యమం పూర్వసస్యంస్యాత్ పరిపూర్ణా విపశ్చతే॥

ఆశ్వయుజాబ్దమున ప్రజలు సుఖసౌఖ్యముల ననుభవించెదరు. సమస్త ప్రాణికోటియు సుఖించును. పూర్వ సస్యములు మధ్యమఫలదములు. అపర సస్యములు బాగుగా ఫలించును.

—♦ బార్హస్పత్యమానాబ్దమున (లుప్త)
క్షయ సంవత్సర నిర్ణయం. :—

బార్హస్పత్యమానమున సుమారు ౮౫ సంవత్సరముల కొక సంవత్సరము క్షయించును. ఒక సౌర సంవత్సరములో గురుడు రెండు రాసులయందు ప్రవేశించినను లేక రెండురాసులను దాటినను అపుడు తొలి ప్రవేశమునకు వచ్చిన సంవత్సరము లుప్తమనియు, రెండవ ప్రవేశమునకు వచ్చిన సంవత్సరమును అప్పటి చాంద్రమాన సంవత్సరమునకు సరియగు బార్హస్పత్య సంవత్సరము అగును. ఈ క్షయాబ్దములు స్ఫుటక్షయాబ్దములనియు, మధ్యక్షయాబ్దములనియు ద్వివిధము. స్ఫుట గురుని రాశిప్రవేశముచే గలుగునది స్ఫుటక్షయాబ్దమనియు, మధ్యమ గురుని రాశిప్రవేశముచే గలుగునది మధ్యమక్షయాబ్దమనియు గ్రహించవలెను. "ఏకస్మిన్ రవివర్షే గౌరవవర్షద్వయావసానంచేత్ । త్ర్యబ్దస్పృగేనమేవం విలుప్త సంవత్సరం ప్రాహుః" అని రత్నమాల.

—♦ చైత్రాద్వయమున సంవత్సరాది నిర్ణయము. ♦—

శ్లో॥ యుగవర్షమాసదివసాః సమం ప్రవృత్తాస్తు చైత్రశుక్లాదేః
కాలోయమనాద్యంతో గ్రహభైరనుమీయతే।
—కాలమాధవీయే

యుగములు, వత్సరములు, మాసములు, దినములు నను కాల విశేషములన్నియు చైత్రశుక్ల ప్రతిపదాదిగ ప్రవర్తించుచున్నవి. ఆద్యంతరహితమగు నీకాలము గ్రహనక్షత్రాదులచే నూహింపఁబడుచున్నది,

శ్లో॥ మలిమ్లుచై స్సమాక్రాంతం సూర్యసంక్రాంతివర్జితం
మలిమ్లుచం విజానీయాద్గర్హితం సర్వకర్మసు.
శ్లో॥ అసంక్రాంతో హియోమాసః కదాచిత్త్రిభివృద్ధితః
కాలాంతరా త్సమాయాతి నపుంసక ఇతీష్యతః॥
శ్లో॥ వత్సరాంతర్గతః పాపో యజ్ఞానాం ఫలనాశకృత్
నైఋతేర్యాతుధానాద్యై స్సమాక్రాంతో వినాశకైః॥
—శాతాతపః.



సౌరవత్సరము చాంద్రసంవత్సరముకంటె పదకొండు దినము లెక్కువగా నున్నట్లు స్థూలదృష్టిచే తెలియనగును. రెండు సౌరవత్సరములు రెండు చాంద్రవత్సరములకంటె ఇరువదిరెండుదినములు అధికముగ నుండును. ఎనిమిది సౌరమాసములు ఎనిమిది చాంద్రమాసములకంటె ఏడున్నరదినము లధికముగా గలవియనగును. ఈ యధికదినములన్నియు జేరి అరదినము తక్కువగా మాసమగును. ఇదియే అధికమాస మనబడును. మిగిలిన దినార్థము పదునారుదినముల నాల్గుగడియల కాలముచే సరిపోవును.

కాలాధిక్యము గల్గిన అధిక మాసమునకు మలత్వ మంగీకరింపఁబడెను. ఒకానొకప్పుడు అభివృద్ధిచే గల్గెడి సంక్రాంతిహీనమగు మాసము నపుంసక మనఁబడును. పురుషుడు సూర్యుడు. సూర్యుడులేని మాసమగుటచే మలమాసము నపుంసక మనబడును.

ఎట్లనిన :—

శ్లో॥ అరుణస్సూర్యోభాను స్తపనశ్చంద్రో రవి ర్గభ స్తిశ్చ
అర్యమహిరణ్యరేతో దివాకర మిత్రో విష్ణూచ, ఏతే ద్వాదశ
సూర్యా మాఘాద్యేషూదయంతి మాసేషు
నిస్సూర్యోధికమాసో మలిమ్లుచాఖ్య స్తతః పాప॥

అని గలదు. మాఘమాసము మొదలుకొని పంద్రెండుమాసములయందును (1) అరుణుడు. (2) సూర్యుడు. (3) భానుడు. (4) తపనుడు. (5) చంద్రుడు. (6) రవి. (7) గభస్తి. (8) అర్యముడు. (9) హిరణ్యరేతస్కుడు. (10) దివాకరుడు. (11) మిత్రుడు. (12) విష్ణువు నను ద్వాదశ సూర్యులు నుదయింతురు. సూర్యరహితమగు మలమాసము పాపయుక్తమగును.

మరియు,

"మాసేషు ద్వాదశాదిత్యా స్తపంతేహి యథాక్రమం
నపుంసకేధికేమాసే మండలం తపతే రవిః"

మాఘాది ద్వాదశమాసములందు ద్వాదశాదిత్యులుదయింతురు. సూర్య

సంక్రాంతిరహితమగు మలమాసమున సూర్యునిమండలము మాత్రమే తపించుచున్నది. అట్లగుటచేత నీ మాసము పాపయుక్తము (మలినయుక్తము) (పుంస్త్వహీనము) కనుక మలమాసము రాక్షసులచేతను తస్కరులచేతను నాక్రమింపఁబడియుండుటచేతనే మలిమ్లుచమాసమనియు వ్యవహరింపఁబడుచున్నది.

శ్లో॥ షష్ట్యాతుదివసైర్మాసః కథితో బాదరాయణైః
పూర్వార్ధంతు పరిత్యజ్య కర్తవ్యా ఉత్తరేక్రియా॥
—పితామహః.

60 దినములుగల మాసమున పూర్వార్ధము మలిమ్లుచము కావున శ్రౌత స్మార్తాదికర్మలకు నిషిద్ధము. ఉత్తరార్ధము శుద్ధము గనుక శ్రౌత స్మార్తాది కర్మలకు యోగ్యమైనదగును.

శ్లో॥ చాంద్రోధిమాసోఽసంక్రాంతస్సోంతర్భవతిచోత్తరే॥
—కాలమాధవీయే.

సూర్యసంక్రమణములేలి చాంద్రమాసము అధికమాస మనబడును. ఇది ముందు (ఉత్తరమాసము లేక నిజమాసము) మాసమున నంతర్భావము నొందును. కనుకనే మలమాసము స్వతంత్రముకాదు. పరతంత్ర మనబడుచున్నది. మలమాసము పూర్వాపరమాసములలో ఏదో ఒక మాసమునకు శేషమగుచున్నది. క్షయమాసమునకు పూర్వాధిమాసమా, ఉత్తరాధిమాసమా యని చూడవలసియున్నది. చైత్రమాసము అధికమైనపు డయ్యది క్షయమాస పూర్వకాధిమాసమగుచో ఆ యధికమాసమును వదలి నిజచైత్రశుక్లప్రతిపదయందే పంచాంగపూజ, గ్రహపూజ, పంచాంగ శ్రవణము, నింబకుసుమభక్షణము, వసంతనవరాత్రారంభము చేయవలయును అధికమాసమునందు తైలాభ్యంగనము మాత్రము చేయక వదలరాదు.

తైలాభ్యంగనము నిజమాసమునందును జేయవచ్చునని కొందరనుటయు గలదు. చైత్రాధిక మాసము క్షయమాస పూర్వాధికమాసమగుచో

శ్లో॥ యస్మిన్నబ్దే యదా చైత్రో హ్యధిమాసో భవేత్తదా
అధిమాసం పరిత్యజ్య నిజచైత్రాదివారవః"



అను నిర్ణయకౌముదీ వచనము ననుసరించి నిజచైత్ర శుక్లప్రతిపదయందు పంచాంగ శ్రవణాదికము నాచరింపనగును గాని అధికమాసమునందుగూడదు. ఇందుల కుపబలముగా

శ్లో॥ సంవత్సరే యత్ర వసంత సంజ్ఞికః
ప్రాప్తోధిమాసోయదినోత్సవాదికం
సరస్వతీ ఖేటవినాయకానాం
సంపూజనం తత్ర నిజే ప్రశస్తం॥

అను గౌతమ వచనమును చూపుటయు గలదు. పూర్వము వ్రాయబడియున్న పితామహోక్తియు క్షయమాస పూర్వాధిమాసోత్తర నిజచైత్రమునకు వర్తించును. మలచైత్రము పూర్వవర్షాంతమం దున్నపుడే యీ శ్లోకములు ప్రమాణములగుచున్నవి.

క్రమాగతమైన అధిక చైత్రము ఉత్తరవర్షాంతఃపాతమగుచో అట్టియెడ అధిక చైత్రశుక్లప్రతిపద్వారాధిపతియే రాజగును. వత్సరారంభప్రయుక్త తైలాభ్యంగనము, నింబకుసుమభక్షణము, పంచాంగ శ్రవణాదికములు అధిక చైత్రశుక్లప్రతిపదయందే చేయవలెను. ఇందులకు ప్రమాణ శ్లోకముల నీ దిగువ వ్రాసి చూపుచున్నాను.

శ్లో॥ చైత్రోఽధికస్స్యాత్ క్షయమాసపూర్వో
నిజాద్యవారః ఖలు వత్సరాదిః
క్రమేణ చైత్రే త్వధికే తదానీం
స్యాచ్ఛుద్ధమాసాదిర వత్సరాదిః॥
—మయూఖే గాలవః.

శ్లో॥ అథ ప్రతిపద చైత్రౌ శుక్లపక్షే భవేతాం
కథమపి యదివారా ద్వౌతదాభూపతిః కః
ప్రథమ ఇతి మునీంద్రైః కీర్తితో గర్గముఖ్యై
ర్గుణవతిసతి డింభే రాజ్యభాగ్జ్యేష్ఠ ఏవ॥ —జ్యోతిస్సారే.

సిద్ధాంతశిరోమణిలో నున్నదని కొందరీదిగువ నుదహరించిన శ్లోకమును ప్రమాణముగా చూపుచున్నారు.

శ్లో॥ యస్మిన్నబ్దేతు చైత్రోఽధిక ఇతికథితో వత్సరాదిస్తదాద్యో
విజ్ఞేయో వాసరోఽర్కోదయసమయగతో వారపోఽబ్దాధిపశ్చ
నాబ్దాది శ్శుద్ధచైత్రప్రతిపదపినత ద్వారపోఽబ్దాధిపశ్చ
ప్రోక్తం సర్వం మునీంద్రైః శ్రుతిస్మృతి సువచస్సంయుతై
శ్చైవ మేవ॥ సిద్ధాంతశిరోమణౌ.

శ్లో॥ క్రమేణ యత్రమాసస్స్యాన్మధుర్నామమలిమ్లుచః
శ్రోతవ్యమాద్యే పురుషైః రాజమంత్ర్యాది సత్ఫలమ్॥
—వసిష్ఠః.

శ్లో॥ అధిమాసేతు కుర్వీత పంచాంగ శ్రవణాదికం
ఆదాయాద్యాశ్చ కందాయ ఫలంతు నిజమాసతః॥
—సిద్ధాంత సరళ్యాం.

పై వచనముల ననుసరించి క్రమాగత అధికచైత్రశుక్లప్రతిపద్వారాధిపతియే రాజుగను, ఆనాడే తైలాభ్యంగనము, నింబకుసుమభక్షణము, పంచాంగ శ్రవణము చేయవలెననియు నిజమాసమునందు వసంతనవరాత్రారంభాదికము నాచరింపవలెననియు ఆదాయవ్యయాదికములను కందాయములను గణించవలెననియు స్పష్టపడుచున్నది. క్షయ మాసపూర్వక అధికచైత్రమును వదలి నిజచైత్ర శుక్లప్రతిపద్వారేశుడే రాజుగను, ఆనాడే పంచాంగ శ్రవణము, తైలాభ్యంగనము, నింబకుసుమభక్షణము, వసంతనవరాత్రారంభాదికము నాచరింపవలెననియు సిద్ధాంతము. ఇందులకు ప్రమాణవచనము లీ దిగువ వ్రాసి చూపుచున్నాను.

శ్లో॥ యస్మిన్నబ్దే యదా చైత్రోఽప్యధిమాసో భవేద్యది
అధిమాసం పరిత్యజ్య నిజచైత్రాదివారపః॥
—నిర్ణయకౌముద్యాం.

శ్లో॥ అబ్దాదిమాసే ద్వివిధే నిజాదివారేశ ఏవాబ్దపతిశ్చనూనం॥
—గ్రంథాంతరే.



—♦ చైత్రశుక్ల ప్రతిపత్తు రెండుదినములయందున్నపుడు అనఁగా రెండువారములయం దున్నపుడు రాజనిర్ణయము ♦—

శ్లో॥ వర్షాద్యా ప్రతిపద్యస్మిన్ వారద్వయసమన్వితా
తౌతస్మిన్ వత్సరాధీశౌ కాలభోగానుసారతః॥ —గర్గః
శ్లో॥ ప్రతిపచ్చైత్రమాసస్య శుక్లే స్యాత్షష్టినాడికాః
పరేద్యురుదయే సాస్యాద్రాజా పూర్వదినస్యతు॥ —గర్గః.
శ్లో॥ వర్షాదౌ ప్రతిపద్యస్మిన్ వారద్వయ సమన్వితౌ
తథాపూర్వదినాధీశో వత్సరాధిపతిస్మృతః॥ —సత్యవ్రతః
శ్లో॥ వాసర ద్వితయే చైత్ర ప్రతిపత్సూర్యదర్శనే
తదా వర్షాధిపః పూర్వవాసరేశ ఇతిస్మృతః। —ప్రచేతాః,
శ్లో॥ సంగవాదనువర్తేతు చైత్రాద్యా ప్రతిపద్యది
వర్తతే తత్రయోవార స్సతు సంవత్సరాధిపః॥—బార్హస్పత్యే

చైత్రశుక్ల ప్రతిపత్తు రెండువారములందున్నచో పూర్వదినవారాధిపతియే రాజగును.

—♦ చైత్రాదిమాసములకు వైదిక నామములు. ♦—

శ్లో॥ చైత్రోమాసో మధుః ప్రోక్తో వైశాఖో మాధవో భవేత్
జ్యేష్ఠమాసస్తు శుక్రః స్యాదాషాఢః శుచి రుచ్యతే
నభోమాసః శ్రావణః స్యాన్నభస్యో భాద్ర ఉచ్యతే
ఇషశ్చాశ్వయుజోమాసః కార్తికశ్చోర్జసంజ్ఞకః
సహోమాసో మార్గశిరః సహస్యః పుష్యనామకః
మాఘమాసస్తపాః ప్రోక్తస్తపస్యః ఫాల్గునః స్మృతః।

| చాంద్రమాస నామములు. | వేదోక్త నామములు. |
| --- | --- |
| చైత్రము | మధుమాసము. |
| వైశాఖము | మాధవమాసము, |
| జ్యేష్ఠము | శుక్రమాసము. |
| ఆషాఢము | శుచిమాసము. |

| | |
|---|---|
| శ్రావణము | నభోమాసము. |
| భాద్రపదము | నభస్యమాసము. |
| ఆశ్వయుజము | ఇషమాసము. |
| కార్తికము | ఊర్జమాసము. |
| మార్గశిరము | సహోమాసము. |
| పౌషము | సహస్యమాసము. |
| మాఘము | తపోమాసము. |
| ఫాల్గుణము | తపస్యమాసము. |

### —♦ ప్రత్యబ్ద నవనాయక నిర్ణయము ♦—

శ్లో॥ చైత్రాదిమేషహరికర్కటచాపయుగ్మ
కాద్రర్క్ష తౌళి మకరోదయవాసరేశాః
రాజా చ మంత్రిభటనాయక సస్యపాశ్చ
ధాన్యార్ఘ మేఘరస నీరసపాః క్రమేణ॥

(1) చైత్రశుక్ల ప్రతిపద్యుక్త వారేశుడు రాజు. (2) మేషసంక్రమణ వారాధిపతి మంత్రి. (3) సింహసంక్రమణ వారాధిపతి సేనాధీశుడు.
(4) కటకసంక్రమణవారాధిపతి సస్యాధిపతి (పూర్వ సస్యాధిపతి)
(5) ధనుస్సంక్రమణవారేశుడు ధాన్యాధిపతి (అపర సస్యాధిపతి)
(6) మిథునసంక్రమణవారాధిపతి అర్ఘాధిపతి. (7) ఆర్ద్రానక్షత్రమున సూర్యుడు ప్రవేశించుకాలమందలి వారాధిపతియే మేఘాధిపతియగును. (8) తులాసంక్రమణవారేశుడు రసాధిపతి. (9) మకరసంక్రమణ వారేశుడు నీరసాధిపతి.

శ్లో॥ మేషసంక్రమణేమంత్రీ వృషభేతు పురోహితః
మిథునేఽర్ఘాధిపశ్చైవ మేఘాధిపతిరేవచ
సస్యాధిపస్తు కటకే సింహే సేనాధిపస్తథా
పరీక్షకస్తు కన్యాయాం తులాయాంతు రసాధిపః
వృశ్చికే గ్రామపాలశ్చ చాపే ధాన్యాధిపస్తథా
మృగేతు నీరసాధీశోకుంభే గణక ఏవచ
మీనే దైవజ్ఞ ఇత్యుక్తా సంక్రాంతౌ వారపాః క్రమాత్॥



మేషాది సంక్రమణ క్రమము ననుసరించి నవాధిపతులు (1) మంత్రి (2) పురోహితుడు (3) అర్ఘాధిపతియు మేఘాధిపతియు నగును. (4) సస్యాధిపతి (5) సేనాధిపతి (6) పరీక్షకుడు (7) రసాధిపతి (8) గ్రామపాలకుడు (9) ధాన్యాధిపతి (10) నీరసాధిపతి (11) గణకుడు (12) దైవజ్ఞుడు అగును. మేఘాధిపతి ఆర్ద్రానక్షత్రమున సూర్యుడు ప్రవేశించు కాలమునందలి వారేశుడే యగును. మిథునసంక్రమణవారేశుడు మేఘాధిపతిగ గ్రహించుట కూడదు.

### —♦ మంత్రి సస్యరసాధిపతుల నిర్ణయ విశేషము. ♦—

శ్లో॥ యదాసూర్యస్య సంక్రాంతి రర్ధరాత్రాదనంతరం
తదూర్ధ్వవారపో గ్రాహ్య మంత్రీ సస్యరసాధిపాః॥

రవిసంక్రమణము అర్ధరాత్రికాలము నతిక్రమించియున్నపుడు ఉత్తర (ముందు) వారాధిపతియే మంత్రి, సస్య, నీరసాధిపతులగుదురని గ్రహించవలెను.

### —♦ సేనధాన్యార్ఘ మేఘనీరసేశ్వరుల నిర్ణయవిశేషము. ♦—

శ్లో॥ సేనధాన్యార్ఘ మేఘేశ నీరసేశ్వరపంచసు
రాత్రౌ త్రిభాగం కుర్వీతద్వాభాగౌ పూర్వవాసరే
శేషభాగం పరదినే వారనాథో లిఖే త్క్రమాత్॥

రాత్రియందుసంక్రమణముసంభవించినపుడు రాత్రిప్రమాణమునుమూడు భాగములు చేయగా అందు రెండు భాగములు పూర్వదినముగను మూడవభాగము పరదినముగను గ్రహించవలెను. సేనధాన్యార్ఘ మేఘ నీరసాధిపతులైదుగురికి సంక్రమణ ప్రవేశము రాత్రియందలి మొదటిరెండు భాగములం దగుచో పూర్వవారాధిపతియును, చివరభాగమునందగుచో ఉత్తరవారాధిపతియు అధిపతులుగా చూడవలెను.

శ్లో॥ సచివస్సస్యపో మేఘ రసనీరసధాన్యపాః
అర్ధరాత్రమతిక్రాంతా భవం త్యుత్తరవారపాః॥

—నారదీయే.

మంత్రి, సస్యాధిపతి, మేఘాధిపతి, రసాధిపతి, నీరసాధిపతి, ధాన్యాధిపతుల నిర్ణయించుపట్ల రవిసంక్రమణము అర్ధరాత్రి నతిక్రమించియున్నచో ఉత్తరవారాధిపతి ననుసరించి ఆధిపత్యములను నిర్ణయించవలెను. నారదీయ వచనము ననుసరించిన నిర్ణయమే శాస్త్రీయముగా గ్రహించుట గలదు.

### ఉపనాయక నిర్ణయము.

శ్లో॥ అశ్వానామధిపో మేషే గజేశశ్చ వృషే తథా
పశూనామధిపో యుగ్మే దేవాధీశస్తు కర్కటే
నరాణా మధిపో సింహే కన్యాయాం గ్రామనాయకః
వస్త్రాధీశస్తులాయాంస్యా త్కీటే రత్నాధిపో భవేత్
వృక్షాధికారీ ధనుషి జంగమాధిపతి ర్మృగే
సర్పాణామధిపః కుంభే మృగాణా మధిపోం త్యజే
జగల్లగ్నాధిపో మేషసంక్రమారంభవారపః
శుభాధిపో వత్సరాదౌ స్త్రీణా మార్ద్రప్రవేశనే
వృషమిధునకన్యాకాళి కర్కట మీనేషు దినాధిపాః క్రమేణ
కోశరణఛత్రజా వ్యవహారా వ్యాపారేశాః
కుంభమీనాయనే వర్ష తటాకాధిపతీః క్రమాత్॥

మేష సంక్రమణ తారాధిపతులు క్రమముగా (1) అశ్వాధిపతి. (2) గజాధిపతి, (3) పశ్వాధిపతి. (4) దేవాధిపతి (5) నరాధిపతి. (6) గ్రామనాయకుడు (7) వస్త్రాధిపతి. (8) రత్నాధిపతి. (9) వృక్షాధిపతి. (10) జంగమాధిపతి. (11) సర్పాధిపతి. (12) మృగాధిపతియు నగుదురు.

జగల్లగ్నాధిపతి మేషసంక్రమణారంభకాలిక వారేశుడు, శుభాధిపతి చైత్రశుక్లప్రతిపద్యుక్తవారేశుడు. స్త్రీలకు అధిపతి ఆర్ద్రానక్షత్రమున సూర్యుడు ప్రవేశించు కాలమునకగు వారేశుడు నగుదురు.

వృషభసంక్రమణవారేశుడు కోశాధిపతి. మిథునసంక్రమణ వారేశుడు యుద్ధాధిపతి కన్యాసంక్రమణవారేశుడు ఛత్రాధిపతి, వృశ్చికసంక్రమణవారేశుడు మేకలు గొఱ్ఱెలకు అధిపతి. కటకసంక్రమణ



వారేశుడు వ్యవహారాధిపతి. మీనసంక్రమణవారేశుడు వ్యాపారాధిపతి కుంభాయన కాలికవారాధిపతి వర్షాధిపతి. మీనాయనకాలిక వారాధిపతి తటాకాధిపతియు నగుదురు.

## 1. రాజగ్రహ ఫలములు (చైత్రశుక్లప్రతిపద్వారేశుడు.)

### రాజు రవి ఫలము.

శ్లో॥ అన్యోన్యవైరం క్షితిపాలకానాం
నాత్యంబు ముంచంతి వలాహకాశ్చ
భూపాద్భయం శస్త్రభయం ప్రజానాం
లోకేఽగ్ని బాధాబ్దపతౌ పతంగే॥

ప్రభువులకు పరస్పర విరోధము, అల్పవృష్టి, ప్రజలకు ప్రభువువలన శస్త్రములవలన భయము, అగ్ని బాధ లుండును. "స్వల్పం పయోగోషు జనేషు పీడా । చోరాగ్నిబాధానిధనం నృపాణాం" పశువులు అల్పక్షీరదములు. పంటలు తక్కువ. ప్రజలకు దుర్మార్గులవల్లను, చోరాగ్నిరోగ బాధ లుండును. రాజులు మరణించెదరు. రాజ్యమునుపోగొట్టుకొనెదరు.

రాజు రవిగానున్న సంవత్సరములో రాజకీయ పరివర్తనము. రాజకీయ కల్లోలములుండును. గోధుమలు, ధాన్యము, మిర్చి, మిరియాలు, కందులు, వేరుశనగ, ఇంగువ, కొబ్బరికాయలు, కట్టెలు,కలప పగడములు, కెంపులు, ముదుకనూలువస్త్రములు, మామిడిపండ్లు, వక్కలు, గుజ్జములు, ఎఱ్ఱనిపదార్థములు, గులాబిరంగు, తెల్లనిరంగులకు విద్యుచ్ఛక్తిని కలుగజేయు వస్తువులకు, ఆవాలు, చర్మములు, రసాయనపు ఎరువులు, పశువుల ధరలు పెరుగును.

### రాజు చంద్రుని ఫలము.

శ్లో॥ గోధూమశాలీక్షుమతీధరిత్రీ
సస్యాంబుపూర్ణాధ్వర వేదనాదితా

విశ్రాంతిగావః సుదుఘాః ప్రభూతా
స్సంవత్సరస్యాధిపతౌ శశాంకే॥

రాజు చంద్రుడగుటచే పాడిపంటలు, వర్షములు ప్రజాసుఖము ఉండును. ఆహారధాన్యముల కొఱతయున్నను ప్రజ లెట్లో జీవితము గడపెదరు. చంద్రుడు రాజుగానుండు సంవత్సరమున ప్రజలు కామాసక్తులై స్త్రీలోలురై యుందురు. స్త్రీలకు పురుషులకున్న యధికారములు కావలెనని కోరుదురు. తేనె, రసవస్తువులు, చింతపండు, పూలు, పాలు, వెన్న, నెయ్యి, బియ్యము, పండ్లు, ఉప్పు, మణులు, ముత్యములు, ఓషధులు, తెల్లనిధాన్యములు, తెల్లని రంగులు, సన్ననినూలు, ఆహారధాన్యములు 60, 80, 100 నెంబరుగల నూలువస్త్రములు, జొన్నలు, సజ్జలు, సుగంధ ద్రవ్యములు, పంచదార, కర్పూరము, తమలపాకులు, పసుపు, చేపలు, మత్స్యపదార్థములు, పెరుగు, చలువరాళ్లు, గోజాతి పశువుల ధరలు బాగుగా పెరుగును.

—♦ రాజు కుజుని ఫలము. ♦—

శ్లో॥ భౌమస్య రాజ్యేఽగ్నిభయం ధరిత్రీ
సస్యేన హీనా క్వచి దేవవృష్టిః
చోరాః ప్రభూతా మనుజేశ్వరాణాం
స్యాద్విగ్రహోఽన్యోన్య జయాయనూనం॥

రాజు కుజుడగుటచే లోకమున అగ్నిభయము. శస్త్రభయము. పంటలు తగ్గుట, అల్పవృష్టి, చోరులు, దుర్మార్గులు ప్రబలుట యుండును. రాజులు పరస్పర జయకాంక్షచే యుద్ధము చేయుదురు. సైన్యముచాలా వరకు నశించును. యుద్ధతీవ్రతయుండును. రక్తము ఏరులుగా పారును. లోకమున భయోత్పాతము లధికమగును.

ఎఱ్ఱని వస్తువులు, ఎఱ్ఱని రంగులు, కందులు, మిర్చి, పగడములు, బెల్లం, కల్లు, సారాయి, విషవస్తువులు, చండ్రికర్ర, కలప, కట్టెలు, అగ్నిపదార్థములు, బంగారం, వెండి, సీసము, ఇనుము, ఉక్కు, మాంసము, యంత్రపరికరములు, బొగ్గు, పెట్రోలు, కిరసనాయిలు, ఆముదము



నార, గోనెసంచులు, ఉల్లిపాయలు, పొగాకు, తేయాకు, కాఫీగింజలు, పసుపు, కంచు, ఇత్తడి, రాగి, కంకర, సిమెంటు, కడపరాళ్ళు, లోహ వ్యాపార వాటాలు, సత్తు మొదలగు వస్తువుల ధరలు విపరీతముగా పెరుగును.

—♦ రాజు బుధుని ఫలము. ♦—

శ్లో॥ బుధేఽబ్దనాథేత్వ పరం చ సస్యం
శ్రేష్ఠం చ వృద్ధిర్లిపి లేఖకానాం
ప్రభూత వాయు ర్భువి మధ్యవృష్టి
ర్గదాహతః ప్రోద్ధత రాజకోపః॥

బుధుడు రాజగుటచే అపర సస్యములు బాగుగా ఫలించును. పూర్వ సస్యములు మధ్యమ ఫలదములు. లిపి లేఖకులు, శిల్పకారులకు వృద్ధి యుండును. వాయుపీడ యధికమగుటచే స్వల్పవృష్టియుండును. రాజకీయ వడిదుడుకు లధికము. రోగపీడలుండును

నర్తనశాలలు, సినీమాలు, వినోదశాలలు ప్రబలును. నెయ్యి, నూనె, నూనెగింజలు, వేరుశనగపప్పు, దూది, ప్రత్తి, వెండి,బంగారం, కలప, కాగితము, చింతపండు, రసాయనపు ఎరువులు, కంచు, ఉల్లిపాయలు, పసుపు, పొగాకు, అరటిపండ్లు, తమలపాకులు, తేయాకు, విస్తళ్ళు, నల్లమందు, పాలు, పెరుగు, మజ్జిగ, వెన్న, చందనము, అగరువస్తువులు, పెసలు, మినుములు, కందులు, తెల్లని రంగులు, చర్మములు, బూడిదరంగు, చిలుకపచ్చ చీరెలు, రంగులు, బియ్యం, గోధుమలు, ఇత్తడి, ప్రత్తిగింజలు, తెల్లధాన్యములు, ద్రావకముల ధరలు, వ్యాపార వాటాలు పెరుగును.

—♦ రాజు గురుని ఫలము. ♦—

శ్లో॥ ద్విజాతయః కర్మరతా స్వధర్మా
స్సన్మార్గగా నీతివిదో నరేంద్రాః

సుభిక్ష మారోగ్య సుఖే ప్రజానాం
సువృష్టి రబ్దాధిపతౌ సురేజ్యే॥

రాజు గురుడగుటచే ద్విజులు సత్కర్మనిరతులై యుందురు. రాజులు ప్రజలు న్యాయముగా సంచరించెదరు. రాజనీతియుండును. సుభిక్ష క్షే మారోగ్యములచే ప్రజలు సుఖించెదరు. సస్యానుకూలవృష్టిచేసస్యములు బాగుగా ఫలించును.

ఉప్పు, గంధకద్రవ్యములు, తగరము, రబ్బరు, సెనగలు, వేరు శనగకాయలు, పంచదార, బెల్లం, చెఱకు, పాలు, పెరుగు, నెయ్యి, వెన్న, తేనె, కల్లు, వ్యాపార వాటాలు, బ్యాంకు వాటాలు, ప్రత్తి, చర్మము, కుసుమధాన్యము, గరుడపచ్చరాళ్ళు, నూలు, వస్త్రములు, ఉలవలు, అపరధాన్యములు, కోకో, టిక్ రేకులు, సిమెంటు, వెండి, బంగారం, ధాన్యం, బియ్యం ధరలు సరసముగా నుండును.

## —♦ రాజు శుక్రుని ఫలము. ♦—

శ్లో॥ సమృద్ధ సస్యా వసుధా సువృష్టి
ర్గావోపి సంపూర్ణ పయః ప్రదాస్స్యుః
ప్రియాః ప్రియాణాం జనయంతితోషం
కామోపచారై ర్భృగుజేఽబ్దనాథే॥

శుక్రుడు రాజగుటచే మంచి వర్షములు కురియును. పంటలు సమృద్ధిగా నుండును. పశువులు పుష్కలముగా పాలిచ్చును. కామోపచారములచే కాంతలు ప్రియులను తృప్తిపరచెదరు.

వెండి, బంగారం, కుసుమధాన్యము, తెల్లని ధాన్యములు, వజ్రములు, మణులు, ఆహారధాన్యములు, పట్టు, ముత్యములు, జొన్న, సజ్జ కస్తూరి, సుగంధ ద్రవ్యములు, చింతపండు, పసుపు, కషాయదినుసులు, మిర్చి, మిరియాలు, నూనెగింజలు, వేరుశనగ, తెల్లనిరంగులు గాజు పాత్రలు, అద్దములు, రాగి, ఫిల్లీభోగములు, రామసాగరాలు (ఆట గడ ధాన్యము) నెంబర్లు, అక్కుళ్ళు, దూదివాటాలు, నూలువాటాలు, ధాన్యవ్యాపార వాటాలు పెరుగును. ధరలుకూడా పెరిగియేయుండును.



## —♦ రాజు శని ఫలము. ♦—

శ్లో॥ శనైశ్చరే వర్షపతౌ సకృజ్జలం
ప్రభూతరోగైః పరిపీడ్యతే జనః
యుద్ధం నృపాణాం గద తస్కరాద్యై
ర్భ్రమంతిలోకాః క్షుధితాశ్చ దేశాః॥

రాజు శని యగుటచే వర్షము స్వల్పము. రాజులకు యుద్ధము. రోగ ములు చోరులు ఆకలిబాధలచే ప్రజలు కృశించి నశింతురు. కొందరు పర దేశముల పాలయ్యెదరు.

కారపు దినుసులు, మసాలావస్తువులు, రసాయనపదార్థములు, బొగ్గు, తారు, నువ్వులు, నువ్వులనూనె, నల్లనిధాన్యములు, మినుములు అవిసెలు, చర్మములు, చెప్పులు, వగరు వస్తువులు, కంబళ్లు, జీర్ణవస్త్రములు, ఎముకలు, ఇనుము, సీసము, కట్టెలు, కల్లు, సారాయి, నల్లమందు పశువులు, గేదెలు, అల్యూమినము, వేరుశనగ, పసుపు, ఎరువులధరలు పెరుగును. ఆహార ధాన్యములకు కంట్రోలు ఏర్పడును. రాజకీయ వడిదుడుకు లధికము. దుర్మార్గులు (గుండాలు) ప్రబలుదురు. మతపిచ్చిచే కలహము లేర్పడును. కుత్సితస్నేహముచే మిత్రత్వబలము సంపాదించిన వారు బలవంతులను జయించెదరు. న్యాయప్రవర్తన యుండదు.

## —♦ రాజవాహన నిర్ణయము. ♦—

చైత్రశుక్ల ప్రతిపద్వ్యక్తవారేశుడు రాజు. రాజగ్రహము నను సరించి వాహనము లేర్పడును.

శ్లో॥ రవిశుక్రా గజారూఢా శనిసోమా తురంగమః
భౌమేజ్యౌ నావకశ్చైవ బుధేదోలా ప్రకీర్తితా॥

రాజు రవి శుక్రులుగా నుండు సంవత్సరమున రాజవాహనము గజము, రాజు శని చంద్రులుగా నుండునపుడు రాజవాహనము అశ్వము. రాజు కుజగురువులుగా నుండునపుడు రాజవాహనము నావయగును. రాజు బుధుడై యున్న సంవత్సరమందు రాజవాహనము ఉయ్యాలయగును.

—♦ రాజవాహన ఫలములు. ♦—

శ్లో॥ గజారూఢే వత్సరశ్చ సుభిక్షం చ ప్రజాసుఖం
వర్షాకాలే సువృష్టిశ్చ సుఖినః సర్వజంతవః॥

రాజు గజారూఢుడై యున్న సంవత్సరమున సుభిక్షక్షేమారోగ్యములచే ప్రజలు సుఖించెదరు. వర్షాకాలమున సస్యానుకూల వర్షములుండుటచే సస్యములు బాగుగా ఫలించును. సమస్త ప్రాణికోటియు సుఖసౌఖ్యముల ననుభవించును.

శ్లో॥ అశ్వారూఢే వత్సరశ్చ భూమికంపో మహాభయం
రాజానో విగ్రహైర్యాంతి వృష్టినాశో మహార్ఘతా॥

రాజు అశ్వారూఢుడై యున్న సంవత్సరమున భూకంపాద్యుపద్రవములు రాజయుద్ధము, వర్షాభావముచే పంటలు లేకుండుట, ఆహార ధాన్యముల కొఱతచే ధాన్యాదుల ధరలు పెరుగుట, దుర్భిక్షము, జనహాని, మానహాని, ధనహాని యుండును.

శ్లో॥ జనానాం భ్రమితేऽసర్వే చతుష్పాదాః ప్రపీడితాః
విఫలా సకలాధాత్రీ నౌకావాహన వత్సరే॥

రాజు నావికారూఢుడై యున్న సంవత్సరమున ప్రజా కల్లోలములు' ఆకలిబాధచే జను లల్లాడిపోవుదురు. పశువుల నష్ట మధికమగును. పంటలు నశించును. దుర్భిక్షముగా నుండును. రాజులకు యుద్ధతీవ్రతచే నావికా సంబంధమైన ఉపద్రవము లధికము. నావికలు సముద్రగర్భమున మునిగిపోవుట సంభవించును. వ్యాపారము స్తంభించియుండును. రవాణా సౌకర్యములు తగ్గియుండుటచే దుర్భిక్షము సంభవించును. ధాన్యాదుల ధరలు పెరుగును.

శ్లో॥ యస్యాబ్దే వాహనం డోలా హాహాభూతాచ మేదినీ
దుర్భిక్షం సర్వదేశేషు సంగ్రామం ఖండ ఖండయోః॥

రాజుయొక్క వాహనము ఉయ్యేలగానున్న సంవత్సరమున ప్రజాక్షోభ మధికము. ప్రపంచమ దంతటను హాహాకారములు ప్రబలమగును. ప్రపంచమం దంతటను దుర్భిక్షముండును. ఆహార ధాన్యముల కొఱత, ధాన్యాదుల ధరలు విపరీతముగా పెరుగుట యుండును. కంట్రోలు పరిస్థితులవల్ల కొంత స్వాస్థ్య మేర్పడును. ప్రపంచయుద్ధముసంభవించును. ప్రతి ఖండమునందు యుద్ధము ముమ్మరముగా జరుగుచుండును.



2. మంత్రి గ్రహ ఫలములు (మేషసంక్రమణవారేశుడు.)

—♦ మంత్రి రవి ఫలము. ♦—

శ్లో॥ రాజ్ఞా మన్యోన్యవైరిత్వ మనావృష్టిశ్చ సంగరః
అధర్మనిరతా మర్త్యా భాస్కరేऽబ్దేతు మంత్రిణి॥

రాజులకు పరస్పర శత్రుత్వము, యుద్ధములు, అధర్మబుద్ధియుకలుగును. అనావృష్టిచే పంటలు తగ్గును. ధాన్యాదుల ధరలు పెరుగును. రోగములు ప్రబలును.

శ్లో॥ సూర్యే ప్రధానే జ్వలితాధరిత్రీ క్షుధాభిభూతం జగదల్పసస్యం
మహార్ఘతా రోగభయం జనానాం యుద్ధం నృపాణా మతులం
న వృష్టిః॥

శ్లో॥ నృపభయం గదతోపిహితస్కరాన్ప్రచురధాన్యధనాదిమహీతలే
రసచయంహి సమర్ఘతమంతదారవిరమాత్యపదంహిసమాగతః॥

ఆకలిబాధలుండును. ఆహారధాన్యము లందుబాటులో నుండవు. రసవస్తువుల ధరలు, నూనెగింజలు, నూనెల ధరలు తగ్గియుండును. ధాన్యములు విద్యుచ్ఛక్తి పరికరములు, యంత్రములు, ఇనుము, ఇత్తడి, సత్తు, తగరము ధరలు బాగుగా పెరుగును. వెండి, బంగారం, ప్రత్తి మూది ధరలున్ను పెరుగును.

—♦ మంత్రి చంద్రుని ఫలము. ♦—

శ్లో॥ సోమే ప్రధానేऽభ్యుదయం వ్రజంతి
ప్రజా మహీశా బహుధా చ వృష్టిః

శాలీక్షు గోధూమ గవాం వివృద్ధి
ర్యజ్ఞక్రియాయాం నిరతా ద్విజాస్స్యుః॥ —జ్యోతిర్నిబంధే.

మంత్రి చంద్రుడగుటచే ప్రజాభ్యుదయము, రాజకీయాభ్యుదయము, రాజులకు అభివృద్ధి, సువృష్టి యుండును. పంటలు బాగుగా ఫలించును. ఆహారధాన్యములకొరత తీరును. పశువులకు ధరలు పెరుగును. పాడి పంటల సమృద్ధి యుండును. కిరసనాయిల్, పెట్రోలు ధరలు తగ్గును. నూనెగింజలు, వెన్న, నెయ్యి, పంచదార, వెండి, బంగారం ధరలు హెచ్చుధరయందు నిలబడియుండును. ద్విజాదులు ధర్మకార్యములు చేయుదురు

—♦ మంత్రి కుజుని ఫలము. ♦—

శ్లో॥ దహనప్రహరణశాంబరమరుదామయభీతి రతులాస్యాల్
క్షితితనయే మంత్రిణిసతి వృష్టి ర్మధ్యాతుయశ్చ సస్యానాం॥
—వసిష్ఠః.

మంత్రి అంగారకుడగుటచే కలహము, యుద్ధము, చోరరోగాగ్ని భయములు, వాయుపీడ ఇవి యధికమగును. వర్షము మధ్యమముగా నుండును. సస్యములకు వ్యాధులు (తెగుళ్ళు) కలుగును. ధాన్యాదులకు ధరలు పెరుగును. ధాతులోహములకు ధరలు సరసముగా నుండును.

—♦ మంత్రి బుధుని ఫలము. ♦—

శ్లో॥ మంత్రిణి శశాంకతనయే ప్రభూతవాయుర్నిరంతరంవాతి
మధ్యమఫలదా ధరణీవిభాతి సురసదృశలోకైశ్చ॥ —వసిష్ఠ

మంత్రి బుధుడగుటచే గాలి వీచును. సస్యములు మధ్యమఫలదము లనుగు. లోకము సుఖించును.

శ్లో॥ శశి సుతే శుభమంత్రి సమాగతే
స్వపతినా కురుతే మదనక్రియాం



బహుధనం బహువారి సమన్వితం
యవమసూరిచణాన్న మహార్ఘతా॥

మంత్రి బుధుడగుటచే స్త్రీలు తమ ప్రియులను సుఖపూర్వకభోగవిలాసములతో తృప్తిపర్చెదరు. ధనధాన్యసమృద్ధి యుండును. గోధుమలు, యవలు, ఆవాలు, మినుములు, సెనగలు, వేరుశనగకాయలు, ప్రత్తి, దూది, వెండి, నార, గోనెసంచులు, కాగితము, కలప. వ్యాపారవాటాలు నూనెగింజలు, నూనె వాటాల ధరలు పెరుగును.

—♦ మంత్రి గురుని ఫలము. ♦—

శ్లో॥ వివిధధాన్యయుతా ఖలు మేదినీ
ప్రచురతోయ ధనాముదితా భవేల్
నృపతయో జనపాలన తత్పరాః
సురగురు ర్యది మంత్రిపదం గతః॥ —దైవజ్ఞ రంజనే.

మంత్రి గురుడగుటచే మంచి వర్షములు మంచి పంటలు ప్రభువులు న్యాయముగ పరిపాలించుటచేత భూమండలము సుఖించును.

—♦ మంత్రి శుక్రునియొక్క ఫలము. ♦—

శ్లో॥ భృగుసుతే నను మంత్రిపదం గతే
శలభమూషక సూకర మాహిషైః
భవతి ధాన్య సమర్ఘతయాభయం
జనపదేషు జలం సరితోఽధికం॥

శుక్రుడు మంత్రి యగుటచే సస్యములకు ఈతిబాధలు, మూషక, శలభ సూకర బాధలు, గేదెలు, ఆవులకు హాని, వాటివల్లమనుజులకుభయము, ధాన్యాదుల ధరలు సరసముగా నుండును. జానపదులకు, ఆటవికులకు భయము. చెరువులు పూర్తిగా నిండునట్టి వర్షములుండును.

శ్లో॥ స్త్రీసంయోగే సదా ప్రీతిః ఫలితా ధాన్యజాతయః
భవంతిగావః సుముఖాః సువృష్టి ర్భృగుమంత్రితః॥

పురుషులు స్త్రీలోలురై యుండురు. పంటల సమృద్ధియుండును. పశువులు పాలిచ్చును. సస్యానుకూలవర్ష ముండును.

—♦ మంత్రి శని ఫలము. ♦—

శ్లో॥ మధ్యవృష్టి ర్మందసస్యం సర్వే పాపరతా నరాః
ప్రజాపీడా భవేన్నిత్యం సూర్యపుత్రేతు మంత్రిణి॥

శని మంత్రియగుటచే వర్షములు తక్కువై పంటలు తగ్గును. ప్రజలు దుర్మార్గులచే (గుండాలచే) పీడింపఁబడుదురు. చోరరోగాగ్ని బాధలు, ప్రజలు, ధన, మాన, ప్రాణహానులు కల్గియుందురు. ధాన్యాదుల ధరలు పెరుగును.

శ్లో॥ మందే ప్రధానేఽఖిల లోకపీడా
వహ్నే ర్భయం ధాన్యవినాశనం చ
రోగాభిభూతా జనతాన పశ్యే
త్సౌఖ్యం తథాస్మిన్నతిహీనవృష్టిః॥

—♦ రాజరికము మంత్రిత్వము ఒకే గ్రహమునకు
వచ్చినపుడు ఫలము. ♦—

శ్లో॥ స్వయం రాజా స్వయం మంత్రీ
యస్మిన్నబ్దే యదా భవేత్
చోరాగ్ని శస్త్రబాధైశ్చ
పీడ్యంతే భూభుజాదయః॥

రాజరికము మంత్రిత్వము ఒకే గ్రహమునకు వచ్చిన సంవత్సరమున రాజకీయ కల్లోలములు, ప్రజాక్షోభ, దుర్మార్గులు ప్రబలుట, చోర రోగాగ్నిశస్త్రభయములు. రాజులకు యుద్ధము, ధన, మాన, ప్రాణ హానులు కలుగును.

3. సేనాధిపతి ఫలములు (సింహాసంక్రమణవారేశుడు).

సేనాధిపతినే ఉత్తరహిందూస్థానవాసులు దుర్గేశుడనుటగలదు.

—♦ సేనాధిపతి రవియొక్క ఫలము. ♦—

శ్లో॥ అన్యోన్య యుద్ధం ధరణీశ్వరాణా
మల్పాంబుదా వారిధరా స్సనాతాః



రక్తాని సస్యాని ఫలంతి భూమా
సైన్యాధినాథే దివసేశ్వరస్య॥

ప్రభువుల కన్యోన్య యుద్ధములు. మేఘములు గాలితోగూడినవై స్వల్ప వృష్టి నొసంగును. ఎర్రనిధాన్యము, ఎర్రని భూములు బాగుగా ఫలించును.

—♦ సేనాధిపతి చంద్రునియొక్క ఫలము. ♦—

శ్లో॥ అతీవార్ఘ శ్చాతివర్షం అరోగా స్సుఖనోజనాః
బహుక్షీరప్రదాగావ శ్చంద్రే సైన్యాధిపే సతి॥

సేనాధిపతి చంద్రుడగుటచే ఆహారధాన్యములు, వెండి, బంగారం, పెట్రోలు, కిరసనాయిల్, వెన్న, నెయ్యి, పంచదార, నూలు, వస్త్రములు, బియ్యం ధరలు పెరుగును. మంచివర్షములుండుటచే సస్యములు బాగుగా ఫలించును. ప్రజారోగ్యముండును. పశువులు క్షీరసమృద్ధిగల్గియుండును.

—♦ సేనాధిపతి కుజునియొక్క ఫలము. ♦—

శ్లో॥ అతంకపీడా భువి సస్యనాశో
లోకా స్సమస్తా జ్వరితాభవంతి
అత్యంత యుద్ధం క్షితిపాలకానాం
సైన్యాధిపత్యే ధరణీ సుతస్య॥

శ్లో॥ అవనిజే గథనాయకతాం గతే
వివిధ దుఃఖ వియోగ సమన్వితః
జనపదేషు జనాః క్రయవిక్రయే
భయ విశేషతయా న ఫలం క్వచిత్॥

కుజుడు సేనానాయకుడగుటచే సస్యహాని, రోగభయము, ఈతిబాధలు, యుద్ధభయము కలుగును. సేనాధీశ్వరు లత్యుగ్రయుద్ధము నారంభించెదరు. ప్రజలు నానావిధములుగ దుఃఖములు వియోగములు ననుభవింతురు. వ్యాపారమునందు వడిదుడుకులు భయోత్పాతములుండును. వ్యాపారము స్తంభించియుండునట్లు ప్రజాకలహములు బొంబాయి, కలకత్తా కరాచి మొదలగు వ్యాపార ముఖ్యకేంద్రములందు సంభవించును.

—◆ సేనాధిపతి బుధునియొక్క ఫలము. ◆—

శ్లో॥ వాతాహతావారిధరాః కథం చి
ద్వర్షంతి సస్యాని తథా ఫలంతి
లోకా స్సదా పీడిత కామచారా
సైన్యాధిపత్యే ఖలు చంద్రజస్య॥

బుధుడు సేనానాయకు డగుటచే మేఘములు వాయూద్ధూతములై కష్టముచే వర్షించును. సస్యములు దానికి తగినట్లు ఫలించును. ప్రజలు కామాచారపరాయణులై యుందురు. స్వాతంత్ర్యప్రియులకు రాజకీయ బాధ లుండును.

—◆ సేనాధిపతి గురునియొక్క ఫలము. ◆—

శ్లో॥ సురగురౌ గత పేన యశోభితా
నరవరా నరపాః కరపాలితాః
గిరిషువై నగరేషు సమం సుఖం
సుఖమతి ద్విజశస్త్రవతాం విశాం॥

గురుడు సేనాధిపతియగుటచే ప్రజలు, రాజులు న్యాయవర్తనులై యుందురు. ప్రజాభీష్ట పాలన యేర్పడును. ఆటవిక జనులు, నగరవాసులు, గ్రామవాసులు సుఖముగ జీవించెదరు. బ్రాహ్మ క్షత్రియ వైశ్యులకు సుఖము. తదితర జాతుల కల్పసుఖ ముండును.

—◆ సేనాధిపతి శుక్రునియొక్క ఫలము. ◆—

శ్లో॥ సువృష్టి రత్యంత సమృద్ధ సస్యం
సుభిక్ష మర్ఘో బహుళో ధరిత్ర్యాం
నరాః స్త్రియా కామరతాః ప్రమత్తాః
సైన్యాధిపత్యే ఖలు భార్గవస్య॥

సేనాధిపతి శుక్రుడగుటచే సువృష్టి, సస్యసమృద్ధి, సుభిక్షము. ధాన్యాదులకు న్యాయమగు ధరలుండును. వస్త్రములు, దూది, నూలు, వ్యాపార వాటాల ధరలు, వెండి, బంగారం, నూనె ధరలు పెరిగియే యుండును.



స్త్రీపురుషులు కామాసక్తులై మదించియుందురు. దుర్మార్గులు స్త్రీలకు ధనమానప్రాణహానిని కలుగజేయుదురు.

—◆ సేనాధిపతి శని ఫలము. ◆—

శ్లో॥ సేనాధిపే సూర్యసుతే ధరిత్ర్యాం
సేనావిముక్తా స్సతతం నరేంద్రాః
అధర్మయుక్తా స్సతతం ప్రజాశ్చ
కృష్ణాని ధాన్యాని ఫలంతి భూమౌ॥
శ్లో॥ రవిసుతే గతపాలిని విగ్రహో
సకల దేశ గతాశ్చలితాజనాః
వివిధవైరి విశేషిత నాగరాః
కృషిధనం నలభే ద్భువి కశ్చన॥

సేనాధిపతి శని యగుటచే రాజులకు యుద్ధమందు సైన్యములు నశించును. ప్రజ లన్యాయపరులు. నల్లని ధాన్యములు, నల్లని భూములు బాగుగా ఫలించును. యుద్ధతీవ్రతచే సకల దేశవాసులు చలించెదరు. నానావిధముల భయ ముండును, వ్యాపార వడిదుడుకులు. రవాణా సౌకర్యములు తగ్గియుండుటచే ధాన్యాదుల ధరలు పెరిగియుండును. కొన్ని ప్రదేశములందు ధరలు తగ్గియుండును. రాజకీయ వడిదుడుకులు, కంట్రోలు మొదలగు కట్టుబాట్లుండును. ఒకానొక సమయమున రాజులు పరాజితులై తమ సైన్యమును శత్రువుల కప్పగించి పోయెదరు.

4. సస్యాధిపతి ఫలములు (కటక సంక్రమణవారేశుడు.)

కటక సంక్రమణవారేశునే పూర్వసస్యాధిపతి యనుటయుగలదు.

—◆ సస్యాధిపతి రవి ఫలము. ◆—

శ్లో॥ సస్యాధీశే భాస్వతి విరళానిచ సర్వసస్యాని
అతివిపులం తీవ్రభయం శుకశలభచణకాది వృద్ధిస్స్యాత్॥

సూర్యుడు పూర్వసస్యాధిపతియగుటచే ఈతిబాధలచే పూర్వసస్యములు పీడింపఁబడును. ఉలవలు, శనగలు, కందులు, వేరుశనగ, ఎర్రధాన్య

ములు, మిర్చి, వక్కలు సమృద్ధిగ లభించుటచేత ధరలు తగ్గియుండును. తక్కిన ధాన్యములకు ధర లుండును. వెండి, బంగారం ధరలో వడిదుడుకు లుండును.

—♦ సస్యాధిపతి చంద్రుని ఫలము ♦—

శ్లో॥ జలధాన్యాని సర్వాణి స్థలధాన్యాని యానిచ
వృక్షజాతి స్సుఫలితా చంద్రే సస్యాధిపేసతి॥

చంద్రుడు సస్యాధిపతి (పూర్వసస్యాధిపతి) యగుటచే జలధాన్యములు స్థలధాన్యములు అనగా మాగాణి మెట్టపంటలు బాగుగా ఫలించును. (పూర్వాపరసస్యములు ఫలించును) వృక్షజాతులు చక్కగ ఫలించును. చింతపండు, మామిడిపండ్లు, పనస, నారింజాదిఫలములు, గోధుమలు, మంచిధాన్యము, జొన్నలు, సజ్జలు, చెఱకు, ఉప్పు, తమలపాకులు మొదలగువానికి ధరలు సరసముగా నుండును.

—♦ సస్యాధిపతి కుజునియొక్క ఫలము. ♦—

శ్లో॥ రక్తశాలి ర్మహాశాలి స్తూవరీ చణకాదయః
రక్తభూమి స్సుఫలితా భౌమే ధాన్యాధిపే సతి॥

సస్యాధిపతి (పూర్వసస్యాధిపతి) కుజుడగుటచే కందులు, మిర్చి, వేరుశనగ, ఎర్రని ధాన్యములు, ఎర్రని భూములు, పెద్దధాన్యములు బాగుగా ఫలించును. అనఁగా మెట్టధాన్యములు బాగుగా ఫలించును. మాగాణి పంటలు మధ్యమ ఫలదములు.

—♦ సస్యాధిపతి బుధుని ఫలము ♦—

శ్లో॥ శశి తనయే సస్యపతౌ త్వపరం
ధాన్యం ప్రభూతఫలదం
అనిలహతం సస్యచయం
త్వితి మధ్యమవృష్టి సంపన్నం॥ —వసిష్ఠః

బుధుడు పూర్వసస్యాధిపతియగుటచే పూర్వసస్యములకు వాయుపీడలు, ఈతిబాధలు, తెగుళ్లు ఏర్పడును. అల్పవృష్టి, అపర సస్యములుబాగుగా ఫలించును. నెయ్యి, నూనెగింజలు, నూనెలు, రసాయనికపు ఎరువులు,



ప్రత్తి, కలప, దూది, నూలు, వస్త్రములు, నార, పసుపు, గోనెసంచులు వ్యాపార వాటాలు, కాగితము, పెసలు, వెన్న, వెండి, బంగారముల ధరలు హెచ్చుగనే యుండును.

శ్లో॥ మధ్యావృష్టి స్ససస్య మల్పం
మేఘావాతేన పీడితాః
త్రాస స్సర్వ నరాణాం స్యా
ద్బుధే సస్యాధిపే సతి॥

మధ్యమ వృష్టి. పంట తక్కువ. ప్రజలకు భీతి అధికము. మబ్బులు గాలిచే పోవుచుండును. తెల్లని భూములు తెల్ల ధాన్యములు బాగుగా ఫలించును.

—♦ సస్యాధిపతి గురునియొక్క ఫలము. ♦—

శ్లో॥ యవగోధూమచణకాః ఫలితాస్సుర్మహీతలే
పీతధాత్రీ సుఫలితా గురౌ సస్యాధిపే సతి॥

పూర్వసస్యాధిపతి గురుడగుటచే పచ్చనిభూములు, పచ్చని ధాన్యము బాగుగా ఫలించును. యవలు, గోధుమలు, సెనగలు, పచ్చజొన్నలు, పెసలు, ఉలవలు బాగుగా ఫలించును. ప్రత్తి, చర్మము, వెండి, బంగారము, వేరుశనగపప్పు, తగరం, రబ్బరు, బ్యాంకువ్యాపార వాటాలు, వస్త్రముల ధరలు తగ్గును.

—♦ సస్యాధిపతి శుక్రునియొక్క ఫలము. ♦—

శ్లో॥ శుక్రసస్యాధిపత్యేన ఫలితా ధాన్యజాతయః
పాండుభూమి స్సుఫలితా సర్వత్రారోగ్య సంపదః॥

శుక్రుడు సస్యాధిపతి (పూర్వసస్యాధిపతి) యగుటచేత సమస్త ధాన్యములందు విశేషముగా తెల్లధాన్యము, తెల్లనిభూములు బాగుగా ఫలించును. దేశమందంతట సుభిక్షక్షేమారోగ్యసంపద లుండును. సమస్త ధాన్యములు, సమస్త వస్తువుల ధరలు సరసమై యుండును.

—♦ సస్యాధిపతి శనియొక్క ఫలము. ♦—

శ్లో॥ తిలమాషకులుత్థాది కృష్ణధాన్యాని యానిచ
కృష్ణభూమి స్సుఫలితా మందే సస్యాధిపే సతి॥

పూర్వసస్యాధిపతి శనియగుటచే నల్లని ధాన్యములు, నల్లనిభూమియు బాగుగ ఫలించును. నువ్వులు, మినుములు, అవిసెలు, నల్లధాన్యములు ఉలవలు, చింతపండు, పొగాకు, చర్మములు, ఇనుము, యంత్ర పరికరములు, కట్టెలు, బొగ్గు ధరలు సరసమగును.

5. ధాన్యాధిపతి ఫలములు (ధనుస్సంక్రమణవారేశుడు)

ధనుస్సంక్రమణవారేశునే అపర సస్యాధిపతి యనుటయు గలదు

—♦ ధాన్యాధిపతి రవి ఫలము. ♦—

శ్లో॥ మధ్యవృష్టిః ఫలం స్వల్ప మనర్ఘశ్చ మహద్భయం
రక్తసస్యాని జాయంతే సూర్యేధాన్యాధిపే సతి॥

సూర్యుడు (అపర సస్యాధిపతి) ధాన్యాధిపతియగుటచేత వర్షములు పంటలు తక్కువ. రాజకీయ వత్తిడిచే కంట్రోలు పరిస్థితిఏర్పడి ధాన్యాదుల ధరలు సరసముగా నుండును. ఒకానొకసమయమందు ధాన్యములకు ధరలు పెరిగి నిలబడును. రాజకీయ వడిదుడుకులు, గుండాలవల్ల ప్రజలకు భయ మధికమగును. మిర్చి, కందులు, ఉలవలు, వేరుశనగలు బాగుగా ఫలించును మిగతా అపరధాన్యములు మధ్యమ ఫలదములు. కొబ్బరికాయలు, మామిడి, పనస, అరటి, నారంజాది ఫలముల ధరలు సరసమగును, వెండి, బంగారం ధరలు పెరిగి నిలబడియుండును.

—♦ ధాన్యాధిపతి చంద్రునియొక్క ఫలము. ♦—

శ్లో॥ బహుక్షీరప్రదాగావ స్సర్వే వ్యాధి వివర్జితాః
సుభిక్షం చ మహద్వర్షం చంద్రే ధాన్యాధిపే సతి।

చంద్రుడు (అపర సస్యాధిపతి) ధాన్యాధిపతి యగుటచే గోవులు బహుక్షీరదములు. ప్రజ లారోగ్యవంతులు. సుభిక్షము. గొప్ప వర్షములు కలుగును. వెన్న, నెయ్యి, పాలు, పెరుగు, మజ్జిగ, వెండి, బంగారం, బియ్యం, చెఱకు, పంచదార ధరలు సరసమై యుండును.

—♦ ధాన్యాధిపతి కుజునియొక్క ఫలము. ♦—

శ్లో॥ ఫలంతి నూకధాన్యాని శింబిధాన్యాని యానిచ
రక్తభూమి స్సుఫలితా భౌమే ధాన్యాధిపే సతి॥



ముల్లుగల ధాన్యములు, కందులు, బొబ్బర్లు, మిర్చి, వేరుశనగ, ఎర్రని ధాన్యములు. ఎర్రని భూములు ఫలించును. "శాలీక్షు ఘృతతైలాది మహార్ఘాణి భవంతి చ" అనుటచేత మంచి ధాన్యమునకు, చెఱకు, బెల్లం, పంచదార, నెయ్యి, నూనెగింజలు, నూనెలు, వేరుశనగ, ఆముదము ధరలు పెరుగును. అపరధాన్యములకును ధర లుండును.

—♦ ధాన్యాధిపతి బుధునియొక్క ఫలము. ♦—

శ్లో॥ మధ్యవృష్టి ర్మందసస్యం మేఘావాతేన పీడితాః
త్రాస స్సర్వ నరాణాం చ బుధే ధాన్యాధిపే సతి॥

బుధుడు (అపర) ధాన్యాధిపతియగుటచే మధ్యమవర్షము. సస్యఫలము మధ్యమము. సామాన్యముగ మబ్బులు గాలిచే పోవుటయుండును. సమస్త జనులకు భయము కలుగును. తుపానుగాలి వీచు ననుటయు గలదు.

—♦ ధాన్యాధిపతి గురునియొక్క ఫలము. ♦—

శ్లో॥ సువృష్టి స్సర్వదేశేషు సర్వసస్య సమృద్ధయః
భవంతిగావ స్సుదుఘాః గురౌ ధాన్యాధిపే సతి॥

గురుడు (అపర) ధాన్యాధిపతియగుటచే దేశమందంతటను సువృష్టి పాడి పంటల సమృద్ధియు కలుగును.

—♦ ధాన్యాధిపతి శుక్రునియొక్క ఫలము. ♦—

శ్లో॥ అతివృష్టి స్సుభిక్షం చ ఫలితా సస్యజాతయః
మానవానీ రుజ స్సర్వే ధాన్యాధీశే భృగోస్సుతే॥

శుక్రుడు (అపర) ధాన్యాధిపతియగుటచే అతివృష్టి, సుభిక్షము, మంచి పంటలు ప్రజల కారోగ్యము కలుగును.

—♦ ధాన్యాధిపతి శనియొక్క ఫలము. ♦—

శ్లో॥ కృష్ణధాన్యాని సర్వాణి సూక్ష్మధాన్యాని యానిచ
కృష్ణభూమి స్సుఫలితా ధాన్యాధీశే శనైశ్చరే॥

శని (అపర) ధాన్యాధిపతి యగుటచే మినుములు, నువ్వులు, అవిసెలు, కృష్ణకాటుకలు మొదలగు నల్లధాన్యములున్ను నల్లావాలు మొదలగు సూక్ష్మధాన్యములును, నల్లభూమియు బాగుగా ఫలించును.

6. అర్ఘాధిపతి ఫలములు (మిథునసంక్రమణవాసరేశుడు.)

—♦ అర్ఘాధిపతి రవియొక్క ఫలము. ♦—

శ్లో॥ అల్పవృష్టి రనర్ఘశ్చ క్షుద్భయం సమరాద్భయం
రక్తధాన్య వివృద్ధిశ్చ సూర్యే ర్ఘాధిపతౌ యది॥

వర్షము తక్కువ ధరలు హెచ్చు. ప్రజలకు ఆకలి బాధ, యుద్ధభయము, గుండాలవల్ల భయము, రాజకీయ వడిదుడుకులు, ఎఱ్ఱధాన్యములకు వృద్ధియు కలుగును. వెండి, బంగారము ధరలు హెచ్చుగనే యుండును. వేరుశనగకాయలు, నూనెలు, కొబ్బరికాయలు, మిర్చి, మిరియాలు, వక్కలు, ఎర్రనిరంగులు, ముదుకనూలువస్త్రములు, ఎఱ్ఱనిధాన్యములు, గులాబిరంగులు మొదలగువాని ధరలు హెచ్చు. రాజకీయ పరివర్తన పరిస్థితులుండును.

—♦ అర్ఘాధిపతి చంద్రునియొక్క ఫలము. ♦—

శ్లో॥ సువృష్టి స్సర్వసస్యానా మభివృద్ధిః ప్రజాయతే
మహతీ చార్ఘవృద్ధిస్స్యా దర్ఘాధీశే నిశాకరే॥

అర్ఘాధిపతి చంద్రుడగుటచే సువృష్టి, సస్యాభివృద్ధియు కలుగును. అర్ఘవృద్ధి యధికమగును. తేనె, రసము, ఉప్పు, మణులు, శంఖములు, ముత్యములు, చేపలు, గోధుమలు, ఆహారధాన్యములు, వస్త్రములు, జొన్నలు సజ్జలు, పంచదార, బెల్లం, కిరసనాయిలు, పెట్రోలు ధరలు గాక మిగతా నూనెల ధరలు, నెయ్యి, వెన్న, పెరుగు, పాలు, తమలపాకులు బియ్యం, మజ్జిగ, సన్నని వస్త్రములు, వెండి, బంగారము ధరలు హెచ్చుగనే యుండును.



—♦ అర్ఘాధిపతి కుజునియొక్క ఫలము. ♦—

శ్లో॥ అర్ఘాధీశే భౌమే భూపానాం భూరిభీతిదం యుద్ధం
కృషివణ్య గవాం హాని ర్లోహిత ధాన్యార్ఘవృద్ధిస్స్యాత్॥

యుద్ధభయము, వర్తక వ్యవసాయములకు హాని, పశుహాని, ఎఱ్ఱధాన్యములకు ధర లధికమగును. వెండి, బంగారము, కందులు, మిర్చి, వేరుశనగ, ఇనుము, ఉక్కు, రాగి, సీసము, ఇత్తడి, సత్తు మొదలగువానికి ధరలు పెరుగును.

—♦ అర్ఘాధిపతి బుధునియొక్క ఫలము. ♦—

శ్లో॥ అర్ఘాధినాథే రజనీకరాత్మజే
వృష్టర్ఘక సస్యాని బహూనిచస్యుః
కౌమార పాషండ జనేంద్రజాలికా
ప్రభూతదోషాన తథా పరే జనాః॥

మంచి వర్షములు, ధరలు బాగుండును. మంచి పంటలు కలుగును. పాషండులు, ఇంద్రజాలికులు, యువకులు దుష్టులయ్యెదరు. నెయ్యి, వెన్న, పాలు, పెరుగు, అపరధాన్యములు, వెండి, బంగారము, వేరుశనగ, నూనెగింజలు, ప్రత్తి, నూలు, నార, గోనెసంచులు, పసుపు, కలప, కాగితము, వ్యాపార వాటాలు, కాఫీగింజలు, దూది ధరలు పెరుగును.

—♦ అర్ఘాధిపతి గురునియొక్క ఫలము. ♦—

శ్లో॥ సువృష్టిభి ర్ధాన్యధనై ర్విరాజితా
భూమి ర్మహాయజ్ఞ వరై ర్మహీసురైః
నిత్యోత్సవై ర్మంగళతూర్యనిస్వనై
రర్ఘాధిపే దేవగురౌచ శశ్వత్॥

గురు డర్ఘాధిపతి యగుటచే సువృష్టి, ధనధాన్యసమృద్ధి, యజ్ఞాదికర్మల యందు బ్రాహ్మణులకు శ్రద్ధ ప్రపంచమునందు ఉత్సవములు, శుభకార్యములు అధికమగును.

—♦ అర్ఘాధిపతి శుక్రుని ఫలము. ♦—

శ్లో॥ అర్ఘాధిపో యదా శుక్ర స్సర్వధాన్యార్ఘ వృష్టయః
శ్వేతధాన్యం సుఫలితం సుభిక్షం స్యాచ్చ భూతలే॥

సర్వధాన్యములు, వాటి ధరలు, వర్షములు అనుకూలముగా నుండును. అందు తెల్లధాన్యము బాగుగ ఫలించును. సుభిక్షము కలుగును. ఆహార ధాన్యములు, బియ్యం, పట్టు, రాగి, వస్త్రములు, దూది ధరలు, వ్యాపార వాటాలు అనుకూల ధరలు కలిగియుండును.

—♦ అర్ఘాధిపతి శని ఫలము. ♦—

శ్లో॥ వృష్టిస్తు మధ్యార్ఘపతౌ శనౌ చే
దాతంక చోరాగ్నియుతా మహీస్యాత్
భయం భవేదన్న సమృద్ధి రల్పా
కృష్ణాని ధాన్యాని ఫలంతి భూమౌ॥

వర్షము సామాన్యము. దొంగలు, అగ్ని రోగములు పీడించును. ఆహార ధాన్యముల కొరత ఏర్పడును. రాజకీయ వడిదుడుకులు, ప్రజాక్షోభ ముండును. నల్లని భూములు, నల్లధాన్యములు, నువ్వులు, మినుములు, బొగ్గు, సీసం, చర్మములు, ఇనుము, తారు, నల్లమందు, నల్లఅవిసెలు, నల్లావాలకు ధరలు సరసమగును.

7. మేఘాధిపతిఫలములు (ఆర్ద్రాప్రవేశకాలిక వారేశుడు.)

—♦ మేఘాధిపతి రవి ఫలము. ♦—

శ్లో॥ మహద్భయం ఫలం స్వల్పం వర్షంస్యాత్ఖండశః క్షితౌ
రక్తసస్యం సుఫలితం సూర్యే మేఘాధిపే సతి॥

ఖండవృష్టి పంట తక్కువ. ఎర్రని భూములు, ఎర్రని ధాన్యములు బాగుగా ఫలించును. ప్రజలు భయపడుచుండెదరు.

—♦ మేఘాధిపతి చంద్రుని ఫలము. ♦—

శ్లో॥ సువృష్టి స్సర్వదేశేషు ఫలితా ధాన్యజాతయః
బహుక్షీర ప్రదాగావో మేఘాధీశే నిశాకరే॥



సర్వదేశములందు సువృష్టి. ధాన్యజాతులన్నియు ఫలించును. గోవులు విశేషముగ పాలిచ్చును.

—♦ మేఘాధిపతి కుజునియొక్క ఫలము. ♦—

శ్లో॥ అతివాయు రనర్ఘశ్చ స్వల్పవృష్టి స్తథాభువి
రక్తసస్యాని జాయంతే భౌమే మేఘాధిపే సతి॥

అల్పవృష్టి. గాలి యధికము. ధరలు హెచ్చు తగ్గు లధికమై యుండును. ఎర్రని ధాన్యములు బాగుగా ఫలించును.

—♦ మేఘాధిపతి బుధునియొక్క ఫలము. ♦—

శ్లో॥ గర్జితాశనిపాషాణ వాతయుక్తాః పయోధరాః
మధ్యదేశే మహద్వర్షం బుధే మేఘాధిపే సతి॥

మేఘములకు ఉరుములు, పిడుగులు, గాలిరాళ్ళు అధికము. (వడగండ్ల వాన లుండును.) మధ్యదేశమున అత్యధిక వర్షములు.

—♦ మేఘాధిపతి గురునియొక్క ఫలము. ♦—

శ్లో॥ సస్యార్ఘవృద్ధిభిస్తుష్టా భవేద్ధాత్రీ నిరంతరం
వీతరోగ భయా స్సర్వే మేఘాధీశే బృహస్పతౌ॥

సస్యసమృద్ధిచే ధరలు తగ్గుట, కొన్నిచోట్ల ధరలు పెరుగుట యుండును. ప్రజలు రోగభయములేక సుఖసౌఖ్యముల ననుభవించెదరు.

—♦ మేఘాధిపతి శుక్రునియొక్క ఫలము. ♦—

శ్లో॥ అతివృష్టి స్సుభిక్షం చ సస్యవృద్ధి ర్నిరామయాః
క్షీరప్రదా స్సదాగావ శ్శుక్రే మేఘాధిపే సతి॥

అతివృష్టి, సుభిక్షము, సస్యవృద్ధి, ప్రజలు ఆరోగ్యవంతులై యుందురు. గోవులు వ్యాధులు లేక పాల నిచ్చును.

—♦ మేఘాధిపతి శనియొక్క ఫలము. ♦—

శ్లో॥ నక్వాపి వృష్టి ర్ధరణీశ్వరాణాం
కోశోఽల్పకః శీతభయం క్వచిచ్చ

అభూరిధాన్యం ప్రచురామయశ్చ
మేఘాధిపో యత్రి రవే స్సుతస్స్యాత్॥
వర్ష ప్రతిబంధకము, రాజులకు ధనాభావము, చలి బాధలు, ప్రజలకు చలి జ్వరములు, ఆహారధాన్యముల కొరత, వ్యాధులు ప్రబలుటయు కలుగును.

8. రసాధిపతి ఫలములు (తులాసంక్రమణవారేశుడు.)

—♦ రసాధిపతి రవి ఫలము. ♦—

శ్లో॥ ఘృతం తైలం గుడం క్షౌద్రం యేచాన్యే రసజాతయః
యాంతిశూన్యార్ఘ్యతాం సర్వే సూర్యోయది రసాధిపః॥
నెయ్యి, నూనె, బెల్లం, తేనె మొదలగు రసవస్తువులకు ధరలు పెరుగును. (వేరుశనగనూనె, కొబ్బరినూనె, ఆముదం, అవిసెనూనె,నువ్వుల నూనెలకు, చింతపండు, నిమ్మ, నారింజ, మామిడి పండ్లకు ధరలు పెరుగును.) "కార్పాస తైలేక్షు గుడాదికానాం" అను పాఠాంతరము గలదు.

—♦ రసాధిపతి చంద్రుని ఫలము. ♦

శ్లో॥ ఘృతతైలగుడక్షౌద్ర పయాంసి దధిశర్కరాః
అర్ఘవృద్ధ్యా ప్రజాయేత చంద్రోయది రసాధిపః॥
నెయ్యి, నూనెగింజలు, కొబ్బరినూనె, వేరుశనగనూనె, ఆముదము, అవిసెనూనె, నువ్వులనూనె, కిర్సనాయిలు, పెట్రోలు మొదలగునూనెలకు, బెల్లం, చెఱకు, తేనె, పాలు, పెరుగు, పంచదార, చింతపండు, నారింజాది ఊరుగాయలకు ధరలు పెరుగును.

—♦ రసాధిపతి కుజునియొక్క ఫలము. ♦—

శ్లో॥ సువర్ణరూప్యాది నిగూఢభావం ప్రయాతికీలాలమతీవతుచ్ఛం
మధ్వాజ్యపూగాది మహార్ఘయుక్తం రసాధినాథే యదిభూమిజస్స్యాత్॥

శ్లో॥ జీరకాలవణం సర్పిస్తిల తైల గుడాదయః
శూన్యార్ఘ్యం యాంతితే సర్వే భౌమోయది రసాధిపః॥



జీలకఱ్ఱ, ఉప్పు, నెయ్యి, నువ్వులనూనె, బెల్లం మొదలగు రసవస్తువులు (శూన్యార్ఘ్యం=వెలలేనివి = అనగా అత్యధిక ధరలు గలవని ధ్వనితము) ధరలు గలిగియుండును. "శూన్యార్ఘ్యం" అని యుండుటచేత ధరలు తగ్గునని చెప్పుట గలదు కాని యిచ్చట కేవల పదముయొక్క అర్థమునే జాగ్రతగా విచారించి గ్రహించుట మేలు. వెండి, బంగారము, వక్కలకు ధరలుండును. కల్లు, సారాయి, బ్రాంది, విస్కీ మొదలగు మత్తుపదార్థములకు ధరలు పెరుగును.

—♦ రసాధిపతి బుధునియొక్క ఫలము. ♦—

శ్లో॥ శశితనయే రసనాథే
పిప్పలీ శుంఠీ చ హింగు లశునాని
ఘృతతైలాద్యపి నిఖిలం
దుర్లభ మిక్షూద్భవం సకలం॥
పిప్పళ్ళు, శొంఠి, అల్లము, మిరియాలు, ఇంగువ, ఉల్లిపాయలు, నెయ్యి, నూనెలు, చెఱకు, బెల్లం, పంచదార మొదలగు వస్తువులకు ధరలు పెరుగును. వేరుశనగపప్పు, కొబ్బరికాయలు, ఆముదాలు, నువ్వులు, అవిసెలు మొదలగు నూనెగింజలకు ధరలు పెరుగును.

—♦ రసాధిపతి గురునియొక్క ఫలము. ♦—

శ్లో॥ చామీకరంస్యాత్సులభం తథాజ్యం
కౌశేయ కార్పాస గుడాంబరాణి
సుఖే నలభ్యాన్యతివారివృష్టి
ర్యదా సురేజ్యో రసనాయకస్స్యాత్॥
బంగారము, వెండి, నెయ్యి పట్టు, ప్రత్తి, బెల్లం, పంచదార, చెఱకు, వస్త్రములకు ధరలు తగ్గి ప్రజల కందుబాటులో నుండును. అత్యధిక వర్ష ముండును. పాడిపంటల సమృద్ధి కలుగును.

—♦ రసాధిపతి శుక్రునియొక్క ఫలము. ♦—

శ్లో॥ సుగంధవస్తూ నిసితే రసేశే
నిర్గంధవస్తూ నిరసాదికాని

క్షారాణి సర్వాణి చ కందమూల
ఫలాని పుష్పాణి బహూనిచస్యుః॥

కుంకుమపువ్వు, కర్పూరము, అగరువస్తువులు, చందనము, అత్తరు, సెంటు, పన్నీరు, చందనము మొదలగు సుగంధద్రవ్యములు, పాదరసము వంటి నిర్గంధవస్తువులు, క్షారములు, ఉప్పు, రసాయన పదార్థములు, పసుపు, బంగాళాదుంపలు, కందమూలాదులు, పండ్లు, పుష్పములు ఎక్కువగా లభించును. అనగా వీటి ధరలు తగ్గియుండును. ఉత్పత్తి పెరుగునని గ్రహించవలెను.

కించ॥ శ్లో॥ గవాం వివృద్ధి ర్లవణేక్షులాక్షా
కాంస్యాతసీ వస్త్రఘృతాదికానాం
సమర్ఘతాతీవ జలస్య వృష్టి
రసాధిపో యత్ర చ దైత్యమంత్రీ॥
—జ్యోతిర్నిబంధే.

పశువులకు గోవులకు వృద్ధి. ఉప్పు, చెఱకు, పంచదార, లక్క, కంచు, ఇత్తడి వస్త్రములు, నెయ్యి, వెన్న, పాలు, నూనెగింజలకు ధరలు సరసము. అత్యధిక వర్షములుండును.

—♦ రసాధిపతి శనియొక్క ఫలము. ♦—

శ్లో॥ తిలమాషకుళుత్థాది కృష్ణధాన్యాని యా నిచ
కృష్ణభూమిశ్చ ఫలితా మందే సతి రసాధిపే॥

నువ్వులు, మినుములు, ఉలవలు మొదలగు నల్లధాన్యములును, నల్లని భూమియు ఫలించును.

శ్లో॥ నీలీగజోర్ణా పటలోహజాతం
సమర్ఘతామేతి రసా మహార్ఘాః
బలారి రల్పం సలిలం దదాతి
రసాధినాథేఽర్కసుతే యదా స్యాత్॥ —జ్యోతిర్నిబంధే

నీలిమందు, ఏనుగులు, ఉన్ని, పట్టు, వెండి, బంగారం, కంచు,పట్టువస్త్రములు, ధావళీలు, ఉన్నిశాలువలు మొదలగు వస్తువుల ధరలు సరసము. రసవస్తువుల ధరలు పడిపోవును. అల్పవృష్టియు కలుగును.



## 9. నీరసాధిప ఫలములు (మకర సంక్రమణ వారేశుడు)

—♦ నీరసాధిపతి రవియొక్క ఫలము ♦—

శ్లో॥ మణిరత్న గంధ నివహాస్తామ్ర స్వర్ణాది ధాతవోఽనర్ఘాః।
దివస కరే నీరస పేరాష్ట్ర క్షోభశ్చ జనవినాశస్స్యాత్॥

సూర్యుడు నీరసాధిపతిగా వున్న రత్నములు మణులు చందనము వెండి, బంగారం, రాగి మొదలగు ధాతులోహములకు ధరలు పెరుగును. జనహాని రాష్ట్రమం దన్యోన్య కలహములు కలుగును.

కించ॥ శ్లో॥ నీరసాధిపతౌ సూర్యే త్రపు చందన యోరపి।
రత్న మాణిక్య ముక్తా దే రర్ఘ వృద్ధిః ప్రజాయతే॥
—దైవజ్ఞరంజనే

సీసము, చందనము, రత్నములు, మాణిక్యము, ముత్యములకు ధరలు తగ్గును ఉత్పత్తి అధికమగునని తెలియవలెను.

—♦ నీరసాధిపతి చంద్రునియొక్క ఫలము ♦—

శ్లో॥ ముక్తాఫలం రత్న సువర్ణ రౌప్య
కాంస్యాది వస్త్రాభరణాని శశ్వత్
వృద్ధింగతా న్యాసుభవంతి లోకే
చంద్రోయదా నీరస నాయకస్స్యాత్॥

ముత్యములు రత్నములు, బంగారం, వెండి, కంచు మొదలగు లోహములు, వస్త్రములు, అలంకార వస్తువుల ఉత్పత్తి యధికమగుటచే ధరలు తగ్గి ప్రజలకు సులభముగా లభించును.

—♦ నీరసాధిపతి కుజునియొక్క ఫలము ♦—

శ్లో॥ నీరస పేక్షితి తనయే నీరస వృక్షా స్సుపుష్ప ఫలసహితాః
స్వర్ణ మణి రక్తచందన కాష్ఠాదీనాం మహార్ఘతానూనం॥

పుష్పవృక్షములు, ఫలవృక్షములు ఫలపుష్పాదులతో గూడియుండును. బంగారం, మణులు, రక్తచందనము, కట్టెలు వీటికి ధరలు హెచ్చు తగ్గు లధికమై తగ్గియుండును. మిర్చి, పొగాకు, ఇనుము, ఉక్కు

యంత్ర పరికరములు, రాగి, ఇత్తడి, కంచు మొదలగువాని ధరలు పెరిగి నిలబడును. అపర ధాన్యముల ధరలు హెచ్చును. ధాన్యము, బియ్యం ధరలు కంట్రోలువల్ల తగ్గియుండును.

♦— నీరసాధిపతి బుధునియొక్క ఫలము ♦—

శ్లో॥ చిత్రవస్త్రాదికం చైవ శంఖ చందన పూర్వకం
అర్ఘవృద్ధిః ప్రజాయేత నీరసేశో బుధోయది॥

చిత్రవస్త్రములు, అద్దకంగుడ్డలు, శంఖములు, చందనము సుగంధద్రవ్యముల ధరలు కొంతతగ్గి నిలబడియుండును.

— ♦నీరసాధిపతి గురునియొక్క ఫలము ♦—

శ్లో॥ పూగీఫలా న్యఖిల రత్న సువర్ణ ధాన్య
కార్పాస చర్మ కుసుమానిచ చందనంచ
వృద్ధిం యయుర్ద్వి జగణా స్సుఖినో భవంతి
భూమాచ నీరసపతౌ సురరాజపూజ్యే॥

వక్కలు, సమస్తమణులు, రత్నములు, బంగారం, వెండి, ధాన్యము, ప్రత్తి చర్మములు, పూలు, సుగంధవస్తువులు, చందనము మొదలగువానికి ఉత్పత్తి యధికమగుటచే కొంతవరకు ధరలు తగ్గియున్నను హెచ్చుగనే యుండును. బ్రహ్మవాదులు, బ్రాహ్మణులు సుఖించెదరు.

—♦ నీరసాధిపతి శుక్రునియొక్క ఫలము ♦—

శ్లో॥ కర్పూరాగరు గంధానాం హేమమౌక్తిక వాససాం
వృద్ధయోఽర్ఘేణజాయంతే శుక్రే నీరసనాయకే॥

కర్పూరము, అగరు, చందనము, బంగారం, వెండి, ముత్యములు వస్త్రములు అధిక ధరలచే లభించును.

—♦ నీరసాధిపతి శనియొక్క ఫలము ♦—

శ్లో॥ స్వర్ణ మణి రత్న మౌక్తిక చందన కర్పూర రజితనాశస్స్యాత్
రవితనయే నీరసపే లోహ త్రపు తైల వృద్ధిశ్చ॥



బంగారం, వెండి, రత్నములు ముత్యములు చందనము కర్పూరము నశించును, ఇనుము, ఇత్తడి నూనెలకు వృద్ధియుండుటచే ధర కొంత తగ్గియుండును.

—♦♦ పురోహితాది ఉపనాయక ఫల నిర్ణయము ♦♦—

శ్లో॥ క్రూర గ్రహాఫలం క్రూరం శుభ గ్రహాఫలం శుభం
పురోహితాది సర్వేషాం భవేదీశ సముద్భవమ్॥

పురోహిత, పరీక్షక, గణకాదులు క్రూరగ్రహము లగుచో క్రూరమనియు, శుభగ్రహములగుచో శుభమనియు గ్రహింపవలయును.

—♦♦ మేఘ నిర్ణయము ♦♦—

శ్లో॥ కల్యాది శకవర్షాణాం వర్తమానాబ్దసంగుణాః
వర్షధాన్యాది మేఘానాం గతవర్షాణి వర్జయేత్॥

వర్షధాన్యాది యోగములు, మేఘనిర్ణయము, వాయు, విద్యుత్ గర్జిత, సముద్ర, భూవాహక శేషుని నిర్ణయము, వేయునపుడు కలిశకము శాలివాహన శకములందు వర్తమానాబ్దముల ననుసరించియే నిర్ణయింపనగునుగాని గతాబ్దములనుబట్టి నిర్ణయింపగూడదని పై శ్లోకము స్పష్టీకరించుచున్నది. ఇట్లుగనే మావంశీకులలో సుప్రసిద్ధులగు నృసింహసిద్ధాంతి, జ్వాలాపతిసిద్ధాంతిగార్లు, వారి పరంపరలోనివారు, సుప్రసిద్ధులగు పిల్లలమఱ్ఱి పూర్ణయ్యసిద్ధాంతిగారు, వారి శిష్యపరంపరయు ప్రవర్తించియున్నారు. కొందరు గతాబ్దముల ననుసరించియే నిర్ణయించుచున్నారు. గతాబ్దములనుబట్టి పిడపర్తివారు, కుప్పావారు, వారి పరంపరలోనివారు ప్రవర్తించుచున్నారు. మేమున్ను వర్తమానాబ్దముల ననుసరించియే నిర్ణయించుచున్నాము. ఇందుకు పైశ్లోకమే ప్రమాణముగాక మాపూర్వుల ననుసరించి యున్న శిష్టాంగీకృతాచారమునై యున్నదనుట కెట్టి సందియములేదు.

ఉదాహరణ :—

సర్వధారి సంవత్సరమునకు కలిగతాబ్దములు ౫౦౪౯ వర్తమానాబ్దములు ౫౦౫౦. శక గతాబ్దములు ౧౮౭౦ వర్తమానాబ్దములు ౧౮౭౧. వర్తమానాబ్దముననుసరించి యీదిగువ వ్రాసి చూపుచున్నాను.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1871 × 8 | = 14968 | ÷ 9 = | లబ్ధము | 1663 | శేషము | 1 |
| 1872 × 8 | = 14976 | ÷ 9 = | ,, | 1664 | ,, | 0 |
| 1873 × 8 | = 14984 | ÷ 9 = | ,, | 1664 | ,, | 8 |
| 1874 × 8 | = 14992 | ÷ 9 = | ,, | 1665 | ,, | 7 |
| 1875 × 8 | = 15000 | ÷ 9 = | ,, | 1666 | ,, | 6 |
| 1876 × 8 | = 15008 | ÷ 9 = | ,, | 1667 | ,, | 5 |
| 1877 × 8 | = 15016 | ÷ 9 = | ,, | 1668 | ,, | 4 |
| 1878 × 8 | = 15024 | ÷ 9 = | ,, | 1669 | ,, | 3 |
| 1879 × 8 | = 15032 | ÷ 9 = | ,, | 1670 | ,, | 2 |
| 1880 × 8 | = 15040 | ÷ 9 = | ,, | 1671 | ,, | 1 |
| 1881 × 8 | = 15048 | ÷ 9 = | ,, | 1672 | ,, | 0 |
| 1882 × 8 | = 15056 | ÷ 9 = | ,, | 1672 | ,, | 8 |
| 1883 × 8 | = 15064 | ÷ 9 = | ,, | 1673 | ,, | 7 |
| 1884 × 8 | = 14072 | ÷ 9 = | ,, | 1674 | ,, | 6 |
| 1885 × 8 | = 15080 | ÷ 9 = | ,, | 1675 | ,, | 5 |
| 1886 × 8 | = 15088 | ÷ 9 = | ,, | 1676 | ,, | 4 |
| 1887 × 8 | = 15096 | ÷ 9 = | ,, | 1677 | ,, | 3 |
| 1888 × 8 | = 15104 | ÷ 9 = | ,, | 1678 | ,, | 2 |
| 1889 × 8 | = 15112 | ÷ 9 = | ,, | 1679 | ,, | 1 |
| 1890 × 8 | = 15120 | ÷ 9 = | ,, | 1680 | ,, | 0 |

శేషము సున్నగా యున్నపుడు 9 వ సంఖ్యగా భావించుకొని తొమ్మిదవ మేఘమును గ్రహించి ప్రవర్తింపవలెనే గాని ఆ సంవత్సరమున మేఘమే పూజ్య మనుకొనరాదు.

పై గణితమునుబట్టి చూడగా నవ మేఘములు ప్రతి సంవత్సరము ఒక్కొక్కటి తగ్గి తలక్రిందుగా వచ్చుచున్నవనుట కెట్టి సందియము లేదు.

శ్లో॥ శకాబ్దాఙ్క వసుభిర్హత్వా నవభి ర్భాజితం క్రమాత్
శేష మావర్త సంవర్త పుష్కరద్రోణ కాలకాః
నీలాఖ్యో వారుణో వాయు స్తమో మేఘా నవస్మృతాః॥



శ్లో॥ శాకేఽష్ట గుణితే నంద్రై ర్భాజితే శేషతో ఘనః
ఆవర్త ఏక శేషస్స్యా త్సంవర్తాఖ్యో ద్వి శేషకే॥
త్రిశేషే పుష్కరో ద్రోణశ్చతుః శేషే ప్రకీర్తితః
కాలనామా పంచశేషే షట్ శేషే నీలకః స్మృతః॥
వరుణః సప్త శేషేస్స్యా ద్వాయురష్టావశేషకే
నవశేషే తమోనామ క్రమా న్మేఘా నవస్మృతాః॥

వర్తమాన శాలివాహన శకాబ్దములను ఎనిమిదిచే గుణించి తొమ్మిదిచే భాగించగా వచ్చు లబ్ధమును విడిచి శేషసంఖ్యను గ్రహించవలెను. శేషసంఖ్య సున్నగా వచ్చినపుడు శేషసంఖ్యను తొమ్మిదిగా గ్రహింపవలయును. శేషసంఖ్యాక్రమము ననుసరించి (1) ఆవర్త (2) సంవర్త (3) పుష్కర (4) ద్రోణ (5) కాల (6) నీల (7) వరుణ (8) వాయు (9) తమ అను తొమ్మిది మేఘములు కల్గుచున్నది.

—♦ చతుర్మేఘ పక్షము ననుసరించి నిర్ణయము. ♦—

శ్లో॥ శాకం త్రియుక్తం విభజే చ్చతుర్భిః
శేషే భవత్యంబుపతిః క్రమేణ
ఆవర్త సంవర్తక పుష్కరాశ్చ
ద్రోణ శ్చతుర్థో మునిభిః ప్రదిష్టః॥

వర్తమాన శకాబ్దమునకు మూడు కలిపి నాల్గుచే భాగింపగా వచ్చు లబ్ధమును వదలి శేషమును గ్రహించవలెను. శేష సంఖ్యగా సున్న వచ్చునపుడు శేషసంఖ్య నాలుగుగా గ్రహించి ప్రవర్తింపవలెనేగాని ఏమియు లేదనుకొనరాదు. శేషసంఖ్యా క్రమము ననుసరించి (1) ఆవర్త (2) సంవర్త (3) పుష్కర (4) ద్రోణము లనెడు నాల్గు మేఘములు కల్గుచున్నవి.

—♦ చతుర్మేఘ ఫలములు. ♦—

శ్లో॥ ఆవర్తో వినివృష్టిః స్యా త్సంవర్తో జలపూరితః
పుష్కరో మందవృష్టిశ్చ ద్రోణో వ్వర్షతి సర్వదా॥

ఆవర్తనామక మేఘము అనావృష్టిని కలుగజేయును. సంవర్త నామక మేఘము పూర్ణవృష్టి (సువృష్టి) ని కలుగజేయును. పుష్కర నామక

మేఘము మందవృష్టి (అల్పవృష్టి)ని కలుగజేయును. ద్రోణనామక మేఘము సర్వదా వర్షమును కలుగజేయుననుట.

—♦ చతుర్మేఘ నిర్ణయోదాహరణము. ♦—

సర్వధారి సంవత్సరమునకు వర్తమాన శకాబ్దములు ౧౮౭౧.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ౧౮౭౧ | × | ౩ | = | ౧౮౭౪ | ÷ | ౪ | లబ్ధము | ౪౬౮ | శేషము | ౨ |
| ౧౮౭౨ | × | ౩ | = | ౧౮౭౫ | ÷ | ౪ | ,, | ౪౬౮ | ,, | ౩ |
| ౧౮౭౩ | × | ౩ | = | ౧౭౩౬ | ÷ | ౪ | ,, | ౪౬౯ | ,, | ౦ |
| ౧౮౭౪ | × | ౩ | = | ౧౮౭౭ | ÷ | ౪ | ,, | ౪౬౯ | ,, | ౧ |
| ౧౮౭౫ | × | ౩ | = | ౧౮౭౮ | ÷ | ౪ | ,, | ౪౬౯ | ,, | ౨ |
| ౧౮౭౬ | × | ౩ | = | ౧౮౭౯ | ÷ | ౪ | ,, | ౪౬౯ | ,, | ౩ |
| ౧౮౭౭ | × | ౩ | = | ౧౮౮౦ | ÷ | ౪ | ,, | ౪౭౦ | ,, | ౦ |
| ౧౮౭౮ | × | ౩ | = | ౧౮౮౧ | ÷ | ౪ | ,, | ౪౭౦ | ,, | ౧ |
| ౧౮౭౯ | × | ౩ | = | ౧౮౮౨ | ÷ | ౪ | ,, | ౪౭౦ | ,, | ౨ |
| ౧౮౮౦ | × | ౩ | = | ౧౮౮౩ | ÷ | ౪ | ,, | ౪౭౦ | ,, | ౩ |
| ౧౮౮౧ | × | ౩ | = | ౧౮౮౪ | ÷ | ౪ | ,, | ౪౭౧ | ,, | ౦ |
| ౧౮౮౨ | × | ౩ | = | ౧౮౮౫ | ÷ | ౪ | ,, | ౪౭౧ | ,, | ౧ |

శేషము సున్నగా వచ్చినపుడా చోట శేషసంఖ్య నాలుగు అని గ్రహించి ప్రవర్తింపవలయును.

—♦ నవమేఘ చతుర్మేఘ నిర్ణయమువల్ల సులభ పద్ధతి. ♦—

నవమేఘ నిర్ణయము :—వర్తమాన శకాబ్దములందు ౧౮౭౦ తీవిచగా వచ్చుదానిని ౯ చే భాగించినచో అభీష్టకాలమునకు మేఘము వచ్చును. తొమ్మిదికి తక్కువగా నున్నపుడా సంఖ్యాతుల్య మేఘమునే గ్రహించవలెను.

చతుర్మేఘ నిర్ణయము :—వర్తమాన శకాబ్దములందు ౧౮౬౯ తీవిచగా వచ్చుదానిని ౪ చే భాగించినచో అభీష్టకాలమునకు మేఘము వచ్చును. నాలుగు తక్కువగా నున్నపుడా సంఖ్యాతుల్య మేఘమునే గ్రహించి ప్రవర్తింపవలయును.

—♦ నవ మేఘములు పుట్టుదిశ నిర్ణయము. ♦—

శ్లో॥ ఆవర్తో మేరుశిఖరే సంవర్తశ్చోత్తరే దిశి
ఈశాన్యాం పుష్కరో మేఘః ప్రాచ్యాం ద్రోణః ప్రజాయతే



నీలమేఘ స్తథాగ్నేయే కాలమేఘస్తు దక్షిణే
నైఋత్యాం వారుణో జాతః పశ్చిమే తామసస్స్మృతః
వాయువ్యాం వాయుమేఘశ్చ జన్మస్థానాః ప్రకీర్తితాః॥

మేఘములన్నియు మేరుపర్వతము దగ్గఱ పుట్టుచున్నవి. ఇందులకు కారణము తెలియగోరువారు నాచే రచింపబడిన "వేద విజ్ఞానము" అను గ్రంథమును చూడగోరుచున్నాము.

(1) ఆవర్తనామ మేఘము మేరు శిఖరమునందు పుట్టుచున్నది (2) సంవర్తనామక మేఘము మేరుపర్వతమునకు ఉత్తరదిశయందు పుట్టుచున్నది (3) పుష్కరనామక మేఘము మేరుపర్వతమునకు ఈశాన్య దిగ్భాగమున పుట్టుచున్నది. (4) ద్రోణనామక మేఘము మేరు పర్వతమునకు తూర్పుదిశలో పుట్టుచున్నది. (5) కాలనామక మేఘము మేరువునకు దక్షిణ దిగ్భాగమున పుట్టుచున్నది. (6) నీలనామక మేఘము మేరువునకు ఆగ్నేయ దిగ్భాగమున పుట్టుచున్నది. (7) వరుణ నామక మేఘము మేరుపర్వతమునకు నైఋతి దిగ్భాగమున పుట్టుచున్నది. (8) వాయునామక మేఘము మేరువునకు వాయువ్య దిగ్భాగమున పుట్టుచున్నది. (9) తమోనామక మేఘము మేరువునకు పశ్చిమ దిగ్భాగమున పుట్టుచున్నది.

## 10. నవ మేఘ ఫలములు.

—♦ ఆవర్త మేఘఫలము. ♦—

శ్లో॥ వినాశనం శాలి యవాదికానాం
తథైవ కార్పాస ఘృతాదికానాం
ఘనో యదావర్తక నామధేయః
స్వల్పం జలం స్యాద్ధనినామపాయః॥

ఆవర్తక నామమేఘము గాన మంచి ధాన్యము, గోధుమలు, జొన్నలు, సెనగలు, ప్రత్తి, నెయ్యి, నూసెగింజలు, నూనెలు మొదలగువాని ఉత్పత్తికి హానిని కలుగజేయును. కనుక వీటికి ధరలు హెచ్చును. అల్పవృష్టి యుండును. వ్యాపారులకు, ధనవంతులకు హాని కలుగును. ఉఱుములు,

మెఱుపులు, పిడుగులతో గూడిన వర్షము లుండును. ఇంద్రధనుస్సులు కలుగును.

—♦ సంవర్త మేఘ ఫలము. ♦—

శ్లో॥ వాయుపూరితతోయం చ వర్షణం సర్వదిక్షు చ
లవణార్ణవపర్యంతం సంవర్తాభ్రస్య లక్షణం॥

గాలితో గూడిన వర్షములు సర్వదిక్కులందు కలుగును. తూర్పుతీర ప్రాంతములందు తుపాను గాలి వీచుననుట సూచితము. "ప్రాచ్యే వాయు ర్వాతి" అనుట విశేష వచనము.

—♦ పుష్కర మేఘ ఫలము ♦—

శ్లో॥ మందవృష్టి ర్మందతోయం మహావాయుః ప్రవర్తతే
లక్షణం పుష్కరాభ్రస్య సర్వమూలాని నాశయేత్॥

మేఘములు అల్పజలము గల్గియుండుటచేత స్వల్పవృష్టిని కలుగజేయును. గాలి ఎక్కువ. కందమూల ఫలాదులకు హాని. అనగా వేరు శనగ పసుపు, కంద, ఉల్లిపాయలు, బంగాళాదుంపలు. చేమదుంపలు, అల్లము, చిలకడదుంపలు, పెండలము, ముల్లంగి మొదలగు దుంప కూరలకు ధరలధికమగును.

—♦ ద్రోణ మేఘ ఫలము ♦—

శ్లో॥ నిరంతరం మహావర్షం మధ్యదేశేతథైవచ
అశుభం సర్వలోకానాం ద్రోణమేఘస్య లక్షణం॥

తూర్పు సముద్ర తీర ప్రాంతములందును. మధ్యదేశమనగా దక్కను పీఠభూమి ప్రాంతములందును మంచివర్షము లుండును. అధిక వర్షములు కలుగుటచే కలరావ్యాధులు ప్రబలును. వరదల బాధచే పంటలు నశించును.

—♦ కాలమేఘ ఫలము ♦—

శ్లో॥ కాలనామ జలదోదయే యదా
నైవవర్షతి జలం వృషా స్వయం
రోగతో వికలతా వపుష్మతాం
స్యాన్మిథః కలహతాక్షమా భృతామ్॥



కాలనామక మేఘముగాన వర్షములు దేవేంద్రుడైనను కురిపింప జాలడు అనగా అనావృష్టియోగము, స్వల్పవృష్టి యుండును. నీళ్లు లేక యిబ్బందు లధికము. స్ఫోటకాగ్ని రోగభయము లుండును. రాజులకు యుద్ధవివాదములుండును. పశువుల మేతకు గడ్డియేదొరకదు. పశువులు నష్టమగును.

—♦ నీలమేఘ ఫలము ♦—

శ్లో॥ నీలమేఘం నిరాలంబ మల్పవృష్టి రనర్ఘతా
అశోభనంచ జీవానాం నీలమేఘస్య లక్షణం॥

నీలనామక మేఘముగాన అల్పవృష్టి యుండుటచే పంటలు తగ్గును. అందుచే ధాన్యాదులకు ధరలు పెరుగును. ప్రాణికోటికి త్రాగుటకు నీరు తక్కువగును. రోగములు ప్రబలును నల్లని మేఘమగుటచే వర్షాభావ మును మాత్రము కలుగజేయదు.

—♦ వరుణ మేఘ ఫలము ♦—

శ్లో॥ వారుణో నామ మేఘోఽసౌ సముద్రాంతం ప్రవర్షతి
మహాఘోరం మహాఘాతం వర్షం వాయుసమన్వితమ్॥

వరుణనామక మేఘముగాన మంచివర్షము లుండును. కాని తూర్పు సముద్రతీర ప్రాంతములందు తుపానుగాలి వీచును. వాయు సహిత వర్షము లధికము.

—♦ వాయు మేఘ ఫలము ♦—

శ్లో॥ నైవాంబువృష్టిం కురుతే సురేశః
సమస్త ధాన్యాంబరకణ్యానాశః
ధారాధరః స్యాద్యదివాయునామా
జనప్రజ స్తర్హి విహీనధామా॥

వాయునామక మేఘముగాన దేవేంద్రుడైనను వర్షమును కురిపింప జాలడు. వర్షాభావము. సమస్తధాన్యములకు హాని సర్వసస్యములు నశించును. ప్రత్తిపంటయు నశించును. బీదవారికి నూకలుకూడా లభిం

పవు. పశువులకు గడ్డిగాదముల కొఱత ఏర్పడును. ఆకలిబాధలు. దుర్భిక్షము బీదజనులు తమతమ యిండ్లను వదలి ఆకలిబాధచే దేశదేశము లందు తిరుగుచు "అన్నమోరామచంద్రా" యనియల్లాడి పోదురు. ఆహారధాన్యములు, ప్రత్తి దూది వస్త్రముల ధరలు పెరుగును. తినుటకు తిండి, కట్టుకొనుటకు బట్ట, నివసించుటకు యిండ్లులేక కూలి బీద జనులుందురు. "అంబరం వ్యసనేవ్యోమ్ని కార్పాసేచ సుగంధిని" అను విశ్వకోశము. "కణోఽతి సూక్ష్మే ధాన్యాంశే" అను గురుబాలబోధిక వచనములు ప్రమాణము.

—♦ తామస (తమో) మేఘ ఫలము ♦—

శ్లో॥ రోగాధిక్యం జాయతే నీరశేష
  శ్చోరాధిక్యం నైవ ధాన్యస్యపోషః
  యస్మిన్ వర్షేస్యా త్తమో నామ మేఘ
  స్తస్మిన్ దుఃఖం ప్రాప్నుయాల్లోక సంఘః॥

తామస (తమోనామక) మేఘముగాన రోగములు ప్రబలును. నీళ్ళ కొఱత యుండును. వర్షములు తక్కువ. చోరులు. దుర్మార్గులు ప్రబలుదురు. ధాన్యములను కొల్లగొట్టెదరు. ఆహార ధాన్యముల కొరతయుండును. రక్షణ సకాలమున లభించదు. ప్రజలు నానావిధ కష్టనష్టములకు లోనగుదురు.

—♦ వాయుపరిమాణ నిర్ణయము ♦—

మంత్రినిబట్టి వాయువును నిర్ణయించవలెను.

శ్లో॥ చతురాఢం గురుభృగా త్రిరాఢం చంద్రిచంద్రజౌ
  ద్వ్యారాఢం రవిభౌమేచ ఆఢమేకం శనైశ్చరే॥

—♦ వర్ష ప్రమాణ నిర్ణయము. ♦—

శ్లో॥ యస్మిన్ వారాధిపో రాజా ఆఢకాధిపతి స్సచ॥
శ్లో॥ చతురాఢం గురుభృగా త్రిరాఢం చంద్ర చంద్రిజౌ
  ద్వ్యారాఢం రవి భౌమే చ ఆఢమేకం శనైశ్చరే॥

రాజు ఏ గ్రహమై యుండునో ఆ గ్రహమే ఆఢకాధిపతియగును. రాజు గురుడుగాని, శుక్రుడుగాని యగుచో నాలుగు తూముల వర్షము. రాజు



చంద్రుడు గాని, బుధుడుగాని యగుచో మూడు తూముల వర్షము. రాజు రవి గాని, కుజుడు గాని యగుచో రెండు తూముల వర్షము. రాజు శని యగుచో తూమెడు వర్షము.

"ఆసమంతాత్ ఢౌకతే గచ్ఛతీ త్యాఢకః" "ఢౌకృగత్యాం" అను గురుబాల ప్రబోధికోక్త ఉత్పత్త్యర్థముచే, తిర్యగూర్ధ్వాకారముగా నంతట వ్యాపించియుండునది ఆఢక మనబడునని గ్రహించవలయును. ఆఢకము అనగా తూమెడు అని గ్రహింపదగును.

ఆఢక ప్రమాణమును దేవమానముచే లెక్కవేయదగును. "ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే" అనుట ప్రమాణము. ఆఢక ప్రమాణము రాజగ్రహము ననుసరించి నియతముగా నుండును.

ఆఢక ప్రమాణము (వర్ష ప్రమాణము.)

వర్ష ప్రమాణము (ఆఢక ప్రమాణము) రాజునుబట్టి నియతముగా నుండును. ఎట్లనిన :—

—♦ రాజు రవియగుచో వర్షప్రమాణ విభాగములు. ♦—

శ్లో॥ షష్టియోజనవిస్తీర్ణం శతయోజన మున్నతం
  ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే॥
  నవభాగా స్సముద్రేషు భూధరేషు తథా నవ
  ద్వ్యాభాగా భువి పర్జన్య శ్చైవం వర్షతి చ త్రిధా॥

రాజు రవి యగుటచే రెండు తూముల వర్షము. "ఏకాఢకేసువృష్టిస్స్యాన్మధ్యవృష్టి ర్ద్వ్యారాఢకే। త్ర్యాఢకేతు సుభిక్షంస్యాద్ద్రోణే వృష్టిర్హి మధ్యమా" అనుటచే మధ్యమ వర్షము. సముద్రములందు 9 భాగములును, పర్వతములందు 9 భాగములును, భూమియందు రెండు భాగములును వర్షము.

—♦ రాజు చంద్రుడగుచో వర్షపరిమాణ విభాగములు. ♦—

శ్లో॥ శతయోజన విస్తీర్ణ మున్నతంతు శతద్వయం
  ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే॥
  అష్టభా స్సముద్రేషు పర్వతేషు తథా నవ
  త్రయోభాగా భువి ప్రోక్తా స్త్వేవం వర్షతి చ త్రిధా॥

రాజు చంద్రుడగుటచే మూడు తూముల వర్షము. సుభిక్షక్షేమారోగ్యములు కలుగును. సముద్రమందు ఎనిమిది భాగములను, పర్వతములందు తొమ్మిది భాగములను, భూమియందు మూడు భాగములును వర్షము.

—♦ రాజు కుజుడగుచో వర్షప్రమాణ విభాగములు. ♦—

శ్లో॥ షష్టియోజనవిస్తీర్ణం శతయోజనమున్నతం
ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే॥
నవభాగా స్సముద్రేషు పర్వతేషు తథానవ
ద్వాభాగా భువి పర్జన్య శ్చైవం వర్షతి చ త్రిధా॥

కుజుడు రాజగుటచే రెండు తూముల వర్షము. మధ్యమ వర్షము. సముద్రములందు 9 భాగములును, పర్వతములందు 9 భాగములును, భూమియందు రెండు భాగములును వర్షము.

—♦ రాజు బుధుడగుచో వర్షప్రమాణ విభాగములు. ♦—

చంద్రుడు రాజుగా నున్నపుడు వ్రాసినట్లే బుధుడు రాజుగా నున్న సంవత్సరమందు వర్ష విభాగమును వ్రాయవలయును. "విస్తారం సప్తతి శ్చైవ శతయోజన మున్నతం" అనివర్షప్రమాణమును మాత్రము వ్రాయుటలో మార్పుడు.

—♦ రాజు గురుడుగాని, శుక్రుడుగాని యగుచో
వర్షప్రమాణ విభాగములు. ♦—

శ్లో॥ అశీతి యోజనం దివ్యం విస్తీర్ణం చోన్నతం శతం
ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే
సప్తభాగా స్సముద్రేషు పర్వతేషు తథా నవ
చతుర్భాగా ధరణ్యాంస్యు రేవం వర్షతి చ త్రిధా॥

రాజు గురుడుగాని, శుక్రుడుగాని యగునపుడు ఆ సంవత్సరమున నాలుగు తూముల వర్షము. (ద్రోణ మనగా నాలుగు తూములు.) "ద్రోణే వృష్టి



ర్మ్హి మధ్యమా" అని యుండుటచే మధ్యమవర్షము. ఆఢకము దేవ మానముచే ఎనుబది యోజనముల విరివి, నూరుయోజనముల ఎత్తు గలిగి యుండును. సముద్రమందు ఏడు భాగములు, పర్వతములందు తొమ్మిది భాగములు, భూమియందు నాల్గు భాగములును వర్షము.

—♦ రాజు శని యగుచో వర్షప్రమాణ విభాగములు. ♦—

శ్లో॥ షష్టియోజన విస్తీర్ణం శతయోజన మున్నతం
ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే
దశభాగా స్సముద్రేషు పర్వతేషు తథానవ
ధరణ్యా మేకభాగస్స్యా దేవం వర్షతి చ త్రిధా॥

రాజు శని గావున యీ సంవత్సరమందు తూమెడు వర్షము. మంచి వర్షము లుండును. ఆఢకము దేవమానముచే అరువది యోజనముల విరివి, నూరు యోజనముల ఎత్తు గలిగియుండును. సముద్రమందు పది భాగములను, పర్వతములందు తొమ్మిది భాగములును, భూమియందు ఒక్కభాగము వర్షము.

—♦ ఆఢకధారుని నిర్ణయము. ♦—

ఆఢకధారులు మువ్వురు. (1) గోప (గొల్లవాడు) (2) విప్ర (బ్రాహ్మణుడు) (3) గణికా (భోగస్త్రీ; వారకాంత). స్ఫుట శనిరాశి చారమువల్ల ఆఢకధారు లెవరో కనుగొనవచ్చును. ఎట్లనిన :—

శ్లో॥ కుళీరహరికుంభోక్షభేషు సూర్యసుతశ్చరన్
ఆఢకో గణికా హస్తే మహార్ఘం సువృష్టికృత్
ఆఢకో విప్రహస్తేతుయుగ్మ కన్యా ధనుర్ఝషే
ఆఢకో గోపహస్తేతు మేషాళి మృగతౌళిషు॥

స్ఫుట శని, కటక, సింహ, కుంభ, వృషభరాసులయందు సంచరించు కాలమున ఆఢకము వేశ్య హస్తగతమై యుండును. ఆ కాలమున ధాన్యాది వస్తువుల ధర పడిపోవును. మంచి వర్షముండును. స్ఫుట శని, మిథున, కన్యా, ధనుస్సు, మీనరాసులయందు సంచరించు కాలమున

అధకము బ్రాహ్మణుని చేతిలో నుండును. స్ఫుట శని. మేష, వృశ్చిక, మకర, తులారాసులయందు సంచరించు కాలమున అధకము గొల్లవాని హస్తగతమై యుండును.

—♦ అధకధారుని వయో విభాగ నిర్ణయము. ♦—

శని మధ్యమ గతిచే ఒక్కొక్క రాశియందు సుమారు 30 నెల లుండును. ముప్పది భాగములు గలిగిన రాశియందు శని ముప్పది నెల లుండుటచే ఒక్కొక్క భాగమునకు ఒక్కొక్క మాసము అగును. ఒక రోజుకు రెండు లిప్తలు గతి గలిగియుండుననుట స్పష్టము. త్రింశద్భాగాత్మక రాశిలో మొదటి పది భాగలలో శని సంచరించునపుడు అధకధారుని వయస్సు బాల్యమనియు, రెండవ పది భాగలలో శని సంచరించునపుడు అధకధారుని వయస్సు యౌవనమనియు, మూడవ పది భాగలలో శని సంచరించునపుడు అధకధారుని వయస్సు వృద్ధాప్యమనియు గ్రహింపవలయును. ఈ విషయము చక్కగా బోధయగుటకు యీ దిగువ వివరించుచున్నాను.

| స్ఫుట శని రా. భా. లి. | రాశి పేరు | అధకధారుని పేరు | వయోదశ (ఆరంభము) |
|---|---|---|---|
| 0-0-0 | మేషము | గొల్లవాడు | బాల్యము |
| 0-10-0 | ,, | ,, | యవ్వనము |
| 0-20-0 | ,, | ,, | వృద్ధాప్యము |
| 1-0-0 | వృషభము | వేశ్య | బాల్యము |
| 1-10-0 | ,, | ,, | యవ్వనము |
| 1-20-0 | ,, | ,, | వృద్ధాప్యము |
| 2-0-0 | మిథునము | బ్రాహ్మణుడు | బాల్యము |
| 2-10-0 | ,, | ,, | యవ్వనము |
| 2-20-0 | మిథునము | బ్రాహ్మణుడు | వృద్ధాప్యము |
| 3-0-0 | కటకము | వేశ్య | బాల్యము |
| 3-10-0 | ,, | ,, | యవ్వనము |
| 3-20-0 | ,, | ,, | వృద్ధాప్యము |
| 4-0-0 | సింహము | ,, | బాల్యము |
| 4-10-0 | ,, | ,, | యవ్వనము |
| 4-20-0 | ,, | ,, | వృద్ధాప్యము |
| 5-0-0 | కన్యా | బ్రాహ్మణుడు | బాల్యము |
| 5-10-0 | ,, | ,, | యవ్వనము |
| 5-20-0 | ,, | ,, | వృద్ధాప్యము |
| 6-0-0 | తులా | గొల్లవాడు | బాల్యము |
| 6-10-0 | ,, | ,, | యవ్వనము |
| 6-20-0 | ,, | ,, | వృద్ధాప్యము |
| 7-0-0 | వృశ్చికము | ,, | బాల్యము |
| 7-10-0 | ,, | ,, | యవ్వనము |
| 7-20-0 | ,, | ,, | వృద్ధాప్యము |
| 8-0-0 | ధనుస్సు | బ్రాహ్మణుడు | బాల్యము |
| 8-10-0 | ,, | ,, | యవ్వనము |
| 8-20-0 | ,, | ,, | వృద్ధాప్యము |
| 9-0-0 | మకరము | గొల్లవాడు | బాల్యము |
| 9-10-0 | ,, | ,, | యవ్వనము |
| 9-20-0 | ,, | ,, | వృద్ధాప్యము |
| 10-0-0 | కుంభము | వేశ్య | బాల్యము |
| 10-10-0 | ,, | ,, | యవ్వనము |
| 10-20-0 | ,, | ,, | వృద్ధాప్యము |
| 11-0-0 | మీనము | బ్రాహ్మణుడు | బాల్యము |
| 11-10-0 | ,, | ,, | యవ్వనము |
| 11-20-0 | ,, | ,, | వృద్ధాప్యము |
| 0-0-0 | మేషము | గొల్లవాడు | బాల్యము |

## ఆఢకధారుని ఫలములు.

శ్లో॥ ఆఢకో గోపహస్తేతు సుభిక్షారోగ్య సంపదః
ఆఢకో బ్రాహ్మణకరే దుర్భిక్షం సస్యనాశనం
ఆఢకో గణికా హస్తే మహదర్ఘం సువృష్టికృత్

ఆఢకము గొల్లవానిచేతియందున్నపుడు సుభిక్ష క్షేమారోగ్యములు, పాడిపంటల సమృద్ధి, ధాన్యాదుల ధర తగ్గియుండుట కలుగును. బ్రాహ్మణుని చేతియందున్న దుర్భిక్షము, భయోత్పాతములు, ప్రజాక్షోభ, ఆహారధాన్యముల కొఱత, పాడిపంటలు క్షయించుట, ధాన్యాదులధరలు హెచ్చుట సంభవించును. వేశ్య చేతియందున్నచో సస్యానుకూలవర్షము లుండును. పాడిపంటల సమృద్ధియుండుటచే ప్రజలు సుఖసౌఖ్యములనను భవింతురు. ధాన్యాదుల ధరలు తగ్గును. ఉత్పత్తి యధికమగుటచేధరలు తగ్గును,

## వాయు నిర్ణయము.

శ్లో॥ శాకే వేదసమాయుక్తో భూధరై స్తతలోహృతః
శేషా ద్వాయు ర్విజానీయాదావహాది యథాక్రమం॥
ఆవహః ప్రవహశ్చైవ సంవహో వివహస్తథా
ఉద్వహస్సువహశ్చైవ వాయురత్ర చ సప్తమః॥

వర్తమాన శకాబ్దములకు నాల్గును కలియగూడగా వచ్చిన మొత్తమును ఏడుచే భాగించగా వచ్చు లబ్ధమును వదలి శేషమునుబట్టి క్రమముగా (1) ఆవహ (2) ప్రవహ (3) సంవహ (4) వివహ (5) ఉద్వహ (6) సువహ (7) వాయువు లను ఏడు వాయువులు వచ్చును.

## వాయు ఫలములు.

శ్లో॥ ఆవహేచోత్తమావృష్టిః ప్రవహే మధ్యవృష్టికృత్
సంవహే చాల్పవృష్టిస్స్యాద్ వివహే వృష్టినాశనమ్॥
ఉద్వహేతు సువృష్టిస్స్యా త్సువహే వృష్టికృత్సదా
వాయౌ వృష్టి వినాశస్స్యా ద్వాయోః ఫలమితిక్రమాత్॥

వాయుక్రమము ననుసరించి (1) మంచి వర్షములు. (2) మధ్యమవర్షము (3) అల్పవృష్టి (4) వర్షాభావము (5) సువృష్టి (6) ముఱుగు వర్షములు (7) వర్ష ప్రతిబంధకములచే ఖండఖండములుగా వర్షము కలుగును.



సర్వధారికి శాలివాహన శక వర్తమానాబ్ద సంఖ్య ౧౮౭౧.

| వర్తమాన శకాబ్దము | వాయువు పేరు | వర్తమాన శకము | వాయువు పేరు | వర్తమాన శకము | వాయువు పేరు |
|---|---|---|---|---|---|
| 1871 | సువహ | 1888 | ప్రవహ | 1905 | ఉద్వహ |
| 1872 | వాయు | 1889 | సంవహ | 1906 | సువహ |
| 1873 | ఆవహ | 1890 | వివహ | 1907 | వాయు |
| 1874 | ప్రవహ | 1891 | ఉద్వహ | 1908 | ఆవహ |
| 1875 | సంవహ | 1892 | సంవహ | 1909 | ప్రవహ |
| 1876 | వివహ | 1893 | వాయు | 1910 | సంవహ |
| 1877 | ఉద్వహ | 1894 | ఆవహ | 1911 | వివహ |
| 1878 | సువహ | 1895 | ప్రవహ | 1912 | ఉద్వహ |
| 1879 | వాయు | 1896 | సువహ | 1913 | సువహ |
| 1880 | ఆవహ | 1897 | వివహ | 1914 | వాయు |
| 1881 | ప్రవహ | 1898 | ఉద్వహ | 1915 | ఆవహ |
| 1882 | సంవహ | 1899 | సువహ | 1916 | ప్రవహ |
| 1883 | వివహ | 1900 | వాయు | 1917 | సంవహ |
| 1884 | ఉద్వాహ | 1901 | ఆవహ | 1918 | వివహ |
| 1885 | సువహ | 1902 | ప్రవహ | 1919 | ఉద్వహ |
| 1886 | వాయు | 1903 | సంవహ | 1920 | సువహ |
| 1887 | ఆవహ | 1904 | వవిహ | 1921 | వాయు |

## —♦ విద్యుత్ (తటిత్) నిర్ణయము. ♦—

శ్లో॥ శాకాబ్దో రామగుణితో మునిభి ర్భాజితః క్రమాత్
శేషా విద్యుచ్చ విజ్ఞేయా తటిదాది ర్విపశ్చితా॥
శ్లో॥ తటిత్సౌదామినీ విద్యు చ్చంచలా చపలాపిచ
నిశ్చలా చాచలా చేతి విద్యు త్సప్త ప్రకీర్తితాః॥

వర్తమాన శాలివాహన శకాబ్దములను మూడింట గుణించగా వచ్చు మొత్తమును ఏడింట భాగించగా వచ్చు లబ్ధమును విడిచి, శేషసంఖ్య,

(1) తటిత్
(2) సౌదామినీ
(3) విద్యుత్
(4) చంచలా
(5) చపలా
(6) నిశ్చలా
(7) అచలా యను సప్త విద్యుత్తులు కలుగుచుండును.

## —♦ విద్యుత్ఫలములు. ♦—

శ్లో॥ స్యాదల్పవృష్టి స్తటిదిసౌదామిన్యాం సువృష్టిదా
మధ్యవృష్టి ర్విద్యుతిస్యా చ్చంచలాయాం సువృష్టికృత్॥
చపలాయాం వాయుపీడా నిశ్చలాయాం మహార్ఘతా
అచలాయాం సువృష్టిస్స్యా దేవం విద్యుత్ఫలం క్రమాత్॥

తటిదాదిగా,

(1) అల్పవృష్టి
(2) సువృష్టి
(3) మధ్యవృష్టి
(4) సువృష్టి
(5) వాయుపీడ
(6) ధరలు తగ్గును
(7) సువృష్టి కలుగును.



సర్వధారికి శాలివాహన శక వర్తమానాబ్ద సంఖ్య ౧౮౭౧

| వర్తమాన శకము. | విద్యుత్ పేరు. | వర్తమాన శకము. | విద్యుత్ పేరు | వర్తమాన శకము. | విద్యుత్ పేరు. |
|---|---|---|---|---|---|
| 1871 | నిశ్చలా | 1890 | అచలా | 1909 | తటిత్ |
| 1872 | సౌదామినీ | 1891 | విద్యుత్ | 1910 | చంచలా |
| 1873 | చపలా | 1892 | నిశ్చలా | 1911 | అచలా |
| 1874 | తటిత్ | 1893 | సౌదామినీ | 1912 | విద్యుత్ |
| 1875 | చంచలా | 1894 | చపలా | 1913 | నిశ్చలా |
| 1876 | అచలా | 1895 | తటిత్ | 1914 | సౌదామినీ |
| 1877 | విద్యుత్ | 1896 | చంచలా | 1915 | చపలా |
| 1878 | నిశ్చలా | 1897 | అచలా | 1916 | తటిత్ |
| 1879 | సౌదామినీ | 1898 | విద్యుత్ | 1917 | చంచలా |
| 1880 | చపలా | 1899 | నిశ్చలా | 1918 | అచలా |
| 1881 | తటిత్ | 1900 | సౌదామినీ | 1919 | విద్యుత్ |
| 1882 | చంచలా | 1901 | చపలా | 1920 | నిశ్చలా |
| 1883 | అచలా | 1902 | తటిత్ | 1921 | సౌదామినీ |
| 1884 | విద్యుత్ | 1903 | చంచలా | | |
| 1885 | నిశ్చలా | 1904 | అచలా | | |
| 1886 | సౌదామినీ | 1905 | విద్యుత్ | | |
| 1887 | చపలా | 1906 | నిశ్చలా | | |
| 1888 | తటిత్ | 1907 | సౌదామినీ | | |
| 1889 | చంచలా | 1908 | చపలా | | |

## —♦ గర్జిత నిర్ణయము ♦—

శ్లో॥ శాకాబ్దో రుద్రగుణితో వసుభి ర్భాజితః క్రమాత్
శేషం హిగర్జితం జ్ఞేయం నిర్ఘోషాది సదాబుధైః॥
శ్లో॥ నిర్ఘోష స్ఖలితో గర్జితాబ్దావాసిత నీచకా
సౌమ్యో నైరాశక శ్చైవ హ్యష్టనామాని గర్జితే॥

వర్తమాన శాలివాహన శకాబ్దములను ౧౧చే గుణించి ఎనిమిదిచే భాగించగావచ్చు శేషసంఖ్య

(1) నిర్ఘోష
(2) స్ఖలిత
(3) గర్జిత
(4) అబ్ద
(5) అసిత
(6) నీచ
(7) సౌమ్య
(8) నైరాశ నామక అష్ట గర్జితము లగుచున్నవి.

## —♦ నిర్ఘోషాది ఫలములు ♦—

శ్లో॥ నిర్ఘోషే చాల్పవృష్టిస్స్యాత్ స్ఖలితే వృష్టిరుత్తమా
గర్జితే మధ్యమావృష్టి రబ్దశ్చైవ సుభిక్షకృత్॥
అసితేచోత్తమావృష్టి రవృష్టి ర్నీచనామకే॥
సౌమ్యాఖ్యేచాతి వృష్టిస్స్య న్నైరాశాఖ్యేతుమధ్యమా॥

నిర్ఘోషాదిగర్జిత క్రమము ననుసరించి

(1) అల్పవృష్టి
(2) సువృష్టి
(3) మధ్యమవృష్టి
(4) సుభిక్షం
(5) ఉత్తమవృష్టి
(6) అనావృష్టి
(7) అతివృష్టి
(8) మధ్యమవృష్టి



సర్వధారికి శాలివాహన శక వర్తమానాబ్ద సంఖ్య ౧౮౭౧.

| వర్తమాన శకము | గర్జితము పేరు | వర్తమాన శకము | గర్జితము పేరు | వర్తమాన శకము | గర్జితము పేరు |
|---|---|---|---|---|---|
| 1871 | అసిత | 1890 | నీచ | 1909 | సౌమ్య |
| 1872 | నైరాశ | 1891 | నిర్ఘోష | 1910 | స్ఖలిత |
| 1873 | గర్జిత | 1892 | అబ్ద | 1911 | అసిత |
| 1874 | నీచ | 1893 | సౌమ్య | 1912 | నైరాశ |
| 1875 | నిర్ఘోష | 1894 | స్ఖలిత | 1913 | గర్జిత |
| 1876 | అబ్ద | 1895 | అసిత | 1914 | నీచ |
| 1877 | సౌమ్య | 1896 | నైరాశ | 1915 | నిర్ఘోష |
| 1878 | స్ఖలిత | 1897 | గర్జిగ | 1916 | అబ్ద |
| 1879 | అసిత | 1898 | నీచ | 1917 | సౌమ్య |
| 1880 | నైరాశ | 1899 | నిర్ఘోష | 1918 | స్ఖలిత |
| 1881 | గర్జిత | 1900 | అబ్ద | 1919 | అసిత |
| 1882 | నీచ | 1901 | సౌమ్య | 1920 | నైరాశ |
| 1883 | నిర్ఘోష | 1902 | స్ఖలిత | 1921 | గర్జిత |
| 1884 | అబ్ద | 1903 | అసిత | | |
| 1885 | సౌమ్య | 1904 | నైరాశ | | |
| 1886 | స్ఖలిత | 1905 | గర్జిత | | |
| 1887 | అసిత | 1906 | నీచ | | |
| 1888 | నైరాశ | 1907 | నిర్ఘోష | | |
| 1889 | గర్జిత | 1908 | అబ్ద | | |

## —♦ సముద్ర నిర్ణయ ఫలములు. ♦—

శ్లో॥ శాకం ముని సమాయుక్తం అబ్ధి భిర్భాజితః క్రమాత్
యచ్ఛేషంన సముద్రస్స్యాత్ క్షారాదీ గణయే ద్బుధః॥
క్షారం క్షీరోదధి శ్చైవ ఘృతశ్చో దధి రేవచ
క్షారో వాయు సమాయుక్తః క్షీర స్త్వ నల ఏవచ
ప్రోక్తో ఘృతాబ్ధి ర్మాహేంద్రో వై దధి ర్వరుణో భవేత్॥

కించ॥ క్షారో దధా సువృష్టిస్స్యా ద్ఘృతే చాల్పతరా భవేత్
క్షీరో దధా సుభిక్షంస్స్యా ద్దధి స్సస్యాదివృద్ధికృత్॥

వర్తమాన శాలివాహన శకాబ్దములో 7 ను చేర్చగానైన మొత్తమును 4 చే భాగించగా వచ్చు లబ్ధమును వదలి శేషసంఖ్యాక్రమమున

(1) క్షారం
(2) క్షీరం
(3) దధి
(4) ఘృతము లను నాలుగు సముద్రములు కలుగును.

అనగా,

(1) ఉప్పు సముద్రము
(2) పాలసముద్రము
(3) పెరుగు సముద్రము
(4) నెయ్యి సముద్రములు కలుగుచున్నవి. ఉప్పునీరుగల సముద్రమే క్షారసముద్ర మనబడును. పాలవంటి నీళ్లు గలదియే పాల సముద్రము. మంచుగడ్డలతోఁగూడి పెరుగువలె కన్పించునదే దధిసముద్రము. నెయ్యివలె కాన్పించునది ఘృతసముద్రమగుచున్నది. వాటిఫలములు క్రమముగా (1) వాయుసహిత సువృష్టి (2) వాయుపీడయున్నను సుభిక్షముగా నుండును. (3) సస్యానుకూల వృష్టిచే పాడిపంటల సమృద్ధి (4) ఇంద్రధనుస్సు లేర్పడును. వర్షములు మిక్కిలి స్వల్పముగా కల్గును.



సర్వధారికి శాలివాహన శక వర్తమానాబ్ద సంఖ్య ౧౮౭౧

| వర్తమాన శకము. | సముద్రము పేరు. | వర్తమాన శకము. | సముద్రము పేరు. | వర్తమాన శకము. | సముద్రము పేరు. |
|---|---|---|---|---|---|
| 1871 | క్షీరం | 1890 | దధి | 1909 | ఘృతం |
| 1872 | క్షారం | 1891 | క్షీరం | 1910 | దధి |
| 1873 | ఘృతం | 1892 | క్షారం | 1911 | క్షీరం |
| 1874 | దధి | 1893 | ఘృతం | 1912 | క్షారం |
| 1875 | క్షీరం | 1894 | దధి | 1913 | ఘృతం |
| 1876 | క్షారం | 1895 | క్షీరం | 1914 | దధి |
| 1877 | ఘృతం | 1896 | క్షారం | 1915 | క్షీరం |
| 1878 | దధి | 1897 | ఘృతం | 1916 | క్షారం |
| 1879 | క్షీరం | 1898 | దధి | 1917 | ఘృతం |
| 1880 | క్షారం | 1899 | క్షీరం | 1918 | దధి |
| 1881 | ఘృతం | 1900 | క్షారం | 1919 | క్షీరం |
| 1882 | దధి | 1901 | ఘృతం | 1920 | క్షారం |
| 1883 | క్షీరం | 1902 | దధి | 1921 | ఘృతం |
| 1884 | క్షారం | 1903 | క్షీరం | | |
| 1885 | ఘృతం | 1904 | క్షారం | | |
| 1886 | దధి | 1905 | ఘృతం | | |
| 1887 | క్షీరం | 1906 | దధి | | |
| 1888 | క్షారం | 1607 | క్షీరం | | |
| 1889 | ఘృతం | 1908 | క్షారం | | |

—♦ భూవాహక శేషుని నిర్ణయము ♦—

శ్లో॥ శాకశ్శరాగ్ని సంయుక్తో వసుభి ర్భాగ మాహరేత్
శేషాన్నాగో విజానీయా దనంతాది యథాక్రమం॥
అనంతో వాసుకి శ్చైవ తక్షః కర్కోటకస్తథా
పద్మక శ్శంఖక శ్చైవ విరాటః కులిక స్తథా॥

వర్తమాన శాలివాహన శకాబ్దములకు 3౫ చేర్చగా నైనమొత్తమును ౮ చే భాగించవలెను. లబ్ధమును వదలి శేషమునే గ్రహించవలెను. శేషసంఖ్యా క్రమమున 1. అనంతుడు 2. వాసుకి 3. తక్షకుడు 4. కర్కోటకుడు 5. పద్మకుడు 6. శంఖుఁడు 7. విరాటుఁడు 8. కులికుఁడు నను ఎనమండుగురు భూవాహక శేషులు వచ్చుచుండెదరు.

—♦ భూ వా హ క శే షు ని ఫ ల ము లు ♦—

—♦ అనంత నామక శేషుని ఫలము ♦—

శ్లో॥ అనంతాఖ్యే మహానాగే భూమిం వహతి భూమిపాః
అనంత వస్తు సంపూర్ణా భూమిస్స్వస్థా జనా స్తదా॥

అనంతుడను శేషుడు భూమిని వహించుటచే రాజులు అనేక వస్తువులను కలిగి యుందురు. లోకమున భయోత్పాతాదులు లేకయుండును. జనులు సుఖించెదరు. " నవిద్యతే అన్తో నాశో యస్యసః అనంతః " అనఁగా నాశము లేనివాడు. నాగులకు రాజైన ఆదిశేషుడు. పర్వతములందుగాని, చందనతరువులందుగాని పుట్టిన దేవయోనులే నాగులనబడుదురు.

—♦ వాసుకి నామ శేషుని ఫలము. ♦—

శ్లో॥ భూమి స్స్థిరా సస్యఫలప్రవృద్ధి ర్భూమిం వహే ద్వాసుకి నామ నాగే॥

"వసురత్నం కేశిరసి యస్యాసః వసుకః తస్యా పత్యం వాసుకిః" వసు వనగా రత్నము. అది శిరస్సున గలవాడు వసుకుడు. వాని కొడుకు వాసుకి. ('వసతి పాతాళ ఇతి వాసుకిః' అనగా పాతాళమందుండువాడు) ఇతడు సర్పముల రాజు. సర్పరాజగు వాసుకి భూమిని వహించుటచే



లోకమునం దెట్టి కల్లోలములు లేకయుండును. పాడిపంటలు సమృద్ధియు, సుభిక్ష క్షేమారోగ్యము లుండును.

—♦ తక్షకనామ శేషుని ఫలము. ♦—

శ్లో॥ తక్షకాఖ్యే మహానాగే భూమిం వహతి చేత్తదా
క్షత్రియా విత్తహీనాస్స్యు ర్మ్లేచ్ఛానాం జాయతే సుఖం॥"

"సుజనా విత్తహీనాస్స్యుః" అను పాఠాంతరమున్ను గలదు. తక్షకుడు భూవాహకుడగుటచే సుజనులకు దారిద్ర్యము. మ్లేచ్ఛులకు (దుర్మార్గులకు) సుఖము కలుగును.

"గోమాంస భక్షకోయస్తు లోక బాహ్యంచ భాషతే
సర్వాచార విహీనోఽసౌ మ్లేచ్ఛ ఇత్యభిధీయతే"

అను రీతిని మ్లేచ్ఛంతే అవ్యక్తం భాషంత ఇతి మ్లేచ్ఛాః - మ్లేచ్ఛ అవ్యక్తేశబ్దే. వ్యక్తముగాకుండా బలుకువారు మ్లేచ్ఛులు. మ్లేచ్ఛజాతులలో నెమలి పింఛము మొదలగునవి కట్టుకొనువారు కిరాతులు. ఆకులు కట్టుకొనువారు శబరులు. తమ భాషయే గాని యొకరి భాష నెఱుగనివారు పుళిందులు. అనగా ఆటవిక జాతుల (కొండజాతుల) వారు. ఛండాలురు మొదలైనవారు మ్లేచ్ఛు లనబడుదురు. (తక్ష్ణోతీతి తక్షకః - కృశింప జేయజూచువాడు తక్షకు డనబడును.)

—♦ కర్కోటకనామ శేషుని ఫలము. ♦—

శ్లో॥ కర్కోటకే మహానాగే ధరణీభార వాహకే
ధరిత్రీ భయసంయుక్తా రాజానో యుద్ధకాంక్షిణః।

కర్కోటకుడు భూవాహకుడు గాన ప్రభువులు యుద్ధతత్పరులు. భూమియందు భయోత్పాతము లధికము. సాహస వ్యాపారము చేయువారికి గొప్ప లాభములు చేకూరును. సాహస కార్యములు చేయువారికి జయము చేకూరును.

—♦ పద్మక నామ శేషుని ఫలము. ♦—

శ్లో॥ పద్మకే భూమివాహేతు నాగేస్యా దుత్తమం ఫలం
ప్రజానాం సుఖ మత్యంత మారోగ్యం జాయతే ధ్రువం॥

పద్మకుడు భూవాహకుడు గాన జనులకు సుఖము. ఆరోగ్యము, భోగ భాగ్యములు, పాడిపంటల సమృద్ధి యుండును.

—♦ శంఖ నామ శేషుని ఫలము. ♦—

శ్లో॥ శంఖకాఖ్యే భూమివహే సుఖం భవతి భూతలే॥

శంఖుఁడు భూవాహక శేషుఁడు గాన ప్రపంచమం దంతటను ప్రజలు సుఖసౌఖ్యములు గల్గియుందురు.

—♦ విరాట నామ శేషుని ఫలము. ♦—

శ్లో॥ భూమిం వహే విరాటేతు భూమి స్స్వస్థా సుభిక్షకృత్
ప్రజానాం సుఖ మారోగ్యం సువృష్టి స్సర్వ దిక్షుచ॥

విరాటుడు భూవాహకుడు గాన భయోత్పాతములు లేక ప్రజలు సుఖం చెదరు. సుభిక్షము, సువృష్టి, ప్రజల కారోగ్యము, పాడిపంటల సమృద్ధి యుండును.

—♦ కుళిక నామ శేషుని ఫలము. ♦—

శ్లో॥ కుళికాఖ్యే భూమి వహే సర్వసస్య వినాశనం॥

కుళికుడు భూవాహకుడు గావున ఖండవృష్టి. అతివృష్టి మూలకముగా సస్యములు నశించును. పాడిపంటలు తగ్గును. ధరలు పెరుగును. మత కలహము లుండును. మత విషయముగా ప్రజాక్షోభ యుండును.



సర్వధారికి శాలివాహన శక వర్తమానాబ్ద సంఖ్య ౧౮౭౧

| వర్తమాన శకము. | భూవాహక శేషుడు | వర్తమాన శకము | భూవాహక శేషుడు | వర్తమాన శకము | భూవాహక శేషుడు |
|---|---|---|---|---|---|
| 1871 | వాసుకి | 1889 | కుళికుడు | 1907 | శంఖుడు |
| 1872 | పద్మకుడు | 1890 | తక్షకుడు | 1908 | అనంతుడు |
| 1873 | కుళికుడు | 1891 | శంఖుడు | 1909 | కర్కోట |
| 1874 | తక్షకుడు | 1892 | అనంతుడు | 1910 | విరాటుడు |
| 1875 | శంఖుడు | 1893 | కర్కోట | 1911 | వాసుకి |
| 1876 | అనంతుడు | 1894 | విరాటుడు | 1912 | పద్మకుడు |
| 1877 | కర్కోటకుడు | 1895 | వాసుకి | 1913 | కుళికుడు |
| 1878 | విరాటుడు | 1896 | పద్మకుడు | 1914 | తక్షకుడు |
| 1879 | వాసుకి | 1897 | కుళికుడు | 1915 | శంఖుడు |
| 1880 | పద్మకుడు | 1898 | తక్షకుడు | 1916 | అనంతుడు |
| 1881 | కుళికుడు | 1899 | శంఖుడు | 1917 | కర్కోట |
| 1882 | తక్షకుడు | 1900 | అనంతుడు | 1918 | విరాటుడు |
| 1883 | శంఖుడు | 1901 | కర్కోట | 1919 | వాసుకి |
| 1884 | అనంతుడు | 1902 | విరాటుడు | 1920 | పద్మకుడు |
| 1885 | కర్కోటకుడు | 1903 | వాసుకి | 1921 | కుళికుడు |
| 1886 | విరాటుడు | 1904 | పద్మకుడు | | |
| 1887 | వాసుకి | 1905 | కుళికుడు | | |
| 1888 | పద్మకుడు | 1906 | తక్షకుడు | | |

—♦ సావన వర్షాధిపతి నిర్ణయము ♦—

శ్లో॥ శాస్త్రోది సౌరాబ్దగణః కలేర్వా
వర్షాధిపస్సప్తహృతావశేషాత్
శుక్రేందువాచస్పతి సూర్యసౌమ్య
శనైశ్చరారాః క్రమశోభవంతి॥

సిద్ధాంత శాస్త్రములలో సూర్యసిద్ధాంతమే అనాదిసిద్ధమైనది. ఇయ్యది ఆర్ష సిద్ధాంతములో మొట్టమొదటిదనియు, శ్రేష్ఠమైన దనుట గలదు. కనుక సూర్యసిద్ధాంతశాస్త్రమున కల్పాది గణితము చెప్పఁబడెను. సృష్ట్యాది నుండియు గణితముజేయు నుపాయములున్ను చెప్పబడెను. సావన వర్షాధిపతిని నిర్ణయించుటకు సృష్ట్యాదినుండిగాని, కల్పాదినుండి గాని, కల్యాదినుండిగాని సాధింపవచ్చును. కలిశకాబ్దములనుండి గణించుట కొంత సులభము. సర్వధారి సంవత్సరమునకు వర్తమాన కలి శకాబ్దములు ౫౦౪౯. ఇవే కల్యాది వర్తమాన సంవత్సరములు. వీటిని 7 చే భాగించగా వచ్చు శేషమను మాత్రమే గ్రహించవలెను. శేష సంఖ్యా క్రమమున (1) శుక్రుడు (2) సోముడు (3) గురుడు (4) రవి (5) బుధుడు (6) శని (7) మంగళుడు సావన వర్షాధిపతులగుచున్నారు. ఇయ్యది స్థూలమార్గము. కనుక ఫలితాదులు అంతగా రుజువాసంగవని కొందరు చెప్పుట గలదు. అట్లయ్యును కొందరు దీనినే గ్రహించి ప్రవర్తించవలెననుట గలదు కాన ఫలాదులనుకూడా వివరించి చూపుచున్నాను.

—♦ సూక్ష్మమార్గముచే సావన వర్షాధిపతి నిర్ణయము. ♦—

సావన వర్షారంభము సర్వజిత్ సంవత్సరములో 31 జూలై 1947 తేదీన యగును. ఆనాడు గురువారమయ్యెను. ఈ తేదీకి సావన వర్ష ప్రమాణ దిన సంఖ్య 360 ని చేర్చగా ఏ నెల ఏ తేదీ యగునో ఆ నాటి వారాధిపతి ననుసరించి సావన వర్షాధిపతిగ గ్రహించవచ్చును సూక్ష్మరీతిచే సాధింపబడిన సావన వర్షాధిపతి ఫలము తప్పక రుజువాసంగును. కనుక ఈ పద్ధతిని గ్రహించి ప్రవర్తించుట మేలు.



సావన వర్షాధిపతి ఫలములు.

—♦ సావన వర్షాధిపతి రవియొక్క ఫలము. ♦—

శ్లో॥ అబ్దాధిపే దినపతౌ ఖలు మధ్యవృష్టి
ర్మందప్రభర్క్ష గణశీతకరం నభశ్చ
హంతుం సపత్న విషయాన్నిఖిలక్షితీశా
నిత్యం చరంతి భువి భూరిబలాహవృతాశ్చ॥

మధ్యవృష్టి. రాజులు గొప్ప సేనలతో శత్రుదేశములపై దండెత్తగలరు మిగతా విషయములు మధ్యమము.

—♦ సావన వర్షాధిపతి చంద్రునియొక్క ఫలము. ♦—

శ్లో॥ ధారాధరాః క్ష్మామఖిలాం ప్రకుర్యు
ర్ధారాధరాం క్షేమ సుఖే సుభిక్షం
ప్రజా నృపాశ్చాతి సురాశ్చభూమా
గీతోత్సవ శ్చాబ్దపతౌ శశాంకే॥

మేఘములు బాగుగా వర్షించును. క్షేమము సుభిక్షము గీతోత్సవములు కలుగును. ప్రజలు ధర్మముచే దేవతలను మించియుందురు.

—♦ సావన వర్షాధిపతి కుజుని ఫలము. ♦—

శ్లో॥ అగ్నితస్కరరోగాస్స్యు స్నృపా విగ్రహ తత్పరాః
హంతం సస్యం వ్యాళభయం భౌమాబ్దే వృష్టినాశనం॥

అగ్ని, సర్ప, చోర, రోగభయములు. రాజులకు యుద్ధాసక్తి. సస్యములు చెడును. వర్షములు తక్కువగును.

—♦ సావన వర్షాధిపతి బుధునియొక్క ఫలము. ♦—

శ్లో॥ వర్షాధిపతౌ సౌమ్యే వర్షం స్యాన్మధ్యమం లోకే
వాయూద్ధూతాజలదాసస్యా న్యపి మధ్యమానిస్స్యుః॥

మేఘములు గాలిచే కొట్టబడి మధ్యమ వర్షము నిచ్చును. సస్యములు మధ్యమముగనే యుండును.

—♦ సావన వర్షాధిపతి గురునియొక్క ఫలము. ♦—

శ్లో॥ వర్షాధిపతౌ జీవే వర్షాధిక్యం హి సర్వసస్యానాం
ధాన్యార్ఘానాం వృద్ధి స్సుభిక్ష మతులం సుఖం ప్రజానాం॥

సర్వ సస్యములకు వర్షములు సమృద్ధిగ నుండును. పంటలు బాగుండును. ధరలు తగ్గియుండును. సుభిక్షము. ప్రజలకు సాటిలేని సుఖము రాజకీయాభివృద్ధి యుండును.

—♦ సావనవర్షాధిపతి శుక్రునియొక్క ఫలము. ♦—

శ్లో॥ సమృద్ధ సస్యా వసు ధా సువృష్టి
ర్గావోహి సంపూర్ణపయః ప్రదాస్స్యుః
ప్రియాః ప్రియాణాం జనయంతితోషం
సదోపచారై ర్భృగుజేబ్దనాథే॥

భూమి సర్వసస్య సంపూర్ణమై యుండును. సువృష్టి. నిరంతరోపచారములచే ప్రియులకు ప్రియురాండ్రు సంతోషమును కలిగించెదరు.

—♦ సావన వర్షాధిపతి శనియొక్క ఫలము. ♦—

శ్లో॥ వర్షాధిపే సూర్యసుతే ధరిత్ర్యాం
అవృష్టి రోగాగ్ని మహీశపీడా
భూపాలకానా మతులం చ యుద్ధ
మనర్ఘతా సస్య వినాశనం చ॥

అనావృష్టి, రోగభయము, అగ్నిభయము, రాజభయము, ప్రభువులకు యుద్ధము, సస్యహాని, దుర్భిక్షము కలుగును.

—♦ పశుపాలకాది నిర్ణయము. ♦—

పశుపాలకులు ముగ్గురు. శ్రీకృష్ణుడు, బలరాముడు, యముడు. ఈ పాలకులు రాజునుబట్టి నిర్ణయింపబడుదురు. కొందరు పంచాంగకర్తలు పశునాయకుడు, స్థానరక్షకులను మాత్రమే వ్రాయుచున్నారు. కొందరు రాజగ్రహము ననుసరించియు, మరికొందరు మేఘాధిపతినిబట్టియు, ఇంక కొందరు ఆర్ద్రాప్రవేశకాలిక వారాధిపతినిబట్టియు, కొందరు రామకృష్ణ



యములు వరుసగా యేటేట వత్తురనుకొనియు వ్రాయుచున్నారు. అవన్నియు సరియైనవి కాజాలవు. పశుపాలకుడు, ప్రాపకుడు, బహిఃప్రాపకులుగా పూర్వులు శ్రీకృష్ణ బలరామ యములనునిర్ణయించియున్నారు వీరు ప్రతి సంవత్సరమునందు మారుచుందురు. గోష్ఠాగారమనగా పశువులుండు కొట్టము. గోష్ఠ మనగా ("గావ స్తిష్ఠం త్యత్ర గోష్ఠం" అని వ్యుత్పత్త్యర్థము.) గోవులుండు ప్రదేశము. (గొడ్ల చావడి). ప్రాపకుడనగా పోషించువాడు.

పశుపాలకుడు, గోష్ఠాగారప్రాపకుడు, (స్థానసంరక్షకుడు). గోష్ఠాద్బహిఃప్రాపకులను నిర్ణయించు విధానము నీ దిగువ వివరించుచున్నాను.

—♦ పశుపాలక (పశునాయక) నిర్ణయము. ♦—

శ్లో॥ భాను ర్భౌమోయమోరాజా బలభద్రో బుధే శనౌ
గురుభార్గవ సోమాశ్చ గోపాలః పశునాయకః॥

సంవత్సరాది వారేశుడే రాజు. రాజగ్రహము ననుసరించి పశుపాలకుడు ఏర్పడును. ఎట్లనిన :—

| రాజగ్రహము. | పశుపాలకుడు. |
|---|---|
| రవి - కుజుడు | యముడు |
| బుధుడు - శని | బలరాముడు |
| చంద్రుడు - గురుడు - శుక్రుడు | శ్రీకృష్ణుడు |

—♦ గోష్ఠాగార ప్రాపకుని (స్థాన సంరక్షకుని) నిర్ణయము. ♦—

శ్లో॥ ఆర్ద్రాప్రవేశ వారేశౌ భానుభౌమౌచ ప్రేతరాట్
భృగ్వింద్వోశ్చ గురౌ కృష్ణో బలభద్రో బుధే శనౌ॥

సూర్యుడు ఆర్ద్రానక్షత్రమున ప్రవేశించు కాలమునకు ఏ వారమగునో తద్వారాధిపతి ననుసరించి (స్థాన సంరక్షకుడు) గోష్ఠాగార ప్రాపకుడేర్పడును. ఎట్లనిన :—

| ఆర్ద్రాప్రవేశ కాలికవారాధిపతి | గోష్ఠాగార ప్రాపకుడు (స్థానసంరక్షకుడు) |
| --- | --- |
| రవి - కుజుడు | యముడు |
| బుధుడు - శని | బలరాముడు |
| చంద్రుడు-గురుడు-శుక్రుడు | శ్రీకృష్ణుడు. |

## —♦ గోష్ఠాద్బహిష్కర్త నిర్ణయము. ♦—

గోష్ఠాద్బహిష్కర్తను నిర్ణయించుటకు ప్రత్యేక శ్లోకము నాకు గ్రంథములం దెచ్చటను లభింపలేదు. కాన ప్రమాణ శ్లోకమును వ్రాయక వదలితిని. గోష్ఠాద్బహిష్కర్తను నిర్ణయించుపట్ల మేఘాధిపతిని గ్రహింపవలెనని మా గురువచన ఆజ్ఞ. అట్లుగ ప్రవర్తించునపు డీదిగువ వ్రాసిన ముఖ్య గమనికను చూచుకొని ప్రవర్తించుట మేలు.

## —♦ ముఖ్య గమనిక. Table I. ♦—

| రాజ గ్రహము. | ఆర్ద్రాప్రవేశ కాలిక వారాధిపతి. | పశ్వాధిపత్య వివరములు, |
| --- | --- | --- |
| (1) రవి - కుజుడు. వీటిలో ఏదో ఒకటి కావచ్చును. | రవి - కుజుడు. వీటిలో ఏదో ఒకటి కావచ్చును. | ఇట్లున్నపుడు ఆధిపత్యములు యమునికే కలుగును. |



| | | |
| --- | --- | --- |
| (2) చంద్ర-గురు-శుక్రులు. వీటిలో ఏదో ఒకటి కావచ్చును. | చంద్ర-గురు-శుక్రులు వీటిలో ఏదో ఒకటి కావచ్చును. | ఇట్టియెడ మూఢాధిపత్యములు శ్రీకృష్ణునకే కలుగును. |
| (3) శని - బుధుడు వీటిలో ఏదో ఒకటి కావచ్చును. | శని - బుధుడు వీటిలో ఏదో ఒకటి కావచ్చును. | ఇప్పట్టున మూఢాధిపత్యములు బలరామునకే కలుగు ననుట సమంజసము. |
| (4) రవి - కుజుడు వీటిలో ఏదో ఒకటి యగునపుడును | చంద్ర-గురు-శుక్రులు వీటిలో ఏదో ఒకటి యగునపుడును | పశుపాలకుడు యముడు. గోష్ఠాగార ప్రాపకుడును గోష్ఠాద్బహిష్కర్తయు శ్రీకృష్ణుడే యగును. |
| (5) రవి - కుజుడు | బుధుడు - శని | పశుపాలకుడు యముడు. గోష్ఠాగార ప్రాపకుడును, గోష్ఠాద్బహిష్కర్తయు బలరాముడే యగును. |

| | | |
|---|---|---|
| (6) చంద్ర - గురు శుక్రులు. | రవి - కుజుడు | పశుపాలకుడు శ్రీకృష్ణుడు. గోష్ఠాగారప్రాపకుడును, గోష్ఠాద్బహిష్కర్తయు యముడే యగును. |
| (7) చంద్ర - గురు - శుక్రులు. | బుధ - శని | పశుపాలకుడు శ్రీకృష్ణుడు. గోష్ఠాగారప్రాపకుడు, గోష్ఠాద్బహిష్కర్తయు బలరాముడే యగును. |
| (8) బుధ - శని | రవి - కుజుడు | పశుపాలకుడు బలరాముడు. గోష్ఠాగారప్రాపకుడున్ను గోష్ఠాద్బహిష్కర్తయు యముడే యగును. |
| (9) బుధ - శని | చంద్ర-గురు-శుక్రులు | పశుపాలకుడు బలరాముడు. గోష్ఠాగారప్రాపకుడున్ను, గోష్ఠాద్బహిష్కర్తయు శ్రీకృష్ణుడే యగును. |



—♦ మరియొక ముఖ్యవిశేషము Table II ♦—

| రాజు. | ఆర్ద్రాప్రవేశకాలి వారాధిపతి | మేఘాధిపతి | పశ్వాధిపత్య వివరము |
|---|---|---|---|
| 1. రవి-కుజుడు | చంద్ర - గురు-శుక్రులు | బుధ - శని | పశుపాలకుడుయముడు. గోష్ఠాగారప్రాపకుడు శ్రీకృష్ణుడు. గోష్ఠాద్బహిష్కర్త బలరాముడు. |
| 2. రవి-కుజుడు | బుధ - శని | చంద్ర - గురు-శుక్రులు. | పశుపాలకుడుయముడు. గోష్ఠాగారప్రాపకుడు బలరాముడు. గోష్ఠాద్బహిష్కర్త శ్రీకృష్ణుడు. |
| 3. బుధ-శని | చంద్ర - గురు-శుక్రులు | రవి - కుజ | పశుపాలకుడు బలరాముడు. గోష్ఠాగార ప్రాపకుడు శ్రీకృష్ణుడుగోష్ఠాద్బహిష్కర్త యముడు. |
| 4. బుధ-శని | రవి - కుజ | చంద్ర - గురు-శుక్రులు | పశుపాలకుడు బలరాముడు. గోష్ఠాగార ప్రాపకుడుయముడు. గోష్ఠాద్బహిష్కర్త శ్రీకృష్ణుడు. |

| | | | |
|---|---|---|---|
| 5. చంద్ర-గురు-శుక్రులు | రవి - కుజ | బుధ - శని | పశుపాలకుడు శ్రీకృష్ణుడు. గోష్ఠాగార ప్రాపకుడు యముడు. గోష్ఠాద్బహిష్కర్త బలరాముడు. |
| 6. చంద్ర-గురు-శుక్రులు | బుధ - శని | రవి - కుజ | పశుపాలకుడు శ్రీకృష్ణుడు. గోష్ఠాగార ప్రాపకుడు బలరాముడు గోష్ఠాద్బహిష్కర్త యముడు. |

Note :— మొదటిపట్టికవల్ల ఏర్పడిన ఆధిపత్యములు ముఖ్యము. అందు మూడవ యాధిపత్య విషయమున సందేహము కలుగునప్పుడు మాత్రమే రెండవపట్టికను చూడదగును. గోష్ఠాద్బహిష్కర్తను నిర్ణయించెడి శ్లోకము ఎచ్చటనైనా యున్నచో విబుధులు తెలియజేయుదురని ప్రార్థించుచున్నాను. గోష్ఠాద్బహిష్కర్తను నిర్ణయించుటకు శ్లోకములేనందున రెండవపట్టికను ఊహచే తయారుచేసితిని. శాస్త్రహేతువు ప్రమాణముగాని స్వతంత్రహేతువు ప్రమాణముకాదని విజ్ఞులకువిశదమేకదా ?

పశునాయక ఫలములు.

—♦ శ్రీకృష్ణుడు పశుపాలకుడగుచో ఫలము. ♦—

శ్లో॥ పశువృద్ధిః సుభిక్షం చ బహుస్స్యాదర్ఘ సంపదః
సంపూర్ణ తృణవృష్టిశ్చ శ్రీకృష్ణే పశునాయకే॥

పశువులకు వృద్ధి, సుభిక్షము, పంటలు బాగుగా ఫలించుటచే ధాన్యాదుల ధరలు తగ్గును. పశువులకు గడ్డి, నీరు సమృద్ధిగా లభించును. ప్రజలకు పాడిపంటల సమృద్ధి, ధనధాన్య సంపత్తులు కలుగును.



—♦ బలరాముడు పశుపాలకుడగుచో ఫలము. ♦—

శ్లో॥ సువృష్టి స్సర్వదేశేషు సర్వసస్యసమృద్ధయః
మధ్యదేశే సుభిక్షంస్యాద్రామేతు పశునాయకే॥

దేశమందంతటను సస్యానుకూల వర్షములు కల్గి సస్యములు చక్కగా ఫలించును. మధ్యదేశమందు విశేషముగా సుభిక్షము; పాడిపంటల సమృద్ధి యుండును.

—♦ యముడు పశుపాలకుడగుచో ఫలము. ♦—

శ్లో॥ అనర్ఘ శ్చాల్పవృష్టిశ్చ స్వల్పక్షీరం తథా గవాం
పశుపీడా భవేన్నిత్యం యమేతు పశునాయకే॥

ధర లధికమగుట. అల్పవృష్టి. పాడిపంటలు తక్కువగుట. పశువులకు రోగాది పీడలు; పశువుల నష్ట మధికమగును.

—♦♦ గోష్ఠాగార ప్రాపకుని ఫలములు ♦♦—

—♦ శ్రీకృష్ణుడు గోష్ఠాగారప్రాపకుడగుచో ఫలము. ♦—

శ్లో॥ బహుక్షీరప్రదాగావ స్సర్వే వ్యాధి వివర్జితాః
గోష్ఠాగార ప్రాపకే శ్రీకృష్ణే సస్య వివృద్ధయః॥

గోజాతి చక్కగా పాల నొసంగును. పాడిపంటల సమృద్ధి యుండును సమస్త ప్రాణికోటియు రోగవర్జితులై సుఖింతురు. ధరలు సరసముగానుండును.

—♦ బలరాముడు గోష్ఠాగార ప్రాపకుడగుచో ఫలము. ♦—

శ్లో॥ సువృష్టి స్సస్యవృద్ధిశ్చ మధ్యమం క్షేమ మేవచ
గోష్ఠాగార ప్రాపణంతు బలరామ కృతం యది॥

పాడిపంటల సమృద్ధియున్నను, ప్రాణికోటి క్షేమారోగ్యములు మధ్యమముగా నుండును. ధరలు మధ్యమము.

—♦ యముడు గోష్ఠాగారప్రాపకుడగుచో ఫలము. ♦—

శ్లో॥ మధ్యవృష్టి ర్మందసస్యం స్వల్పం క్షీరం తథా గవాం
గోష్ఠాగార ప్రాపకేతు యమే సస్య వినాశనం॥

పాడిపంటలు తగ్గును. మధ్యమ వర్షము. మధ్యమ సస్యములు. ధరలు కొలదిగ పెరుగును. కొండొకచో సస్యహాని. పశువులకు హాని. ప్రజా క్షోభ యుండును.

గోష్ఠాద్బహిఃప్రాపకుని ఫలములు.

—♦ శ్రీకృష్ణుడు గోష్ఠాద్బహిఃప్రాపకుడగుచో ఫలము. ♦—

పశువృద్ధి, సుభిక్షము, పంట లధికముగా ఫలించుటచే ధరలు తగ్గును. పాడిపంటల సమృద్ధి. పశువులు తృణసమృద్ధితో వర్ధిల్లును.

—♦ బలరాముడు గోష్ఠాద్బహిఃప్రాపకుడగుచో ఫలము. ♦—

శ్లో॥ సువృష్టి స్సస్య సంపత్తి స్సుభిక్షం చ క్వచిత్క్వచిత్
భవేద్గోష్ఠా ద్బహిష్కర్తా బలభద్రో భవేద్యది॥

సువృష్టి, సస్యసంపత్తి, సుభిక్షము అప్పటప్పట కొన్నిప్రాంతములందు కలుగును. ధరలు హెచ్చుతగ్గులుగా నుండును.

—♦ యముడు గోష్ఠాద్బహిఃప్రాపకుడగుచో ఫలము. ♦—

శ్లో॥ మధ్యవష్టి ర్మందసస్యం స్వల్పక్షీరం తథా గవాం
గోష్ఠాద్బహిః ప్రాపకేతు యమే సస్య వినాశనమ్॥

పాడిపంటలు తక్కువ. మధ్యమ వృష్టి మధ్యమ సస్యములు కలుగును. ఒకప్పుడు సస్యహానియు కలుగును. ధరలు పెరుగును.

రెండాధిపత్యములు వచ్చినపుడు ఫలములు.

—♦ యమునకు గోష్ఠప్రాపక బహిష్కారత్వముల ఫలము. ♦—

శ్లో॥ పశుపీడాల్పవృష్టిశ్చ స్వల్పక్షీరం తథా గవాం
యమే గోష్ఠప్రాపకేతు బహిష్కారక ఏవచ॥

పశువులకు రోడపీడలు, అల్పవృష్టి, పాడిపంటలు తక్కువ.

—♦ బలరామునకు గోష్ఠప్రాపక బహిష్కారకత్వముల ఫలము. ♦—

పశునాయకత్వ ఫలమే గ్రహించవలెను.

—♦ శ్రీకృష్ణునకు గోష్ఠప్రాపక బహిష్కారకత్వముల ఫలము. ♦—

శ్లో॥ బహుక్షీర ప్రదాగావ స్సర్వే వ్యాధి వివర్జితా
గోష్ఠాద్బహిః ప్రాపణంతు శ్రీకృష్ణేన కృతం తదా॥



ప్రాణికోటికి అధివ్యాధులుండవు. పాడిపంటలు సమృద్ధిగా నుండును. ధరలు తగ్గును. సుభిక్షక్షేమారోగ్యసంపదలు కలుగును.

—♦♦♦ పశునాయకత్వమున సంపూర్ణాధిపత్యఫలములు ♦♦♦—

—♦ శ్రీకృష్ణునికి సంపూర్ణాధిపత్యము కలిగినచో ఫలము ♦—

శ్లో॥ పశువృద్ధి స్సుభిక్షంచ బహుసస్యార్ఘ సంపదః
గోష్ఠే సర్వాధికారీచే చ్ఛ్రీ కృష్ణ స్తృణవర్ధనమ్॥

పశుపాలకుడు, గోష్ఠాగార ప్రాపకుడు, గోష్ఠాద్బహిః ప్రాపకుడు శ్రీకృష్ణుడగుటచేత పశువులు తృణవృద్ధితో వర్ధిల్లును. ధరలు తగ్గును. గొప్ప పంటలు లభించును. సుభిక్ష క్షేమారోగ్యములు కల్గును.

—♦ యమునకు పశుపాలనయందు సంపూర్ణాధిపత్య ఫలము ♦—

శ్లో॥ అనర్ఘ శ్చాల్పవృష్టిశ్చ స్వల్పక్షీరం తథాగవాం
పశుపీడా భవేన్నిత్యం యమే పశ్వధిపేభవేత్॥

యమునకు పశుపాలనాధికారము సంపూర్ణముగ నుండుటచేత అల్పవృష్టి ధరలధికమగుట పాండిపంటలు తక్కువగుట పశువులకుపీడ. అమాయకు లగు ప్రజలకు దుర్మార్గులవల్ల ధనమానప్రాణహానులు కలుగును.

—♦ బలరామునకు సంపూర్ణాధిపత్య ఫలము ♦—

పశుపాలకత్వ ఫలమే వ్రాయవలెను.

—♦ వర్షధాన్యాది యోగములను గురించిన విమర్శ ♦—

ప్రతిసంవత్సరము ప్రతిపంచాంగ కర్తయు పంచాంగ పీఠికలో వర్షధాన్యాదులను ఒక పేజినిండా వ్రాసి చూపుచున్నారు. వర్షధాన్యాదులకు ప్రక్కనచూపబడు అంకెలు పుట్లను తెలుపునా? తూములను తెలుపునా? లేక నిరుటికంటె యింతయెక్కువని తెలుపునా ? అను సందియములకు తావియ్యకుండా స్పష్టముగా తెలియజేయు పంచాంగకర్త ఒక్కడైనను కాన్పింపడు. పంచాంగ పాఠకులను యావిషయమై అంతగా శంకించినట్లు తోచకున్నది.

ఉత్తర హిందూస్థాన పంచాంగకర్తలు ఈ వర్షధాన్యాదులకు వింశోపకములని పేరిడి వ్యవహరించుచున్నారు. వింశోపకము లనగా వారివృష్టిలో వర్షధాన్యాదులకు ప్రక్కనవ్రాసిన యంకెలకు ౨౦ హర

మైయుండునని స్పష్టమగుచున్నది. వర్ష ధాన్యాదులకు వ్రిక్కనయుండు అంకెలు ఎన్ని యేళ్ళు చూచినను ఎచ్చటనైనను ఇరువదికిమించి వచ్చుటలేదుగాన యిరువదిలో వ్రాసిన పాళ్లైయుండునని తలంచి, వింశమనగా ఇరువది గనుక వర్ష ధాన్యాదులకు వింశోపకములని ఉత్తర హిందూస్థానపంచాంగకర్తలు వ్యవహరించియుండునని తోచుచున్నది. వర్షధాన్యాదులకు వింశోపకములని వ్యవహరించుట యుక్తిదూరము. ఏలనన ఏ సంవత్సరమునందైనను గర్జితము ౧ విద్యుత్ ౭ ను మించివచ్చుటలేదు. మిగతా కొన్ని యిరువదికి లోపైన కొంత పరిమితమును మీరి వచ్చుటలేదు గాన పాళ్లన్నిటికి ఇరువది (వింశము) పరమహర మనదగదని విజ్ఞులకు తెలియవచ్చుచున్నది.

మాగురువర్యులు వర్షధాన్యాదులను కొన్నిటిని వ్రాసి అటుపైన "ఏషాం పరమఫలభాగాః" అని కొంతకొంత మొత్తమునుచూపియుండిరి. ఆ విషయమునే మాకు బోధించియున్నారు. ఆయా గణములలోనివాటికి ఫలము ఆ పరమఫల భాగ మొత్తమును మించి యెన్నడును రాదు. ఆగణితప్రక్రియను తెలిసికొని నేను చాలా గ్రంథములను పరిశీలన చేయగా ఒకగ్రంథములోవలె మరియొక గ్రంథములో యుండనందున మా గురువుగారిచే నేను తెలిసికొనియున్నంత మేరకు విమర్శలో వ్రాసిచూపుచున్నాను.

పంచాంగపీఠికలో వ్రాయు ఆదాయ వ్యయములు, కందాయములు వర్షధాన్యాదులు సంక్రాంతిపురుష లక్షణము, ఉపనాయకులు ఇవన్నియు అనేకరీతులుగా నున్నందున కనిపెట్టుట ఇతరులకేగాక పంచాంగకర్తలకుగూడ కష్టమైయుండుటచేత వాస్తవమైన విషయములు పంచాంగకర్తలకే గాక ఇతరులకుగూడ తెలియజేయవలెననెడి నా యభీప్సితము సికింద్రాబాదు వాస్తవ్యులును సుప్రసిద్ధ పుస్తక వ్యాపారము జేయువారున్న ప్రీమియర్ ముద్రణాలయాధికారులును నగు రాజశ్రీ కొండా శంకరయ్యగారికి నేను తెలియజేయగా వారు నాకు తగు విధమున సహాయము చేతునని మాటయిచ్చినందున నే నీ గ్రంథమును వ్రాయుట కవకాశము చిక్కెను. ఇందు గుణదోషము లుండవచ్చును. దోషముల నేరి జూపుచో రెండవ ముద్రణయందు సవరించుకొని ప్రవర్తించెదనని విజ్ఞులకు విన్నవించుకొనుచున్నాడను.



—♦ వర్షధాన్యాదుల పరమఫలభాగనిర్ణయ పట్టిక ♦—

| వరుస సంఖ్య | గణనామము | వస్తు సంఖ్య | పరమఫల భాగములు. |
|---|---|---|---|
| 1 | వర్షాదులు | 12 | 17 |
| 2 | వ్యాధ్యాదులు | 50 | 19 |
| 3 | జ్ఞానాదులు | 6 | 17 |
| 4 | గోమాయునృద్ధ్యాదులు | 14 | 13 |
| 5 | సస్యవృద్ధ్యాదులు (వ్రీహ్యాదులు) | 17 | 16 |
| 6 | క్షుధాదులు | 12 | 13 |
| 7 | పశువిప్రాదులు | 37 | 5 |
| 8 | స్వర్ణవృద్ధ్యాదులు | 9 | 12 |
| 9 | అతివృష్ట్యాదులు | 7 | 17 |
| 10 | విద్యుత్ | 1 | 7 |
| 11 | శిలావర్షం | 1 | 6 |
| 12 | గర్జితం | 1 | 5 |
| 13 | రాజపూజావమానములు | 2 | 6 |
| 14 | ఫలవృక్షాదులు | 10 | 25 |
| 15 | అండజాదులు | 12 | 19 |
| 16 | స్వప్నాదులు | 3 | 12 |
| | మొత్తము. | 194 | |

—♦ వర్షాదుల నిర్ణయము. ♦—

వర్షధాన్యాదుల నిర్ణయమందు వర్తమానాబ్దములనే గ్రహించి గణించవలెను.

శ్లో॥ కల్యాది శ్సక వర్షాణాం వర్తమానాబ్ద సంగుణాః
వర్షధాన్యాదిమేఘూనాం గత వర్షాణి వర్జయేత్॥

అనుట ప్రగాణము.

శ్లో॥ శాకం త్రినిఘ్నం నగభాజితం చ
శేషం ద్వి నిఘ్నం శరసంయుతంచ
లబ్ధం త్రినిఘ్నం గిరిభాజితంచ
శేషం ద్వి నిఘ్నం శరసంయుతం చ॥

శ్లో॥ వర్ష ధాన్యం తదాశీతం తృణ ముష్ణంచ మారుతం
ప్రజావృద్ధిక్షయ శ్చైవ రాజవిగ్రహ మేవచ॥
ఉగ్రంచ పుణ్యం పరతశ్చ పాపం
క్రమేణ లబ్ధాచ్ఛక వత్సరాచ్ఛ
నిరీక్ష్య సమ్యక్ ప్రతివర్ష మేవం
సర్వం వదే జ్జ్యోతిషికః పునశ్చ॥

సర్వధారి సంవత్సరమునకు వర్తమాన శకాబ్దములు ౧౮౭౧ అగును కనుక ఉదాహరణయందు దీనినే గ్రహించి గణితముచేసి సుబోధ యగుటకుగాను చూపుచున్నాను.

గుణితము అనగా గుణింపబడునది. గుణకము అనగా గుణించునది. గుణజము అనగా గుణింపగా వచ్చునది. గుణజమునే కొందరు లబ్ధము అందురు. అట్లనరాదు. గుణితము ౧౮౭౧ శకము. గుణకము 3. గుణజము ౫౬౧౩. విభాజ్యము అనగా భాగింపబడవలసిన సంఖ్య. ఒకానొకప్పుడు గుణజము విభాజ్యముగా మారును. విభాజకము అనగా భాగించు సంఖ్య. లబ్ధము అనగా భాగించగా వచ్చు సంఖ్య. దీనినే విభక్తమనియు నందురు. శేషమనగా మిగులునది. విభాజ్యము ౫౬౧౩ విభాజకము ౭ లబ్ధము ౮౦౧ శేషము ౬ భాజిత మనగా భాగించు సంఖ్య. నిఘ్నమనగా గుణించుట. సంయుత మనగా కలియగూడుట (కలుపుట) యని యర్థము.

ఉదాహరణము :—వర్తమాన శకాబ్దములు ౧౮౭౧.



౧౮౭౧
3
౭ | ౫౬౧౩
౮౦౧—౬ × ౨=౧౨ × ౫=౧౭ వర్షం
3
౭ | ౨౪౦౩
౩౪౩—౨ × ౨=౪ × ౫=౯ ధాన్యం
3
౭ | ౧౦౨౯
౧౪౭—౦ × ౨=౦ × ౫=౫ శీతం.

ఈ విధముగ మిగిలిన వాటిని సాధించవలెను.

వర్షాది గణములో వస్తుసంఖ్య ౧౨ ఎట్లనిన :— (1) వర్షం (2) ధాన్యం (3) శీతం (చలి) (4) తృణం (గడ్డి) (5) ఉష్ణం (వేడి) (6) మారుతం (గాలి) (7) ప్రజావృద్ధి (శిశువుల పుట్టుక) అనగాజనాభాయందు పెరుగుదల (Birth rate). (8) ప్రజాక్షయం (ప్రజా మరణములు) (Daeth rate) (9) రాజవిగ్రహం(రాజులకుయుద్ధము లేక రాజకీయ వడిదుడుకులు) (10) ఉగ్రం (రౌద్రం లేక కోపావేశము) (11) పుణ్యం (12) పాపం. ఈ పన్నెండింటికి పరమఫలభాగములు ౧౭. ఎప్పుడును ౧౭ కంటె మించి రావు. వర్షధాన్యాదులు శాలివాహన శక వర్షములబట్టియు, కల్యాది శక వర్షములబట్టియు కనుగొనబడును. గణిత మునకు ఉపపత్తియు కానరాదు. గ్రహగతి సంబంధమున్నులేదు. కనుక ఫలము రుజువిచ్చుననుటకు వీలులేదు. అట్లన్నను వర్షధాన్యాదులు వ్రాయుటలేదేమి ? అను పామరజనాదు లడుగకుండుటకుగాను లోక మర్యాద ననుసరించి (లోక పరిపాటివలన వ్రాయబడినవి). వర్షధాన్యాదులను వ్రాయక వదలినను దోషము కానేరదనుట తథ్యము.

## —♦ వ్యాధ్యాదుల నిర్ణయము. ♦—

శ్లో॥ వసుఘ్నం నందసంభక్తం శాకాచ్ఛేషం ద్విసంగుణం
త్రియుతం వ్యాధయశ్చైవ ఘనశ్చైవ క్రమేణతు॥

వర్తమాన శాలివాహన శకాబ్దములను ౮ చే గుణించి ౯ చే భాగించగా వచ్చు శేషమును ౨ చే గుణించి ౩ ను కలుపవలెను. లబ్ధసంఖ్యను ౮ చే గుణించి ౯ చే భాగించగా వచ్చు శేషమును ౨ చే గుణించి ౩ ను చేర్చవలెను. ఇట్లే అంతయు గణించదగును.

శ్లో॥ వ్యాధిర్వ్యాధ్యుపశమనమాచారం దుష్ప్రవర్తనం
జన్మాని మరణంచైవ దేశోపప్లవమేవచ॥ ౧

శ్లో॥ దేశస్వాస్థ్యం చోరభయం తన్నాశశ్చ తతః పరం
తతస్త్వగ్నిభయం నాశం మృగోపద్రవమేవచ॥ ౨

శ్లో॥ మృగక్షయం కీటభయం కీటనాశనిమేవచ
మూషకోద్భవనాశశ్చ సర్పోపద్రవ నాశనమ్॥ ౩

శ్లో॥ కామం లోభం చ మోహం చ మదమాత్సర్యమేవచ
సుఖం దుఃఖంచ భోగంచ విడంబం మానవేదనమ్॥ ౪

శ్లో॥ ద్వేషం ప్రతిష్ఠాఽప్రతిష్ఠాద్యూతం మత్తం నరాస్త్రియః
ధాతుర్వాదం భయం శౌర్యం దుష్టనిగ్రహమేవచ॥ ౫

శ్లో॥ శిష్టానాం పాలనం సత్యాసత్యం విశ్వాసమేవచ
విశ్వాసఘాతకంచైవ దయాస్యాన్నిర్దయాళుతాః
న్యాయంచా న్యాయకంచైవ ఇహ సాంవత్సరే ఫలమ్॥

వ్యాధ్యాదిగణితములో వస్తుసఖ్య ౫౦. అవేవియనగా (1) వ్యాధి (రోగం) (2) వ్యాధ్యుపశమనం (రోగములవల్ల మరణము) ఉపశమన మనగా కొందరు తగ్గుట యని భావింతురు. యమునకు శముడనియు ఉపశముడనియు పేర్లుగలవు. "శమ యతి ప్రాణిన ఇతి శమనః." శమ ఉపశమనే—ప్రాణులను శమింపజేయువాడు అని ఉత్పత్త్యర్థము. కనుక ఉపశమన మనగా మరణమనియే భావించదగును (3) ఆచారం (వంశపారంపర్యంగానున్న మంచి నడవడికయే ఆచారము) (4) దురాచారము (దుష్ప్రవర్తనము) (5) జన్మ (పుట్టుక) జనాభాయందు పెరుగుదల (Birth rate) (౬) మరణం (Death rate) (7) దేశోపప్లవం (భూకంపము) దేశమందు రాజకీయ పడిదుడుకులనియు చెప్పవచ్చును. (8) దేశస్వాస్థ్యం (దేశమునం దెట్టి ఉపద్రవములు లేకయుండుట లేక దేశశాంతి) (9) చోరభయం (దొంగలవల్ల భయం) (10) తన్నాశం (అందువల్ల కలుగు నష్టం) (11) అగ్నిభయం (12) తన్నాశం (13) మృగోపద్రవము (అడవి జంతువులవల్ల బాధలు) (14) మృగక్షయం (అడవి జంతువులు నశించుట) (15) కీటభయం (పురుగులవల్ల భయం) (16) తన్నాశం (17) మూషకభయం (ఎలుకలవల్ల భయం) (18) తన్నాశం (19) సర్పోపద్రవం (పాములవల్ల ప్రమాదములు) (20) తన్నాశం (21) కామం (స్త్రీలను పొందవలెనను కోరిక) (కోరికలు పెరుగుట) (22) లోభం (ఏ విషయమందైనను తెంపులేని యాశ) (23) మోహం (మైమరచుట దీనినే మూర్ఛయనియు ననుట గలదు) లేక ప్రేమించుటయు ననియు చెప్పనగును. (24) మదం (విద్యాధనాదులచే వచ్చెడి గర్వం) (25) మాత్సర్యము (పరుల మేలు చూచి సహింపలేని గుణము) లేక (యితరులు దుఃఖించుచుండగా చూచి సంతోషించుగుణము) (26) సుఖం (27) దుఃఖము (28) భోగం (ఇంద్రియ సుఖము) (29) విడంబం (ఎడబాటు) (30) మనోవేదన (మనస్తాపము) (31) ద్వేషం (ప్రీతిలేకపోవుట) (32) ప్రతిష్ఠ (కీర్తి) (33) అప్రతిష్ఠ (అపకీర్తి) (34) ద్యూతం (జూదము) (35) మత్తత (మద్యపానాదులచే దేహము మరచియుండుట) (36) నరః (పురుషుల సంఖ్య) (37) స్త్రియః (ఆడవాండ్ల సంఖ్య) (38) ధాతువాదం (బంగారాది లోహముల వ్యాపారము) (Speculation) (సాహస వ్యాపారము) (39) భయం (40) శౌర్యం (సాహస కార్యములు చేయునట్టి బలము గలిగి యుండుట. దీనినే వీరత్వ మనవచ్చును.) (41) దుష్టనిగ్రహము (దుర్మార్గులను బంధించియుంచుట; లేక దుర్మార్గులను చంపుట) (42) శిష్టపాలనం (సన్మార్గులను రక్షించుట) (43) సత్యం (44) అసత్యం (45) విశ్వాసం (నమ్మిక) (46) అవిశ్వాసం (అపనమ్మిక) (47) దయ (ప్రేమ) (48) నిర్దయ (ప్రేమ లేకుండుట) (49) న్యాయం (తనకు దగిన ధర్మమువలన చలింపకయుండుట) (50) అన్యాయం (తనకుదగినధర్మము నుండి తప్పుట). వ్యాధ్యాదిగణమున పరమఫలభాగలు ౧౯. అనగా వ్యాధ్యాదులలో ఏదైనను ఎప్పుడైనను ౧౯ కంటె మించి కలుగనేరవు. ఉదాహరణ :—

౧౮౭౧

౮

౯ | ౧౪౯౬౮

౧౬౬౩—౧×౨×౩=౫ వ్యాధి

—♦ జ్ఞానాదుల నిర్ణయము. ♦—

శ్లో॥ శకాబ్దాశ్చ ద్వి సంగుణ్యాం నవభిర్భాజితు క్రమాత్
తచ్ఛేషం ద్విగుణీకుర్యా ద్రూపం చైవతు మిశ్రితం॥
జ్ఞానాజ్ఞానేచ కాపట్యం నిష్కాపట్యం చ ధార్మికం
అధార్మిక మితి జ్ఞేయం సంవత్సర ఫలస్మృతం॥

వర్తమాన శకాబ్దములను ౨ చే గుణించి ౯ చే భాగించగవచ్చు శేష సంఖ్యను రెండుచే గుణించగా వచ్చిన సంఖ్యకు ఒకటి కలుపవలెను. లబ్ధసంఖ్య సంఖ్యనుకూడా ఇదే రీతిని గణించవలెను. జ్ఞానాదిగణము లోని వస్తుసంఖ్య ౬. వీటి పరమ ఫలభాగములు ౧౭.

(1) జ్ఞానం (తెలివి) (2) అజ్ఞానం (తెలివి తక్కువ) (3) కపటం (నీచనడవడిక. కుత్సితమైన నడవడిక దీనినే మోసము అని యందురు) (4) నిష్కపటం (మోసముచేయ నిచ్ఛ లేకుండుట) (5) ధార్మికం (ధర్మ కార్యాదులను చేయవలెనను యిచ్ఛ) లేక వేదవిహితమైన కర్మలు చేయవలెనను యిచ్ఛ, [6] అధార్మికం [అధర్మకార్యములు చేయవలెనను యిచ్ఛ].

ఉదాహరణ :—

౧౮౭౧

౨

౯ | ౩౭౪౨

౪౧౫—౭×౨×౧=౧౫ జ్ఞానం.

—♦ గోమాయు వృద్ధ్యాదుల నిర్ణయము. ♦—

శ్లో॥ శకాబ్దాన్ రామగుణితాన్ బాణసంఖ్యా విభాజితాన్
తచ్ఛేషం త్రిగుణీకృత్య శశియుక్తం తతః క్రమాత్॥



గోమాయు వృద్ధి స్తన్నాశః సస్యకీటస్య తత్క్షయః
శలభోద్భవ తన్నాశౌ మశకా మత్కుణోద్భవం
వృశ్చికోద్భవ తన్నాశో జ్ఞాతవ్యం వత్సరే ఫలమ్॥

వర్తమాన శాలివాహన శకాబ్దములను 3 చే గుణించి ౫ చే భాగించగ వచ్చు శేష సంఖ్యను 3 చే గుణించి ౧ చేర్చవలెను. ఇట్లే తక్కిన వానిని సాధింపనగును. గోమాయు వృద్ధ్యాదిగణములోని వస్తు సంఖ్య ౧౪. అవేవనగా (1) గోమాయువృద్ధి ("గాః మినోతి క్షిపతీతి గోమాయుః") (గోవులను బోదోలునది నక్క) (2) తన్నాశం (వాటి నాశము) (3) సస్యకీటక వృద్ధి (పంటలకు హాని కలుగచేసే చీడపురుగులు మొదలగు పురుగుల పుట్టుక) (4) తన్నాశం (5) శలభవృద్ధి (మిడుతల పుట్టుక) (6) తన్నాశం (7) మశకవృద్ధి (దోమల పుట్టుక) (8) తన్నాశం (9) మత్కుణవృద్ధి (నల్లుల పుట్టుక) (10) తన్నాశం (11) వృశ్చిక వృద్ధి (తేళ్ల పుట్టుక) (12) తన్నాశం (13) వ్యాఘ్రవృద్ధి (14) తన్నాశం. గోమాయు వృద్ధ్యాదులకు పరమ ఫల భాగములు ౧౩.

—♦ సస్య వృద్ధ్యాదుల నిర్ణయము. ♦—

శ్లో॥ కల్యబ్దాన్ పంచభిర్గుణ్యాం చాష్టభిర్భాగ మాహరేత్
తచ్ఛేషం ద్విగుణీకృత్యయుగ్మయుక్త్యం పునః పునః॥ ౧
వ్రీహి శాలి కుళుత్థాశ్చ తిలమాషాశ్చ ముద్గరాః
సర్షపా శ్చణకాశ్చైవ అఢకాశ్చ తతః పరమ్॥ ౨
గోధూమాః కోద్రవాశ్చైవ తత శ్చైవ ప్రియంగువః
యావనాలా స్తత శ్చైవ శ్యామాకా రాజమాషకాః
నీవార శ్శింబి ధాన్యాని చై తేషాం వృద్ధి రుచ్యతే॥

ఉదా :—సర్వధారి సం॥ కు కల్యాద్యబ్దములు (వర్తమానాబ్దములు.)

౫౦౫౦

౫

౮ | ౨౫౨౫౦

౩౧౫౬—౨×౨=౪×౨=౬ వ్రీహి.

౫

౮ | ౧౫౭౮౦

౧౯౭౨—౪×౨=౮×౨=౧౦ శాలి.

ఇట్లే తక్కిన వాని సాధించుకొనవచ్చును.

వ్రీహ్యాది సస్యగణములోని వస్తుసంఖ్య. అవేవియనగా (1) వ్రీహి (ఎఱ్ఱని ధాన్యము. ఇది ఎరుపు తెలుపుకలిసియున్న పాటలీపుష్పము యొక్క రంగుగల్గియున్న ధాన్యము) (పాటలీ పుష్పము అనగా కలిగొట్టు పువ్వు) (2) శాలి (అరువది దినములకు పండెడి ధాన్యములను శాలిధాన్యము లందురు. వీటినే రాజనాలందురు) (3) కుళుత్థ (ఉలవలు) (4) తిల (నువ్వులు) (5) మాష (మినుములు) (6) ముద్గర (పెసలు) (7) సర్షప (ఆవాలు) (8) చణక (సెనగలు) (9) ఆఢక (తొవర్లు లేక బొబ్బర్లు) వీటికి పరమ ఫల భాగములు ౧౬. ఇవిగాక మరికొన్నిటిని కొందరు చేర్చి చెప్పుచున్నందున వాటినికూడ చూపియుంటిని. అవి ఏవనగా (1) గోధుమ (2) కోద్రివ (ఆళ్ళు) (3) ప్రియంగు (కొఱ్ఱలు) (4) యావనాల (అలచంద, దీనినే కుల్మాషమందురు). (5) శ్యామాక చామలు (నల్లని వడ్లు) (6) రాజమాషకా (కందులు) (7) నీవార (ఒకడు విత్తకయే పడి మొలచి పండెడి గునుగువరి, దూసర్లుమొదలైన తృణధాన్యములకు నీవారధాన్య మందురు.) (8) శింబి (కాయధాన్యములు - వేరుసనగ అని కొందరు చెప్పుదురు కాని శమీధాన్యము లేక వరిపంటను తగ్గించెడి ధాన్యము. ఈ మొక్కలే కలుపుమొక్కలందురు) కలుపుమొక్కలవల్ల కలుగు ధాన్యమే శింబిధాన్య మనదగి యున్నది.

వ్రీహ్యాది సస్యగణములో గోధూమాదులను చేర్చగా నైన సంఖ్య ౧౭. వీటికి పరమ ఫల భాగములు ౧౬.

## —♦ క్షుధాదుల నిర్ణయము. ♦—

శ్లో॥ శాకంచ వేదగుణితం సప్తభిర్భాగ మాహరేత్
శేషంచ ద్విగుణీకృత్యరూపం చైవతు మిశ్రయేత్
క్షుధా తృషాచ నిద్రాచ ఆలస్యం తూద్యమ స్తథా
శాంతం క్రోధ స్తథా లోభో భేదే మైత్రీ తథైవచ
తతస్తు రసనిష్పత్తిః ఫలనిష్పత్తి రేవచ।
ఉత్సాహాః సర్వలోకానాం జ్ఞాతవ్యం నిశ్చింతం బుధైః॥



శాలివాహన శక వర్తమానాబ్దములను ౪ చే గుణించి ౭ చే భాగించగా వచ్చు శేషమును ౨ చే గుణించి అందు ౧ కలియకూడవలెను.

ఉదాహరణము :—

౧౮౭౧
౪
౭ | ౭౪౮౪
౧౦౬౯—౧×౨=౨×౧=౩ క్షుధా.
౪
౭ | ౪౨౭౬
౬౧౦—౬×౨=౧౨×౧=౧౩ తృష్ణా.

ఇట్లే తక్కినవి సాధించవలయును.

క్షుధాది గణములోని వస్తుసంఖ్య ౧౨. అవి (1) క్షుదా (ఆకలి) (2) తృష్ణా (దప్పి) (3) నిద్ర (4) ఆలస్యం (5) ఉద్యోగం (ప్రయత్నము) (6) శాంతం (7) క్రోధం (8) లోభం (దంభము=దర్పము) లోభం= పిశునత్వము) (9) మిత్రభేదము (10) మిత్రత్వం (స్నేహం) (11) రస నిష్పత్తి (రసవస్తువుల వృద్ధి) (12) ఫలనిష్పత్తి (పండ్లవృద్ధి) వీటి పరమ ఫల భాగములు ౧౩. ఇంతకు మించి ఎన్నడును రానేరవు.

## —♦ పశు విప్రాదుల నిర్ణయము: ♦—

శ్లో॥ కల్యబ్దాః వేదగుణితాః పంచభిర్భాగ మాహరేత్
తచ్ఛేషం రూపసంయుక్తం తల్లబ్దంచ పునః పునః॥
తదాదౌ ధేనుమహిషీ మృగఛ్ఛాగాశ్వదంతినాం
ఉష్ట్ర విప్రక్షత్రియాణాం వైశ్యశూద్రా తథైవచ॥
మ్లేచ్ఛానాం సంకరాణాం చ వృద్ధిం నాశం వదేద్బుధః
వజ్రాది నవరత్నానాం వృద్ధిరేవ వినాశనమ్॥

వర్తమాన కల్యాద్యబ్దములను ౪ చే గుణించి ౫ చే భాగించగా వచ్చు శేషసంఖ్యకు ౧ చేర్చవలెను. లబ్ధమునుగూడ ఇట్లే గణితముచేసి మిగతావి సాధించవలెను.

ఉదా:—సర్వధారి సంవత్సరమునకు వర్తమాన కల్యాద్యబ్దములు ౫౦౫౦.

౫౦౫౦
౪
౫| ౨౦౨౦౦
౪౦౪౦–౦×౧=౧ ధేనువృద్ధి.
౪
౫| ౧౬౧౬౦
౩౨౩౨–౦×౧=౧ తన్నాశం.

నిట్లే తక్కిన వాని సాధించవలెను.

పశు విప్రాది గణములోని వస్తుసంఖ్య ౩౭ అవి క్రమముగా

1. ధేనువృద్ధి (ఆవులకు వృద్ధి) 2. తన్నాశం 3. మహిషీవృద్ధి (గేదలకువృద్ధి) 4. తన్నాశం 5. మృగవృద్ధి (మృగ్యతేలుబ్ధకై రితిమృః. మృగఅన్వేషణే అనగా వేటకాండ్రచే వెదకబడునది గాన మృగము అనగా ఇఱ్ఱి (ఆడులేడి) యని భావము.) 6. తన్నాశం 7. ఛాగవృద్ధి (మేకపోతులవృద్ధి) 8. తన్నాశం 9. అశ్వవృద్ధి (గుఱ్ఱములవృద్ధి) 10. తన్నాశం 11. దంతివృద్ధి (ఏనుగులవృద్ధి) 12. తన్నాశం 13 ఉష్ట్రవృద్ధి (ఒంటె వృద్ధి) 14. తన్నాశం 15. విప్రవృద్ధి (బ్రాహ్మణులవృద్ధి) 16 తన్నాశల 17. క్షత్రియవృద్ధి (రాజులకువృద్ధి) 18. తన్నాశం 19. వైశ్యవృద్ధి ం(కోమటులవృద్ధి) 20. తన్నాశం 21. శూద్రవృద్ధి 22. తన్నాశం 23. మ్లేచ్ఛవృద్ధి (గోమాంసభక్షకోయస్తు లోకబాహ్యంచ భాషతే। సర్వాచారవిహీనోఽ సౌమ్లేచ్ఛ ఇత్యభిధీయతే। "మ్లేచ్ఛంతేఅవ్యక్తం భాషంత ఇతిమ్లేచ్ఛాః॥ మ్లేచ్ఛ అవ్యక్తేశబ్దే" అనురీతిని వ్యక్తముగాకుండ బలుకువారు గనుక మ్లేచ్ఛులు. మ్లేచ్ఛజాతులలో నెమలిపింఛము మొదలైనవి కట్టుకొనువారు కిరాతులు. ఆకులు కట్టుకొనువారు శబరులు. తమభాషయే కాని యొకరిభాష నెఱుగనివారు పుళిందులు, (హిందూదేశములోని కిరాతులు, శబరులు, పుళిందులు మొదలగువారు మ్లేచ్ఛులనబడుదురు.) 24. తన్నాశం 25. సంకరాణాంవృద్ధి (సంకరజాతులులేక



సంకీర్ణజాతులవృద్ధి 26. తన్నాశం 27. వజ్రాది నవరత్నవృద్ధి 28. తన్నాశం. ఇక్కడనుంచి యీదిగువవ్రాసిన శ్లోకము ననుసరించి వస్తుక్రమముగా వృద్ధిమాత్రమే వ్రాయవలెను. ఎట్లనిన:—

శ్లో॥ గారుత్మతం పద్మరాగం వజ్రం వైడూర్యమేవచ
గోమేధికం పుష్యరాగ మింద్రనీలం ప్రవాళకం
మౌక్తికంచేతిరత్నానామే తేషాం వృద్ధిరుచ్యతే॥

29. గారుత్మతవృద్ధి (గరుడపచ్చలవృద్ధి) 30. పద్మరాగవృద్ధి (తామర పువ్వువంటి (గులాబిరంగువంటి) ఎఱువురంగుగల రత్నములనే కెంపులందురు.) 31. వజ్రవృద్ధి (ఇంద్రధనుస్సులండలిరంగులను మెఱయజేయు రత్నమును వజ్రమందురు.) 32. వైడూర్యవృద్ధి (పగటివేళ చీకటుమరుగున దూరిన పిల్లికన్నులవలె ప్రకాశించు రత్నము., 33. గోమేధికవృద్ధి (గోమూత్రమురంగుగల రత్నము.) 34. పుష్యరాగవృద్ధి (గోగుపూవు వన్నెగల్గిన రత్నము.) 35. ఇంద్రనీలవృద్ధి (వెదురుపూవు రంగువలెగాని నెమలిగొంతు రంగువలెనుండు రత్నము) 36. ప్రవాళవృద్ధి (పగడములవృద్ధి) 37. మౌక్తికవృద్ధి (ముత్యములవృద్ధి) ధేన్వాదుల పరమఫల భాగములు ౫

రవికి పద్మరాగము. చంద్రునకుమౌక్తికము. కుజునకుప్రవాళము బుధునకు పుష్యరాగము. గురునకు గారుత్మతము. శుక్రునకు వజ్రము. శనికి ఇంద్రనీలము. రాహువునకు వైడూర్యము. కేతువునకు గోమేధికము. ఆయాగ్రహారిష్ట దోషనివారణకు ఆయాగ్రహరత్నములున్న ఉంగరమును ధరించుటమంచిది. ఈ నవరత్నములను గురించి వ్రాయదగిన దెంతయో గలదు. గ్రహచార ప్రకరణమున సందర్భాను సారముగా వ్రాయబడెను. అచ్చోట చూడుడు.

## —♦ స్వర్ణాదుల నిర్ణయము. ♦—

శ్లో॥ శకాబ్దాత్ వహ్నిభిర్గుణ్యా సప్తభి ర్భాగ మాహరేత్
తచ్ఛేషం ద్విగుణీకృత్య తల్లబ్ధంచ పునః పునః॥
సువర్ణం రజితం తామ్రం రీతిః కాంస్య మయస్తథా
త్రపుసీస రసశ్చైవ వ్యవస్థాప్య యథాక్రమం॥

వర్తమాన శకాబ్దములను 3 చే గుణించి ౭ చే భాగించగా వచ్చు శేషమును ౨ చే గుణించవలెను. ఇందు ఏసంఖ్యయు కలుపవలసిన పనిలేదు.

ఉదాహరణము :—సర్వధారి సం॥రమునకు వర్తమాన శకాబ్దములు ౧౮౭౧.

౧౮౭౧
3
౭ | ౫౬౧౩
౮౦౧—౬×౨=౧౨ సువర్ణవృద్ధి
3
౭ | ౨౪౦౩
౩౪౩—౨×౨=౪ రజత వృద్ధి.

ఇట్లే తక్కిన వానిని సాధింపవలయును.

స్వర్ణాదుల గణములోని వస్తు సంఖ్య ౯. అవి ఏవియనగా (1) స్వర్ణవృద్ధి (బంగారం) (2) రజత వృద్ధి (వెండి) (3) తామ్రవృద్ధి (రాగి) (4) రీతివృద్ధి (ఇత్తడి) (5) కాంస్యవృద్ధి (కంచు) (6) అయోవృద్ధి (ఇనుము) (7) త్రిపువృద్ధి (సత్తు) (8) సీసవృద్ధి (9) రసవృద్ధి (పాదరసవృద్ధి). వీటికి పరమ ఫల భాగములు ౧౨. ఈ సంఖ్యకు మించి ఏ లోహమైనను ఎప్పుడైనను రాదు.

—♦ అతివృష్ట్యాదుల నిర్ణయము. ♦—

శ్లో॥ శకాబ్దే వేదగుణితం వసుభి ర్భాజితం క్రమాత్
తచ్ఛేషం ద్విగుణీకుర్యా దగ్నియుక్తం పునః పునః
అతివృష్టి రనావృష్టి ర్మక్షికా శ్శున సూకరాః
స్వచక్రం వా పరచక్రం స్స్యప్తైతే సంభవంతిచ॥

వర్తమాన శకాబ్దములను ౪ చే గుణించి ౮ చే భాగించగా వచ్చు శేషమును ౨ చే గుణించి అందు 3 ను కలుపవలెను.



ఉదాహరణము :—

౧౮౭౧
౪
౮ | ౭౪౮౪
౯౩౭—౨×౨=౪×3=౭ అతివృష్టి.
౪
౮ | ౩౭౪౮
౪౬౮—౪×౨=౮×3=౧౨ అనావృష్టి.

ఇట్లే మిగిలిన వానిని సాధింపవలయును.

అతివృష్ట్యాదుల గణములోని వస్తుసంఖ్య ౭. (1) అతివృష్టి(అధిక వర్షము) (2) అనావృష్టి (వర్షాభావము) (3) మక్షికవృద్ధి (ఈగలవృద్ధి) (4) శునకవృద్ధి (కుక్కలవృద్ధి) (5) సూకరవృద్ధి (పందులవృద్ధి) (6) స్వచక్రభయం ("చకతిహంతి పరబల మితి చక్రం చక్రతృప్తౌ ప్రతిఘాతేచ." అని ఉత్పత్త్యర్థము. అనగా పరబలమును హింసించునది చక్రము. (చక్రమనగా సేనయని భావార్థము,) స్వదేశసేనవల్ల భయమునే స్వచక్రభయమందురు.) (7) పరచక్రభయం (పరదేశ సేనవల్ల భయం). అతివృష్ట్యాదుల పరమఫల భాగములు ౧౭. ఇంతకుమించి ఎన్నడును కలుగనేరవు.

—♦ 10. విద్యుత్ నిర్ణయము ♦—

శ్లో॥ శాకాబ్దం రామగుణితం వసుసంఖ్యైర్విభాజితం
శేషాద్విద్యుచ్ఛవిజ్ఞేయం ఇహసాం వత్సరేఫలమ్॥

వర్తమాన శాలివాహన శకాబ్దములను 3 చే గుణించి ౮ చే భాగించగా వచ్చు శేషసంఖ్యయే విద్యుత్ గా గ్రహించవలెను.

ఉదా :—సర్వధారి సంవత్సరమునకు వర్తమాన శకాబ్దములు

౧౮౭౧
3
౮ | ౫౬౧౩
౭౦౧—౫ విద్యుత్ (మెఱుపు).

విద్యుద్గణమున వస్తుసంఖ్య. దీనికి పరమఫలభాగములు ౭ ఇంతకు మించి ఎన్నడును కలుగదు.

## —♦ శిలావర్ష నిర్ణయము ♦—

శ్లో॥ శాకాబ్దం రామగుణితం సప్తసంఖ్యా విభాజితం
తచ్ఛే శేశ్చ శిలాపాతం విజ్ఞేయంచ యథాతథా॥

వర్తమాన శకాబ్దములను ౩ చే గుణించి ౭ చే భాగించగా వచ్చు శేష సంఖ్యయే శిలాపాతమగును.

ఉదాహరణం:—సర్వధారి సంవత్సరమునకు శాలివాహన శక వర్తమానాబ్దములు ౧౮౭౧.

౧౮౭౧
౩
౭ | ౫౬౧౩
౮౦౧-౬ శిలాపాతం (రాళ్ళవాన; వడగండ్లవాన) శిలా పాత గణమున వస్తుసంఖ్య ఒకటియే. దీనికి పరమఫల భాగములు ౬ ఇంతకుమించి ఎన్నడును కలుగనేరదు.

## —♦ గర్జిత నిర్ణయము ♦—

శ్లో॥ శాకాబ్దో రామగుణితో రిపుభిర్భాజితః క్రమాత్
శేషంహిగర్జితంజ్ఞేయ మిహసాం వత్సరేఫలమ్॥

వర్తమాన శకాబ్దమును ౩ చే గుణించి ౬ చే భాగించగావచ్చు శేషమే గర్జిత మగును.

సర్వధారి సంవత్సరమునకు వర్తమాన శకాబ్దములు ౧౮౭౧

౧౮౭౧
౩
౬ | ౫౬౧౩
౯౩౫-౩ గర్జితం (ఉఱుము; పిడుగు)



గర్జితగణములోని సంఖ్య ఒకటియే. దీనికి పరమఫల భాగములు ౫ ఇంతకుమించి ఇది యెన్నడును రానేరదు.

## —♦ రాజాపూజావమాన నిర్ణయ విమర్శ ♦—

రాజపూజావమాన సాధనమందు మనవారు అష్టోత్తరీదశా పద్ధతిలో గ్రహములకు చెప్పబడిన సంఖ్యలనే యిచ్చట గ్రహించి చూపుచున్నారు. వింశోత్తరీ దశాపద్ధతిలో గ్రహములకు చెప్పఁబడిన సంఖ్యల నేల గ్రహింపక వదలిరో తెలియకున్నది. ఆయుర్దాయ నిర్ణయమందనేక రీతులున్నవని బృహత్పరాశర సంహితయందు చెప్పబడెను. అన్నిటికంటె వింశోత్తరీ దశాపద్ధతియే శ్రేష్ఠమైనదని అందుచెప్పబడెను. కాని ఉత్తర హిందూస్థాన వాసులలో కొందరు వింశోత్తరీ దశాపద్ధతిని గ్రహించుచున్నను అచ్చట అష్టోత్తరీదశా పద్ధతియే మిగుల ప్రచార ములో నున్నదని తెలియవచ్చుచున్నది. ఉత్తరహిందూస్థాన పండితులు వ్రాసిన గ్రంథములే దక్షిణ హిందూస్థాన పండితులు ప్రమాణగ్రంథములని స్వీకరించుటలో దోషములేదు కాని యుక్తిదూరములును. దక్షిణదేశాచార విరుద్ధముగానుండు విషయములనైనను సవరించుకొని ప్రవర్తించుట సమంజసమై యున్నది. కావున, నేను ఈ విషయమై కొంత సాహసముగా ప్రవర్తించుచున్నందులకు విజ్ఞులు మన్నించెదరు గాక!

## —♦ అష్టోత్తరీదశా పద్ధతిలో గ్రహసంఖ్యా నిర్ణయము ♦—

శ్లో॥ సూర్యశ్చంద్రః కుజః సౌమ్యః శని ర్జీవస్తమో భృగుః
ఏతే దశాధిపాః ప్రోక్తా వినాకేతుం నవగ్రహాః॥
రసాః పంచేందవోనాగాః శైలచంద్ర నభేందవః
గోబ్జాః సూర్యకునేత్రాశ్చ సమాః ప్రత్యేదనాదయః॥

—పరాశరహోరాయాం

శ్లో॥ అష్టోత్తరీ ద్విధాప్రోక్తా శివాద్యా కృత్తికాదితః॥

—పరాశరహోరాయాం

అష్టోత్తరీదశా పద్ధతిలో ఆర్ద్రా నక్షత్రమునుండిగాని కృత్తికా నక్షత్రమునుండిగాని జన్మనక్షత్రము వరకు లెక్కించి దశలు కట్టవచ్చునని రెండువిధముల జెప్పఁబడెను. ఏ నక్షత్రమునుండి దశలు సాధించినను గ్రహదశా సంవత్సరములందు మార్పులేదు. అష్టోత్తరీదశా పద్ధతిలో కేతువును వదలి మిగతా గ్రహములకు దశా సంవత్సరములు నిర్ణయింపఁబడెను. ఎట్లనిన రవికి ౬ చంద్రునకు ౧౫ కుజునకు ౮ బుధునకు ౧౭ శనికి ౧౦ గురునకు ౧౯ రాహువునకు ౧౨ శుక్రునకు ౨౧ సంవత్సరములుగా నిర్ణయింపఁబడెను.

—♦ వింశోత్తరీ పద్ధతిలో గ్రహసంఖ్యా నిర్ణయము ♦—

శ్లో॥ దహనాత్స్వర్క్ష పర్యంతం గణయేన్నవభిర్హరేత్
సూర్యేందుభౌమజతమసో వాకృతిర్మంద చంద్రజౌ
కేతుశుక్రౌ క్రమాదేతే విజ్ఞేయాశ్చ దశాధిపాః।
రసాశాముని ధృత్యబ్ధా భూపతి ధృతివత్సరాః
సప్తేందవో నగావ్యోమ బాహవో భాస్కరావితః॥

వింశోత్తరీ పద్ధతిలో కృత్తికాదిగా జన్మనక్షత్ర పర్యంతం లెక్కించగా వచ్చిన నక్షత్రసంఖ్యను 9 చే భాగించగా వచ్చు శేషసంఖ్యా క్రమము ననుసరించి దశలను కనుగొనవచ్చును. శేషసంఖ్య (1) రవి (2) చంద్ర (3) కుజ (4) రాహు (5) గురు (6) శని (7) బుధ (8) కేతు (9) శుక్రుడు యీక్రమము ననుసరించి దశలు ఏర్పడును. గ్రహదశాక్రమము ననుసరించి ౬, ౧౦, ౭, ౧౮, ౧౬, ౧౯, ౧౭, ౭, ౨౦ సంవత్సరములను ఆయా గ్రహదశా పరిమిత వత్సరములుగా నిర్ణయింపఁబడెను.

అష్టోత్తరీదశాపద్ధతిలో రాహువును విడిచినచో అందలిగ్రహ సంవత్సరముల మొత్తము ౯౬ అగును. వింశోత్తరీ దశాపద్ధతిలో ఛాయా గ్రహములగు రాహు కేతువులను వదలివేసినచో మిగతా గ్రహ సంవత్సరముల మొత్తము ౯౫ అగును. యీ రెండుదశాపద్ధతులలో ఛాయా గ్రహములను వదలివైచి మిగతా గ్రహదశా సంవత్సరములందు ఏర్పడిన భేదము ఒకసంవత్సరమై యున్నది.



కృత్తికా యుగమందే వింశోత్తరీదశా ప్రారంభమైనదని తెలియుచున్నది. అష్టోత్తరీ దశా పద్ధతి యిటీవల కల్పింపబడినదని అందలి ఆర్ద్రాది గణనయే చెప్పుచుండ దానిని కూడా కృత్తికా యుగమునకు చేర్చవలెనను తలంపులోనే కృత్తికాదిగ గణించుటయు గలదని అష్టోత్తరీ దశా క్రమములో ద్వివిధ రీతులుగా చెప్పబడెనని స్పష్టమగుచున్నది. ప్రసంగానువశమున చాలాదూరము వచ్చుచున్నాము. దీనిని గురించి విమర్శించదగిన దెంతయో గలదు. ప్రకృతమున తద్విమర్శ చేయుచో గ్రంథవిస్తర భీతిని వదలివేయుచున్నాను. ఉత్తర దక్షిణ హిందూస్థానములలో మిగుల ప్రచారమును బడసిన కారణమున అష్టోత్తరీ వింశోత్తరీ పద్ధతుల ననుసరించియే రాజపూజావమానములు వ్రాసి చూపుచున్నాను.

రాశీశులు అష్టోత్తరీ వింశోత్తరీ పద్ధతులయందొకే మాదిరిగానున్నందున విమర్శింపవలసినది లేదు.

—♦ రాశీశ నిర్ణయము. ♦—

శ్లో॥ కుజ శుక్రజ్ఞ చంద్రార్క బుధభార్గవభూమిజాః
గుర్వర్కిసౌరగురవః క్రమాన్మేషాది నాయకాః॥

—♦ సులభ పద్ధతిచే రాశీశుల నిర్ణయము ♦—

శ్లో॥ సింహస్యాధిపతి స్సూర్యచంద్రః కర్కటకేశ్వరః
మేషవృశ్చికయో ర్భౌమః కన్యామిథునయో ర్బుధః
ధనుర్మీనద్వయో ర్మంత్రీ తులావృషభయో ర్భృగుః
మకరే కుంభరాశౌచ నాయక స్సూర్యనందనః॥

సింహరాశికి అధిపతి రవి. కటకరాశ్యధిపతి చంద్రుడు. మేషవృశ్చికములకు అధిపతి కుజుడు. కన్యామిథునములకు అధిపతి బుధుడు. ధనుర్మీనములకు అధిపతి గురుడు. తులావృషభములకు అధిపతి శుక్రుడు. మకర కుంభములకు అధిపతి శని.

—♦ రాజపూజావమాన నిర్ణయము. ♦—

శ్లో॥ రాశిసంఖ్యా నృపశ్చైక్యం త్రినిఘ్నం బాణసంయుతం
మునిభిర్భాజితం శేషం రాజపూజ్య మిహోచ్యతే

తల్లబ్ధం పురనిఘ్నంచ పంచసంఖ్యాయుతం పదం
మునిభిర్భాజితం శేషం అవమాన మితి స్మృతం॥

మేషాది క్రమముగా ద్వాదశ రాసులకు ఏర్పడు సంఖ్యయే రాశి సంఖ్య యనబడును, రాజపూజావమానములను ఏ సంవత్సరమునకు సాధించవలెనో ఆ సంవత్సరమునకు రాజు ఏ గ్రహమో చూడవలెను. రాజగ్రహమునకు చెప్పబడిన సంఖ్యను, రాశి సంఖ్యలో చేర్చగానైన సంఖ్యను ౩ చే గుణించి ౫ చేర్చగా వచ్చు మొత్తమును ౭ చే భాగించగా వచ్చు శేషము రాజావమాన మనబడును.

ఉదాహరణము :—సర్వధారి సంవత్సరమునకు రాజు శని. మేషరాశివారికి రాజపూజావమానములు చూపబడుచున్నవి.

(ఎ) అష్టోత్తరీ పద్ధతిచే గణితముచేసి చూపబడుచున్నది.

రాజు శని. అష్టోత్తరీ పద్ధతిచే రాజగ్రహమున కేర్పడెడి సంఖ్య ౧౦. మేషరాశివారికి రాజపూజావమానములు చూడవలసియున్నందున రాశి సంఖ్య ౧ అగును. రాశి సంఖ్య రాజగ్రహ సంఖ్య కలిపినచో ౧౧ అగును.

౧౧×౩=౩౩×౫=౩౮÷౭ లబ్ధసంఖ్య ౫ శేషసంఖ్య ౩ రాజపూజ్యము.

లబ్ధసంఖ్య ౫×౩=౧౫×౫=౨౦÷౭ లబ్ధసంఖ్య ౨ శేషసంఖ్య ౬ రాజావమానము.

(బి) వింశోత్తరీ పద్ధతిచే గణితముచేసి చూపబడుచున్నది.

రాజు శని. వింశోత్తరీ పద్ధతిచే రాజగ్రహమునకు చెప్పబడిన సంఖ్య ౧౯. మేషరాశివారికి రాజపూజావమానములు చూడవలసియున్నందున రాశి సంఖ్య మేషాదిగా లెక్కించిన ౧ అగును. రాశి సంఖ్యను రాజగ్రహ సంఖ్యలో చేర్చగానైన మొత్తము ౨౦.

౨౦×౩=౬౦×౫=౬౫÷౭ లబ్ధసంఖ్య ౯ శేషసంఖ్య ౨ రాజపూజ్యము.

లబ్ధసంఖ్య ౯×౩=౨౭×౫=౩౨÷౭ లబ్ధసంఖ్య ౪ శేషసంఖ్య ౪ రాజావమానము.



ఈ విధముగా మేషాది రాసులవారికి అష్టోత్తరీ పద్ధతిచేతను, వింశోత్తరీ పద్ధతిచేతను రాజపూజావమానములను సాధింపదగును.

పంచాంగ కర్తలు వర్షధాన్యాది యోగములందు అష్టోత్తరీదశా పద్ధతి ననుసరించి మేషరాశికి సాధింపబడిన రాజపూజావమానములను చూపుచున్నారు. అట్లు వ్రాయుట సత్యదూరమని గ్రహించవలెను. వర్షప్రవేశ లగ్నమును సాధించి తద్రాశి సంఖ్యతో రాశిగ్రహసంఖ్యను చేర్చి పై విధముగా అష్టోత్తరీ, వింశోత్తరీ పద్ధతులచే రాజపూజావమానములను సాధించి వర్షధాన్యాదియోగములందు చూపుటయే మంచిదని తోచుచున్నది. కనుక పంచాంగకర్తలీ విషయమును గమనించి ప్రవర్తించెదరని నమ్ముచున్నాను. వర్షప్రవేశ లగ్నమున కొక ఉదాహరణము వ్రాసి చూపిన బాగుండుననువారు కొందరుండకపోరు. గ్రంథవిస్తర భీతిని వదలివేయడమైనది.

## —♦ ఫలవృక్ష వృద్ధ్యాదులు. ♦—

శ్లో॥ శకాబ్దే వేదగుణితే నవభిర్భాగ మాహరేత్
తచ్ఛేషం త్రిగుణీకృత్య రూపయుక్తం పునః పునః॥
పనసం నారికేళంచ మాతులుంగ మతః పరం
జంబీరం చాపి ఖర్జూరం రంభా చూతకపిత్థకాః
తింత్రిణీ చాపి ధాత్రీ చ ఫలానాం వృద్ధయః స్మృతాః॥

వర్తమాన శాలివాహన శకాబ్దములను ౪ చే గుణించి ౯ భాగించగా వచ్చు శేషమును ౩ చే గుణించి ౧ చేర్చవలెను.

ఉదాహరణము :—

౧౮౭౧
౪
౯ | ౭౪౮౪
౮౩౧—౫×౩=౧౫×౧=౧౬ పనసవృద్ధి.
౪
౯ | ౩౩౨౪
౩౬౯—౩×౩=౯×౧=౧౦ నారికేళ వృద్ధి.

ఇట్లే తక్కిన వానిని సాధింపనగును.

ఫలజాతి వృక్షగణములోని వస్తుసంఖ్య ౧౦. అవి క్రమముగా (1) పనస (2) నారికేళ (కొబ్బరికాయ) (3) మాతులుంగ (మాదీఫలం) (4) జంబీరం (నిమ్మ) (5) ఖర్జూరం (6) రంభాఫలం (అరటి పండు) (7) చూతఫలం (మామిడిపండు) (8) కపిత్థం (వెలగపండు) (9) తింత్రిణీ (చింత పండు) (10) ధాత్రీఫలం (ఉసిరిక) వీటికి పరమ ఫల భాగములు ౨౫. ఇంతకు మించి కలుగవు.

—♦ అండజాదుల నిర్ణయము. ♦—

శ్లో॥ శకాబ్దాన్ త్రిగుణీకృత్య సప్తభిర్భాగ మాహరేత్
శేషంతు ద్విగుణీ కుర్యాద్బాణయుక్తం పునః పునః॥
అండజా స్వేదజాశ్చైవ ఉద్భిజ్జాశ్చ జరాయుజాః
స్థావరా జంగమాశ్చైవ వృద్ధిక్షయ యథాక్రమమ్॥

వర్తమాన శకాబ్దములను 3 చే గుణించి ౭ చే భాగించగా వచ్చు శేషమును ౨ చే గుణించి ౫ చేర్చవలెను.

ఉదాహరణము :—

౧౮౭౧
3
౭ | ౫౬౧౩
౮౦౧—౬ × ౨ = ౧౨ × ౫ = ౧౭ అండజ వృద్ధి
3
౭ | ౨౪౦౩
౩౫౩—౨ × ౨ = ౪ × ౫ = ౯ తన్నాశం.

ఇట్లే తక్కిన వానిని సాధింపనగును.

అండజాదుల గణములోని సంఖ్య ౧౨. (1) అండజవృద్ధి (గ్రుడ్డువల్ల పుట్టేవి) (2) తన్నాశం (3) స్వేదజవృద్ధి (ఉక్క లేక చెమటవల్ల పుట్టేవి) (4) తన్నాశం (5) ఉద్భిజ్జవృద్ధి (భూమిని బ్రద్దలుచేసి పైకి వచ్చు తరుగుల్మ లతాదులు) (6) తన్నాశం (7) జరాయుజవృద్ధి (మావివలన పుట్టేవి నరపశ్వాదులు) (8) తన్నాశం (9) స్థావరవృద్ధి



(గిరివృక్షాది స్థిరముగా నుండెడి జీవజాతి) (10) తన్నాశః (11) జంగమ వృద్ధి (కదలునవి) (12) తన్నాశం వీటికి పరమ ఫల భాగములు ౧౯. ఇంతకు మించి యివి యెన్నడును బోనేరవు.

—♦ స్వప్నాదుల నిర్ణయము. ♦—

శ్లో॥ శాకాబ్దాన్ త్రిగుణీకృత్య సప్తభిర్భాగ మాహరేత్
శేషంతు ద్విగుణీకృత్య శూన్యయుక్తం పునః పునః॥
స్వప్నం సుషుప్తి జాగ్రచ్చ విజ్ఞేయాని సునిశ్చితా॥

వర్తమాన శకాబ్దములను 3 చే గుణించి ౭ చే భాగించవలెను. శేషమును ౨ చే గుణించి సున్న కలుపవలెను

ఉదాహరణము :—

౧౮౭౧
3
౭ | ౫౬౧౩
౮౦౧—౬ × ౨ = ౧౨ × ౦ = ౧౨ స్వప్నం
3
౭ | ౨౪౦౩
౩౪౩—౨ × ౨ = ౪ × ౦ = ౪ సుషుప్తి
3
౭ | ౧౦౨౯
౧౪౭—౦ × ౨ = ౦ × ౦ = ౦ జాగ్రత్.

దీని తరువాతనే 6 వ గణములోని అనగా క్షుధాది గణములోని ఉత్సాహ మెన్నిపాళ్లు గల్గియున్నదో అద్దానినే అచ్చట చూపిన సంఖ్యనే మరల యిచ్చట వ్రాయుట సిద్ధాంత సాంప్రదాయమై యున్నది. కనుక అట్లుగ ప్రవర్తించవలెను. స్వప్నాది గణమున వస్తుసంఖ్య ౩. వీటి పరమ ఫల భాగములు ౧౨.

—♦ వింశోపకాదులను గురించిన చరమ శ్లోకము. ♦—

శ్లో॥ వింశోపకాస్తు బహుభి ర్బహుధోన్నతాశ్చ కారణా జ్ఞానాత్
నాత్రిస్వపరోక్తిభిధాభీతిర్న క్షుత్రసూచికానామల్పా-ఇతి॥

అత్రి జ్యోతిర్నిబంధన వర్షప్రబోధ వసిష్ఠసంహిత, ముహూర్త గణపతి, బృహద్దైవజ్ఞరంజనాది ప్రసిద్ధ గ్రంథోక్త శ్లోకాః కతిచన సంగృహీతాః. ఇతి లోకస్సంగ్రహాః సామాన్యానాం వినోదాయ.

—♦ గ్రహచారలందు వ్రాయదగిన విశేష శ్లోకములు. ♦—

రవ్యాది గ్రహచారలు వ్రాయునపుడు తద్గ్రహములలో ఏగ్రహమునకు రాజరికము, సేనాధిపత్యము, సస్యాధిపత్యములు ఒకేసారి వచ్చునో అట్టి సమయమందును, యీ మూడాధిపత్యములలో ఏ రెండాధిపత్యములైన కలిగియున్నపుడును యీ దిగువ నుదహరించిన శ్లోకములను ఆ యా గ్రహచారఫలములందు వ్రాసి చూపవలెను. ఇవన్నియు నారదసంహితనుండి సంగ్రహించి వ్రాయబడినవే గాని కల్పితములు కానేరవు.

శ్లో॥ అబ్దేశ్వరశ్చమూపోవాసస్యేశోవా దివాకరః
తస్మిన్నబ్దే నృపక్రోధాఽనావృష్టి ర్భయ కృత్సదా॥
("స్వల్ప సస్యార్ఘ వృష్టయః" అను పాఠాంతరమున్ను గలదు.)

రవికి రాజరికము, సేనాధిపత్యము, సస్యాధిపత్యము ఈ మూడాధిపత్యములు ఒకేసారి వచ్చినను, ఇదు ఏ రెండాధిపత్యములైనను వచ్చియున్నను ఆ సంవత్సరమున రాజకీయ కల్లోలములు, రాజకోపము, అనావృష్టి, సస్యహాని, ధరలు పెరుగుట దేశమందలి ప్రజలు సర్వదా భయకంపితులగుచున్నారు.

శ్లో॥ అబ్దేశ్వరశ్చమూపోవాసస్యేశోవా నిశాకరః
తస్మిన్నబ్దే కరోతిక్ష్మాం పూర్ణం శాలి ఫలేక్షుభిః॥

చంద్రునకు ఏ సంవత్సరమందు రాజు, సేనాధిపతి, సస్యాధిపత్యములు మూడుగాని, ఏ రెండాధిపత్యములు కలుగుచున్నవో ఆ సంవత్సరమున మంచి వర్షములుండును. పాడిపంటల సమృద్ధియుండును. ఆహార ధాన్యములు, ఫలజాతులు, పంచదార, చెరకు, నెయ్యి, వెన్న, పాలు మొదలగువాని ధరలు తగ్గును. ఉత్పత్తి యధికమగునపుడు ధరలు తగ్గుట తథ్యమే గదా!



శ్లో॥ అబ్దేశ్వరశ్చమూపోవాసస్యేశోవా మహీసుతః
తస్మిన్నబ్దే చౌరవహ్ని వృష్టిక్షుద్భయ కృత్సదా॥

కుజునకు రాజరికము, సేనాధిపత్యము, సస్యాధిపత్యములు మూడు ఒకేసారి కలిగినను, ఇందలి ఏ రెండాధిపత్యములు వచ్చియున్నను ఆ సంవత్సరమందు చోరరోగాగ్నిశస్త్రాస్త్రభయములు, దుర్మార్గులు ప్రబలుట, ధన మాన ప్రాణహానులు, ప్రజాక్షోభ, యుద్ధభీతి, ఆకలి బాధలు, అనావృష్టిచే పంటలు పండక పోవుట, పశువులకు రోగములు, కలరా స్ఫోటకాది బాధలు, రాజకీయ కల్లోలములుండును. వడిదుడుకు లధికమై యుండును.

శ్లో॥ అబ్దేశ్వరశ్చమూపోవా సస్యేశోవా శశాంకజః
అతి వాయుం స్వల్పవృష్టిం కరోతి నృపవిగ్రహమ్॥

బుధునకు రాజరికము, సేనాధిపత్యము, సస్యాధిపత్యములు మూడు ఒకేసారి కలిగినను, అందు ఏ రెండాధిపత్యములైనను వచ్చియున్నచో ఆ సంవత్సరమున అధికమైన గాలి, స్వల్పవృష్టి కలుగును. రాజ విరోధములు, ప్రజలకు భయము, రాజకీయ వడిదుడుకులు, కలహములు యుద్ధభీతి యుండును.

శ్లో॥ అబ్దేశ్వరశ్చమూపోవా సస్యేశోవా సురార్చితః
కరోత్యనుత్తమాం ధాత్రీం యజ్ఞధాన్యార్ఘవృష్టిభిః॥

గురునకు రాజరికము, సేనాధిపత్యము, సస్యాధిపత్యములు మూడు ఒకేసారి కలిగినను, ఇందు ఏ రెండాధిపత్యములు కలిగినను ఆ సంవత్సరమందు సుభిక్ష క్షేమారోగ్యములుండును. పాడిపంటల సమృద్ధియుండును. సస్యానుకూల వర్షములుండును. ప్రజలు ధర్మకార్యములు చేయుదురు. ధాన్యాదుల ధరలు సరసమై యుండును.

శ్లో॥ అబ్దేశ్వరశ్చమూపోవా సస్యేశోవా భృగోః సుతః
కరోతి సర్వాం సంపూర్ణాం ధాత్రిం శాలిఫలేక్షుభిః॥

శుక్రునకు రాజరికము, సేనాధిపత్యము, సస్యాధిపత్యములు మూడు ఒకేసారి కలిగినను, ఇందు ఏ రెండాధిపత్యములు కలిగినను ఆ సంవత్సరమందు సస్యానుకూల వర్షములుండును. పాడిపంటల సమృద్ధియుండును.

ధాన్యాదులు, ఆహార ధాన్యములు, చెఱకు, పంచదార మొదలగు వస్తూత్పత్తి యధికమై యుండుటచే ధరలు తగ్గియుండును.

శ్లో॥ అబ్దేశ్వరశ్చమూపోవా సస్యేశోవార్కనందనః
అంతకశ్చౌరవహ్న్యర్తిం బుధాన్యభూప భయప్రదః॥
—నారద సంహితాయాం.

శనికి రాజరికము, సేనాధిపత్యము, సస్యాధిపత్యములు ఒకేసారి కలిగినను, ఇందు ఏ రెండాధిపత్యములు వచ్చియున్నను ఆ సంవత్సరమునందు దుర్భిక్షము కలుగును. చోరరోగాగ్నిబాధలు, అనావృష్టి, పశుక్షయము, జనహాని, సస్యహాని, ధనహాని, రాజవిగ్రహము, రాజకీయ కల్లోలములు; ప్రజలు భయకంపితులగుటయు సంభవించును.

—♦ అధికమాస నిర్ణయము. ♦—

శ్లో॥ ద్వాత్రింశద్భిర్గతై ర్మాసై ర్దినైః షోడశభిస్తథా
ఘటికానాం చతుష్కేణపత త్యధికమాసకః॥

గతాధిక మాసమునకు ౩౨ మాసముల ౧౬ దినముల ౪ ఘడియలకు మరల అధిక మాసము సంభవించుననుట సర్వసాధారణ విషయము.

శ్లో॥ శాకే బాణకరాంకకే విరహితేనం దేందుభిర్భాజితే
శేషేఽగ్నౌచ మధుశ్చ మాధవశివే జ్యేష్ఠశ్చ ఖేచాష్టకే
ఆషాఢో నృపతౌ నభశ్చ శరకే భాద్రశ్చ విశ్వాంకకే
నేత్రే చాశ్వినకోఽధిమాన ఉదితో శేషేన్యకేస్యాన్నహి॥

వర్తమాన శకాబ్దములందు ౯౨౫ తివిచగా వచ్చు మొత్తమును ౧౯ చే భాగించగా వచ్చు శేషసంఖ్య ౩ అగుచో చైత్రమాస మధికమనియు శేషసంఖ్య ౧౧ అగుచో వైశాఖమాసమనియు, శేషసంఖ్య సున్నగాని, ౮ గాని యగుచో జ్యేష్ఠమాస మధికమనియు, శేషసంఖ్య ౧౬ అగుచో ఆషాఢమాస మధికమనియు, శేషసంఖ్య ౫ అగుచో శ్రావణమాస మధికమనియు, శేషసంఖ్య ౧౩ అగుచో భాద్రపదమాస మధికమనియు శేషసంఖ్య ౨ అగుచో ఆశ్వయుజమాసము అధికమాసమగునని గ్రహించవలెను. మిగిలిన అంకెలు అనగా ౧, ౪, ౬, ౭, ౯, ౧౦, ౧౨,



౧౪, ౧౫, ౧౭, ౧౮ సంఖ్యలలో ఏ సంఖ్యయైనను శేషముగా వచ్చినవు డా సంవత్సరమం దధికమాసమే కలుగనేరదని గ్రహించి ప్రవర్తింపవలెను. ఇయ్యది స్థూలమార్గమే గాని సూక్ష్మము గానేరదు. రవిచంద్ర స్ఫుటముల ననుసరించి రవి సంక్రమణ ప్రవేశము అమావాస్యకు సమీపముగానున్న కాలములో ఏ తిథియందు సంభవించునో చూచుకొని ప్రవర్తించవలెను.

అధికమాస నిర్ణయమునుగూర్చి వేరొకచో వ్రాయబడును గాన గ్రంథవిస్తరభీతిని యిట వదలివేయబడినది. పాఠకుల సౌకర్యార్థము రాబోవు స్ఫుటాధిక మాసములను యీ దిగువ వ్రాసి చూపుచున్నాను. ఇందు వ్యత్యాస మేదియు కలుగనేరదనుట తథ్యము.

## రాబోవు అధిక మాసముల పథకము.

| వర్తమాన కల్యాద్యబ్దములు | ఇంగ్లీషు వత్సరము చాంద్ర సంవత్సరము | అధిక మాసములు | అధిక మాసాంతరము | విశేష నిర్ణయము |
|---|---|---|---|---|
| | | | సం. నె. | |
| 5049 | 1947 సర్వజిత్ | శ్రావణం | 2– 5 | |
| 5052 | 1950 వికృతి | ఆషాఢం | 3– 0 | |
| 5055 | 1953 విజయ | వైశాఖం | 2–11 | |
| 5057 | 1955 మన్మథ | భాద్రపదం | 2– 5 | |
| 5060 | 1958 విళంబ | శ్రావణం | 3– 0 | |
| 5063 | 1961 ప్లవ | జ్యేష్ఠం | 2–11 | |
| 5065 | 1963 శోభకృత్ | ఆశ్వయుజం | 2– 5 | పుష్యమాసం క్షయించును |
| 5066 | 1964 క్రోధి | చైత్రం | 0– 7 | |
| 5068 | 1966 పరాభవ | శ్రావణం | 2– 5 | |
| 5071 | 1969 సౌమ్య | ఆషాఢం | 3– 0 | |
| 5074 | 1972 పరీధావి | వైశాఖం | 2–11 | |
| 5076 | 1974 ఆనంద | భాద్రపదం | 2– 5 | |
| 5079 | 1977 పింగళ | ఆషాఢం | 2–11 | |
| 5081 | 1980 రౌద్రి | జ్యేష్ఠం | 3– 0 | |
| 5084 | 1982 దుందుభి | ఆశ్వయుజం | 2– 5 | మాఘమాసం క్షయించును. |
| 5084 | 1982 దుందుభి | ఫాల్గుణం | 0– 6 | |
| 5087 | 1985 క్రోధన | శ్రావణం | 2– 6 | |
| 5090 | 1988 విభవ | జ్యేష్ఠం | 2–11 | |
| 5093 | 1991 ప్రజాపతి | వైశాఖం | 3– 0 | |
| 5095 | 1993 శ్రీముఖ | భాద్రపదం | 2– 5 | |
| 5098 | 1996 ధాత | ఆషాఢం | 2–11 | |
| 5101 | 1999 ప్రమాథి | జ్యేష్ఠం | 3– 0 | |



పై అధిక మాసముల పట్టికను గ్రహించి ప్రవర్తించినందున ఎట్టి వైషమ్యము రానేరదు. ఇవి చైత్రపక్షాయనాంశ సమ్మతము. మిక్కిలి వేదారంభ కాలికమును తెలియజేయు ధనిష్ఠాదినుండి గ్రహించిన అయనాంశ సమ్మతము. కనుక వైదిక మతానుయాయులందరు పై పథకము ననుసరించి వచ్చెడి అధిక మాసములను గ్రహించి ప్రవర్తింపదగియున్నదనుట నిర్వివాదాంశము.

## —♦ అధిక మాసముల ఫలములు. ♦—

శ్లో॥ సుభిక్షం శుభవృష్టిశ్చ ధనధాన్య సమాకులం
ఘృతం తైలంచ కార్పాసం సుభిక్షం చైత్రకద్వయే॥

చైత్రమాస మధికమైన సంవత్సరమందు సుభిక్షము. సస్యానుకూల వర్షములు, ధనధాన్య సమృద్ధి, పాడిపంటల సమృద్ధి, నెయ్యి, వెన్న, పాలు, నూనెలు, ప్రత్తి మొదలగునవి సంపూర్ణముగా లభించును. ఉత్పత్తి యధికమగుటచే ధరలు తగ్గి సుభిక్ష క్షేమారోగ్యముల నొసంగును.

శ్లో॥ స్వల్పవృష్టి ర్భవేన్మేఘో ధనధాన్య సమాకులం
ఘృతం తైలంచ కార్పాసం సుభిక్షం మాధవద్వయే॥

వైశాఖమాస మధికమైన సంవత్సరమున స్వల్పవృష్టియున్నను ధనధాన్య సమృద్ధియు, నెయ్యి, నూనెలు, ప్రత్తి, నూలు, వస్త్రములు, ఆహార ధాన్యముల ధరలు సరసమై యుండును. సుభిక్ష క్షేమారోగ్యములుండును. పాడిపంటలు సమృద్ధిగ నుండును. కొన్ని దేశములందు మాత్రము పాడిపంటలు తగ్గుటచే ధరలు పెరుగును. "వైశాఖయుగ్మే ధాన్యానాం నిష్పత్తి రశుభం క్వచిత్" అనుట ప్రమాణము.

శ్లో॥ విడ్వరం భూమిపాద్భీతి స్తస్కరాది భయం భవేత్
ఘృతంతైలం తథా ధాన్యం సమర్ఘంస్యాద్ద్వి జ్యేష్ఠకే॥

జ్యేష్ఠమాస మధికమైన సంవత్సరమున రాజులవల్ల ప్రజలకు భయము, చోరభీతి, అగ్నిబాధలు, నెయ్యి, నూనెలు, ఆహార ధాన్యముల ధరలు కొంత పెరిగి నిలబడును. రాజయుద్ధము సస్యనాశముండుననియు చెప్పనగును. "జ్యేష్ఠద్వయే నృపధ్వంసో ధాన్యాని క్షితిసత్తమే" అనుట ప్రమాణము.

శ్లో॥ తుషధాన్యాదివృద్ధిః స్యాత్పశురోగోఽతి వృష్టితః
రాజ్ఞాం సుఖఃరాభూమిరాషాఢ ద్వితయం యథా॥

ఆషాఢమాసము అధికమైయున్న సంవత్సరమునపొట్టుధాన్యములకుఉత్పత్తి యధికము కనుక ధరలు తగ్గియుండును. పంటలు సమృద్ధిగా ఫలించును. అధిక వర్షములుండుటచే పశువులకు రోగపీడలుండును. ప్రజారోగ్యము చెడును. రాజులు సుఖింతురు. కొన్నిచోట్ల ఖండవృష్టియుండుటచేధాన్యాదుల ధరలు పెరుగుటకు పంటలు తగ్గుటయే కారణమై యున్నది. "ద్వయాషాఢే వ్యథాకించిత్ఖండవృష్టిః క్వచిత్ పునః" అనుట ప్రమాణము.

శ్లో॥ ద్విశ్రావణేఽతి దుర్భిక్షం స్వల్పవృష్టి ర్మహద్భయం
పాపబుద్ధి రతాలోకా రాజానః క్రూరశాసనః॥
కించ॥ దుర్భిక్షం శ్రావణే యుగ్మే పృథ్వీనాశః ప్రజాక్షయః॥

శ్రావణమాస మధికమైయున్న సంవత్సరమున దుర్భిక్షము, భూముల ధరలు తగ్గుట, ప్రజాక్షయము, రాజ్యభాగములు విభాగములగుట, స్వల్పవృష్టి ప్రజలు భయకంపితులగుట, దుర్మార్గులు ప్రబలి ప్రజలను పాపభీతిలేక హింసించుచు తృప్తినొందుట, రాజులు ప్రజాపీడనగావించు శాసనములను చేయుట సంభవించును. ధరలు పెరుగును. కొన్నిచోట్ల ఆహార ధాన్యములకొరత సంభవించును.

శ్లో॥ ద్విభాద్రో క్షేమమారోగ్యం సస్యనిష్పత్తిరుత్తమా
బహుక్షీరప్రదాగావో వృష్టిస్స్యాత్కార్తికావధి॥

భాద్రపదమాస మధికమైన సంవత్సరమున ప్రజారోగ్యము, సస్యవృద్ధి, పశువృద్ధి పాడిపంటల సమృద్ధియుండును. గోవులు బహు క్షీరదములు, కార్తికమాస పర్యంతం వర్షములు బాగా యుండును.

శ్లో॥ ఆశ్వినీ ద్వితయే భూమ్యాం సైన్యచోరరుజం భయం
సుభిక్షం కేచనాప్యాహుః దుర్భిక్షం దక్షిణాదిశి॥

ఆశ్వయుజమాసము అధికమైన సంవత్సరమున భూమియందలి ప్రజలు సేనలవలనను, రోగములవల్లను, దొంగలవల్లను పీడింపబడుదురు. ధన మాన ప్రాణహానులుండును. కలహములధికమగును. కొందరుసుభిక్షము



కల్గునని చెప్పుట గలదు. దక్షిణదేశములందు దుర్భిక్షము, ఆహార ధాన్యముల కొఱత, పాడిపంటలు తగ్గుట, ధాన్యాదుల ధరలు పెరుగుట అల్పవృష్టి, రోగభయములు కలుగును.

శ్లో॥ సుభిక్షం కార్తిక యుగే క్వచిత్ దుఃఖం రణా నృణామ్॥

క్షయమానము మార్గశిరమైనపుడు పూర్వాధిమాసము కార్తీకమున్ను పరాధిమాసము ఫాల్గుణమున్ను యగును గనుక కార్తీకమాసముయధిక మాసముగా నున్న సంవత్సరమున పాడిపంటల సమృద్ధియున్నను కొన్ని ప్రాంతములందు ప్రజాకల్లోలములుండును. రాజులవల్లను, యుద్ధభయము వల్లను ప్రజలు దుఃఖములను పొందెదరు. ప్రజానష్టముండును. ఒకానొకప్పుడు క్షయమాసము పుష్యమైయున్న కార్తీకమాసము పూర్వాధి మాసముగా వచ్చును.

శ్లో॥ మార్గశీర్షయుగే దేశే జాయతే పరమం సుఖం॥

క్షయమాసము పుష్యమాసమైనపుడు పూర్వాధిమాసము మార్గశిరమాసమగును. పరాధిమాసము ఫాల్గుణము నగును. మార్గశిరమాసము అధిక మాసమై యున్న సంవత్సరమున సుభిక్ష క్షేమారోగ్యసంపద లుండును.

## — క్షయమాస ఫలములు. —

శ్లో॥ మాఘక్షయే భువి క్షేమం రాజ్యానాంచ భయం తథా॥

మాఘమాసము అధికముగా వచ్చుట ఎన్నడును కని విని యెఱుంగని విషయము. అట్లే పౌషమాసము అధిక మాసముగా వచ్చిన దెన్నడును కని విని ఎఱుంగని విషయమై యున్నది. కాని క్షయమాస పరముగా పై శ్లోకమును గ్రహించి పరివర్తించవలెనని కోరుచున్నాను. మాఘ మాసము క్షయించిన సంవత్సరమందు సుభిక్ష క్షేమారోగ్యసంపద లున్నను రాజులవల్ల ప్రజలు బాధింపబడెదరు. రాజకీయ వడిదుడుకు లుండును.

శ్లో॥ పౌషక్షయే సుభిక్షం చ మంగలం నృపతేర్జయః
రాజదండ పరో లోకో లోకేమతి విపర్యయః॥

పౌషమాసము క్షయమాసమై యున్న సంవత్సరమందు సుభిక్ష క్షేమారోగ్య సంపద లుండును. రాజులకు జయము చేకూరును. జనులకు రాజ

దండనయు, మతిభ్రంశము కలుగును. ప్రజలు రాజకీయ కల్లోలములచే మతివిహీనులై చరింతురు.

శ్లో॥ సుభిక్షం ఫాల్గుణ యుగే క్షత్రియాణాం శివం భవేత్॥

పుష్యమాసముగాని, మార్గశిరమాసముగాని, మాఘమాసముగాని క్షయ మాసముగా వచ్చినపుడు పరాధిక మాసము ఫాల్గుణమై యుండును. ఫాల్గుణము అధిక మాసమై యుండు సంవత్సరమున సుభిక్ష క్షేమారోగ్య సంపద లుండును. రాజులు సుఖించెదరు.

రాబోవు క్షయ (లుప్త) మాస పథకము.

| వర్తమాన కల్యబ్దము. | క్రీస్తుశకము | చాంద్ర సంవత్సరము | లుప్త మాసము | పూర్వాధి మాసము | పరాధి మాసము |
|---|---|---|---|---|---|
| ౫౦౬౩ | 1963-64 | శుభకృత్ | పుష్యం | ఆశ్వయుజం | చైత్రం |
| ౫౦౮౪ | 1982-83 | దుర్ముఖ | మాఘం | ఆశ్వయుజం | ఫాల్గుణం, |

## —♦ క్షయమాస లక్షణము. ♦—

ఒక చాంద్ర మాసములో రెండు సౌర సంక్రాంతులు కలిగినను లేక సంక్రాంతిద్వయ మధ్యమున అమావాస్యాంతము లేకపోయినను, ఆ చాంద్ర మాసము లుప్తమాస మనబడును. ఆ యేటిలో రెండు అధిక మాసములు ఆ లుప్తమాసమునకు వెనుక ముందు కలుగుచుండును. మార్గశిర, పౌష, మాఘమాసములలో ఏ ఒక మాసమందైనను క్షయ మాసము కలుగును.

క్షయమాసము గల సంవత్సరమునందు వచ్చు అధిక మాసములే కార్తీక, ఫాల్గుణములై యుండును. కాని మూడు సంవత్సరముల కొకసారి సంభవించు అధికమాసములందు కార్తీక, ఫాల్గుణమాసములు అధిక మాసములై యుండజాలవు.



## —♦ రవిచార ఫలములు. ♦—

### —♦ మేషసంక్రాంతి నిర్ణయ ఫలము. ♦—

శ్లో॥ పూర్వాహ్ణే కాలేగ్నిభయం ప్రకుర్యా
న్మధ్యం దినే మేష వినాశనం స్యాత్
తతో పరాహ్ణే సతి లోకపీడా
సాయంతనే వృష్టి ర్నిశి ప్రవృద్ధిః॥

మేషసంక్రమణ ప్రవేశకాల ఫలము :—పూర్వాహ్ణకాలమందు (అనగా పగలు 12 గంటలకు లోపుగా) సూర్యసంక్రమణము సంభవించిన లోకమున అగ్నిభయములు, దుర్మార్గులు ప్రబలుట, కలహములు సంభవించును. సరిగా పగలు రెండుజాముల వేళ సంక్రమణము సంభవించినచో మేకలు, గొఱ్ఱెలు నశించును. అపరాహ్ణకాలమునందు సూర్య సంక్రమణమగుచో లోకమున భయోత్పాతములు, రోగాది పీడలుకలుగును. సాయంకాలమునం దగుచో వర్షములు కలుగును. రాత్రికాలమునం దగుచో సుభిక్ష క్షేమారోగ్యములు పాడిపంటల సమృద్ధి యుండును. కొందరు

శ్లో॥ దివాచే న్మేషసంక్రాంతి రనర్ఘ కలహప్రదః
రాత్రౌ సస్యాభివృద్ధిస్స్యాత్ క్షేమారోగ్యం సుభిక్షకృత్॥

అను శ్లోకమువల్ల పగటివేళ సంక్రమణము సంభవించినపుడు ధాన్యాదులకు ధరలు పెరుగుట, కలహములు కలుగును. రాత్రియందు సంక్రమణము కలుగుచో సస్యాభివృద్ధి క్షేమారోగ్య సుభిక్షములు కలగునని వ్రాసి యూరకుండుట గలదు.

శ్లో॥ మేషం యాంతి దివా సూర్యే
రాత్రౌ సంక్రమితే తులామ్
తదా నందంతి రాజానో
జనాశ్చ వివిధోత్సవైః॥

మేషసంక్రమణము పగటి కాలమున సంభవించినను తులా సంక్రమణము రాత్రియందు సంభవించుచో రాజులు ప్రజలు నానావిధ సంతోషముగలవా రగుదురు.

## —♦ మేషసంక్రాంతి వార ఫలములు. ♦—

శ్లో॥ దుర్భిక్షం రవివారేతు సోమవారే సువృష్టికృత్
ఈజవారేత్వనర్ఘంచ సౌభాగ్యం సౌమ్యవాసరే
గురువారేర్ఘవృద్ధిస్యాత్సస్యవృద్ధి ర్భృగో ర్దినే
శనివారేల్ప వృష్టిస్యా న్మేషసంక్రమణే రవౌ॥

మేషసంక్రమణములు ఆదివారమునందగుచో దుర్భిక్షము, ధాన్యాదుల ధరలు పెరుగుట, పాడిపంటలు నశించుట, ప్రజాక్షోభ, ఆకలిబాధ లుండును. సోమవారమునం దగుచో సస్యానుకూల వర్షములు, పాడి పంటల సమృద్ధి, ధరలు తగ్గుట యుండును. మంగళవారమునం దగుచో ధరలు బాగా పెరుగును. పరిజాకల్లోలములు, అగ్నిస్ఫోటకాది భయ ములు, దుర్మార్గులవల్ల బాధలు, చోరబాధ లుండును. బుధవారమునం దగుచో సస్యానుకూలవర్షములున్నను గాలి యధికము. సుఖసౌఖ్యము లుండును. మధ్యమ సస్యములు, పాడిపంటలు మధ్యమము. ధరలు కొల దిగ పెరుగును. గురువారమునం దగుచో సస్యానుకూల వర్షములు. పాడిపంటల సమృద్ధి యుండును. అర్ఘవృద్ధి యనగా వెల పెరుగునని చెప్పుట సర్వసాధారణమై పోయెను. కాని వస్తూత్పత్తి యధికమై ధరలు తగ్గునవియే చెప్పనగును, శుక్రవారమునం దగుచో సస్యములు బాగుగా ఫలించును. పాడిపంటల సమృద్ధి ధరలు తగ్గియుండును. శని వారమునం దగుచో అల్పవర్షములు, సస్యహాని, రోగములు పరిబలుట, ధరలు పెరుగుట యుండును.

## —♦ మేషసంక్రాంతి తిథి ఫలములు. ♦—

శ్లో॥ నందాయాం మేషసంక్రాంతి రల్పవృష్టికరీమతా
భద్రాయాం రాజయుద్ధాయ జయాయాం వ్యాధయే నృణామ్
రిక్తాయాం పశుఘాతాయ పూర్ణాయాం ధాన్యవర్ధనీ
ఇత్యేతేద్బాల బోధోక్తం బహుశాస్త్రేషు సమ్మతమ్॥



| నందతిథులు | భద్ర తిథులు | జయ తిథులు | రిక్త తిథులు | పూర్ణ తిథులు |
|---|---|---|---|---|
| పాడ్యమి<br>షష్ఠి<br>ఏకాదశి | విదియ<br>సప్తమి,<br>ద్వాదశి | తదియ<br>అష్టమి<br>త్రయోదశి | చవితి<br>నవమి<br>చతుర్దశి | పంచమి<br>దశమి<br>పూర్ణిమ |
| అల్పవృష్టి | రాజయుద్ధం | వ్యాధిపీడ | పశువులకు రోగములు | ధాన్యవృద్ధి |

అమావాస్యయందు మేషసంక్రాంతియగుచో ఫలము చెప్పలేదు కనుక ఫలమే లేదని వదలరాదు. "అమాయాం సస్యనాశాయ" అను గ్రంథాంతర ఫలమును గ్రహించి పరివర్తించవలెను. అమావాస్య యందు సంక్రాంతి యగుచో సస్యహాని యుండునను ఫలము చెప్ప నగును. ఇందు చెప్పబడలేదనుచో "అనుక్త మన్యతో గ్రాహ్యం" అను నార్యోక్తి ననుసరించి చూపబడినది. ఇగతా ఫలవిశేషములు మకర సంక్రాంతిఫలములవలె చూడనగును.

## —♦ కాల ఫలములు. ♦—

శ్లో॥ సూర్యోదయే రోగకరీ స్మృతార్ద్రా
ఘటీద్వయే విగ్రహ రోగయోగః॥
పూర్వాహ్ణకాలే జగతో విపత్తిః
మధ్యాహ్నకాలే కృషి నాశనాయ॥
సాయాహ్నకాలే తృణ సస్యనాశం
అస్తంగతార్ద్రా బహుసస్య సంపదః॥
సంధ్యాస్థితార్ద్రా కురుతే సుభిక్షం
రాత్రౌ స్థితా స్సర్వసుఖాయలోకే॥

భోగం ప్రదత్తే ఖలు మధ్యరాత్రే।
పూర్వం సుఖం దుఃఖ మతోఽపరత్ర॥
"ఉషస్య కాలే జగతో విపత్తిః"

అని గ్రంథాంతర వచనము.

ఆర్ద్రానక్షత్రమున సూర్యుని ప్రవేశ కాల ఫలములు క్రమముగ (1) సూర్యోదయకాలమందగుచో రోగములు కలుగజేయును. (2) సూర్యోదయము మొదలుకొని రెండు ఘడియలకు లోపుగానున్న కాలమునం దగుచో కలహములు, రోగములు, యుద్ధము కలుగజేయును. (3) పూర్వాహ్ణకాలము అనగా ఝాము ప్రొద్దు ఎక్కిన తరువాత రెండు ఝాములకు లోపుగానున్న కాలమునందగుచో జగద్విపత్తును కలుగజేయును. (4) పగలు సంగవకాలాంతము మొదలుకొని మధ్యం దినాంతరమున సుమారు 3 గడియల కాలమువరకునైన కాలము మధ్యాహ్న కాలము అగును. మధ్యాహ్నకాలమునం దగుచో వ్యవసాయమునకు నష్టమును కలుగజేయును. (5) అపరాహ్ణకాల ఫలము చెప్పకున్నను "అనుక్త మన్యతో గ్రాహ్యం" అను నార్యోక్తి ననుసరించి మేషసంక్రమణ సమయమునందు చెప్పబడిన "తతో పరాహ్ణే సతిలోకపీడా" అను వచనమును గ్రహించవలసియున్నది. అపరాహ్ణకాలమునందు ఆర్ద్రాప్రవేశమగుచో ప్రజాపీడనలు, ప్రజాక్షోభ యుండును. (6) సాయాహ్నకాలమునందగుచో గడ్డి లేకపోవుట సస్యములు నశించుట కలుగును. (7) సూర్యాస్తమయకాలమునకు మిక్కిలి దగ్గరగానుండు సమయమునందైన సస్యవృద్ధిని కలుగజేయును. (8) సూర్యోదయాస్తమయ సంధి (దివారాత్రముల కాలములసంధి) కాలమునందైన సుభిక్షము (8) రాత్రియందైన సమస్త జీవరాసులు సుఖించును. (9) మధ్యరాత్రియందైన భోగములు కలుగును. (10) అర్ధరాత్రికి పూర్వము నందనగా రాత్రి మొదటి యామము తర్వాత రెండవయామము ఆఖరగు పర్యంతముగల కాలమునందైన సుఖమును కలుగజేయును. అర్ధరాత్రిని మించిన కాలము (మూడవ యామము) నందైన దుఃఖములు కలుగజేయును. (12) "ఉషస్య కాలే జగతో విపత్తి" అనుటచే ఉషఃకాలమందు జగద్విపత్తు సంభవించును. గ్రంథాంతరే "దివార్ద్రా సస్య నాశాయ" అని చెప్పబడియున్నది. దివార్ద్రాప్రవేశమువల్ల సస్యములు నశించుననుట తథ్యమే. దివార్ద్రాదోషము లేదనుటకు యీదిగువ చెప్పబడిన శ్లోకమును గ్రహించి పరివర్తింపవలసియున్నది.



శ్లో॥ జలరాశి గతే చంద్రే జలోదయ సమన్వితే
తత్కాలే రౌద్రభే చార్కే దివార్ద్రా దోషనాశనమ్॥

జలరాశియందు చంద్రుడు ప్రవేశింపబోవుచున్నపుడును, జలరాశియందు చంద్రుండుండుకాలములోను (సూర్యుడు పగటి కాలమున ఆర్ద్రానక్షత్రమున ప్రవేశించినందువల్ల దోషము) దివార్ద్రాదోషములేదని చెప్పవలసియున్నది.

జలరాసులేవని సందేహించకుండునటుల సౌకర్యార్థము ఇట ప్రమాణ శ్లోకము చూపబడుచున్నది.

### —♦ జలరాసులు. ♦—

శ్లో॥ మత్స్యః కుళీరే మకరే బహూదకం
కుంభే వృషేచార్ధజలం ప్రమాణం
అళ్యాంచ తౌళ్యాం మిథునేకపాదం
శేషేతు రాశౌ జలనాశనంచ॥

మీనము, కటకము, మకర రాసులు పూర్ణజలరాసులు కుంభము, వృషభ రాసులు అర్ధజలరాసులు. వృశ్చిక, మిథున, తులారాసులు పాదజల రాసులు. మేష, సింహ, కన్యా, ధనుస్సు లను నాల్గున్ను నిర్జలరాసులు.

చంద్రుడు మీన కటక మకర కుంభ వృషభరాసులయందున్నపుడు గాని, ఆ రాసులయందు ప్రవేశింపబోవనున్న సమయమందుగాని దివార్ద్రాప్రవేశమగుచో దివార్ద్రాదోషములేదని చెప్పవలసియున్నది.

### —♦ దివార్ద్రాదోషాపవాదము. ♦—

శ్లో॥ రౌద్ర ప్రవేశే తరణిర్విధుశ్చే
త్త్రికోణసంస్థోఽథ చతుష్టయస్థః
జలర్క్షగోవా శుభవీక్షితోవా
ధాన్యం ప్రభూతం నిఖిలం తదానీం॥

సూర్యుడు పగటి కాలమున ఆర్ద్రానక్షత్రమునందు ప్రవేశించియున్నపుడు చంద్రుడు సూర్యునకు ౫, ౯ రాసులందు (త్రికోణరాసులందు) న్న యెడలను, జలరాసులందు చంద్రుడున్నను, సూర్యుడు శుభగ్రహము లగుదురు. శుక్రులలో ఏ ఒకరు చూచినను దివార్ద్రాదోషముతొలగించి సస్యవృద్ధి నిచ్చును.

——◆ తిథి ఫలములు. ◆——

శ్లో॥ ప్రతిపద్యాది చార్ద్రాయాః ప్రవేశే శుభదారవేః
ద్వితీయా సస్యవృద్ధిస్స్యా త్తృతీయా త్యీతిబాధకమ్
చతుర్థ్యాం రోగదం ప్రోక్తం పంచమ్యాం క్షేమ ముత్తమమ్॥
షష్ఠ్యాం ధాన్యసమృద్ధిస్స్యా త్సప్తమ్యాంసుఖదం భవేత్
అష్టమ్యా మల్పవృష్టిస్స్యా న్నవమ్యా మీతిబాధకమ్
దశమ్యాం శుభదం ప్రోక్తం ఏకాదశ్యాం సుభిక్షకృత్
ద్వాదశ్యాం శుభదా ప్రోక్తం త్రయోదశ్యాం జలప్లవం
భూతేత్యర్ఘ వినాశాయ పూర్ణేపూర్ణ ఫలప్రదం
అమాయాం సస్యనాశాయ తిథీనాం ఫల మీదృశమ్॥

సూర్యుడు ఆర్ద్రానక్షత్రమునందు ప్రవేశించు కాలమున తిథియొక్క ఫలములు :—(1) పాడ్యమినందైన శుభము (2) ద్వితీయమందు సస్యసమృద్ధి, వస్త్రముల ధాన్యముల ధరలు తగ్గును. (3) తదియయందు ఈతిబాధలు, చోరభయములుండును. (4) చతుర్థియందు రోగములు, అశుభములు కలుగును. (5) పంచమియందు సమస్త ప్రాణికోటి సుఖించును. (6) షష్ఠియందు ధాన్యసమృద్ధి ధరలు తగ్గుట యుండును. (7) సప్తమియందు క్షేమారోగ్యసంపదలు కలుగును. (8) అష్టమియందు అల్పవృష్టి సస్యహాని ధరలు పెరుగుట యుండును. (9) నవమియందు ఈతిబాధలు. (10) దశమియందు శుభములు. (11) ఏకాదశియందు సుభిక్షము. (12, ద్వాదశియందు శుభదము. (13) త్రయోదశియందు తిథి వృద్ధి క్షయము ననుసరించి వర్షము, ధాన్యాదుల ధరలు యుండును. (14) చతుర్దశియందు గ్రంథాంతరములో "దివాకరస్య రౌద్రర్క్షే ప్రవేశే చ చతుర్దశీ। సమస్త ధాన్యవాసాంసి మహార్ఘాణి భవంతిహి" యని చెప్పబడియుండుటచేత సమస్త ధాన్యములకును, వస్త్రములకును ధరలు



తగ్గును. ఉత్పత్తి యధికమగును. ఇయ్యది శుక్లపక్షమందలి చతుర్దశీ ఫలమని గ్రహించవలెను. కృష్ణపక్షచతుర్దశియగుచో వర్షాభావము, సస్యహాని, ధాన్యాదులకు ధరలు పెరుగుట యుండును. (15) పూర్ణిమయందు సర్వాభీష్టసిద్ధి నొసంగును. ● అమావాస్యయందు సస్యనాశము కలుగును. గ్రంథాంతరమున "అమాయాం పద్మినీనాథ రౌద్రనక్షత్రగే యది। భూమిపానాం వినాశస్స్యా త్తస్కరాణా ముపద్రవః" అని చెప్పియున్నందున రాజులకు యుద్ధము, రాజహాని, చోరులు, దుర్మార్గుల వల్ల ప్రజలు భయకంపితులగుట యుండును.

——◆ వారఫలములు. ◆——

శ్లో॥ దినపతి వారే పశుపతి ధిష్ణ్యే దినపతివేశేసతి పశునాశః
శశిధరవారే స్మరహరధిష్ణే దినకరవేశేసతి సుభిక్షమ్॥
భానోర్వేశః పృథ్వీసూనో ర్వారే రౌద్రేధిష్ణ్యేచేత్స్యాత్
శస్త్రాఘాతా త్పృథ్వీశానాం నిః సందేహం మృత్యుస్తర్హి॥
బుధే సుఖ మవాప్నోతి గురౌచార్ఘ సమృద్ధిదం.
శుక్రే శాంతికరం ప్రోక్తం మందే మందధీః ప్రజాః॥

సూర్యుడు ఆర్ద్రానక్షత్రమున ప్రవేశించు కాలమునందలి రవ్యాది వార ఫలములు క్రమముగా (1) ఆదివారమునందైన పశువుల నష్టము కలుగును. (2) సోమవారమునందైన సుభిక్షము, సస్యవృద్ధి, పాడిపంటల సమృద్ధిచే ధరలు తగ్గుటయుండును (3) మంగళవారమునందైన వర్షాభావము, సస్యహాని, చోరరోగాగ్నిభయములు, రాజులకు యుద్ధము, రాజహాని యుండును. (4) బుధవారమునందైన సస్యానుకూల వర్షములు మధ్యమముగా నుండును. వాయుపీడ అధికము. సుఖసౌఖ్యములుండును. (5) గురువారమునందైన సస్యానుకూలవృష్టియుండును. పాడిపంటలు సమృద్ధిగా నుండును. ధాన్యాదుల ధరలు తగ్గును. (6) శుక్రవారమునందయిన సుఖసౌఖ్యములు, మనశ్శాంతి, సుభిక్షక్షేమారోగ్యములు, పాడిపంటల సమృద్ధియుండును. (7) శనివారమునందయిన ప్రజలు మందబుద్ధులై చరింతురు. మతిహీన ప్రవర్తన గలిగియుందురనుటచే దుర్మార్గముగా చరింతురని భావము.

## నక్షత్రభేదముచే మేషసంక్రాంతి ఫల విశేషము.

శ్లో॥ యదా మేషగతః సూర్యో భరణ్యాది చతుష్టగే
సస్యవృద్ధి ర్భవేత్తస్య వృద్ధి రార్ద్రాచతుష్టయే
మఘాదిదశకే హానిః క్షేమంచానుక్త భేషుచ॥

—పీయూషధారే కశ్యపోక్తిః.

మేషసంక్రాంతిప్రవేశకాలమునకుచంద్రుడు భర-కృ-రో-మృగశిరలందున్నచో సస్యవృద్ధియుండును. ఆర్ద్ర-పున-పుష్య-ఆశ్రేషలయందు చంద్రుడున్నను సస్యవృద్ధియుండును. మఘ-పూఫ-ఉఫ-హ-చిత్ర-స్వా-విశాఖ-అనూ-జ్యే-మూలలందు చంద్రుడున్నచో సస్యహాని యుండును. మిగిలిన నక్షత్రములందున్నచో సుభిక్షము కలుగును.

## నక్షత్ర ఫలములు.

శ్లో॥ ప్రవేశే రౌద్రనక్షత్రే అశ్విన్యాంతు భయం భవేత్
భరణ్యా మశుభం ప్రోక్తం కృత్తికాయామవర్షణమ్॥
రోహిణ్యాం సస్యవృద్ధిస్స్యా చ్చంద్రర్క్షేతు సువృష్టిదం
రౌద్రే రౌద్రఫలం కుర్యా దాదిత్యామర్ఘవృద్ధిదం॥
పుష్యే జలప్లుతో లోకే సార్పభేదారుణం భయం
మఘాయా మల్పవృష్టిస్స్యా ద్భగే కీర్తికరం నృణాం॥
అర్యమర్క్షే సువృష్టిస్స్యాత్ హస్తర్క్షే సర్వసౌఖ్యదం
చిత్రాయాం చిత్రధాన్యాని యదా శుభఫలం భవేత్॥
స్వాతౌ సస్యాభివృద్ధిస్స్యా ద్విశాఖా రోగవృద్ధిదం
మైత్రే సర్వమహీపాలాః సంతుష్టాః సర్వజంతవ॥
ఐంద్రే సర్పభయం కుర్యాన్మూలే సర్వభయావహః
తోయ భేచాతి వృష్టిస్స్యా ద్విశ్వర్క్షేతు శోభనం॥
వైష్ణవే సస్యవృద్ధిస్స్యా ద్వాసవే వృష్టి రుత్తమా॥
శతభేజల సంకీర్ణా పూర్వాభాద్రేతు శోభనమ్॥
ఉత్తరాభాద్రభే వృష్టి స్సర్వసస్య వివృద్ధిదం
నృపవిధ్వంసనాదీని పౌష్ణభే కురుతే ఫలమ్॥



సూర్యుడు ఆర్ద్రానక్షత్రమందు ప్రవేశించు కాలమునకు దిననక్షత్రము (1) అశ్వనియైన లోకమునభయోత్పాతములుండును. (2) భరణీనక్షత్రమైన అశుభఫలము ప్రజానష్టముండును. (8) కృత్తికయైన అగ్నిభయము వర్షాభావము కలుగును. (4) రోహిణియైన సస్యసమృద్ధి యుండును. (5) మృగశిరయైన మంచి వర్షము కలుగును. (6) ఆర్ద్రయైన అగ్నిభయం, దుర్మార్గులవల్ల ప్రజలకు ధనమానప్రాణహానులుసంభవించును. (7) పునర్వసుయైన సస్యవృద్ధియుండును. ధరలు తగ్గును. (8) పుష్యమీనక్షత్రమైన మంచివర్షములుండును. (9) ఆశ్రేషయైన దుర్మార్గులవల్ల ప్రజాహాని యుండును. మలేరియా జ్వరములవల్లను, కలరావల్లను జనహాని యధికమై యుండును. (10) మఘయైన స్వల్పవర్షములు. (11)పుబ్బయైన శుభం కీర్తి వృద్ధియుండును. (12) ఉత్తరయైన సువృష్టి. (13) హస్తయైన సమస్త ప్రాణికోటియు సుఖించును. (14) చిత్రయైని చిత్రవిచిత్ర ధాన్యములు పండును. (15) స్వాతియైన సస్యసమృద్ధి. (16) విశాఖయైన రోగములు ప్రబలును. (17) అనూరాధయైన రాజులు ప్రజాభీష్ట పాలనచేయుదురు. (18) జ్యేష్ఠయైన సర్పాదివిషజంతూపద్రవములుండును. (19) మూలయైన నానామూలముగా భయోత్పాతములుండును. (20) పూర్వాషాఢయైన అతివృష్టి కలుగును. (21) ఉత్తరాషాఢయైన శుభములు కలుగును. (22) శ్రవణమైన సస్యములకు వృద్ధియుండును. (23) ధనిష్ఠయైన సువృష్టి. (24) శతతారయైన అతివృష్టి. (25) పూర్వాభాద్రయైన శుభములు కలుగును. (26) ఉత్తరాభాద్రయైన సువృష్టి, సస్యాదులు బాగుగా పెరుగును (27) రేవతియైన రాజకీయ కల్లోలములు, రాజయుద్ధము, జనహాని, ప్రజాక్షోభ యుండును.

## యోగఫలములు.

శ్లో॥ విష్కంభే పంచకే చైవ రాద్రర్క్షే ప్రవిశోయది
సుభిక్షం జలసంకీర్ణం నృపాః స్వస్థాః శుభప్రదాః॥

రవి ఆర్ద్రానక్షత్రమందు ప్రవేశించు కాలమునకు విష్కంభం, ప్రీతి, ఆయుష్మాన్, సౌభాగ్యము, శోభన మను అయిదు యోగములలో ఏ ఒక్క యోగమైయున్నను సుభిక్షము, సువృష్టి, రాజులు శాంతయుక్త

లై ప్రజాభీష్టముగా పరిపాలించెదరు. లోకమునశుభకార్యములుచేయుట యధికమై యుండును.

శ్లో॥ అతిగండాఖ్యయోగేచే దార్ద్రాం యాతి దివాకరః
పరస్పరంతు యుద్ధం చత్వా కుర్వంతి భూమిపాః॥

అతిగండనామయోగము ఉండు కాలమున సూర్యుడు ఆర్ద్రానక్షత్రమునందు ప్రవేశించిన రాజులు పరస్పర యుద్ధము చేయుదురు.

శ్లో॥ సుకర్మయోగే వృష్టిస్స్యా ధృతియోగే సుభిక్షకృత్
శూలయోగేల్పవృష్టిస్స్యా దండయోగే మహద్భయమ్॥

సుకర్మయోగమున సువృష్టి యుండును. ధృతియోగమున సుభిక్షము, శూలయోగమున అల్పవృష్టి, కడుపునొప్పి శూలరోగములు ప్రబలును. గండయోగమున గొప్పభయము. ప్రజలు భయకంపితులగుదురు.

శ్లో॥ వృద్ధియోగేభివృద్ధిస్స్యా ధ్రువయోగేతు ధైర్యకృత్
వ్యాఘాతే జలనాశాయ హర్షణే పరితోషతః॥
వజ్రయోగే సర్వజనాః పీడ్యంతే వర్షణం క్వచిత్
సిద్ధిః సర్వాభివృద్ధిస్స్యా ద్వ్యతీపాతే ధనక్షయః।
అల్పవృష్టి వరీయాంస్తు పరిఘశ్చార్ఘనాశకృత్
శివేశివంస్యా త్సస్యస్య సిద్ధియోగే సుభిక్షదః॥
సాధ్యే సుభిక్ష మాప్నోతి శుభయోగే శుభప్రదం
శుక్లయోగే సువృష్టిస్స్యా ద్బ్రహ్మయోగే వినాశనం॥
ఐంద్రేవృష్టిః ప్రజాయేత వైధృతౌ వృష్టి నాశనమ్॥
దుర్భిక్షం మరణం వ్యాధిం కుర్యాదే తత్ఫలం స్ఫుటమ్॥

రవి ఆర్ద్రానక్షత్రమందు ప్రవేశించుకాలమందు (11) వృద్ధియోగమున్న సస్యాదులకు వృద్ధి. (12) ధ్రువయోగమున్న ప్రజలు ధైర్యముగా నుందురు. (13) వ్యాఘాతయోగమున్న వర్షాభావము. (14) హర్షణయోగమున్న సంతోషముండును. (15) వజ్రయోగమున్న ప్రజలు పీడింపబడుదురు. రోగములుండును. అల్పవృష్టి యుండును. (16) సిద్ధియోగమైన సమస్త ప్రాణికోటికి అభివృద్ధి. (17) వ్యతీపాతయోగమున్న ధనహాని, ధనలేమియు కలుగును. (18) వరీయాన్ యోగమున్న అల్పవృష్టి. (19) పరిఘయోగమున్న ధాన్యాదులకు ధరలు పెరుగును. (20) శివయోగమున్న శుభములు చేకూరును. (21) సిద్ధయోగమున్న సుభిక్షము. (22) సాధ్యయోగమున్న అసాధ్యకార్యములన్నియు సాధింపగలిగియుందురు. (23) శుభయోగమున్న శుభములు కలుగును. (24) శుక్లయోగమున్న సువృష్టి యుండును. (25) బ్రహ్మయోగమున్న సర్వసస్యములునశించును. కాని గ్రంథాంతరములో "బ్రహ్మాభిధానయోగే చేన్నలినీశః శివర్క్షగః జలంచ సకలం ధాన్యం మధ్యమం త్వత్ర జాయతే" అని యుండుటవల్ల మధ్యమ వర్షములు. మధ్యమ సస్యములు. పాడిపంటలు మధ్యమముగా నుండును. (26) ఐంద్రయోగమున్న సువృష్టి. (27) వైధృతియోగమున్న వర్షములు లేకుండుట, దుర్భిక్షము ప్రజాహాని, పశుహాని, రోగములు ప్రబలుట యుండును. ధాన్యాదుల ధరలు పెరుగును.



—◆ లగ్నఫలములు. ◆—

శ్లో॥ మేషే శుభకరంచైవ వృషభే పశువర్ధనం
మిథునే పశునాశంచ కుళీరే సస్యవృద్ధికృత్
సింహే వ్యాధిభయం కుర్యా త్కన్యాయా మశుభం భవేత్
తులావృష్టిః ప్రకుర్వీత వృశ్చికే విడ్వరం తథా
యుద్ధే ధనురాశేశ్చ మృగే వృష్టి ఫలప్రదః
కుంభేతు స్వల్పవృష్టిస్స్యా న్మీనే వృష్టి జలప్లవం॥

రవి ఆర్ద్రానక్షత్రమునందు ప్రవేశించు కాలమున లగ్నఫలములు మేషాది క్రమముగా 1. శుభం. 2. పశువృద్ధి 3. పశునాశము. 4. సస్యవృద్ధి. 5. వ్యాధిభయము. 6. శుభం. 7. సువృష్టి. 8. రాజవిగ్రహం. 9. యుద్ధము. 10. వర్షము. 11. అల్పవృష్టి. 12. అతివృష్టి కలుగును.

—◆ రవి ఆర్ద్రయందు ప్రవేశించుకాలమున
చంద్రస్థితి నిర్ణయము. ◆—

శ్లో॥ చతుష్కంచ చతుష్కంచ పంచమం త్రికమేవచ
పంచకంచ తథా షట్కం భరణ్యాది యథాక్రమం
సస్యవృష్టి శ్చాతివృష్టిః వృష్టినాశో మహార్ఘతాః
వృష్టినాశం మహాక్షేమం షణ్మండల ఫలం క్రమాత్॥

ఆర్ద్రానక్షత్రమునందు సూర్యుడు ప్రవేశించు కాలమునకు చంద్రుడు భరణ్యాది ఆరు మండలములలో ఏ మండలమునందుండునో సులభముగ తెలియుటకు యీ దిగువ చక్రమున చూపబడుచున్నది.

| మండలములకు వరుస నెంబరు | మండలమునందుండెడి నక్షత్రములు. |
|---|---|
| 1 | భరణి-కృత్తిక-రోహిణి-మృగశిరా |
| 2 | ఆర్ద్ర-పునర్వసు-పుష్యమి-ఆశ్రేష |
| 3 | మఘు-పుబ్బ-ఉత్తర-హస్త-చిత్ర |
| 4 | స్వాతి-విశాఖ-అనూరాధ |
| 5 | జ్యేష్ఠ-మూల-పూర్వాషాఢ-ఉత్తరాఢ-శ్రవణం |
| 6 | ధనిష్ఠ-శతభిషం-పూర్వాభాద్ర-ఉత్తరాభాద్ర- రేవతి-అశ్వనీ |

"ఆర్ద్రాయాం ప్రథమే పాదే యది వర్షతి వాసవః
సజలా నిర్జల శ్చైవ నిర్జల స్సజలో భవేత్ ॥
భరణీ పూర్వసస్యాని అంత్యసస్యాని రేవతీ
ఆర్ద్రాభిన్నే మధ్య సస్యం సర్వం నస్యతిచాశ్వినీ॥"

—గార్గిః దైవజ్ఞవిలాసే ౮ ఉల్లాసే.

సూర్యుడు ఆర్ద్రానక్షత్ర ప్రవేశ కాలమున చంద్రుడు భరణ్యాదిషణ్మండములలో ఉన్నపుడు మండల క్రమమున ఫలములుచూపబడుచున్నవి. 1. భరణ్యాది ప్రథమ మండలములో చంద్రుడున్న యెడల సస్యానుకూల వర్షము ఉండును. 2. ఆర్ద్రాది ద్వితీయ మండలములో చంద్రు డున్న యెడల అతివృష్టి కలుగును. 3. మఘాది తృతీయ మండలములోచంద్రు డున్నయెడల వర్షాభావము. 4 స్వాత్యాది చతుర్థ మండలములో చంద్రుడున్నయెడల సస్యాదికమునకు ఉత్పత్తి యధికమగుటవల్ల ధాన్యములకు ధరలు తగ్గును. 5. జ్యేష్ఠాది పంచమమండలములో చంద్రు డున్నయెడల వర్షాభావము. 6. ధనిష్ఠాది షష్ఠమ మండలమున చంద్రు డున్నయెడల సుభిక్షక్షేమారోగ్యసంపదలు, పాడిపంటలసమృద్ధి ధరలు తగ్గుట కలుగును.



రవిచార ఫలములను అన్నియు యిక్కడ వ్రాసి చూపరాదు. రవిచార ఫలములందలి విశేషములను గ్రహచారఫలములందు చూపదగియున్నందున యిచ్చట వ్రాయక వదలవలెనని గ్రహించి ప్రవర్తించవలయును. "ఆర్ద్రాప్రవేశే వృష్టిస్స్యాద్దివావాయదివానిశి । శోకవృద్ధి రనర్ఘత్వమవృష్టిస్సస్యసంపదః"॥

—దైవజ్ఞ విలాసే.

## —♦ రోహిణీనక్షత్ర స్థితి నిర్ణయము. ♦—

శ్లో॥ మేషార్క దిననక్షత్రాదబ్ధా యుగ్మం తటే ద్వయం
గిరావేకం ద్వయం సంధౌ సాభిజి ద్గణనా భవేత్ ॥

మేషసంక్రమణ ప్రవేశకాలమునకున్న దిననక్షత్రము మొదలుకొని రోహిణీనక్షత్రమువరకు లెక్కింపగానైన సంఖ్యను యీ క్రిందివిధముగా పంచవలెను. 1. సముద్రమందు రెండు నక్షత్రములు. 2. తటములందు రెండు నక్షత్రములు 3. పర్వతమునందు ఒక నక్షత్రము. 4. సంధుల యందు రెండు నక్షత్రములను ఉంచవలెను. బాలబోధగా యీ దిగువ వివరించబడుచున్నది.

సూర్యుడు మేషరాశియందు ప్రవేశించు కాలమున ఏ నక్షత్రమగునో తదాదిగా రోహిణీనక్షత్రముందువరకు లెక్కింపగా వచ్చు సంఖ్యాక్రమమున (అభిజిత్తునుకూడా లెక్కింపవలెను.)

| సముద్రమందు | తటమందు | సంధియందు | పర్వతమందు |
|---|---|---|---|
| 1—2 | 3 | 4 | 5 |
| 9—8 | 7 | 6 | |
| | 10 | 11 | 12 |
| 16—15 | 14 | 13 | |
| | 17 | 18 | 19 |
| 23—22 | 21 | 20 | |
| | 24 | 25 | 26 |
| | 28 | 27 | |

ఉదాహరణము :—సర్వధారి సంవత్సరము చైత్ర శుక్ల చతుర్థీ మంగళవారమున (13 ఏప్రిల్ 1948) రోహిణీ నక్షత్రము ఉదయాది ౫౦-౧౮ వరకు గలదు. ఆ రోజుననే అశ్వనీ ౧ మేషే రవిః ఉదయాది 3-౮-౨ లకు ప్రవేశమయ్యెను. రోహిణీనక్షత్రము సముద్రమునందుండె ననుట స్పష్టము.

—♦ సముద్ర చక్రే రోహిణీవాస ఫలాని వక్ష్యంతే. ♦—

శ్లో॥ యదా పయోనిధిస్థలే గతో విరించి భం తదా
అతీవ వర్షణం భవే త్సమస్త ధాన్యవర్ధనమ్॥

సముద్రమునందు రోహిణీవాసమైన సంవత్సరమున అధికవర్షము లుండును. సమస్త సస్యములు చక్కగా ఫలించును. పాడిపంటల సమృద్ధి యుండును. ధాన్యాదుల ధరలు తగ్గును. ఒకానొకచోట అధిక వర్షములచే వరదలవల్లను, మురుగు నీ రధికమగుటచేతను పంటలకు నష్టమున్నను సుభిక్షముగానే యుండును.

శ్లో॥ యది విధి ధిష్ణ్యం పతతి తటస్థం
శుభజలవృష్టి ర్ధనకణవృద్ధిః॥



సముద్రతటమందు (సముద్రపు టొడ్డున) రోహిణీవాసమైయున్న సంవత్సరమున సువృష్టి యుండును. సస్యవృద్ధి, తృణవృద్ధి, ధనవృద్ధి యుండును. పాడిపంటల సమృద్ధి యుండుటచే ధరలు సరసముగా నుండును.

శ్లో॥ రోహిణీనామనక్షత్రం పర్వతస్థం యదా భవేత్
వృష్టిహాని స్తదా జ్ఞేయా సర్వసస్య వినాశనమ్॥

పర్వతమందు రోహిణీవాసమైన సంవత్సరమున వర్షములుండవు సమస్త సస్యములకు నాశము కలుగును. పాడిపంటలు తగ్గును. పశువులకు రోగములు, ప్రజలకు ఆహారధాన్యముల కొఱత ఏర్పడును. ధరలు పెరుగును. దుర్భిక్షభయములుండును.

శ్లో॥ సంధిసంస్థం యదా బ్రాహ్మ్యం భం జాయతే
ఖండవృష్టి స్తదా సర్వధాన్యా న్యత్రయః॥

సంధియం దనగా పర్వతమునకు తటమునకును మధ్యయందు రోహిణీ నక్షత్రమున్న సంవత్సరమున ఖండవృష్టి యుండును. ధాన్యాదులను అమ్మక నిలవచేయవలెను. ధరలు పెరుగును. పాడిపంటల కొఱత యుండును.

—♦ సంవత్సరవాస ఫలమ్ ♦—

రోహిణీ నక్షత్రము సముద్రమందున్నచో సంవత్సరాధిపతి మాలాకారుని గృహమందు నివాసమై యుండును "సర్వవస్తు సమర్ఘం స్యా న్మాలాకార గృహేబ్దకే" అనుటచే ఆ సంవత్సరమున సమస్త వస్తువుల ధరలు మధ్యమముగా నుండును. (సరసమై యుండును.)

రోహిణీవాసము తటమైనచో సంవత్సరాధిపతి రజక (చాకలివాని) గృహమందు నివసించును.

"వాపీకూపతటాగాని నదీనదవనాని చ
జలపూర్ణాని దృశ్యంతే వాసో రజక వేశ్మని॥

సంవత్సరాధిపతి చాకలివాని యింటిలోనుండు సంవత్సరమున వాపీకూపతటాకాదులున్ను, నదీనదములున్ను పూర్ణజలయుతములై యుండును. అనగా అతివృష్టి యుండునని భావము.

రోహిణీనక్షత్రము సంధియం దున్నచో సంవత్సరాధిపతి వైశ్యు గృహమందు నివసించి యుండును.

"సర్వధాన్యం మహార్ఘం స్యా ద్వణిగ్వేశ్మనిసంస్థితే"

అను ప్రమాణము ననుసరించి ఆ సంవత్సరమున ధాన్యాదుల ఉత్పత్తి యధికమై యుండును గనుక ధరలు తగ్గియుండును.

రోహిణీ నక్షత్రము పర్వతమందున్నచో సంవత్సరాధిపతి కుంభకారుని (కుమ్మరివాని) యింటియందు నివసించియుండును. "కుంభకారగృహే వాసోతద్వర్షే మధ్యమం ఫలం" అను ప్రమాణము ననుసరించి ఆ సంవత్సరమందు మధ్యమ ఫలములు కలుగును.

—♦ చంద్రచార ఫలములు. ♦—

చంద్రచార ఫలములనే కొందరు యోగపంచక నిర్ణయ ఫలములని వ్రాయుచుందురు.

—♦ జ్యేష్ఠశుక్ల ప్రతిపద్యుక్త వార ఫలములు. ♦—

—♦ ఆదివార ఫలము. ♦—

శ్లో॥ దుర్భిక్ష యుద్ధామయభీతయశ్చ
నృపా స్సదా క్రోధముఖాః ప్రమత్తాః
సస్యాని మధ్యాని భవంతి లోకే
జ్యేష్ఠాదియుక్తే సతి భానువారే॥

జ్యేష్ఠ శుక్ల పాడ్యమి ఆదివారముతో గూడియున్నచో దుర్భిక్షము, యుద్ధము, రోగములవల్ల భయము కలుగును. రాజులు కోపస్వభావులై ప్రజలను పీడించెదరు. సస్యములు మధ్యమముగా ఫలించును.

—♦ సోమవార ఫలము. ♦—

శ్లో॥ సుభిక్షం క్షేమమారోగ్యం వృష్టి స్సస్య వివర్ధనం
ఆనందనిరతా ధాత్రీ జ్యేష్ఠాద్యా సోమవాసరే॥

దేశమున సుభిక్షము. ప్రజలకు క్షేమారోగ్యములు. సస్యానుకూల వర్షములు. పాడిపంటల సమృద్ధి యుండుటచే ప్రపంచమునందలి జనులు సంతోషించెదరు.



—♦ మంగళవార ఫలము. ♦—

శ్లో॥ దుర్భిక్ష యుద్ధామయభీతి కృచ్ఛ్ర
లోకా స్సదాన్యోన్య నృపాశ్చక్రుద్ధాః
దగ్ధం పురగ్రామ వనం నగాశ్చ
జ్యేష్ఠాది భూసూను దినే మునీంద్రైః॥

దుర్భిక్షము, యుద్ధము, రోగములవల్ల ప్రజలు భయకంపితులగుదురు. రాజులు, ప్రజలు పరస్పరము విరోధము గలిగియుందురు. పట్టణములు, గ్రామములు, వనములు, పర్వతములు అగ్నిదగ్ధములగును. చోరులు దుర్మార్గులు ప్రబలుదురు. ప్రజలకు ధన మాన ప్రాణ భంగములు కలుగును.

—♦ బుధవార ఫలము. ♦—

శ్లో॥ జ్యేష్ఠస్స్యాగమ ప్రాప్తాయాతిథిః ప్రథమా తథా
సోమపుత్రేణ దుర్భిక్షం భవత్యేవ నసంశయః॥

శ్లో॥ సుభిక్షం క్షేమమారోగ్యం వృష్టిస్సస్య వివర్ధనం
స్వధర్మనిరతాభూపాః జ్యేష్ఠాదౌ సౌమ్యవాసరే॥

బుధుడు పాపయుతుడై యున్నచో పాపుడగును. శుభయుతుడై యున్నచో శుభుడగును. జ్యేష్ఠశుక్ల ప్రతిపదయందు బుధుని స్థితిచే శుభత్వ పాపత్వముల నెఱింగి ప్రవర్తించవలెను.

పాపయుతబుధుడగునపుడు దుర్భిక్షమును తప్పక కలుగజేయును. శుభయుతుడైనపుడు సుభిక్ష క్షేమారోగ్యములు, సస్యానుకూల వర్షములు, పాడిపంటల సమృద్ధి యుండును. రాజులు స్వధర్మనిరతులై ప్రవర్తించెదరు.

—♦ గురువార ఫలము. ♦—

శ్లో॥ సుభిక్షం క్షేమమారోగ్యం సస్యవృద్ధి ప్రవర్షణం
బహుక్షీర ప్రదాగావో జ్యేష్ఠాదౌ గురువాసరే।

దేశమున సుభిక్షము, ప్రజలకు క్షేమమారోగ్యములు, సస్యవృద్ధి, మంచి వర్షములు, గోవులు బహుక్షీరముల నొసంగును. పాడిపంటల వృద్ధియుండుటచే ధరలు తగ్గును.

—♦ శుక్రవార ఫలము. ♦—

శ్లో॥ ప్రజారోగ్యం సుభిక్షంచ క్షేమం సస్యవివర్ధనం
సువృష్టి స్సర్వదేశానాం జ్యేష్ఠాదా భృగువాసరే॥

ప్రజల యారోగ్యాభివృద్ధి, దేశమున సుభిక్షము, ప్రజారక్షణ, సస్యములకు అభివృద్ధి, మంచి వర్షములు దేశమందంతటను యుండును. పాడి పంటల సమృద్ధియుండుటచే ధరలు తగ్గును.

—♦ శనివార ఫలము. ♦—

శ్లో॥ జ్యేష్ఠశుక్లప్రతిపది శనివారో భవేద్యది
జలశోషం ప్రజానాశం ఛత్రభంగో మహీపతేః॥

కించ॥ మధ్యసస్య మనర్ఘంచ జ్యేష్ఠాదా శనివాసరే॥

నీళ్లు లేక పశువులు, ప్రజలు రోగాదులచే పీడింపఁబడుదురు. పశువులకు నష్టము. ప్రజానష్టము. రాజులకు రాజ్యవినాశనము. దుర్భిక్షము. ప్రజాక్షోభ యుండును. మధ్యమ సస్యములగుటచే ధాన్యాదుల ధరలు బాగా పెరుగును.

—♦ ఆషాఢశుక్ల పంచమీయుక్తవారఫలములు. ♦—

శ్లో॥ ఆషాఢే పంచమీ శుక్లా......యదా భవేత్॥

ఈ శ్లోకము మొదటి పాదమున......అని వదలినచోట ఆషాఢ శుక్ల పంచమీ తిథి ఏ వారమున సంభవించునో ఆ వారమున వ్రాయుటకు వీలుగానుండునట్లు వదలి అచ్చోట వారక్రమమున "రవివారో" "సోమవారో" "భౌమవారో" "సౌమ్యవారో" "గురువారో" "భృగువారో" "మందవారో" అని వ్యవహరించుకొని పరివర్తింపనగును. వారక్రమమున ఫలములు యీ దిగువ చూపబడుచున్నవి. ఇవి రెండవ పాదముగా గ్రహించి వ్రాయనగును. (1) దుర్భిక్షం భయభీతాహ్యనావృష్టిర్భవేద్ధ్రువమ్। (2) సుభిక్షం క్షేమమారోగ్యం సువృష్టిశ్చ భవేద్ధ్రువమ్॥ (3) ఘోరం యుద్ధం విజానీయాత్ప్రజానాం పీడనం మహత్॥ (4) సుభిక్షం క్షేమమారోగ్యం జాయతే వృష్టి రుత్తమమ్। (5 సుభిక్షం జాయతే దేశే పశూనాం తృణవర్ధనమ్। (6) సుభిక్షం క్షేమమారోగ్యం



సువృష్టిశ్చ భవేద్ధ్రువమ్। (7) లోకానాం భయపీడాచ దుర్భిక్ష మధికం ధ్రువమ్॥

కించ॥ ఆషాఢమాసే సిత పంచమీస్యా
ద్రవ్యాదివారే క్రమశః ఫలాని
అత్యల్పవృష్టి రతివృష్టి యుద్ధం
క్షేమం సుభిక్షం శుభదంచ తాపం॥

జ్యేష్ఠశుక్ల పంచమీయుతవారము (1) ఆదివారమైన దుర్భిక్షభయము, భీతి, అల్పవృష్టి కలుగును. (2) సోమవారమైన సుభిక్ష క్షేమారోగ్యములు సువృష్టి యుండును. (3) మంగళవారమైన యుద్ధము, ప్రజాపీడ, కలుగును. (4) బుధవారమైన సుభిక్ష క్షేమారోగ్యములుండును. గాలి యధికముగా వీచును. (5) గురువారమైన సుభిక్ష క్షేమారోగ్యములు, పాడిపంటల సమృద్ధి, పశువుల గ్రాసము పుష్కలముగా లభించును. ధరలు తగ్గును. (6) శుక్రవారమైన సుభిక్ష క్షేమారోగ్యములు, సువృష్టి పాడిపంటల సమృద్ధి యుండును. ప్రజలు సుఖసౌఖ్యములను పొందెదరు. (7) శనివారమైన ప్రపంచమందంతటను భయోత్పాతములు, దుర్భిక్షము ప్రజాక్షోభ, ధరలు పెరుగుట, పాడి తగ్గుట, పంటలు నశించుట, పశుగ్రాసమునకు కఱువు, పశువులకు నష్టము సంభవించును.

—♦ ఆషాఢ శుక్లమున స్వాతీనక్షత్రయుక్త
తిథి ఫలము. ♦—

శ్లో॥ ఆషాఢే శుక్లపక్షేతు అష్టమీ స్వాతి సంయుతా
వాయు స్సర్వత్ర పీడ్యంతే భూమౌ సస్య సమృద్ధయః॥

ఆషాఢ శుక్లమున స్వాతీనక్షత్రము అష్టమీతిథియందు వచ్చుచో గాలి యధికముగా వీచును. సర్వసస్యములు ఫలించును.

శ్లో॥ ఆషాఢే శుక్లపక్షేతు నవమీ స్వాతి సంయుతా
వాయు స్సర్వత్ర సంవాతి భూమౌ బీజం నవాపయేత్॥

ఆషాఢ శుక్లమున స్వాతీనక్షత్రము నవమీ తిథియందు వచ్చుటచేత లధికమైన గాలి యుండును. విత్తులు చల్లరాదు. చల్లినచో ప్రయోజన ముండదు.

శ్లో॥ ఆషాఢే శుక్లపక్షేతు దశమీ యది సంయుతా
స్వాతీయుక్తేన చంద్రేణ మహద్వర్షం భవేద్ధ్రువమ్॥

ఆషాఢశుక్లపక్షమున స్వాతీనక్షత్రము దశమీతిథియందు వచ్చుచో అధికవర్షములుండును.

—♦ ఆషాఢ కృష్ణపక్షమున రోహిణీయుక్త తిథి ఫలములు. ♦—

శ్లో॥ ఆషాఢే కృష్ణపక్షేతు దశమీ రోహిణీయుతా
సర్వసస్య సమృద్ధిస్స్యా దేకాదశ్యాంతు మధ్యమా
ద్వాదశీ రోహిణీయుక్తా స్సర్వసస్య వినాశనీ॥

ఆషాఢ కృష్ణపక్షమునందు రోహిణీనక్షత్రమున్న తిథి దశమియయిన సమస్త సస్యములు చక్కగా ఫలించును. ఏకాదశియైన మధ్యమముగా ఫలించును. ద్వాదశియైన సమస్త సస్యములు నశించును.

—♦ పౌషమావాస్యయుక్త వారఫలములు. ♦—

శ్లో॥ దుర్భిక్షం క్షేమ మశుభం ఆరోగ్యం సస్యవర్ధనం
శుభం యుద్ధం క్రమాద్జ్ఞేయం పౌషమావారజం ఫలమ్।

పౌషమావాస్యయుక్త వారఫలములు వారక్రమ సంఖ్యలో చూపబడు చున్నవి. (1) దుర్భిక్షం. (2) క్షేమం. (3) అశుభం. (4) ఆరోగ్యం. (5) సస్యవృద్ధి. (6) శుభం. (7) యుద్ధము మొదలగు ఫలములు ఆది వార క్రమమున కలుగును.

—♦ దర్శయుక్త వారఫల విశేషములు. ♦—

శ్లో॥ అమావాస్యా దినే సూర్యః సంతాపాయార్థనాశనాత్
సుభిక్ష క్షేమమారోగ్యం వర్షాయాః ప్రబలోదయః॥

అమావాస్య ఆదివారమున కలిగిన ధననాశమువలన సంతాపము, వర్షాధిక్యతవలన సుభిక్ష క్షేమారోగ్యములుండును.

శ్లో॥ సస్యోత్పత్తిః ప్రజాసౌఖ్యం సోమవారే అమాయది
రాజ్యభ్రంశో రాజయుద్ధం క్లేశానాంచ ప్రవర్ధనమ్॥



అమావాస్య సోమవారమున కలిగిన సస్యవృద్ధి. ప్రజాసౌఖ్యమున్నను రాజులకు రాజ్యహాని, యుద్ధము, కష్టములు అధికమగును.

శ్లో॥ ఉపఘాతోల్పవృష్టిశ్చ క్షయశ్చార్ఘస్య భూమిజే
దుర్భిక్షం రాజ్యనాశశ్చ ప్రజానాం దుఃఖభాజనమ్॥

అమావాస్య మంగళవారమునందు సంభవించిన భూకంపము, తుపాను, ఉల్కాపాతములు, స్వల్పవర్షములు, ధనమానప్రాణహానులు, ప్రజానాశము, దుర్భిక్షము, ప్రజాక్షోభ, యుద్ధభయము, రాజ్యనష్టము లుండును.

శ్లో॥ స్థానత్యాగో ధాన్యమల్పం బుధవారే ప్రవర్తతే
సదా వృష్టి సుభిక్షంచ కల్యాణం దుఃఖనాశనమ్॥

అమావాస్య బుధవారమునందు వచ్చిన స్థాన భ్రష్టములు, ప్రజాక్షోభ స్వల్పధాన్యము, ఎల్లప్పుడు వర్షములు, వరదలవల్ల పంటలకు నష్టము, రోగము లుండును. కొన్నిచోట్ల సుభిక్ష క్షేమారోగ్యసంపదలు, దుఃఖ నాశనము కలుగును.

శ్లో॥ ఆరోగ్యంచ ప్రజాః స్వస్థా గురువారే సమాదిశేత్
భృశం జలోత్థితా మేఘాః కృషీణాం భూర్యుపద్రవాః॥

గురువారమునం దమావాస్య సంభవించినపుడు ప్రజారోగ్య ముండును కాని అధిక వర్షములచే వరదలు కలిగి, పంటలు నశించును. పశువులు నశించును.

శ్లో॥ తస్కరోపద్రవా నిత్యం శుక్రేణా మవసీదినే
దుర్భిక్షం రౌరవం ఘోరం మహాదుఃఖం మహద్భయమ్॥

శుక్రవారమున అమావాస్య వచ్చినచో చోరులవల్ల బాధలు, దుర్భిక్షము, దుర్మార్గులచే ధనప్రాణమానహానులు, దుఃఖములు కలిగి భయకంపితులై యుందురు.

శ్లో॥ పరాఙ్ముఖాః పితుః పుత్రా వ్యసనం శనివాసరే

అమావాస్య శనివార యోగముచే భార్యాభర్తలకు, తండ్రికొడుకులకు మిత్రులకు ఎడబాటులు, విరోధములు, దుఃఖములు సంభవించును.

—• మరియొక విశేష శ్లోకము. •—

శ్లో॥ శ్రావణే పంచమీ శుక్లే విజయదీపమాలికాః
సౌమ్యవారే సుభిక్షంస్యాత్ క్రూరే దుర్భిక్ష ముచ్యతే॥

శ్రావణ శుక్ల పంచమి ఆశ్వయుజ శుద్ధ దశమి, దీపావళీ అమావాస్య, ఫాల్గుణ శుక్ల పూర్ణిమ శుభగ్రహవారములందు వచ్చుచో సుభిక్షమున్ను, పాపగ్రహవారములందు సంభవించుచో దుర్భిక్షము కలుగును. ఈ నాలుగున్ను ఏ సంవత్సరమందైనను కలిసి రావలెను. ఇందొకటి లోపించిన వ్రాయరాదు.

—• చంద్రచారయందు వ్రాయదగినవిశేషములు. •—

—• చంద్రశృంగోన్నతి నిర్ణయము. •—

శ్లో॥ వక్రోళి ద్వితయే సింహే శూలాభః కన్యకాద్వయే
మీనత్రయే దక్షిణోచ్చశృంగః శేషే సమాకృతిః॥
విగ్రహంహి సమే చంద్రే దుర్భిక్షం దక్షిణోన్నతే
వ్యాధి చౌరభయం శూలే సుభిక్షం చోత్తరోన్నతే॥

చంద్రుడు వృశ్చిక ధనుస్సులం దుదయించిన వక్రగతుడు, కన్యాతులల యం దుదయించిన శూలమువలె నుండును. మీనత్రియమున ఉదయించినపుడు దక్షిణశృంగము ఎత్తుగ నుండును. మిథున, కటకములం దుదయించిన సమశృంగముగలిగియుండును. వక్రుడనగా ఉత్తరశృంగోన్నతి గల చంద్రుడని గ్రహించవలెను.

చంద్రునియొక్క శృంగోన్నతి సమముగానున్నచో కలహములు కలుగును. దక్షిణోన్నతి కలిగినచో దుర్భిక్షముకలుగజేయును. శూలమువలెనున్నచో వ్యాధిభయము, చోరభయములుండును. ఉత్తరశృంగోన్నతివలన సుభిక్షము కలుగును.

◡ సమశృంగ చంద్రుడు. ◡ ఉత్తర శృంగోన్నతిచంద్రుడు.
◡ దక్షిణ శృంగోన్నతి చంద్రుడు. ◡ శూలాభచంద్రుడు.

శ్లో॥ మేషమీనోదయేచం దుర్నియతం దక్షిణోన్నతం
శేషముత్తరశృంగేతు సమంతు వృష కుంభయోః॥

—దైవజ్ఞవిలాసే. గార్గిః.



—• చంద్రుని వర్ణ నిర్ణయము. •—

శ్లో॥ సింహే మేషద్వయే రక్తః శ్యామో మకరకుంభయో
తులాకర్కాలిషు శ్వేతః పీతః శేషేషు శీతగుః॥

చంద్రు డుదయించు కాలమున సింహ, మేష లగ్నములగుచో చంద్రుడు రక్తవర్ణుడుగ కన్పించును. మకరకుంభములైన నల్లనివర్ణముగలవాడగును. తులాకటక వృశ్చిక లగ్నములైన తెల్లనిరంగుగలవాడగును. మిగిలిన లగ్నములైన పసుపు (బంగారపువన్నె) గలవాడగును.

—• చంద్రుని రంగులయొక్క ఫలములు. •—

శ్లో॥ అరుణశ్శీతలకిరణః కరోతిరసహాని రూగ్రరణమరణం
పీతోరోగ నియోగం కరకాదిభయం పునః కాలః॥

ఎరుపురంగుగల చంద్రుడు రసవస్తువులకు ధరలు పెంపుచేయును, రస వస్తువులు నశించునని భావము. గొప్ప యుద్ధమున రాజులకు ప్రజలకు మరణములు కలగును. పసుపు వర్ణము గలిగిన చంద్రుడు రోగములను కలుగజేయును. నల్లనిరంగుగల చంద్రుడు వడగండ్లవాన, ఉరుములు, మెఱుపులు, గాలితోగూడిన వర్షముల నిచ్చును. భయమును కలుగ జేయును. తెల్లని చంద్రుడు సుభిక్షక్షేమారోగ్యముల నొసంగునని గ్రహించవలెను.

—• చంద్రోదయ సాధనము. •—

చంద్రోదయ సాధనము అత్యంతసూక్ష్మగణితసాధ్యమైయున్నది. స్థూలముగా సాధన చేయు రీతి చూపబడుచున్నది.

అమావాస్యయందు సూర్యచంద్రు లిరువురును కలిసియుందురు. కనుక అమావాస్యకు దర్శయని పేరు. "దర్శస్సూర్యేందు సంగమః' అనుటప్రమాణము. సూర్యాస్తమయమున పూర్వమే శుక్లపక్షమున చంద్రోదయమగును. పూర్ణిమనాడు సూర్యుడు అస్తక్షితిజమునందుండగా చంద్రుడు ఉదయక్షితిజమందుండును. అమావాస్యయందు సూర్యచంద్రు లిర్వురు ఒకే దిశయం దస్తమించెదరు. అనగా శుక్లపక్షమునందు సూర్యాస్తమానానంతరమున చంద్రాస్తమయము కలుగును. కృష్ణపక్షమున సూర్యాస్తమానమునకు పూర్వమందే లేక సూర్యో

దయమునకు ముందుగనే చంద్రాస్తమయమున్ను, సూర్యాస్తమానాత్పరమున చంద్రోదయమున్ను కలుగును.

శ్లో॥ తిథి గుణితం రజనీ పరిమాణం
యమరహితం సహితం సితపక్షే
విషయశశాంక విభాజితలబ్ధం
భవతి విధూదయ మస్తమయంచ॥

రాత్రి ప్రమాణమును తిథిచే గుణించి అందు ౨ కలుపగా వచ్చినదానిని ౧౫ చే భాగించగా వచ్చు లబ్ధము ఘడియలగును. శేషమును ౬౦ చే గుణించి ౧౫ చే భాగించగా (శేషమును ౪ చే గుణించగా) వచ్చునవి విఘడియలగును. ఈ విధముగనే చంద్రోదయాస్తమయ సాధనములు ఏ తిథికైనను సాధింపవచ్చును. (కృష్ణపక్షమున ౨ తీసివేయవలెను.)

(1) ఉదాహరణము :—శుక్ల పంచమినాడు చంద్రాస్తమయ మెపుడు కలుగుచున్నదో చూపబడుచున్నది.

రాత్రి ప్రమాణము ఘ. 30–0 లు ఉన్న దనుకొనుడు.

30–0 రాత్రి ప్రమాణము
5 గుణకము
150–0 గుణజము
2–0 (యమసహితం సితపక్షే) చేర్చదగిన సంఖ్య
15|152–0
10 లబ్ధం. శేషము 2×4=8.

శుక్ల పంచమినాడు ఘ, 10–8 లకు చంద్రాస్తమయము అనట స్పష్టమగుచున్నది. (సూర్యాస్తమయానంతరమున చంద్రాస్తమయమని గ్రహించవలెను.)

(2) ఉదాహరణము :—కృష్ణపంచమినాడు చంద్రోదయ మెపుడు కల్గుచున్నదో చూపబడుచున్నది.

రాత్రి ప్రమాణము ఘ. 30–0 అనుకొనుడు.



30–0 రాత్రి ప్రమాణము
5 గుణకము
150–0 గుణజము
2–0 తీసివేయదగిన సంఖ్య (యమరహితం.)
15|148–0
9 లబ్ధం శేషసంఖ్య 13×4=52

కృష్ణ పంచమినాడు ఘ. 9–52 లకు చంద్రోదయమనుట స్పష్టము. (సూర్యాస్తమయానంతరమున ఘ. 9–52 లకు చంద్రోదయమగునని తెలియవచ్చుచున్నది.)

ఇయ్యది మహాస్థూలమైనదయ్యును సూక్ష్మరీతిచే చంద్రోదయాస్తమయముల సాధన మిక్కిలి ప్రయాస సాధ్యమైన దగుటచే సాధారణ జనులకే గాదు, సిద్ధాంత గణితము తెలిసిన పంచాంగకర్తలకైనను దుర్ఘటమైనందున స్థూలరీతిచే సాధింపబడినది గ్రహించి ప్రవర్తించుట దోషము కానేరదని తెలియదగును.

ఇంతకంటె కొంతవరకు సూక్ష్మమైన పద్ధతిని కూడా తెలియజేయబడుచున్నది. ఎట్లనిన :—

శుక్లపంచమీ తిథ్యంత కలలు=5×12×60=3600
శుక్లపంచమీతిథ్యంతవికలలు=5×12×60×60=216000
మధ్యమమానముచే చంద్రునిగతి కలాది 790–35

$$\frac{216000}{216000+790\text{–}35} = \frac{216000}{22390\text{–}35}$$

$$= \frac{116640000}{1342455} = \frac{\text{ఘ. 8–41 వి.}}{} = (\text{చంద్రోదయము})$$

మొదట చూపిన చంద్రోదయ సాధనకంటె ఇది కొంతవరకు సూక్ష్మమైనదే గాని ఇదియే ప్రమాణముగా గ్రహించవలెననుటకూడదు. ఇదియైనను స్థూలమే యగుననుట కారణమై యున్నది. రెండవరీతిని గ్రహించి ప్రవర్తించు నత్యంతరములేనపుడు గ్రహించి ప్రవర్తించుచో దోషము కానేరదు.

పైన చూపిన విధముగా చంద్రోదయాస్తమయ ఘటికలను సాధించగా వచ్చు కాలమునకు ఏ లగ్నమగునో చూచుకొని ఆయాలగ్న ఫలములను గ్రహించవలసియున్నది. కాని "అసిత చతుర్దశ్యాంతే ప్రతిమాసం చాస్తమేతి తుహినకరః। సతతం దర్శస్యాంతేతు వితో రాశ్యాదిభిర్నియత రే॥"

—దైవజ్ఞ విలాసే ఉల్లాసే.

—♦ చంద్రోదయలగ్న ఫలములు. ♦—

శ్లో॥ చంద్రోదయే మేషరాశౌ గ్రీష్మధాన్య మహార్ఘతా
వృషే మాష తిలా గురు తుష ధాన్య మహార్ఘతా॥
కార్పాస సూత్ర ధాన్యాది మహర్ఘం మిథునే స్మృతమ్
అనావృష్టిః కర్కరాశౌ సింహే ధాన్య మహార్ఘతా॥
చతుష్పాద వినాశోపి రాజ్ఞా మన్యోన్య విగ్రహః
ద్విజాదిపీడా కన్యాయాం తులాక్రియణకం ప్రియమ్।

చంద్రోదయ లగ్నము (1) మేషమగుచో గ్రీష్మధాన్యములకు (గోధుమాదులకు) ధరలు తగ్గును. ఉత్పత్తి యధికమై యుండును. (2) వృషభమగుచో మినుములు, నువ్వులు, పెద్దగింజలు, (వేరుశనగ), పొట్టుధాన్యములకు ధరలు తగ్గును. ఉత్పత్తి (పంట) యధికమగును. (3) మిథునమగుచో ప్రత్తి, నూలు, దూది ఆహార ధాన్యములకు ధరలు తగ్గును. ఉత్పత్తి యధికమగును. (4) కటకమగుచో వర్షములు తక్కువ. పంటలు తగ్గును. ధరలు కొంత హెచ్చుగా నుండును. (5) సింహమగుచో ధాన్యములకు ధరలు తగ్గియుండును (6) కన్యయగుచో పశువులకు నష్టము, రాజులకు యుద్ధము, కలహములు, పాడిపంటలకు హానియుండును. బ్రాహ్మణులకు పీడ, పశువుల ధరలు, నెయ్యి, వెన్న, పాలు, పెరుగు ధరలు పెరుగును. (7) తులయగుచో క్రయవిక్రయాదులు అధికమగును. వ్యాపార వాటాలు పెరుగును. ధరలు హెచ్చుతగ్గులుగ యుండును.

శ్లో॥ వృశ్చికే ధాన్యనిష్పత్తిర్ధనుర్మకరయోః శుభమ్
కుంభే చణక మాషాది తిలానాం నాశ ఇష్యతే॥
మీనే సుభిక్షమారోగ్యం ఫలం ద్వాదశరాశిజమ్
ఏవం జ్ఞేయం ద్వితీయాయాం నియమే ప్రతిభావనాత్॥



(8) వృశ్చికమగుచో ధాన్యములకు ఉత్పత్తి యధికమగును. కనుక ధరలు తగ్గునని భావము. (9) ధనుస్సు అయిన ధరలు సరసముగా నుండును, (10) మకరమైన శుభములు కలుగును. (11) కుంభమైన వేరుశనగ, సెనగలు, మినుములు, నువ్వులు మొదలగు అపరాల పంటలు నశించును. కనుక ధరలు పెరుగునని గ్రహించవలెను. (12) మీనమగుచో సుభిక్షము ప్రజారోగ్య ముండును. సమస్త వస్తువుల ధరలు సరసముగా నుండును.

—♦ చంద్రాస్తమయ లగ్న ఫలములు. ♦—

శ్లో। చంద్రాస్తే మేషరాశిస్థే సర్వధాన్య మహార్ఘతా
వృషేచ చణకా పీడా మృత్యుశ్చోరభయం జనే॥
మిథునేష్వతి వృష్టిస్స్యాద్ద్విజవాపేన ఘృష్టయే
కర్కటే ప్యతివృష్టిస్స్యాత్సింహే ధాన్య మహార్ఘతా॥
కన్యాయాం ఖండవృష్టిశ్చ సర్వధాన్య సమర్ఘతా
తులాయా మల్పవృష్టిస్స్యాద్దేశభంగో భయం పథి।
వృశ్చికే మధ్యమం వర్షం గ్రామనాశో ఱ్ఱుపద్రవాత్
సుభిక్షం ధనుషాధాన్యైర్మకరే ధాన్యపీడనమ్॥
కుంభేఽల్పవృష్టిర్ధాన్యాని మహార్ఘాణి ప్రజాభయమ్
సుఖసంపత్తయో ర్మీనేమాసం యావదిదం ఫలమ్॥

చంద్రాస్తమయము (1) మేషలగ్నమందైన (అనగా అమావాస్యారంభ ఘటికలకు లగ్నమును సాధించి చూడగా మేషలగ్నమగుచో) సమస్త ధాన్యములకు ధరలు తగ్గును. (మహార్ఘము అనునపుడు వెల పెరుగును అని చెప్పరాదు. ఉత్పత్తి యధికమగునని తలంచవలెను. ఉత్పత్తి అధికమైనపుడు ధరలు తగ్గుట అనుభవైకవేద్యమే గదా!) (2) వృషభమైన వేరుశనగలు, సెనగల పంటకు నష్టము. కనుక ధరలుపెరుగును ఉత్పత్తి తగ్గినపుడు వస్తుకొఱతవల్ల ధరలు పెరుగుట తథ్యమే యగును. (3) మిథునమైన అధిక వర్షములు. గాలి యధికము. ప్రత్తిపంట నశించును కనుక ధరలు పెరుగును, విత్తనములు చల్లుటయందు ప్రయోజనము లేదు కనుక విత్తనములు చల్లుట కూడదు. (4) కటకమైన అధిక వర్షము

లుండును. (5) సింహమైన ఆహారధాన్యములకు వెల పెరుగుననగా ధాన్యాదులకు ధరలు తగ్గును ఒకానొకప్పుడు ధరలు పెరుగునని చెప్పనగును (6) కన్యయైన ఖండవృష్టి, ధాన్యాదుల ఉత్పత్తి తగ్గుటవలన ధరలు పెరుగును. (7) తులయైన అల్పవృష్టియుండును. పంటలు తగ్గుటచే ధరలు పెరుగును. మరియు రాజకీయ వడిదుడుకులు, రాజ్య పరివర్తనము, రాజకీయములందు మార్పులు ఏర్పడుటవల్ల ప్రజలు భయకంపితులై యుందురు. (8) వృశ్చికమైన మధ్యమవర్షము, గ్రామములు నాశనమగును. చోరరోగాగ్నిభయములుండును. దుర్మార్గులు చెలరేగెదరు. ప్రజాక్షోభయుండును. భయోత్పాతములు కలహములుండును. (9) ధనుస్సైన సుభిక్షము. (10) మకరమైన ధాన్యాదులకు నాశము. అనగా పంటలు చెడిపోవును. ధరలు పెరుగును. (11) కుంభమైన అల్పవృష్టియుండుటవల్ల కొన్నిచోట్ల పంటలు పండి ధరలు తగ్గియుండును. మరికొన్నిచోట్ల వర్షములు లేక పంటలు లేకపోవుటచే ధాన్యాదులకు ధరలు పెరుగును. ప్రజాకల్లోలములు, భయోత్పాతములుండును. (12) మీనమైన సుఖసౌఖ్యములుండును. ఈ మాసమునందంతయు సుభిక్షముగా నుండును.

శ్లో॥ విమల ప్రతిపద్యంతే స్సుదయం యాతిప్రభాకరాన్మర్త్యః
ద్వాదశభాగ వివృద్ధ్యాతిథయశ్చాంద్రశ్చ సంభూతాః॥
—దైవజ్ఞవిలాసే ౯ ఉల్లాసే.

—♦ కుజచార ఫలములు. ♦—

కుజచార ఫలములన్నియు యిచ్చట వ్రాయుట ఆచారముకాదు. గ్రహచార ఫల వివరములందు వ్రాయుట సమంజసమైనది గాన యిచ్చట కుజుని వక్రత్వ ఫలములు మాత్రమే వ్రాసి చూపుట సాంప్రదాయమై యున్నందున ఆ విషయములనే యిచ్చట వ్రాయబడుచున్నవి.

—♦ కుజ వక్రత్వ నిర్ణయ ఫలములు. ♦—

శ్లో॥ యద్యుదయర్క్షా ద్వక్రం కరోతి నవమాష్ట సప్తమర్క్షేషు
తద్వక్ర ముష్ణ ముదయే పీడాకర మగ్నివార్తానామ్॥



గత సంవత్సరమున కుజుడు ఏ నక్షత్రమునందు సంచరించుచు ఉదయము నొందెనో ఆ నక్షత్రమునుండి కుజుడు వర్తమాన సంవత్సరములో ఏ నక్షత్రమునందు సంచరించుచు వక్రించెనో ఆ నక్షత్రము వరకు లెక్కించుకొనవలెను. ఉదయ నక్షత్రమునుండి ౭, ౮, ౯ నక్షత్రములలో ఏ ఒక నక్షత్రమునందైనను సంచరించుచుండగా కుజునకు వక్రత్వము కలిగినచో ఆ వక్రమునకు ఉష్ణమని పేరు. ఉష్ణవక్రము గలిగిన కుజుడు యంత్రాగారములందును, అగ్నిసంబంధము గల్గియుండు కార్మికులు, కంసాలులు, కమ్మరులకున్ను, ప్రజలకున్ను పీడను కలుగజేయును. అగ్నిభయవార్తలు, కార్మికుల నిర్బంధములు, కార్మికుల సమ్మెలు ప్రబలును.

శ్లో॥ ద్వాదశ దశమైకాదశనక్షత్రా ద్వక్రితే కుజేఽశ్రుముఖమ్
దూషయతి రసానుదయే కరోతి రోగాన వృష్టించ॥

కుజు డుదయించిన నక్షత్రము లగాయతు ౧౦, ౧౧, ౧౨ నక్షత్రములలో వక్రత్వము కల్గియున్నచో ఆ వక్రమునకు అశ్రుముఖమని పేరు. అశ్రుముఖ వక్రముగలిగిన కుజుడు సమస్త రసవస్తువులకును. పాదరసము, రసానిక పదార్థములకు నాశము కలుగును. రోగములుండును. అనావృష్టి. సమస్త రసవస్తువుల ధరలు, ధాన్యాదుల ధరలు లోహముల ధరలు పెరుగును,

శ్లో॥ వ్యాలం త్రయోదశర్క్షా చ్చతుర్దశాద్వా విపచ్యతేఽస్తమయే
దంష్ట్రివ్యాలమృగేభ్యః కరోతి పీడాం సుభిక్షంచ॥

కుజు డుదయించిన నక్షత్రమునుండి ౧౩, ౧౪ నక్షత్రములందు వక్రత్వమునొందినచో ఆ వక్రము వ్యాళమను పేరుగలదియగును. గజములు, పెద్దపులులు, ఏదుపందులు, సర్పములు మొదలగు క్రూరజంతూపద్రవములుండును. సుభిక్షముండును.

శ్లో॥ రుధిరానన మితివక్రం పంచదశాత్ షోడశాచ్చవినివృత్తే
తత్కాలం ముఖరోగం సభయంచ సుభిక్ష మావహతి॥

కుజు డుదయించిన నక్షత్రమునుండి ౧౫, ౧౬ నక్షత్రములందు వక్రత్వము నొందినచో ఆ వక్రము రుధిరమను పేరుగలది యగును. అది

మనుష్యులకు ముఖరోగములు, గళరోగములు, భయములు కలుగ జేయును. సుభిక్షమును కలుగజేయును.

శ్లో॥ అసిముశలం సప్తదశాదష్టాదశతోపివా తదనువక్రే
దస్యుగణేభ్యః పీడాం కరోత్య వృష్టిం సశస్త్రభయమ్॥

కుజు డుదయించిన నక్షత్రమునుండి ౧౭, ౧౮ నక్షత్రములందు వక్రత్వమునొందినచో ఆ వక్రమునకు అసిముశలమని పేరు. అది చోరభయము, శస్త్రభయము, అనావృష్టి, యుద్ధభయము కలుగజేయును

## —♦ విశేష ఫలములు. ♦—

శ్లో॥ భాగ్యార్యమోదితో యది నివర్తతే వైశ్వదేవతే భౌమః
ప్రాజాపత్యే స్తమితస్త్రీనపి లోకాన్ని పీడ్యతి॥

కుజుడు పుబ్బయందుగాని, ఉత్తరయందు గాని ఉదయించి ఉత్తరాషాఢ నక్షత్రమున వక్రించి రోహిణినక్షత్రమునం దస్తమించినయెడల స్వర్గ మర్త్యపాతాళలోకములయందు (ముల్లోకములయందు) పీడలుకలుగును.

శ్లో॥ యస్మిన్ ఋక్షేభ్యుదిత స్తద్దిగ్వ్యూహాన్ జనాన్ హంతి॥

కుజుడు ఏ నక్షత్రమం దుదయించునో ఆ నక్షత్రమున్న దిశకు ప్రయాణము చేయువారికి నాశము కలిగించును.

శ్లో॥ ప్రాజాపత్యే శ్రవణే మూలే త్రిసుషూత్తరాసు శాక్రేచ
విచరన్ ఘననివహానా ముపఘాతకరః క్ష్మాతనయః॥
—వారాహీ సంహితాయాం 3౬. ఫుటే.

రోహిణీ, శ్రవణ, మూల, ఉత్తరఫల్గుణి, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర జ్యేష్ఠానక్షత్రములందు కుజుడు సంచరించుచు వక్రించిన మేఘములు నశించును. వర్షాభావము. (విచరన్=వక్రచారముగల్గియున్నచో)

శ్లో॥ చారోదయాః ప్రశస్తాః శ్రవణమఘాదిత్య మూలహస్తేషు
ఏకపదాశ్వి విశాఖా ప్రాజాపత్యేషుచ కుజస్య॥

కుజుడు శ్రవణ, మఘా, పునర్వసు, మూల, హస్త, పూర్వాభాద్ర, అశ్వనీ, విశాఖ రోహిణినక్షత్రములందు సంచరించుచున్నను ఉదయించినను దోషములేదు. శుభము కలుగును.

వివరములకు గ్రహచార ప్రకరణమును చూడుడు.



## —♦ బుధచార ఫలములు. ♦—

## —♦ ఉదితమాస ఫలములు. ♦—

శ్లో॥ పౌషాషాఢ శ్రావణవైశాఖేష్విందుజస్సమాఘేషు
దృష్టోభయాయ జగతశ్శుభఫలదః ప్రోషిత స్తేషు॥
ఇషోర్జమా సయోర్వహ్నిశస్త్ర దుర్భిక్ష కారకః
ఉదిత శ్శశిజో నృణా మిత రేషు శుభప్రదః।
అవర్షే కురుతే వర్షం వర్షే వర్షం నయచ్ఛతి
భయేచ కురుతే క్షేమం సర్వత్ర ప్రతిలోమగః॥

బుధుడు పౌష, ఆషాఢ, శ్రావణ, మాఘమాసములలోను, ఆశ్వయుజ, కార్తీకమాసములలోను ఉదయించిన దుర్భిక్షము, శస్త్రాగ్నిభయములు కలుగును. ఈ మాసములలో అస్తమించినచో లోకమునకు శుభము. అట్టి ఉదయ కాలమున వర్షములున్న అనావృష్టియు, అనావృష్టియున్న వృష్టియు ఇట్లే ఎద్దియైనను తద్విపరీతముగ ఫలము లొసంగును.

Note :—మిగతా విషయములను గ్రహచారలందు వ్రాయదగియుండుట చేత వదలివేయడమైనది. పంచాంగ పీఠికయందు పైన వ్రాసినవే చాలును.

## —♦ గురుచార ఫలములు. ♦—

పంచాంగ పీఠికయందు ముఖ్యముగా గురుని రాశి ఫలములువ్రాసి చూపుట సిద్ధాంత సాంప్రదాయము. కనుక రాశిచార ఫలములను మాత్రమే యిచ్చట వ్రాసిన చాలును. చార ఫలములు వివరముగా గ్రహచార ప్రకరణమున వ్రాయబడియున్నందున యిచ్చట గ్రంథ విస్తరభీతిని వ్రాయక వదలబడెనని గ్రహించవలెను.

## —♦ శుక్రచార ఫలములు. ♦—

సిద్ధాంత సాంప్రదాయములో యిచ్చట శుక్రుని ఉదయాస్తవీధి ఫలములు మాత్రము వ్రాసి చూపుట గలదు. గ్రహచార ప్రకరణ

మన యీ విషయము వివరముగా వ్రాయబడియున్నందున యిచ్చట వ్రాయక వదలితిని.

—♦ శనిచార ఫలములు. ♦—

సిద్ధాంత సాంప్రదాయములో యిచ్చట శనియొక్క నక్షత్రరాశి ఫలములను, కూర్మచక్రఫలములను వ్రాయుట గలదు. ఇవన్నియు గ్రహచార ప్రకరణమున వ్రాయఁబడియున్నందున యిచ్చట వ్రాయక వదలివేయడమైనది.

—♦ రాహుచార ఫలములు. ♦—

సిద్ధాంత సాంప్రదాయములో గ్రహణమాస ఫలములు వ్రాసి చూపుట గలదు. ఇవన్నియు గ్రహచార ప్రకరణమున చూపబడి యున్నవి. వాటిని చూచి ప్రవర్తించవలెను. గ్రంథవిస్తర భయమున యిట వ్రాయక వదలితిని.

—♦ దేశారిష్ట యోగములు. ♦—

ఇవన్నియు గ్రహచార ప్రకరణమున వివరముగా వ్రాయ బడెను. వాటిని చూచి ప్రవర్తించవలెను.

—♦ అనావృష్టి యోగములు. ♦—

గ్రహచార ప్రకరణమున వివరింపఁబడియున్నవి. వాటిని చూచు కొని ప్రవర్తించవలెను.

—♦ వర్ష యోగములు. ♦—

గ్రహచార ప్రకరణమున వివరములు గలవు. వాటిని చూచు కొని ప్రవర్తించవలెను.

—♦ సస్య ఫల విచారణ. ♦—

శ్లో॥ వృశ్చిక వృష ప్రవేశే భానోర్యే బాదరాయణేనోక్తాః
గ్రీష్మశర త్సస్యానాం సదసద్యోగాః కృతాస్త ఇమే॥

శ్లో॥ భానోరళి ప్రవేశే కేంద్రైస్త్రస్మా చ్ఛుభగ్రహాక్రాంతైః
బలవద్భిః సౌమ్యైర్వా నిరీక్షితై గ్రీష్మక వృద్ధిః॥



శ్లో॥ అష్టమరాశిగతేర్కే గురు శశినోః కుంభసింహస్థితయోః
సింహఘటసంస్థయోర్వా నిష్పత్తి గ్రీష్మ సస్యస్య॥

శ్లో॥ అర్కాత్సితే ద్వితీయే బుధేథవా యుగపదేవ వాస్థితయోః
వ్యయగతయోరపి తద్వ న్నిష్పత్తిరతీవ గురుదృష్ట్యా॥

శ్లో॥ అల్యాదిస్థేసవితరి గురౌ ద్వితీయేర్థ నిష్పత్తిః॥

శ్లో॥ లాభహిబుకార్థయుక్తైః సూర్యాదరిగాత్సితేందుశశిపుత్రైః
సస్యస్య పరా సంపత్ కర్మాణి జీవేగవాంచాగ్ర్యే॥

శ్లో॥ అర్థస్థానే క్రూరః సౌమ్యైర నిరీక్షితః ప్రథమజాతమ్
సస్యం నిహంతి పశ్చాదుప్తం నిష్పాదయే ద్వ్యక్తమ్॥

శ్లో॥ జామిత్ర కేంద్రసంస్థా క్రూరా సూర్యస్య వృశ్చికస్థస్య
సస్యవిపత్తిం కురుతః సౌమ్య దృష్టా న సర్వత్ర॥

శ్లో॥ వృశ్చిక సంస్థాదర్కాత్ సప్తమషష్ఠోపగా యదా క్రూరా
భవతి తదా నిష్పత్తిః సస్యానామర్ఘ పరిహానిః॥

శ్లో॥ విధినానేనైవరవిర్వృషప్రవేశే శరత్సముత్థానామ్
విజ్ఞేయః సస్యానాం నాశాయ శివాయతాతజ్ఞైః॥

శ్లో॥ త్రిషుమేషాదిషుసూర్యః సౌమ్యయుతో వీక్షితో పివావిచరన్
గ్రైష్మికధాన్యం కురుతే సమర్ఘముభయోవ యోగ్యంచ॥

శ్లో॥ కార్ముకమృగఘటసంస్థః శారదస్య తద్వదేవరవిః
సంగ్రహకాలో జ్ఞేయో విపర్యయః క్రూరదృగ్యోగాత్॥

సస్యములు గ్రీష్మ. కాలిక, శరత్కాలికములని ద్వివిధములు.

జొన్న, మొక్కజొన్న, సజ్జ, ధాన్యము, కందులు, పెసలు, మినుములు, నువ్వులు గ్రీష్మధాన్యములు. వీటికి జ్యేష్ఠాషాఢమాసములలో విత్తులు చల్లుట, నారు నాటుట సంభవించును. యవలు, గోధుమలు, వేరుశనగ, సెనగలు మొదలగునవి శరద్ధాన్యములు. వీటికి ఆశ్వయుజ కార్తీకమాసములందు విత్తులు చల్లెదరు. గ్రీష్మసస్యజాతకమున వృశ్చిక లగ్నము. శరత్కాల సస్యములకు వృషభలగ్నము.

వృశ్చికరాశియందు సూర్యుడు ప్రవేశించు కాలమునకు లగ్నమును సాధించవలెను. ఈ సాధనము ద్వివిధము. (1) సాయనపద్ధతి

అనగా వృశ్చికాయనగతోర్కః అని వ్రాయబడు కాలమునకు లగ్నమును సాధించు పద్ధతి. గ్రహములను, లగ్నమును సాయనపద్ధతినే సాధించవలెను. (2) నిరయన పద్ధతి ఇందు రవిచంద్రులుకూడా దృక్సిద్ధగ్రహములైయున్న మంచిది. దృక్సిద్ధముగాని రవిచంద్రులవల్ల కొలది వ్యత్యాస ముండును కాని త్రోసివేయవలసిన నిమిత్తములేదు. వృశ్చికాయన ప్రవేశమునకు సాధింపబడిన లగ్నము సాయన మనబడును. సాయన పద్ధతి ననుసరించి ప్రవర్తించినచో ఫలములు ఋజు వాసంగును. సాయన పద్ధతి తెలియనివారు వృశ్చిక సంక్రమణ ప్రవేశ కాలికమునకే మామూలు రీతిని లగ్నమును సాధించవలసియుండును.

(2) వృశ్చికమున రవి ప్రవేశించు కాలమునకు సాధింపబడిన లగ్నమునకు ౧, ౪, ౭, ౧౦ స్థానములందు శుభులగు చంద్ర, బుధ,గురు శుక్రులలో ఎవరున్నను గ్రీష్మ సస్యములు బాగుగా ఫలించును.

(3) గురుచంద్రులలో ఎవరైనను, కుంభసింహములందుగాని, యిర్వురు కలసి కుంభమునగాని, సింహమునగాని యున్న సమయమందు రవి వృశ్చికరాశియందు ప్రవేశించినను గ్రీష్మ సస్యములు బాగుగా ఫలించును.

(4) రవికి రెండింటగాని, పన్నెండవయింటగాని బుధ శుక్రులు (యీ రెండింటిలో ఏ ఒక గ్రహమైనను) ఉన్నపుడు ఆ బుధశుక్రరవులలో ఏ గ్రహమునైనను గురుడు చూచినచో (రవిని గురుడు చూచుటయే యిచ్చట మంచిది) గ్రీష్మ సస్యములు బాగుగా ఫలించును.

(5) రవి వృశ్చికమున, గురుడు రెండవరాశియగు ధనుస్సుయందున్నచో గ్రీష్మ సస్యములు మధ్యమముగా ఫలించును. (సగము పంట పండునని భావము.)

(6) రవి వృశ్చికమునందుండగా రవికి ౨, ౪, ౧౧ స్థానములందు చంద్ర, బుధ, శుక్రులున్నయెడలను లేక రవి వృశ్చికమున ప్రవేశించు కాలమునకు సాధింపబడిన లగ్నమునకు ౨, ౪, ౧౧ స్థానములలోచంద్రబుధశుక్రులున్నను లేక వృశ్చికమునందు చంద్ర బుధ శుక్రులున్నను గ్రీష్మ సస్యములు బాగుగా ఫలించును. ౧౦ వ స్థానమున గురుడున్నను పంట లధికము.



(7) వృశ్చికమున రవియుండగా ఆ రవికి రెండవ యింట పాపగ్రహములగు కుజ, శని, రాహు, కేతువులలో ఏ గ్రహమున్నపుడు శుభగ్రహదృష్టి రవికిగాని, కుజాదులకుగాని లేకయున్నచో గ్రీష్మ సస్యములు నశించును. మరల గ్రీష్మ సస్యములకు బీజావాపనాదికములు జరిగించవలసియుండును.

(8) రవికిగాని, వృశ్చికరాశియందు రవి ప్రవేశించిన కాలమునకు సాధింపబడిన లగ్నమునకుగాని కేంద్రస్థానములందు (౧-౪-౭-౧౦ స్థానములు) పాపగ్రహములున్నచో గ్రీష్మ సస్యములు నశించును. శుభగ్రహదృష్టియున్నచో కొంతవరకు ఫలించును.

(9) వృశ్చికమున రవియుండి, ఆ రవికి ౬, ౭ స్థానములందు పాపులున్నను, వృశ్చికముననున్న రవితో రెండు పాపగ్రహములు చేరియున్నను, ఆహార ధాన్యములకు (గ్రీష్మధాన్యములకు) అభివృద్ధి వెలలు తగ్గును. ఒకానొకప్పుడు బాగుగా పెరుగును.

(10) ఇట్లే వృషభసంక్రమణ ప్రవేశ కాలమునకు (వృషభాయన ప్రవేశకాలమునకు) లగ్నమును సాధించి గ్రహబలాబలముల ననుసరించి శరద్ధాన్యముల వృద్ధిక్షయములను తెలిసికొనవలెను.

(11) మేష, వృషభ, మిథునరాసులందు సంచరించుచున్న సూర్యుడు శుభయుత వీక్షణములుగలవాడైయున్నచో గ్రీష్మ సస్యములు బాగుగా ఫలించును. పాపయుత వీక్షణములుగలవాడైనచో గ్రీష్మసస్యములు నశించును. పంట లధికమగునపుడు ధరలు తగ్గును. పంటలునశించినపుడు ధరలు పెరుగునని అందరెరింగిన విషయమే.

(12) ధనుస్సు, మకర, కుంభములందు రవి సంచరించుచున్నపుడు శుభయుత వీక్షణములు గల్గియున్నచో శారద సస్యములు (శరత్కాలిక సస్యములు) బాగుగా ఫలించును. పాపయుత వీక్షణములుగల్గియున్నచో శారదసస్యములు నశించును. శుభపాపగ్రహ సంబంధములు గల్గియున్నచో మిశ్రమఫలము (మధ్యమ ఫలము).

పై విషయములను జాగ్రతగా విచారణచేసి చూచుకొని ఎప్పుడు ఏయే ధాన్యములను సంగ్రహించవలెనో (ఖరీదు చేయవలెనో) ఎప్పుడు అమ్మవలెనో తెలిసికొనవచ్చును.

## —♦ సస్య సముదాయ సమిష్టి ఫల నిర్ణయము. ♦—

సస్య జాతక ఫలములను సాధింపకయే పంచాంగ కర్తలలో నూటికి 99 మంది కేవలము యీ దిగువ నుదహరించిన శ్లోకము ననుసరించి పంటను వీసములలో వ్రాసి చూపుట గలదు.

శ్లో॥ రాజామాత్య భటేశ సస్య పతయోర్ధాన్యార్ఘ కీలాలభృ
న్నాథా షడ్రసనాథనీరసపతీ జ్యేష్ఠాదివారాదికం
భవ్యం యోగసపంచకంపిత్రుచయః షణ్మండలేందు క్రమా
దేతేషాం శుభతాం సమూహ్య విలిఖేద్దైకైకమంశః ఫలమ్॥
—ఉత్తర కాలామృతే.

(1) రాజు (2) మంత్రి (3) సేనాధిపతి (4) సస్యాధిపతి (5) ధాన్యాధిపతి (6) అర్ఘాధిపతి (7) మేఘాధిపతి (8) రసాధిపతి (9) నీరసాధిపతి (10) జ్యేష్ఠశుక్ల ప్రతిపద్యుక్తవారాధిపతి (11) ఆషాఢశుక్ల పంచమీయుక్తవారాధిపతి (12) ఆషాఢశుక్లమందు స్వాతీనక్షత్రయుక్తతిథి (13) ఆషాఢకృష్ణపక్షమందు రోహిణీనక్షత్ర యుక్తతిథి (14) పుష్య బ ౦ తిథియొక్క వారాధపతి (15) ఆర్ద్రాప్రవేశ కాల ఫలము (16) ఆర్ద్రా ప్రవేశ కాలమున భరణ్యాది షణ్మండలస్థ చంద్రఫలము. ఈ 16 లో ఎన్ని మంచివిగా యుండునో అన్ని వీసముల పంట పండునని వ్రాయుట సిద్ధాంత సాంప్రదాయమై యున్నది.

మరికొందరు నవనాయకులనుబట్టి ఫల నిర్ణయముచేసి చూపుచున్నారు. నవనాయకులలో శుభులెందరో వారినిబట్టి పంటను నిర్ణయించుచున్నారు. ఒక్కొక్క నాయకునకు వీసం ముక్కాని పంటయని చెప్పుచున్నారు. ఇట్లు వ్రాయుట సమంజసము కానేరదు. మీదుమిక్కిలి సిద్ధాంత సాంప్రదాయ విరుద్ధమగు దురాచారమని చెప్పక నొప్పక తప్పదు.

ఒక్కొక్క నాయకునకు వీసం ముక్కాని పంటయని గ్రహించి వ్రాసినదానికిని, పై శ్లోకరీతిచే నిర్ణయింపబడి వ్రాసిన దానికిని ఫలవైషమ్యము కలుగుచున్నందున ఒక్కొక్క నాయకునకు వీసం ముక్కాని పంట యని వ్రాయుట దారుణమగు సాహసము, అజ్ఞానవిలసితము, మూర్ఖ్యము నగును.



## —♦ మౌఢ్య నిర్ణయమున విశేషము. ♦—

గురు శుక్ర మౌఢ్య నిర్ణయము ఇచ్చట వ్రాయఁగియున్నది. కుజ బుధ శని మౌఢ్యములనుకూడా వ్రాసి చూపుట సిద్ధాంత సాంప్రదాయము గాకున్నను వ్రాసిన దోషము లేకపోవుటయే గాక ఆయా వేద శాఖీయులు ఆయా శాఖా సంబంధ కార్యములుచేసుకొనుటకు యోగ్యాయోగ్య కాలము స్పష్టముగా తెలియగలదు. మీదుమిక్కిలి ప్రయాణాదులకు కాల నిర్ణయమునందు సహాయకారి యగును.

సామాన్యముగ లోకులు "మౌఢ్య కాలములో గ్రహములు కన్పింపవు" అనుకొనుట గలదు. అందు శుక్రమౌఢ్యమును అందరు నెరుంగుదురు. శుక్రశబ్దము తత్సమ పదము. గ్రామ్యపదము చుక్క. దేశవ్యవహారములో పామరులు శుక్ర గ్రహమునే చుక్క యనుట గలదు. శుక్రోదయమునే "చుక్క పొడుపు" అనుటయు గలదు.

శుక్రమౌఢ్య విషయమున కొంత విమర్శచేసి చూపక తప్పుట లేనందున వ్రాయబడుచున్నది.

శుక్రుడు మౌఢ్యములోగూడ మొదటను తుదను కొంతకాలము అగుపడుచుండుట గలదు. ఇందుకు కారణము:—అస్తమయము (మౌఢ్యము) అనగా గ్రహము సూర్యుని సమీపించుట. గ్రహము తన మార్గమున నడచుచు సూర్యునకు ఇంత దగ్గరకు రాగా అస్తమయము కలుగుననియు, ఇంతే దూరమునకు పోయినపుడు ఉదయించుననియు, దూరము నియతముగ చెప్పబడియున్నది. శుక్రుడు ఋజుమార్గమందున్నపుడు బ్రహ్మసూర్యాదిసిద్ధాంతములయందు విషవృత్తీయభాగలు (విషువాంశలు లేక కాలాంశలు) పది యని యున్నది. గ్రహలాఘవము కరణరత్నములందు తొమ్మిది యని చెప్పబడినది. అట్లుగ మేము సాధించుచున్నామనియు, అట్లు సాధించిన గ్రహము సరివచ్చుచున్నదనియు, అట్లే నాకగుపడెననియు చెప్పి సంతోషించు పంచాంగ కర్తలు చాలా మంది యున్నారు. పామరులను బట్టి పంచాంగ కర్తల మాటలనేనమ్మి వారికి సహాయులగుచున్నారు. వాస్తవముచే గ్రహము కనిపించుట కనిపింపకపోవుట సంధ్యాకాలమందలి సూర్యునియొక్కయు, గ్రహము యొక్కయు కాంతినిబట్టి భేదించుచున్నది. కాంతి నీచ (Perigee) ఉచ్చ

(Appogee) క్రాంతి (Decliration) అక్షాంశ (Latitude) ఇత్యాది నానాకారణములచే ప్రతిక్షణ విలక్షణముగ మారును. అందువలన గ్రహములు దృక్సిద్ధములైనను కాలాంశలనుబట్టి సాధించిన అస్తమయమునకును ఆదర్శనమునకును భేదము కలుగుచున్నది. వాస్తవమైన గణితము చేసినను పై కారణములవల్ల భేదించుచుండగా అసంబద్ధ, అశాస్త్రీయ, అవకతవక గ్రంథములబట్టియు, అసత్సాంప్రదాయకాలాంశలను గ్రహించియువ్రాసెడి పంచాంగములందలి మాఢ్యకాలములు తప్పుగాక ఒప్పుగా ఎట్లు భావించుచున్నారో దైవమున కెఱుక గాని అస్మదాదు లెఱుంగజాలరనుట తథ్యము.

ఇంతకు వ్రాయదలచిన దేమనగా కాలాంశలనుబట్టి గురు శుక్ర మాఢ్యాదులను పంచాంగకర్తలుచూపదగియున్నదనియు, గ్రహాదర్శనాదర్శములను స్థిరకాలాంశలచేతను, చరకాలాంశలచేతను వ్రాసి చూపుచో అందు వివాస్తవా వాస్తవ విషయములు పండితులకే గాక పామరులు గూడ గ్రహించుట కవకాశ మేర్పడునని యభిప్రాయము. కాలాంశలనుబట్టి చూచునపుడు గ్రహమునకు మేఘాద్యావరణమున్నచో కన్పింపదు. మేఘాద్యావరణము లేకున్నపుడు జాగ్రతగా పరిశీలించినచో స్పష్టముగా కాన్పించుననుట కెట్టి సందియము లేదు. జాగ్రతగా పరిశీలించవలెనని వ్రాయుటకు కారణము గ్రహముయొక్క కాంతి తగ్గియుండుననుటే యని గ్రహించవలయును.

—♦ సంక్రాంతులనుబట్టి అర్ఘలు. ♦—

(1) కొందరు పంచాంగ కర్తలు సంక్రాంతి ప్రవేశకాలమునకు ఏ లగ్నమగునో తద్రాశ్యుక్త పదార్థముల ధరలోని హెచ్చుతగ్గులను వ్రాసి చూపుచున్నారు. ఇయ్యది కొంతవరకు ఋజువిచ్చును.

(2) మరికొందరు "సౌరమానార్ఘలు" అనుశీర్షిక క్రింద సంక్రాంతి ప్రవేశ కాలిక తిథి, వార, నక్షత్రముల సంఖ్యలను మొత్తముచేసి 3 చే భాగించగావచ్చు శేషసంఖ్య (౧ అత్యర్ఘ ౨ సమార్ఘ 3 శూన్యార్ఘ) ననుసరించి వ్రాసి చూపుచున్నారు. ఇట్లుగ వ్రాసిన ఫలము ఋజువౌనంగునని చెప్పలేము. సంక్రాంతి ముహూర్తముల ననుసరించి వ్రాసినచో కొంతవరకు ఫలము ఋజువౌనంగును.



—♦ రాశి ద్రవ్య నిర్ణయము. ♦—

శ్లో॥ వస్త్రావికకుతుపానాం మసూరగోధూమరాలకయవానామ్
స్థలసంభవౌషధీనాం కనకస్యచ కీర్తితో మేషః॥

వస్త్రములు, గొఱ్ఱెబొచ్చు (ఉన్ని), తోలుసంచులు (మనీపర్సులు, సూట్‌కేసులు మొదలగునవి), ఆవాలు, గోధుమలు, వృక్షములజిగురు (తుమ్మజిగురు, రబ్బరు, సాంబ్రాణీ మొదలగు జిగురులు) వాడియైన ముల్లుతో గూడిన ధాన్యము (తోక గోధుమలు, బార్లీగింజలు), స్థలసంభవములు (అభ్రకము, మణిశిల, కడప రాయి, పలకలు, సిమెంటు, మణులు, శిలాజిత్, రత్నములు, లోహములు, ప్రత్తి మొదలగునవి) ఓషధులు, బంగారము మొదలగువానికి మేషరాశి యగును. ఇనుము, ఉక్కులకుకూడా ఇయ్యదియే ప్రధాన రాశి. (అరాలక=సజ్జలు).

శ్లో॥ గవివస్త్రకుసుమగోధూమశాలియవమహిషసురభితనయాః స్యుః

ఆవులు, ఎడ్లు, వస్త్రములు, పువ్వులు, గోధుమలు, మంచి ధాన్యములు (రాజనాదులు): యవలు (తోకగోధుమలు), గేదెలు, దున్నపోతులు, సుగంధ ద్రవ్యములకు ముఖ్యరాశి వృషభము.

"సురభిర్నా జాతిఫలే వసంతే చంపక ద్రుమే
సల్లక్యాం స్త్రీమాతృభేదే మనోజ్ఞేతు విశేష్యవత్॥"

అను ప్రమాణము ననుసరించి సురభిపదమునకు నానార్థములు గలవు. సురభి=ఆవు, వసంతఋతువు, మంచి పరిమళ ద్రవ్యము (చందనము, సంపెంగ, జాజికాయ, జాపత్రి, కుంకుమపువ్వు, కర్పూరము, కస్తూరి. (చంపకము=సంపెంగ).

శ్లో॥ మిథునేఽపి ధాన్యశారదవల్లీ శాలూకకార్పాసాః॥

ధాన్యము, శరదృతువునందు పండు ధాన్యములు, (వేరుశనగ, చామలు, నల్లధాన్యము, నూనెగింజలు, అవిసెలు, బొబ్బర్లు, బఠాణీ, సెనగ, మినుములు, కందులు, ఉలవలు మొదలగునవి). తామరపాకులు, పెండలము, చిలకడ దుంపలు, కుంకుమపువ్వు, ప్రత్తి మొదలగునవి మిథునరాశ్యధీనములై యున్నవి.

శాలూక మనగా కలువదుంప. దుంపకూరలగు చిలకడదుంప, చేమదుంపలు, బంగాళాదుంప, కంద, పెండలము మొదలగువానికిన్నీ నీరుల్లి, పసుపు, అల్లము మొదలగు పదార్థములున్ను మిథునరాశ్యధీనములై యున్నవి.

శ్లో॥ కర్కిణి కోద్రవకదళీదూర్వాఫల కందపత్రచోచాని॥

కొఱ్ఱలు అరటికాయలు, అరటిపండ్లు. గఱిక (పచ్చగడ్డి) పండ్లు, ఆకులు పొగాకు, తేయాకు, తమలపాకులు, చోచ మనగా భుక్తశేషములయిన ఫలాదులు (పనసపండ్లు, బాదంకాయలు మొదలగునవి), కొందరు చోచం అనగా లవంగములనుట గలదు.

శ్లో॥ సింహే తుషధాన్యరసాః సింహాదీనాం త్వచః సగుడాః

సింహము, పొట్టుధాన్యము (వేరుశనగ, కందులు, మినుములు, గోధుమలు, పెసలు, ఉలవలు, మంచిధాన్యము) (తుష మనగా ఉమక లేక ఊక). రసవస్తువులు (పాదరసము. చింతపండు కషాయదినుసులు, విష వస్తువులు, రసాయనములు. చెఱకు, ఉప్పు, నిమ్మ, దబ్బ, నారింజ మొదలగునవి). చర్మము, పంచదార, బెల్లం, పటిక, మొదలగు వస్తువులు సింహరాశ్యధీనములై యున్నవి.

శ్లో॥ షష్ఠేతసీ కలాయాః కులత్థ గోధూమముద్గ నిష్పావాః॥

అవిసె గింజలు, గుండ్రని సెనగలు (బటాణీలు) ఉలవలు, గోధుమలు, పెసలు, కందులు, (నిష్పావాః అనగా తూర్పారబోసెడు ధాన్యములు). ఇవన్నియు కన్యారాశ్యధీనములు.

శ్లో॥ సప్తమరాశౌ మాషాగోధూమాః సర్షపాః సయవాః

మినుములు, గోధుములు, ఆవాలు, యవలు (తోక గోధుమలు), బొబ్బర్లు మొదలగునవి తులారాశ్యధీనములు.

శ్లో॥ అష్టమరాశావిక్షుః సైక్యం లోహాన్యజావికం చాపి

గొఱ్ఱెబొచ్చు, చెఱకు, (శిక్యం=కావడిపట్టు) లోహములు (రాగి, ఇత్తడి, కంచు, ఇనుము, సత్తు, సీసము, తగరము, ఉక్కు మొదలగు లోహములు. వెండి, బంగారములుకూడా లోహములయ్యును అవి ధాతు లోహములలో జేరియున్నందున వృశ్చికరాశ్యధీనములు కానేరవని



గ్రహించవలయును.) కంబళ్ళు, మేకబొచ్చు మొదలగునవి వృశ్చికరాశ్యధీన పదార్థములు. (మేకలు, గొఱ్ఱెలు వృశ్చికరాశ్యధీనములైన జంతువులు).

శ్లో॥ నవమేతు తురగలవణాంబరాస్త్ర తిలధాన్య మూలాని॥

గుఱ్ఱములు, ఉప్పు, వస్త్రములు, అస్త్రములు (అస్త్రములనగా దేహాదులమీద జిమ్మబడు ఆయుధములు. కత్తులు, బల్లెములు, బాణములు, తుపాకులు, విషవాయువులు, బాంబులు, ఆటంబాంబు మొదలగునవి ) నువ్వులు, ధాన్యము (మంచి ధాన్యము), మూలవస్తువులు (మూలవస్తువులనగా వేరునుండి పుట్టునవి. వేరుశనగ, ముల్లంగి, చిలగడదుంప, బంగాళా దుంప, పసుపు, ఉల్లి, అల్లము, మెట్టతామరదుంపలు, చేమదుంపలు మొదలగునవి) ధనూరాశ్యధీనములు.

—♦ మూలభేద వివరణ. ♦—

శ్లో॥ మూలభేదం ప్రవక్ష్యామి యథోక్తం శంభునాపురా
మూలం కాష్ఠం త్వచాపత్రం పుష్పంచైవ తథా ఫలమ్॥
శ్లో॥ బీజం ధాన్యంచ మూలంచ కందాంకూర ప్రరోహిణః
శ్లో॥ లతాకంటకగుల్మాది జటానిర్యాసకే సరాః॥
శ్లో॥ వత్సనాభాహి ఫేనాది గ్రంథే తంతూర్ణవైక్యతాః
విజ్ఞేయా మూలశబ్దార్థాం పూర్వవద్గ్రహనిర్ణయః॥

—లంపాకే.

మొదలు, కట్టె, చెట్లపట్టలు (చెట్టు చర్మములు), ఆకులు, పూలు, కాయలు, పండ్లు, గింజలు, ధాన్యము, వేరు, వేరుశనగ, కంద, పెండలము చిలగడదుంప, చేమదుంప, బంగాళాదుంప, పసుపు, అల్లము, ముల్లంగి దుంప, కషాయ దినుసులు, దుంపరాష్ట్రం, కళింగరాష్ట్రం, పిప్పళ్లు, మిరియాలు, నార, తీగెలు, ఊడలు, గడ్డి, నల్లమందు, నాభి, జీలకర్ర, దారము, పట్టు, లక్క, వెదురు, కాగితము, ప్రత్తి, బెత్తము, బెండ్లు, చాపలు, పగ్గములు, ఖరి, గోనెలు, తవుడు, చిట్టు (పొట్టు) మొదలగునవి మూలపదార్థములని లంపాకమున చెప్పబడెను.

(1) వక్కలు, కరక్కాయలు, ఇంగువ, కొబ్బరికాయలు, వేరుశనగ (2) లవంగాలు, కుంకుమపువ్వు, తమలపాకులు. (3) చంద్ర (4)నల్ల

మందు, దవనము, మరువము, గంజాయి, తేనె, కాగితము, నార మొదలగునవియు మూలపదార్థములగును. ఇందు చూపబడిన అంకెలకు క్రమముగా రవి, చంద్రి, కుజ, బుధులు అధిపతులై యుందురు.

శ్లో॥ మకరే తరుగుల్మాద్యం సైన్యేక్షు సువర్ణకృష్ణలోహాని॥

వృక్షములు, కట్టెలు, కలప, పొదలు, సేనలు (సైన్యము) కావడిమట్లు, కావడిబద్దలు, చెఱకు, బంగారం, నల్లని లోహములు (ఇనుము, ఉక్కు, సీసం తగరం. జర్మన్ సిల్వర్) మొదలగునవిమకరరాశ్యధీనవస్తువులు.

శ్లో॥ కుంభే సలిల జఫల* సుమరత్నచిత్రాణి రూపాణి॥

జలచరములు (చేపలు మొదలగునవి), ఫలములు (నిమ్మ, నారింజ, మామిడి, సపోటా పండ్లు కొబ్బరిబొండములు) చిత్రవిచిత్రరూపములుగల రత్నములు, చిత్రవిచిత్రములగు పూలు, ద్రావకములు మొదలగునవి కుంభరాశ్యధీన పదార్థములు.

శ్లో॥ మీనే కపాలసంభవరత్నాన్యం బూద్భవాని వజ్రాణి
స్నేహాశ్చ నైకరూపావ్యాఖ్యాతా మత్స్య జాతించ॥

కపాలసంభవరత్నములు (ఏనుగు కుంభస్థలమునుప్రక్కలు చేయగాలభించు మణులును, సర్పముల శిరస్సుననుండు రత్నములు) జలచరములు, జలపదార్థములు, ముత్యములు, కర్పూరతైలము, సుగంధతైలములు, సువాసన సబ్బులు, సబ్బుబిళ్లలు, రసాయనపు పెరువులు, రసాయనపు ద్రవ్యములు, మిశ్రమ పదార్థములు మొదలగునవి మీనరాశ్యధీన పదార్థము లగును.

రాశ్యుక్తపదార్థములను జాగ్రతగా చూచి ఆయా సంక్రమణ కాల లగ్నములు ఏవియగునో ఆ పదార్థములయొక్క ధరలలోని హెచ్చు తగ్గులు బాగుగా విచారణచేసి వ్రాయుట మంచిది. సంక్రమణ ప్రవేశ లగ్నమునకు గాని, రవి ప్రవేశించియున్న రాశికి గాని గ్రహస్థితిగతుల ననుసరించి విచారణచేసి ధర ప్రతులను నిర్ణయించవలయును.

—♦ గ్రహముల స్థితిచే ధరల నిర్ణయించు విధము ♦—

శ్లో॥ రాశే శ్చతుర్దశార్థాయ సప్తనవపంచమస్థితో జీవః
ద్వ్యేకాదశ దశ పంచాష్టమేషు శశిజశ్చ వృద్ధికరః॥



ఏ రాశికైనను ౨, ౪, ౫, ౭, ౯, ౧౦, ౧౧ స్థానములలో గురుడున్న యెడలను, ౨, ౧౧, ౧౦, ౫, ౬ స్థానములలో బుధుడున్నయెడలను, తద్రాశ్యుక్తపదార్థములకు వృద్ధియుండును. ఉత్పత్తి యధికమగును గనుక ధరలు తగ్గుననుట తథ్యము.

శ్లో॥ షట్సప్తమ గోహానిం వృద్ధిం శుక్రః కరోతి శేషేషు
ఉపచయ సంస్థాః క్రూరాః శుభదాః శేషేషు హానికరాః॥

ఏ రాశికైనను ౬, ౭ స్థానములలో శుక్రుడున్నయెడల తద్రాశ్యుక్త పదార్థములకు వృద్ధియుండును. అనగా ధరలు తగ్గునని భావము. క్రూరగ్రహములగు (రాహుకేతువులు ఛాయాగ్రహములగుటచేత వాటి ఫలములు అంతగా ఋజువొసంగుటలేదు కాన రాహువులను క్రూరగ్రహములనుండి వదలివేయబడెను. (రాహుకేతువులు నైసర్గిక పాపగ్రహములే యగును.) రవి, కుజ, శనులు ఏ రాశికైనను ఉపచయస్థానములగు 3, ౬, ౧౦, ౧౧ స్థానములలో యున్నపుడు తద్రాశ్యుక్త పదార్థములకు వృద్ధియుండును. అనగా ధరలు తగ్గునని భావము. క్రూరులగు మిగత ఏ రాశియందు స్థితిగలిగియుండునో తద్రాశ్యుక్త పదార్థముల ఉత్పత్తి తగ్గును. అట్లగుటచే ధరలు పెరుగునని గ్రహించవలయును.

క్షీణచంద్రుడు, పాపయుత బుధుడు పాపగ్రహములుగా పరిగణింపబడుదురు. పూర్ణచంద్రుడు, విశుద్ధబుధుడు లేక శుభగ్రహయుత బుధుడు శుభగ్రహములుగాపరిగణింపబడుదురు. ఇట్లుండుటచేతనే చంద్రబుధులను మిశ్రమ గ్రహములుగా పరిగణించుటయు గలదు

పైన వ్రాసి చూపిన విధముగా ధర ప్రతులను తెలిసికొని ఆ యా సంక్రమణములు గల మాసములందు (సౌరమాసములందు) ధర ప్రతుల స్థితిని వ్రాయుట మంచిది. ఇదియే ఉత్తమ మార్గము.

—♦ సంక్రాంతి ముహూర్త నిర్ణయము. ♦—

శ్లో॥ సంక్రాంతౌ మూర్తభేదా హరపవన యమేవారుణేసార్పఐంద్రే
ఏషాం పంచేందుసంజ్ఞాగురుకర పితృభేచాగ్నిదస్రేచసౌమ్యే
త్వష్ట్రేమైత్రేచమూలేశ్రుతివసుచపూషాత్రిణిపూర్వాఖరామే
బ్రాహ్మేదితేని ద్విదైవేభవతిశరకృతాదుత్తరాత్రిణి ఋక్షం॥
—బృహదవకహాడ చక్రే.

సంక్రమణ ప్రవేశకాలమునందు ఆర్ద్ర, స్వాతి, భరణి, శతభిషం, ఆశ్లేష, జ్యేష్ఠానక్షత్రములలో ఏ ఒక నక్షత్రమైనను దిననక్షత్రముగా నున్నచో సంక్రాంతి ముహూర్తములు ౧౫ గా గ్రహించవలయును. పుష్యమి, హస్త, మఖ, కృత్తిక, అశ్విని, మృగశిర, చిత్ర, అనూరాధ మూల, శ్రవణం, ధనిష్ఠ, రేవతి, పూర్వాత్రయము (పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర) లలో ఏ ఒక నక్షత్రమైనను దిననక్షత్రమై యున్నచో సంక్రాంతి ముహూర్తములు ౩౦.గా గ్రహించవలయును. రోహిణి, పునర్వసు, విశాఖ, ఉత్తరాత్రయము (ఉత్తర, ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర) లలో ఏ ఒక నక్షత్రమైనను దిననక్షత్రమైయున్నచో సంక్రాంతి ముహూర్తములు ౪౫ గా గ్రహించవలెను.

—♦ ముహూర్తముల ఫలము. ♦—

శ్లో॥ బాణవేదైస్సమార్ఘంస్యా
న్మధ్యర్ఘం వ్యోమరామయోః
మూర్తే పంచదశోయాతే
దుర్భిక్షంచ ప్రజాయతే॥

౪౫ ముహూర్తములుగానున్నచో సమార్ఘము అనగా ధరలు హెచ్చు తగ్గులు లేక సరసముగా నుండును, ౩౦ ముహూర్తములు నున్నపుడు మధ్యార్ఘము అనగా ధరలు కొంతవరకు పెరుగునని భావము. ౧౫ ముహూర్తములు నున్నపుడు దుర్భిక్షం అనగా శూన్యార్ఘము. శూన్యార్ఘము అనగా వెలలేనిదనుట. అనగా వస్తువుల ధర యింతని చెప్పలేక పోవుట. అనగా వస్తువుల ధరలు బాగుగా పెరుగునని భావము.

శ్లో॥ సుభిక్షం సంక్రమే సౌమ్యవారోధిక ముహూర్తకే
మహార్ఘం పాపవారేవా ముహూర్తే చాక్షభూమితే॥

—గణపతౌ.

—♦ సౌరమానార్ఘ విచారణయందలి భేదములు. ♦—

శ్లో॥ సంక్రాంతినాడ్యాస్తిథివార ధిష్ణ్యం
ధాన్యాక్షరం వహ్నిహరేత్తు భాగం
ఏకే మహార్ఘం ద్వితయేచ సామ్యం
శూన్యేతు శూన్యం ప్రవదంతి తజ్ఞాః॥



సంక్రమణ ప్రవేశకాలమందున్న తిథి వార నక్షత్ర సంఖ్యలతో సంక్రాంతి ఘడియలను, ధాన్యాదుల పేరులోని మొదటి అక్షరమున కగు సంఖ్యయు, వీటినన్నిటిని మొత్తముచేసి దానిని ౩ చే భాగించగా వచ్చు శేషమునుబట్టి అర్ఘమును నిర్ణయించుటగలదు. శేషసంఖ్య ౧ యగుచో మహార్ఘము ౨ యగుచో మధ్యార్ఘము ౩ యగుచో శూన్యార్ఘము.

—♦ అక్షర సంఖ్యా నిర్ణయము. ♦—

“కాదిర్నవోటాది నవ పాది పఞ్చయాద్యష్టకమ్॥

క మొదలు ఝ వరకు ౯, ట మొదలు ధ వరకు ౯, ప మొదలు మ వరకు ౫, య మొదలు హ వరకు ౮ అని గ్రహించవలెను. “న” అను అక్షరమునకు సున్నయని గ్రహించవలెను. అచ్చు అక్షరములకు సంఖ్య ఎక్కడను ఎవరును చెప్పియుండలేదు. అచ్చులు ౧౬. వీటికిక్రమముగా

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ
1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16

అని గ్రహించవచ్చునని తోచుచున్నది. ఇందు దోషమున్న విజ్ఞులు తెలియజేసినచో యుక్తమైనచో గ్రహించి ప్రవర్తించెదను.

(2) పద్ధతి :—శ్లో॥ సంక్రాంతి ఋక్షం తిథివార ధిష్ణ్యం
సప్తాహతా పావక భుక్త శేషం
ఏకే మహార్ఘంచ సమే సమార్ఘం
శూన్యేతు శూన్యం మునయోవదంతి॥

సంక్రాంతి నక్షత్రము (సూర్యుడు ఏ నక్షత్రమునందు సంచరించుచు రాశి ప్రవేశము చేయుచున్నాడో ఆ నక్షత్రము, అనగా సూర్యస్థిత నక్షత్రమునకు ఏర్పడిన సంఖ్యయు) సంక్రాంతి ప్రవేశకాలమునకున్న తిథి, వార, నక్షత్ర సంఖ్యలను చేర్చి మొత్తమును ౭ చే గుణించి ౩ చే భాగించిన శేషసంఖ్య ౧ అగుచో మహార్ఘము ౨ అగుచో మధ్యార్ఘము సున్నయగుచో శూన్యఫలం లేక శూన్యార్ఘ మనియు గ్రహించ వలయును.

(3) పద్ధతి :—శ్లో॥ సంక్రాంతి నాడీ నవమిశ్రితాచ
సప్తాహతా పావక భక్తతాచ

ఏకే మహార్ఘం ద్వితయేచ సామ్యం
శూన్యేతు శూన్యం మునయోవదంతి॥

సంక్రాంతి గడియలకు ౯ చేర్చగా వచ్చిన దానిని ౭ చే గుణించి 3 చే భాగించగా ౧ మిగిలిన మహార్ఘము ౨ మిగిలిన సమార్ఘము ● మిగిలిన శూన్యార్ఘము అగునని భావము.

—♦ సూర్యసంక్రాంతి విశేష ఫలము. ♦—

శ్లో॥ పూర్వసంక్రాంతి నక్షత్రాత్పరసంక్రాంతి ఋక్షకం
ద్విత్రి సంఖ్యా మహార్ఘంచ చతుః పంచత్వనర్ఘతా
షష్ఠే లోకో భ్రమంత్యాశుగృహీత్వా ఖర్పరం కరే॥

మొదటి సంక్రాంతి ప్రవేశ కాలిక నిత్యనక్షత్రము, రెండవ సంక్రాంతి ప్రవేశకాలిక నిత్యనక్షత్రమువరకు లెక్కించిన సంఖ్య ౨, 3 అగుచో మహార్ఘము, ౪, ౫ అగుచో శూన్యార్ఘము. ౬ వ సంఖ్యయగుచో లోక విభ్రమము సంభవించును. దీనినే ఖర్పరయోగమని కొందరు చెప్పుట గలదు.

—♦ గ్రహ సంక్రాంతి ఫల విశేషము. ♦—

శ్లో॥ కృష్ణే వృద్ధిః క్షయ శ్శుక్లే మందారారాహుకేశ్చ సంక్రమే
శుక్లే వృద్ధిః క్షయః కృష్ణేభృగుజ్యేచ సోమజః॥

పాపులగు శని, కుజరవులు రాశి సంక్రమణము చేయు కాలము కృష్ణ పక్షమైనచో మహార్ఘము, శుక్ల పక్షమైనచో శూన్యార్ఘము కలుగును. శుభులగు శుక్ర గురు బుధులు రాశి ప్రవేశము చేయు కాలము శుక్ల పక్షమైనచో మహార్ఘము, కృష్ణపక్షమైనచో శూన్యార్ఘము కలుగ జేయుదురని కొందరు చెప్పుచున్నారు.

—♦ చాంద్రమానార్ఘలు. ♦—

చంద్రోదయకాలమునకు (చంద్రోదయమని వ్రాయబడు రోజున చంద్రోదయ కాలమునకు) యీ దిగువ రీతిని నక్షత్రములున్నచో అర్ఘ నిర్ణయముచేయుట గలదు.

శ్లో॥ ఆచపూర్వే మనర్ఘంచ, ఉచిమూరే సమం తథా
అన్యే షోడశఋక్షాణి, మహార్ఘం జాయతే శశీ॥



ఆర్ద్ర, ఆశ్రేష, పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వాభాద్రలు చంద్రోదయకాలమున నున్నచో అనర్ఘము. ఉత్తరఫల్గుణి. ఉత్తరాషాఢ. ఉత్తరాభాద్ర, చిత్ర, మూల, రేవతీ నక్షత్రములున్నచో సమార్ఘము. మిగతా పదహారు నక్షత్రములు అనగా అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఘ, హస్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, శ్రవణం, ధనిష్ఠ, శతభిష నక్షత్రములు చంద్రోదయ కాలమున నున్నచో మహార్ఘమని భావము.

గ్రహ రత్నముల వివరము.

| గ్రహము | రత్నము | యింగ్లీషువారి పేరు |
|---|---|---|
| రవి | మాణిక్యం | Ruby |
| చంద్ర | ముత్యా | Pearl |
| కుజ | ప్రవాళ | Coral |
| బుధ | మరకత | Emerald |
| గురు | పుష్యరాగం | Topaz |
| శుక్ర | హీరకం | Diamond |
| శని | నీలమణి | Sappire |
| రాహు | గోమేధికం | Tircon |
| కేతు | వైడూర్యం | Cat's eye |

సస్యములు.

జూన్, జూలై :—తొలకరి - ముంగటి వానకారు, గ్రీష్మఋతువు.
ఏప్రిల్, మే :—ఎండ కారు, వసంతఋతువు.
డిశంబరు, జనవరి :—శీతకారు.

1. తృణధాన్యములు :—వరి, జొన్న, మొక్కజొన్న, గంటె, చోడి, కొఱ్ఱ, ఆరిక, చామ, గోధుమలు.

2. కాయ ధాన్యములు :—కంది, పెసర, మినుము,ఉలవ, సెనగ బొబ్బర, అనుములు.

3. తాలింపు ద్రవ్యములు :—మెంతి, ఆవ, ధనియాలు, మిర్చి, జీలకఱ్ఱ. (ఓషధీ సస్యములు.)

4. నారపంటలు :—ప్రత్తి. గోగు, జనుము. (పారిశ్రామిక సస్యములు.)

5. రంగు దినుసులు :—నీలి, కుసుంబా, చిరువేరు, కుసుమపువ్వు (పారిశ్రామిక సస్యములు.)

6. దుంపకూరలు :—బంగాళాదుంప, కంద, పెండలము, చేమ, తామర.

7. కాయగూరలు :—వంగ, దోస, బీర, పొట్ల, కాకర, సీమ వంగ, ఆనప, గుమ్మడి, పుచ్చ, అరటి.

8. చమురు గింజలు :—నూవులు, వేరుశనగ, ఆముదము (అవిసె) కుసుంబాలు.

9. తృణవృక్షములు :—తాటి, కొబ్బరి, పోక, ఖర్జూర (హింతాళ=గిరకతాడి) మొగలిచెట్టు (కేతకీ), ఈతచెట్టు.

10. చక్కెర పిష్టములు :—చెరకు, కర్రపెండలం (చిలగడం).

11. పండ్లు :—సీమవంగ, పుచ్చ, అరటి.

12. మత్తుద్రవ్యములు :—పొగాకు, నల్లమందు, (ఓషధులలో చేరినవి).

—♦ సూర్యసంక్రాంతి అర్ఘనిర్ణయ విశేషములు. ♦—

శ్లో॥ సూర్యసంక్రాంతి రాశ్యంకం తిథివారాదిసంభవమ్
రాశ్యంకేన సమం కృత్వా సప్తభి ర్గుణయే త్తతః॥
త్రిభిః శేషో ఫలం జ్ఞేయం తత్తన్నామ్నసే యథాక్రమమ్
ఏకేనచ సమం జ్ఞేయం ద్వాభ్యాం తస్య సమర్ఘతా॥
శూన్యే మహర్ఘం జానీయా ద్విగణయ్య పృథక్ పృథక్॥



ఏ రోజున సూర్యసంక్రాంతి ప్రవేశమో ఆ రోజున తత్కాలసంక్రాంతి రాశిసంఖ్యను, తిథినక్షత్ర వార యోగ ధృవాంకములను, ఏ పదార్థమునకు అర్ఘను తెలిసికొనవలసియుండునో ఆ పదార్థమునకు చెప్పబడిన ధృవాంకమును ఇవన్నియు మొత్తముచేసి ౭ చే గుణించి ౩ చే భాగించవలెను. శేషము ౧ అగుచో శూన్యార్ఘము. ౨ అగుచో సమార్ఘము. సున్న అగుచో మహార్ఘము అని తెలియవలయును.

రాశి ధృవాంకములు :—మేషము ౩. వృషభము ౨౨. మిథునము ౩౩. కటకము ౨౫. సింహము ౧౮. కన్యా ౧౭. తులా ౨౨. వృశ్చికము ౧౨. ధనుస్సు౧౯. మకరము౧౮. కుంభము౨౩. మీనం౨౫.

తిథి ధృవాంకములు :—పాడ్యమి మొదలుకొని చతుర్దశీ పర్యంతము ౧, ౨, ౩, ౪, ౫, ౬, ౭, ౮, ౯, ౧౦, ౧౧, ౧౨, ౧౩, ౧౪, ధృవాంకములగును. పూర్ణిమకు ౧౫ అమావాస్యకు ౩౦ ధృవాంకమగునని గ్రహించవలయును.

వార ధృవాంకములు :—ఆదివారము ౨౧. సోమవారము౧౫. మంగళవారము ౧౨. బుధవారము ౨. గురువారము ౧౩. శుక్రవారము ౧౪. శనివారము ౦. (శనివారమునకు సున్నయే ధృవాంకము).

నక్షత్ర ధృవాంకములు :—అశ్వనికి ౧౮. భరణి ౫. కృత్తికా ౬. రోహిణి ౧౪. మృగశిరా ౪. ఆర్ద్రా ౧౩. పునర్వసు ౨౮. పుష్యమి ౨౮. ఆశ్రేష ౩౬. మఘా ౧౫. పూర్వఫల్గుణి ౩. ఉత్తరఫల్గుణి ౩౧. హస్త ౧౮. చిత్రా ౨౫. స్వాతి ౧౪. విశాఖ ౨౪. అనూరాధ ౨౮. జ్యేష్ఠ ౩౭. మూల ౧౮. పూర్వాషాఢ ౧౩. ఉత్తరాషాఢ ౩౦. శ్రవణము ౨౫. ధనిష్ఠ ౨౩. శతభిషము ౨౪. పూర్వాభాద్ర ౮. ఉత్తరాభాద్ర ౪౧. రేవతి ౨౮.

యోగధృవాంకములు :—విష్కంభ ౧౩. ప్రీతి ౧౨. ఆయుష్మాన్ ౪౭. సౌభాగ్య ౬౮. శోభన ౩౬. అతిగండ ౪౭. సుకర్మా ౧౮. ధృతి ౪౪. శూల ౪౩. గండ ౨౫. వృద్ధి ౧౭. ధ్రువ ౨౨. వ్యాఘాత ౧౫. హర్షణ ౩౫. వజ్ర ౧౪. సిద్ధి ౨౨. వ్యతీపాత ౧౩. వరీయాన్ ౩౮. పరిఘ ౧౫. శివ ౧౩. సిద్ధ ౧౮. సాధ్య ౧౩. శుభ ౨౫. శుక్ల ౨౨. బ్రహ్మ ౧౩. ఐంద్ర ౨౭. వైధృతి ౨౬.

ధాన్యాదులధృవాంకములు :—ధాన్యము ౭౭. గోధుమలు౧౦౮. జొన్నలు ౧౩౩. పెసలు ౧౪౧. శెనగలు ౩౫. కందులు౭౭. నూనెలు౬౮. నెయ్యి ౪౮. బెల్లం ౪౧. పంచదార ౧౦౧. కొబ్బరికాయలు ౧౦౪. పోకచెక్కలు (సుపారీ) ౮౫. మంజిష్ఠ (పసుపు) ౧౨౯. ప్రత్తి ౧౨౦. దూది ౪౪. నూలు ౧౦౭. వస్త్రములు ౧౦౮. కస్తూరి ౧౩౪. ఎద్దు ౧౭౬, ఆవులు ౪౧. గేదెలు ౯౬. మేకలు లేక గొర్రెలు ౯౦. గుర్రములు ౮. చందనము ౧౮౧. చెరకు ౮౮.

ఉదాహరణము :—సర్వధారి సం॥రములో చైత్రశు ౪ మంగళవారం (౧౩ ఏప్రిల్) ౨౮-౨౭ రో ౫౦-౧౪ సౌభా ౪౭-౭ అశ్వని ౧ మేషే. రవిః ౩-౪౨

మేషసంక్రమణము గనుక రాశి ధృవాంకము ౩. సంక్రమణ ప్రవేశ కాలిక తిథి చతుర్థి గనుక తిథి ధృవాంకము ౪. మంగళవారము గనుక వార ధృవాంకము ౧౨. రోహిణీనక్షత్రముగనుక నక్షత్రధృవాంకము ౧౪. సౌభాగ్యయోగము గనుక యోగధృవాంకము ౪౮. వీటి నన్నిటిని మొత్తము చేయగానైన సంఖ్య ౮౧. ఏపదార్థమునకు మనము ధర ప్రతులను కనుగొనవలెనో ఆ పదార్థమునకు చెప్పఁబడిన ధృవాంకమును యీ మొత్తములో చేర్చగా వచ్చిన మొత్తమును ౭ చే గుణించి ౩ చే భాగించవలెను. శేషసంఖ్య ౧. మహార్ఘము ౨. సమార్ఘము ౩ శూన్యార్ఘముగ గ్రహించవలసియున్నది.

రాశ్యాది ధృవసంఖ్య మొత్తము=౮౧
ధాన్యమునకు ధృవాంకము =౭౭

మొత్తము = ౧౫౮
౭ గుణకము.
౩ | ౧౧౦౬
౩౬౮ శేషము ౨.

ధాన్యము ధర మేషమాసములో సమార్ఘము అనగా కొలదిగ పెరిగి నిలబడి యుండునని గ్రహించవలెను.



రాశ్యాది ధృవసంఖ్య మొత్తము = ౮౧
నూనెలకు ధృవాంకము = ౬౮

మొత్తము = ౧౪౯
౭ గుణకము
౩ | ౧౦౪౩
౩౪౭—శేషము ౨

నూనె ధరలు మేషమాసమున సమార్ఘముగ నుండును.

ఇట్లే మిగతా వస్తువుల కన్నిటికి ధర ప్రతులను నిర్ణయించుకొనవచ్చును.

ఈ పద్ధతి లోగడ వ్రాసిన వానికంటె కొంత మంచిదిగా తోచవచ్చును, కాని వారాహీసంహితోక్తపద్ధతియే దీనికంటె శ్రేష్ఠమైనది. మిగతావి సర్వసాధారణములు గాన ఋజువొసంగనేరవనుట తథ్యము.

శ్లో॥ సంక్రాంతిఋక్షం తిథివారమిశ్రం ధాన్యాక్షరాఢ్యం త్రిహృతం చ శేషం । ఏకేనవృద్ధిం యుగళేన సామ్యం శూన్యేన హానిం మునయో వదంతి॥ —జ్యోతిర్నిబంధే.

—♦ చాంద్రమానార్ఘ నిర్ణయ విశేషము. ♦—

ప్రతి మాసమునందు అమావాస్యానంతరమున చంద్రోదయము ఎప్పుడు కలుగుచున్నదో గణించవలసియున్నది. అట్లే చంద్రాస్తమయమును సాధించవలసియుండును. చంద్రోదయమునుబట్టి శుక్లపక్షమున అర్ఘ పరిస్థితిని తెలియనగును. చంద్రాస్తమయమునుబట్టి కృష్ణపక్షమున అర్ఘ స్థితిని గ్రహింపవచ్చును.

శ్లో॥ చతుర్దశ్యష్టమే భాగే క్షీణో భవతి చంద్రమాః
అమావాస్యాష్టమేంశేతుపునః కిల భవేదణుః॥—కాత్యాయనః.

తిథియొక్క ప్రమాణము ౧౨ భాగలు. అందు చతుర్దశీతిథి (కృష్ణ చతుర్దశీతిథి) యొక్క ఆరంభము రాశ్యాది ౧౧-౧౮-౦ అమావాస్యారంభము రాశ్యాది ౦-౦-౦ చంద్రుడు రాశ్యాది ౧౧-౨౬ ౦ గానున్నపుడు చంద్రాస్తమయమగుననియు, చంద్రుడు రాశ్యాది ౦-౮-౦ గా నున్నపుడు చంద్రోదయమగుననియు తలంపరాదు. రవిచంద్రులకు మధ్య దూరము ననుసరించి తిథి ఏర్పడుచున్నది. కనుక రవిచంద్రాంత

రము అనగా వ్యర్కేందువు రాశ్యాది౧౧-౨౬-౦వచ్చినపుడుచంద్రాస్తమయ ధ్రువ మగుచున్నది. రవిచంద్రాంతరము అనఁగా వ్యర్కేందువు రాశ్యాది ౦-౮-౦ వచ్చినపుడు చంద్రోదయ ధ్రువ మగుచున్నది. ఈ భాగాదుల ననుసరించి తిథ్యాది ఘటికల నట్లు తీసుకొనివచ్చెదరో అట్లే చంద్రాస్తోదయములను కృష్ణ చతుర్దశి శుక్ల పాడ్యమి తిథులందు సాధించవలసియున్నది.

ఉదాహరణము :—సర్వధారిసంవత్సర చైత్రమాసమున చంద్రోదయాస్తమయముల సాధన చూపఁబడుచున్నది.

చైత్ర శుక్ల పాడ్యమి శనివారమున మధ్యాహ్నకాలిక చంద్ర స్ఫుటము రాశ్యాది ౦-౫-౫౪-౩౩ గతి ౭౭౪-౨౫ రవిస్ఫుటమురాశ్యాది ౧౧-౨౭-౧౫-౮ గతి ౫౮-౫౧ దినార్ధ ౧౫-౨౧.

౦-౫-౫౪-౩౩ గతి ౭౭౪-౨౫ దినార్ధ ౧౫-౨౧
౧౧-౨౭-౧౫-౮ గతి ౫౮-౫౧
౦-౮-౩౯-౨౫ గతి౭౧౫-౩౪ వ్యర్కేందువు. దీనిని సవర్ణించగా ౭౧౫౬.
౦-౮-౦-౦ చంద్రోదయ ధ్రువం.
౦-౩౯-౨౫ (గతము)
౨౩౬౫ విలిప్తలు. వీటిని సవర్ణించగా

౭౧౫౬ | ౨౩౬౫౦ / ౨౧౪౬౮ | ౩-౧౮ గతము గనుక దీనిని దినార్థములో తీసివేయవలెను.

౨౧౮౨
౬౦
౧౩౦౯౨౦
౭౧౫౬
౫౯౩౬౦
౫౭౨౪౮
౨౧౧౨

౧౫-౨౧
౩-౧౮
౧౨-౩

పాడ్యమి శనివారమున ఉదయాది ఘ ౧౨-౩ లకు చంద్రోదయ మగుచున్నది.



చైత్ర బ ౧౪ శనివారము (8 మే) న మధ్యాహ్న కాలిక చంద్ర స్ఫుటము రాశ్యాది ౦-౧౪-౪౦-౫౮ గతి ౭౮౧-౯ రవిస్ఫుటము రాశ్యాది ౦.౨౪-౨౮-౨౮ గతి ౫౭-౫౨ దినార్ధ ౧౫-౫౨.

౦-౧౪-౪౦-౫౮ గతి ౭౮౧-౯ దినార్ధ ౧౫-౫౨ చంద్రాస్తమయధ్రువము రాశ్యాది ౧౧-౨౬-౦.

౦-౨౪-౨౮-౨౮ గతి ౫౭-౫౨
౧౧-౨౦-౧౨-౩౦ గతి౭౨౩-౧౭
౧౧-౨౬-౦ - ౦ చంద్రాస్తమయధ్రువము
౧౧-౨౦-౧౨-౩౦ గతి౭౨౩-౧౭వ్యర్కేందువుసవర్ణించ గా౭౨౩౩
౦- ౫-౪౭-౩౦ (అస్తమయధ్రువము వ్యర్కేందువుకంటె హెచ్చుగానున్నందున ఏష్యమగుచున్నది.)
౩౪౭-౩౦
౨౦౮౫౦ సవర్ణించగా

౭౨౩౩ | ౨౦౮౫౦౦ / ౧౪౪౬౬ | ౨౮-౪౯ ఏష్యముగావున దినార్థములో కలుపవలెను.

౬౩౮౪౦
౫౭౮౬౪
౫౯౭౬
౬౦
౩౫౮౫౬౦
౨౮౯౩౨
౬౯౨౪౦
౬౫౦౯౭
౪౧౪౩

౧౫-౫౨ దినార్ధ
౨౮-౫౦
౪౪-౪౨

చైత్ర బ ౧౪ శనివారమున ఉదయాది ఘ ౪౪-౪౨ లకు చంద్రాస్తమయము కలుగుచున్నది.

ఇట్లు ప్రతినెలయందును చంద్రోదయాస్తమయములను సాధించి తత్కాలమునకు లగ్నము ఏదియగునో ఆలగ్నముయొక్క గ్రహబలాబలములను చూచి అర్ఘ్య పరిస్థితిని వ్రాయవలెను.

ఒక్క చంద్రోదయమునుబట్టి అర్ఘ్య నిర్ణయము చేయుట చాలు ననుకొనరాదు. చంద్రాస్తమునుబట్టియు అర్ఘ్య నిర్ణయముచేసి చూపుట మంచిది.

పై విధముగా చంద్రోదయాస్తమయములు కలుగుచున్న కాలమున ఏ నక్షత్రముండునో ఆ నక్షత్రము ననుసరించి ముహూర్తముల నిర్ణయముచేసి చూచుకొని అర్ఘ్య నిర్ణయముచేయవచ్చును. ఇట్లుగ చేయుటయే ఉత్తమమార్గ మనుట కెట్టి సందియములేదు. ముహూర్త నిర్ణయము సౌరమానార్ఘ్య నిర్ణయమున చూపఁబడెను. లోగడ వ్రాసిన చాంద్రమానార్ఘ్య నిర్ణయమునుకూడా చంద్రోదయాస్తమానకాలముల ననుసరించి చూచుటయే మంచిది.

—♦ మకర సంక్రాంతి ఫల విచారణ. ♦—

సూర్యుడు మకరరాశిలో ప్రవేశించునపుడు మాత్రమే "సంక్రాంతి పురుష నిర్ణయము" ఫల నిర్ణయములను వ్రాయుచు, మిగత౧౧ రాసుల ప్రవేశములయొక్క ఫలములను వ్రాయక పోవుటకుఁగల కారణమేమి? అను సందేహము ప్రతివానికి కలుగవచ్చును. దేవతలకు సూర్యోదయకాలము సూర్యుడు మకరరాశి ప్రవేశకాలమైయున్నది. అందువల్ల మకరసంక్రాంతికి ఎక్కువ ప్రాధాన్యత కల్గినది.

మకరసంక్రాంతి ప్రవేశకాలమునకున్న వారమునుబట్టి (1) సంక్రాంతి పురుషునిపేరు. (2) స్నానము (3) అక్షతలు కల్గుచున్నవి. ప్రవేశకాలిక కరణమునుబట్టి (1) వస్త్రము (2) గంధము (3) పుష్పము (4) ఆభరణము (5) పాత్రము (6) ఆహారము (7) ఫలము (8) వాహనము (9) ఆయుధము (10) ఛత్రము (11) క్రీడావస్తువు (12) యానము (13) చేష్టా (14) స్థితి ఈ పదునాలుగు కలుగుచున్నవి. (15) కొందరు గ్రంథకారులు వయోనిర్ణయముచేసిరి కనుక గ్రహించవలసియున్నది. (16) జాతి నిర్ణయము.

—♦ సంక్రాంతి పురుష నిర్ణయము. ♦—

శ్లో॥ సూర్యేఘోరా విధౌధ్వాంక్షీ భౌమవారే మహోదరీ
బుధే మందాకినీజ్ఞేయా మందాఖ్యా దేవమంత్రిణి
మిశ్రాభిధా కవే ర్వారే రాక్షసీస్యాదినాత్మజే॥

—జ్యోతిర్నిబంధే



సంక్రాంతి (1) ఆదివారమగుచో సంక్రాంతి పురుషుడు ఘోరనామకుడు. (2) సోమవారమగుచో సంక్రాంతి పురుషుడు ధ్వాంక్షనామకుడు. (3) మంగళవారమగుచో సంక్రాంతి పురుషుడు మహోదరనామకుడు. (4) బుధవారమగుచో సంక్రాంతి పురుషుడు మందాకినీనామకుడు (5) గురువారమగుచో సంక్రాంతి పురుషుడు మందనామకుడు. (6) శుక్రవారమగుచో సంక్రాంతి పురుషుడు మిశ్రనామకుడు. (7) శనివారమగుచో రాక్షస నామకుడు.

శ్లో॥ ఉగ్రక్షిప్రచరైర్మిత్రధ్రువ మిశ్రాఖ్యదారుణైః
ధిష్ణైః సంక్రాంతి రర్కస్య ఘోరాద్యాక్రమశోభవేత్॥

—జ్యోతిర్నిబంధనే.

ఉగ్ర, క్షిప్ర, చర, మిత్ర, ధృవ, మిశ్ర, దారుణనక్షత్రములు సంక్రాంతి ప్రవేశకాల నక్షత్రములైయున్న ఘోర, ధ్వాంక్ష, మహోదర, మందాకినీ, మంద, మిశ్ర, రాక్షసనామక సంక్రాంతి పురుషులు క్రమముగానగుదురు. ఈపద్ధతివసిష్ఠసంహితయందును చెప్పఁబడియున్నది. ఎట్లనిన :—

శ్లో॥ ఘోరోగ్రక్షే ధ్వాంక్షీ లఘుభే చరభే మహోదరీ మృదుభే
మందాకిన్యచరక్షే మందా మిశ్రేచ రాక్షసీ తీక్ష్ణే॥

ఆంధ్రదేశస్థ పంచాంగకర్తలలో చాలామంది వారమునుబట్టియేసంక్రాంతి పురుషుని పేరు నిర్ణయించుచున్నారు. ఇదియే సిద్ధాంత సాంప్రదాయమైయున్నది.

—♦ సంక్రాంతి పురుషుని పేరునుబట్టి ఫలములు. ♦—

శ్లో॥ ఘోరాసుఖాయ శూద్రాణాం విశాం ధ్వాంక్షీ శుభప్రదా
మహోదరీచ చోరాణాం రాజ్ఞాం మందాకినీ మతా।
విప్రాణాం శుభదామందా పశూనాం మిశ్రకాభిధా
చండాల శౌండికాదీనాంస్యాదానందాయరాక్షసీ॥

—జ్యోతిర్నిబంధనే.

శ్లో॥ శూద్రవిట్చోరభూపద్విజగణపశుముఖ్యసర్వజంతూనాం
శుభఫలదాః క్రమశస్తానూనం సంక్రాంతయస్తేషామ్॥

—వసిష్ఠ సంహితాయాం.

(1) ఘోరనామకుడగుటచే శూద్రులకు సుఖము. (2) ధ్వాంక్ష నామకుడగుటచే వైశ్యులకు శుభములు సుఖము కలుగజేయును. (3) మహోదరనామకుడు చోరులకు సుఖమును కలుగజేయును. (4) మందాకినీ నామకుడు రాజులకు సుఖమును కలుగజేయును. (5) మందనామకుడు విప్రులకు శుభమును గలుగజేయును. (6) మిశ్రనామకుడు పశువులకు సుఖమును కలుగజేయును. (7) రాక్షసనామకుడు కల్లును అమ్ముకొనువారికి, మద్యపానాదులయం దాసక్తిగలవారికిని, ఐంద్రజాలికులకు, కూలికి దేవరను పూజించువారికిని, చండాలురు, మ్లేచ్ఛులు, ఆటవిక జాతులకును సంతోషమునుకలుగజేయును. పీయూషధా రే. పు. ౧౨౧

శ్లో॥ శూద్రతస్కరవైశ్యత్మ్నదేవభూవగవాం క్రమాత్
అనుక్తానాంచ సర్వేషాం ఘోరాద్యాః సుఖదాః స్మృతాః॥

మకరసంక్రాంతిపురుషుని ఫలము ఆయా పేరులనుబట్టి ఆయా జాతులకు సుఖము కలుగునని పై శ్లోకములవల్ల స్పష్టమగుచుండ తద్భిన్నముగా ఆయా జాతులవారికి నాశము కలుగునని పంచాంగకర్తలలో నూటికి తొంబదిమంది వ్రాయుట దారుణమగు సాహసమే యగును. అట్లుగ వ్రాయువారికనైనను తమ తప్పును సవరించుకొందురుగాక! తప్పును సవరించుకొని ప్రవర్తించుట వివేకలక్షణము. తప్పును సవరించుకొనజాలక తమ తప్పును సమర్థించుకొన జూచుట అజ్ఞానవిలసితము, అవివేకము, మూర్ఖ్యుని చెప్పక నొప్పక తప్పదు.

—♦ సంక్రాంతి పురుషుని స్నానోదక నిర్ణయ ఫలములు. ♦—

శ్లో॥ అగురు శ్చందనం బిల్వః కుంకుమం నింబలోయంచ స్తథా
శంఖస్నానం నిర్మలతోయంస్యాత్సూర్యాదివాసరాత్క్రమాత్

శ్లో॥ సువృష్టిర గురుస్నానే సుభిక్షం చందనం తథా
బిల్వోదకై ర్మహాభీతిః కుంకుమై శ్శుభదం భవేత్
నింబోదకై ర్మహారోగం శంఖయుక్తం సుఖప్రదం
రవ్యాదివాసరేష్వేవంసువృష్టి ర్నిర్మలోదకైః॥

సంక్రాంతి వారము (1) ఆదివారమగుచో అగురూదకస్నానం, సువృష్టి నొసంగును. (2) సోమవారమగుచో చందనోదకస్నానం, సుభిక్షము కలుగజేయును. (3) మంగళవారమగుచో బిల్వోదకస్నానం (మారేడు దళయుత జలముతో స్నానం) మహాభయమునుకలుగజేయును. (4) బుధవారమగుచో కుంకుమస్నానం, శుభము: (5) గురువారమగుచోనింబ(వేపాకునీరు) స్నానం, రోగభయములధికము; స్ఫోటకము. కలరా, ప్లేగుజాడ్యములు కలుగజేయును. (6) శుక్రవారమగుచో శంఖోదకస్నానం, సుఖసౌఖ్యముల నొసంగును. (7) శనివారమగుచో నిర్మలమైన నీరుతో స్నానం, సువృష్టి నొసంగును.



—♦ అక్షతధారణ ఫలములు. ♦—

సంక్రాంతి వారము (1) ఆదివారమగుచో ప్రియంగు అక్షతధారణం. ప్రియంగు (కొఱ్ఱలు) పంటకు నష్టమును కలిగించును. (2)సోమవారమగుచో యావనాళాక్షతధారణం. యావనాళ (అలచందలు) హాని. (3) మంగళవారమగుచో తిలాక్షతధారణం. నువ్వులపంట నశించును. (4) బుధవారమగుచో చణకాక్షతధారణం, సెనగల పంట నశించును. (5) గురువారమగుచో యవకాక్షతధారణం, లోకగోధుమలపంట నశించును. (6) శుక్రవారమగుచో మాషాక్షతధారణం, మినుములపంట నశించును. (7) శనివారమగుచో ముద్గాక్షతధారణం, పెసరపంట నశించును. అక్షతధారణ నిర్ణయఫల శ్లోకములు నావద్దనున్న ప్రాచీన గ్రంథములోనున్నను ఆ గ్రంథము చాలా శిథిలమై యున్నందున యీ శ్లోకములున్న భాగము పురుగులు కొరికివేయుటచే శ్లోకములను వ్రాయజాలకపోతిని. విజ్ఞులీవిషయమునగల శ్లోకములు సరిగా వ్రాసియున్నవానిని తెలియజేయుచో రెండవ ముద్రణయందు శ్లోకములులేని లోపమును సవరించుకొందునని మనవిచేయుచున్నాను.

—♦ వస్త్రధారణ నిర్ణయము. ♦—

శ్లో॥ శ్వేతం పీతం హరిత్పాండురక్తం శ్యామంచ మేచకమ్
చిత్రం కంబలదిగ్ మేఘసన్నిభం క్రమతోం బరమ్।

—గణపతౌ.

మకరసంక్రాంతి ప్రవేశకాలముననున్న కరణము (1) బవయగుచో శ్వేతవస్త్రధారణం. (2) బాలవయగుచో పీతవస్త్రధారణం. (3) కౌలవయగుచో హరితవస్త్రధారణం (4) తైతులయగుచో పాండుర (తెల్లని) వస్త్రధారణం. (5) గరజియగుచో రక్తవస్త్రధారణం. (6) వణిజియగుచో శ్యామ (నలుపు తెలుపుకలిసినరంగు) వస్త్రధారణము (7) విష్టియగుచో మేచక (కృష్ణవర్ణ) వస్త్రధారణము. (8) శకునియగుచో చిత్రవస్త్ర,

ధారణం. (9) చతుష్పాలైయగుచో కంబళవస్త్రధారణము (10) నాగ మగుచో దిగంబరత్వము. (11) కౌస్తుఘ్నమగుచో మేఘవర్ణవస్త్రధారణము కలుగును.

శ్లో॥ శ్వేతం రక్తం చిత్రం పీతం నీలంచ కంబలం క్రమశః
పట్టమజినం క్షౌమం వల్కల మసితం బవాద్వసనమ్॥
—జ్యోతిర్నిబంధనే

బవాదికరణ క్రమముగ (1) శ్వేతం (2) రక్తం (3) చిత్రం (4) పీతం (5) నీలం (6) కంబళం (7) పట్టం(పట్టు) (8) అజినం (మృగచర్మం లేక లేడిచర్మం) (9) క్షౌమం (వెలిపట్టు లేక రేషన్‌సిల్కు)(10) వల్కలము (నారచీర) (11) అసితం(నల్లనిది) క్షౌమం = క్షుమాయాః అతస్యా వికారః క్షౌమం=క్షుమ యనగా నల్లయవిసె. దానియొక్క నారచేత చేయబడినది. అసితం=సితః నభవతీత్యసితః=సితమనగా తెలుపు అది కానిది అసితం. "కృష్ణేనీలాసితశ్యామకాలశ్యామలమేచకాఃఇత్యమరః.

శ్లో॥ శ్వేతపీతహరిత్పాండురక్తశ్యామవర్ణమసితం బహువర్ణమ్
కంబలోవివసనాంబుదవర్ణాన్యం శుకానిచ రవేః కరణేషు॥
—కశ్యపః—పీయూషధారే ౧౩౫ పుటే.

పైన వ్రాసి చూపిన శ్లోకములన్నియు ప్రమాణగ్రంథములోని వగుటచే అందొకదాని కొకటి కొన్నిచోట్ల భేదించినను యిష్టమైన శ్లోకము నే ప్రమాణముగా గ్రహించి ప్రవర్తింపవచ్చును. కాని ముహూర్త గణపతి, ముహూర్త చింతామణి గ్రంథమునకు వ్యాఖ్యయగు పీయూష ధార వ్యాఖ్యయు ఒకేవిధమున చెప్పఁబడియుండుటచేత జ్యోతిర్నిబంధనోక్త శ్లోకము ప్రాచీనమైనదయ్యును వదలివేయుట దోషము కానేరదు,

—♦ లేపన నిర్ణయము (గంధ నిర్ణయము) ♦—

శ్లో॥ కస్తూరికుంకుమంచైవ చందనం మృచ్చరోచనమ్
యావక్షోతుమదోవాపి హరిద్రాంజనకోఽగరుః
కర్పూరశ్చేతి విజ్ఞేయం సంక్రాంతేశ్చ విలేపనమ్॥—గణపతౌ.

మకర సంక్రమణకాలిక బవాదికరణ క్రమమున 1 కస్తూరి 2. కుంకుమం 4. చందనం 3. మృత్తిక. 5. గోరోచనము 6. యావ (లక్క) "యావోఽలక్తోద్రుమామయః" అని అమరుడు చెప్పెను. "యాతి వస్త్రాదినా యావః" వస్త్రములతో కూడి యుండునని (లక్క; లక్క వస్త్ర



ములను ప్రకాశింపజేయును.) లక్క ఒకవిధముగా వృక్షములయొక్క బంక యని చెప్పవలయును. 7. ఓతుమదం "ఓతుర్బిడాలో మార్జాలః" అని అమరుడు చెప్పెను. ఓతుమదమును దాక్షిణాత్యులు జవ్వాదియందురు. కొందరు పునుగుపిల్లి మదము, గావున పునుగు అనియు అందురు. 8. హరిద్రా "నిశాఖ్యా కాంచనీపీతా హరిద్రా" ఇత్యమరః, హారిద్ర మనగా పచ్చని వన్నెగలది. అనగా పసుపు అని గ్రహించవలెను. 9. అంజనం (కాటుక లేక సుర్మా). "స్రోతోంజనంతు సౌవీరం కాపో తాంజనయామునీ" అని అమరసింహుడు చెప్పెను. "యమునాస్రోత సిజాత మంజనం స్రోతోంజనం" అని ఉత్పత్తి. అనఁగా యమునానది ప్రవాహమునందు బుట్టిన యంజనమును స్రోతోంజన మందురు. దీనినే ఉత్తరహిందూస్థానీయులు దేశీయముగా "సుర్మా" యను పదముచే వ్యవహరించుట గలదు. 10. అగురు 11. కర్పూరం. లేపన మనగా పై పూత.

శ్లో॥ కస్తూరికా కుంకుమచందనం మృద్గోరోచనం యావకఓతుఘర్మః
నిశ్యంజనంచాగురురిందు రేభిర్విలేపనంసంక్రమణే బవాత్స్యాత్॥
—కశ్యపః.

శ్లో॥ కస్తూరికా చందన కుంకుమం మృద్గోరోచనం యావక ఓతు ఘర్మః । నిశ్యంజనం చాగరురిందు రేభిర్విలేపనం సంక్రమణే బవాచ్చ॥
జ్యోతిర్నిబంధనే.

ఓతుఘర్మః=పిల్లిచెమట("ఘర్మోనిదాఘస్స్వేదస్స్యాత్" ఇత్యమరః) "జిఘర్తీతి ఘర్మః=కాలునది యని ఉత్పత్త్యర్థము. అనగా చెమట యని భావము. మదముకూడా కారునదియే యగుటచే కొందరు "ఓతు మదః" పిల్లి మదము అని చెప్పుటకు హేతువయ్యెను. సంక్రాంతి పురుషునికి లేపన ద్రవ్యములు చెప్పుటలో వస్తుభేదము లేకున్నను, కరణ క్రమముగా చెప్పుటలో కొలదితారతమ్యమున్నందున జ్యోతిర్నిబంధనోక్త శ్లోకమును వదలి ముహూర్త గణపతి, ముహూర్త చింతామణి పీయూష ధార వ్యాఖ్యాకారుని వచనము లేకమైయున్నందున వాటినే గ్రహించి ప్రవర్తించవలయును.

## —♦ పుష్పధారణ నిర్ణయము. ♦—

శ్లో॥ పున్నాగజాతీబకుల కేతకీ బిల్వార్కజమ్
దూర్వాబ్జమల్లికాపుష్పం పాటలాచ జపా క్రమాత్.

—ముహూర్తగణపతౌ.

శ్లో॥ పున్నాగజాతి ర్బకులా సుకేతకీ బిల్వార్కదూర్వా శతపత్రి
మల్లికాః। తతో భవే త్పాటలికా జపా తతః పుష్పాణి సూ
ర్యస్య బవాదిషు క్రమాత్॥

—కశ్యపః—ముహూర్తచింతామణి వ్యాఖ్యాయాం.

శ్లో॥ పున్నాగజాతీ బకులాని మల్లికా జపాచ నీలోత్పలమర్కమాధవీ
సచంపకం పాటలపుష్పధుత్తురం బవాది పుష్పాణిచ ధారణాని॥

—జ్యోతిర్నిబంధనే.

మకరసంక్రాంతిప్రవేశకాలిక కరణము 1. బవయగుచో పున్నాగ పుష్పం (సురపొన్నపువ్వు) 2. బాలవయగుచో జాతిపుష్పం (మాలతీ పుష్పము లేక జాజిపుష్పమని పేరు.) 3. కౌలవయగుచో వకుళపుష్పం (పొగడపువ్వు) "ఉచ్యతే రోగ మత్తీతి వకుళః" రోగమును బోగొట్టునది యని శబ్ద ఉత్పత్త్యర్థము. వకుళమునుబకుళమనుటయుగలదు. ఇందులకు "బవయోరభేదః" అను ఆర్యోక్తియు గలదు. 4. తైతులయగుచో కేతకీ పుష్పం (మొగలిపువ్వం) "కిత్యతే జ్ఞాయతే గంధో నేనేతి కేతకీ కితజ్ఞానే" దీనిచేత పరిమళము తెలియబడును అని శబ్ద ఉత్పత్త్యర్థము. 5. గరజికరణమగుచో బిల్వపుష్పం (మారేడుపుష్పం) "బిలతికుష్ఠాదీన్ బిల్వః బిలభేదనే"—కుష్ఠాదులను గొట్టివేయునది యని బిల్వశబ్ద ఉత్పత్త్యర్థము. "సేవకస్య పాపం బిలతిహినస్తీతివాబిల్వః" సేవకుని పాపము బోగొట్టునదనియు బిల్వశబ్ద ఉత్పత్త్యర్థము. 6. వణిజికరణమగుచో అర్కపుష్పం (జిల్లేడుపువ్వు) 7. విష్టి (భద్రి) కరణమగుచోదూర్వాపుష్పము (గరిక పుష్పము) 8. శకునియగుచో అబ్జపుష్పము (తామరపువ్వు) దీనినే శతపత్రపుష్పమనియు నందురు. 9. చతుష్పాత్ యగుచో మల్లికాపుష్పం (మల్లెపుష్పం) "మల్యతే మూర్ధ్నిమల్లికా" శిరస్సునందు ధరింపఁబడునది యని మల్లికాశబ్దఉత్పత్త్యర్థము. 10. నాగవమగుచో పాటలపుష్పం(పాదిరపువ్వు లేక మొక్కపుచెట్టుపువ్వు) కొందరు కలిగొట్టుచెట్టుపువ్వందురు.



"పాటలవర్ణపుష్పత్వాత్పాటలః" ఎఱుపు తెలుపు వర్ణములలోగూడిన పువ్వు అని శబ్ద ఉత్పత్త్యర్థము. 11. కింస్తుఘ్నమగుచో జపాపుష్పం (దాసానిచెట్టుపువ్వు) జలమధ్యే జపతీవ తిష్ఠతీతి "జపా జప వ్యక్తాయాం వాచి" నీళ్ళనడును జపముసేయుదానివలె నుండునది గావున జపా యనబడుచున్నది. దీనినే దాసానిచెట్టందురు. దాసానిచెట్టుపువ్వునే జపాపుష్పమందురు.

జ్యోతిర్నిబంధన గ్రంథములో కరణక్రమమున 1. బవకుపున్నాగ పుష్పము 2. బాలవకు జాజిపుష్పము 3. కౌలవకు వకుళపుష్పము (4) తైతులకు మల్లికాపుష్పము 5. గరజికి జపాపుష్పము 6. వణిజికి నీలోత్పలము (నల్లకలువపువ్వు 7. విష్టి లేక భద్రకు అర్కపుష్పము 8. శకునికి మాధవీపుష్పము (గురువిందెపువ్వు) "మధౌ చైత్రే పుష్యతీతిమాధవీ" చైత్రమాసమునందు పుష్పించునది గనుక గురువిందచెట్టునకు మాధవీ యని శబ్ద ఉత్పత్త్యర్థము చెప్పబడినది. 9. చతుష్పాత్తుకు చంపకపుష్పము (సంపెంగపువ్వు) "చమ్యతే అళిభిరితి చంపకః "చము అదనే" తుమ్మెదలచే నాస్వాదింపఁబడునది యని చంపకశబ్ద ఉత్పత్త్యర్థము. 10. నాగమునకు పాటలపుష్పము 11. కింస్తుఘ్నమునకు ధుత్తూరపుష్పం (ఉమ్మెత్తపుష్పం) "వాతాదిరోగాన్ ధునోతీతి ధుత్తూరః "ధూ విధూననే" వాతాది రోగములను కంపింపఁజేయునది యని ధుత్తూర (ఉమ్మెత్తచెట్టు) కు శబ్దోత్పత్త్యర్థము. దీని పువ్వే ధుత్తూరపుష్పము. ధుత్తూర పుష్పమునే కొందరు ధత్తూరమని వ్రాయుట వాడుక.

## —♦ ఆభరణధారణ నిర్ణయము. ♦—

శ్లో॥ నూపురః కింకిణీముక్తా విద్రుమః కంకణం మణిః
గుంజా వరాటకా నీలో వజ్రిః స్వర్ణం యథాక్రమమ్॥

—ముహూర్త గణపతౌ

కరణక్రమమున 1. బవకు నూపురం (అందె లేక గండపెండేరమనియు నందురు.) 2. బాలవకు కింకిణీ (చిరుగంటలు లేక చిరుగజ్జెలు) 3. కౌలవకు ముక్తా (ముత్యము) 4. తైతులకు విద్రుమం (పగడము) 5. గరజికి కంకణం (హస్తభూషణం లేక మాత్తికాదులలోగూడిన కడియము) 6. వణిజికి మణి (రత్నం) 7. విష్టి లేక భద్రకు గుంజా. (గురి

వెండపూసల హారము) 8 శకునికి వరాటకము (తామరపువ్వులోనిదుద్దు వంటి యాభరణము. కొందరు గవ్వలహారమనియు నందురు. 9. చతుష్పాత్తుకు నీలము (నల్లసివణి) 10. నాగమునకు వజ్రముల హారము 11. కింస్తుఘ్నమునకు బంగారు ఆభరణము.

శ్లో॥ ప్రవాళ ముక్తారజతం మణిస్తథా। గోమేధికం నీలసువర్ణసీసమ్
కాంస్యం తథా పిత్తలతామ్రలోహం। బవాదికానా మిహ భూషణాని.
—జ్యోతిర్నిబంధే.

బవాది క్రమమున (1) బవకు పగడము 2. బాలవకు ముత్యము 3 కౌలవకు వెండి 4. తైతులకు మణి 5, గరకు గోమేధికం 6. వణిజకి నీలము 7 విష్టికి లేక భద్రకు సువర్ణం (బంగారం) 8. శకునికి సీసం 9 చతుష్పాత్తునకు కంచు లేక ఇత్తడి 10. నాగమునకు రాగి 11 కిస్తుఘ్నమునకు ఇనుము. పై రెండింటిలో ఏ శ్లోకమునైనా గ్రహించి ప్రవర్తింప వచ్చును.

—♦ పాత్రధారణ నిర్ణయము. ♦—

బవాది క్రమమున 1. స్వర్ణ 2. రూప్య (వెండి) (3) తామ్ర(రాగి) 4. కాంస్య (కంచు) 5 లోహ (ఇనుము) 6. పోక (కఫరీ) 7. పత్ర 8, వస్త్ర 9. చెయ్యి 10. భూమి 11. కాష్ఠ (కొయ్య) ముహూర్త గణపతిలో దీనికి శ్లోకములేదు.

శ్లో॥ సువర్ణం రజితం తామ్రం అయ స్సీసం తథా త్రపు
కాంస్యం పాషాణదారూణి మృత్పాత్రం వేణుపాత్రకం.
—సిద్ధాంత సరళ్యాం,

బవాది క్రమమున 1 స్వర్ణపాత్ర 2 రజితపాత్ర 3 తామ్రపాత్ర 4 అయఃపాత్ర 5. సీసపాత్ర 6. త్రపు(ఇత్తడి) పాత్ర 7. కాంస్యపాత్ర 8. పాషాణపాత్ర 9. దారుపాత్ర 10. మృత్పాత్ర (కుండ) 11. వేణుపాత్ర (వెదురుగొట్టం)

—♦ ఆహార నిర్ణయము. ♦—

శ్లో॥ అన్నంచ పాయసం భైక్ష్యమపూపంచ పయోదధి
చిత్రాన్నం గుడమధ్వాజ్యం శర్కరాబవతో భవేత్॥



శ్లో॥ నటక్షత్రియవిప్రాణాం విట్శూద్రయతి యోషితామ్
నాస్తికాన్త్యజపాఖండ క్లీబానాం సంక్షయోబవాత్॥
—జ్యోతిర్నిబంధనే.

బవాది క్రమమున 1. బవకు అన్నాహారము. నర్తకులకు హాని. 2. బాలవకు పాయసం ఆహారం. క్షత్రియులకు హాని 3. కౌలవకు భిక్షాహారము. విప్రులకు హాని 4. తైతులకు అపూపం (పిండివంటకములు) వైశ్యులకు హాని 5. గరకు పాలు. శూద్రులకు హాని 6. వణిజకి పెరుగు. యతీశ్వరులకు హాని 7. విష్టికి చిత్రాన్నం. స్త్రీలకు హాని 8. శకునికి బెల్లము. నాస్తికులకు హాని 9. చతుష్పాత్తుకు మధువు (కల్లు). అంత్యజులకు హాని 10. నాగమునకు ఆజ్యము (నెయ్యి). పాషండులకు హాని 11. కింస్తుఘ్నమునకు పంచదార. క్లీబులకు (నపుంసకులు) అనగా స్త్రీవేషధారులగు పురుషులు (కొజ్జవారు) వీరలకు హాని.

శ్లో॥ అన్నంచ పాయసం భైక్ష్యం పక్వాన్నంచ పయోదధి
చిత్రాన్నం గుడ మధ్వాజ్యం శర్కరా భక్షణం క్రమాత్.
—ముహూర్తగణపతౌ.

పాషండాః = సంసారసంబంధహేతుభూతమైన యసచ్ఛాస్త్రములను పలుకువారు. (కామాచారులు). "పాశాః సంసృతి బంధ హేతుభూతాని అసచ్ఛాస్త్రాణి అణంతి వదంతీతి పాషండాః" అనిశబ్దోత్పత్తి. భైక్ష్యం=భిక్షాదిభ్యోఽణ్=మధుకరాన్నము (భిక్షాన్నము).

—♦ ఫలధారణ నిర్ణయము. ♦—

శ్లో॥ నారికేళ కదళీఫలం తథా చూత జంబు బదరీఫలం తథా
తాళ బిల్వక మధూక ఖర్జురా తింత్రిణీ పనస భుగ్బవాదిషు.

1. బవకు కొబ్బరికాయ 2. బాలవకు అరటిపండు 3. కౌలవకు మామిడిపండు 4. తైతులకు నేరేడుపండు 5. గరకు రేగుపండు 6. వణిజకి తాటిపండు 7. భద్రకు మారేడుపండు 8. శకునికి యిప్పపండు 9. చతుష్పాత్తుకు ఖర్జూరపండు 10. నాగమునకు చింతపండు 11. కింస్తుఘ్నమునకు పనసపండు. ఏ ఫలముల ధరించునో ఆ ఫలములకు హాని.

—♦ వాహన నిర్ణయము. ♦—

శ్లో॥ సింహో వ్యాఘ్రో వరాహశ్చ ఖర కుంజర మాహిషాః
అశ్వోష్ట్ర మేష వృషభా న్బయానం వాహనం బవాత్.

శ్లో॥ గజోవాజిర్వృషో మేషః ఖరోష్ట్రౌ హరయః క్రమాత్
బవాదౌ వాహనం ప్రోక్తం స్థిరేషు వృషభో రవిః॥
శ్లో॥ ఖశబాహ్లీకవంగేషు సంక్రాంతేర్ధిష్ణ్యవాహనమ్
అన్యదేశేషు తిథ్యర్ధవాహనం స్యాద్బవాదితః.
శ్లో॥ బవే గరే గజారూఢో బాలవే వణిజే వృషే
కింస్తుఘ్నే శకునౌ కాలే వాజిరూఢస్తు సంక్రమే
వ్యాఘ్రే విష్ట్యాం చతుష్పాదే మహిషే నాగతైతులే.
శ్లో॥ గజే లక్ష్మీర్వృషే స్వాస్థ్యం విడ్వరం వాజివాహనే
మహిషే మారణం వ్యాఘ్రే వాహనే నిశ్చితం భయమ్
గర్గాదిభాషితంచైవ కుర్యాచ్ఛాంతింతు బుద్ధిమాన్.
—జ్యోతిర్నిబంధే.

శ్లో॥ సింహోవ్యాఘ్రో వరాహశ్చఖరేభ మహిషాహయాః
శ్వాజౌగాః కుక్కుటోవాహాః సంక్రాంతౌ బవతో రవేః.
—ముహూర్తగణపతౌ.

శ్లో॥ హరి శార్దూల వరాహ గర్దభగజమహిషాశ్చ ఘోటకాశ్చైవ
శ్వాజ వృషభ కుక్కుటాః స్యుః సంక్రాంతే ర్వాహనాని బవ
కరణాత్.
శ్లో॥ బాహ్లీకఖశవంగాంగేషుతు విజ్ఞేయం వాహనంచ ఋక్షభవమ్
కరణభవం త్వన్యస్మిన్దేశే నియతంచ వాహనం జ్ఞేయమ్.
—వసిష్ఠ సంహితాయాం.

శ్లో॥ సింహశార్దూల వారాహ కుంజరా మహిష స్తథా
తురగాశ్వాజ వృషభ కుక్కుటాశ్చ బవాదిషు
తిథ్యర్ధకేషు సంక్రాంతి వాహనాని యథాక్రమాత్
భయోనివాహనం వంగబాహ్లీక విషయే ఖశే.
—కాశ్యపః.

—♦ ప్రసంగ వశాత్ యోనినిర్ణయ శ్లోకాని లిఖ్యంతే. ♦—

శ్లో॥ అశ్విన్యంబుపయోర్హయో యోనిగదితః స్వాత్యర్కయోః కాసరః
సింహోవస్వజపాద్భయోః సముదితోయామ్యాం త్యయోః
కుంజరః । మేషో దేవపురోహితానలభయోః కర్ణాంబునోర్వా



నరః । స్యాద్వైశ్వాభిజితో స్తథైవ నకుల శ్చాంద్రాబ్జయో
ర్యోరహిః. —ముహూర్తచింతామణౌ.
శ్లో॥ జ్యేష్ఠామైత్రభయోః కురంగఉదితో మూలార్ద్రయోః శ్వాతథా
మార్జారోదితిసార్పయోరథమఘాయోర్యో స్తథైవోందురుః
వ్యాఘ్రో ద్వీశఖ చిత్రయోరపి చ గౌరర్యమ్ణ బుధ్న్యర్క్షయో
ర్యోనిః పాదగయోః పరస్పరమహావైరంభయోన్యోస్త్యజేత్.
—చింతామణౌ.

—♦ యోని నిర్ణయము. ♦—

1. అశ్వనీ శతతారలకు అశ్వము 2. స్వాతిహస్తలకు దున్నపోతు 3. ధనిష్ఠ పూర్వాభాద్రలకు సింహము 4. భరణీ రేవతులకు గజము. 5. పుష్యమి కృత్తికలకు మేక 6. శ్రవణ పూర్వాషాఢలకు వానరము 7. ఉత్తరాషాఢ అభిజిత్తులకు నకులం (అనగా ముంగిస) 8. మృగశిరా రోహిణులకు సర్పము 9. జ్యేష్ఠ అనూరాధలకు లేడి 10. మూలఆర్ద్రలకు కుక్క 11. పునర్వసు ఆశ్రేషలకు మార్జాలము (పిల్లి) 12. మఘపుబ్బలకు ఎలుక 13. విశాఖ చిత్రలకు వ్యాఘ్రము 14. ఉత్తర ఉత్తరాభాద్రలకు ఆవు. పై జంట నక్షత్రములలో ౧-కి పురుషజంతువు ౨-కి స్త్రీ జంతువు.

బాహ్లీకము, ఖశదేశము, వంగదేశము, అంగదేశములందు అశ్వన్యాది నక్షత్ర యోనుల ననుసరించి ఏర్పడు జంతువాహనముగా వ్రాయుదురు. మిగతా దేశములందంతటను కరణము ననుసరించి యేర్పడిన వాహనమును వ్రాయవలెను.

బవాదికరణ క్రమముగా 1. బవకు సింహవాహనము 2. బాలవకు వ్యాఘ్రవాహనము. నిశ్చింత భయం. కౌలవకు వరాహవాహనము (పంది) 4. తైతులకు గర్దభవాహనము (గాడిద). 5. గరకు గజవాహనం. లక్ష్మీప్రదము 6. వణిజకి మహిషవాహనము (దున్నపోతు). మృత్యుభీతి. 7. విష్టి లేక భద్రకు అశ్వవాహనం. రాజవిగ్రహం. ప్రజాక్షోభ. 8. శకునికి శ్వానవాహనము (కుక్క). 9. చతుష్పాత్తుకు అజవాహనము (మేక). 10. నాగమునకు వృషభవాహనము. స్వాస్థ్యం. (శాంతియుండును) 11. కింస్తుఘ్నమునకు కుక్కుటవాహనము (కోడిపుంజు). యిచ్చటకొన్ని జంతువాహనముల ఫలము చెప్పబడకున్నను "అనుక్త మన్యతో గ్రా

హ్యమ్" అను ఆర్యోక్తిచే ఆయా జంతువులకు హాని గలుగునని గ్రహించవలెను.

—♦ ఆయుధధారణ నిర్ణయము. ♦—

శ్లో॥ భుశుండీభిందిపాలాసి దండకోదండ తోమరాన్
కుంత పాశాంకుశాస్త్రేషూన్బిభర్తి కరణేష్వినః.
—నారద కశ్యపయోః—చింతామణౌ.

శ్లో॥ క్రమశో బిభర్తి దినపో బవతో భుశుండీ గదాఖ్యంచ
ఖడ్గాఖ్యం దండకార్ముకతోమర కుంతపాశాంకుశ శాస్త్రశరాః.
—వసిష్ఠ సంహితాయాం.

శ్లో॥ భుశుండీ చ గదాఖడ్గోదండః కోదండ తోమరా
కుంతః పాశోంకుశోస్త్రంచ బాణశ్చైవాయుధం క్రమాత్.
—ముహూర్త గణపతౌ.

బవాది క్రమముగా 1. బవకు ఫిరంగి. 2. బాలవకు భిందిపాలము= తుపాకి గుండు లేక (వాటుగుదియ) "భిందతః పాలయతీతి భిందిపాలః= నఱకువానినుండి రక్షించునది). 3. కౌలవకు అసి (కత్తి) 4 తైతులకు (కర్ర). 5. గరకుకోదండము (కుర్దంతే నేన నేతికోదండం=దీనిచేత వేటాడుదురు. (విల్లు). 6. వణిజికి తోమరము (చిల్లకోల). "తామ్యంతేఅనేతి తోమరః తమగ్లానౌ=దీనిచేత బడలుదురు.) 7. భద్రకు కుంతము (బల్లెం) "కుణంత్యనేనేతి కుంతః=దీనిచేత మొరపెట్టుదురు." (ఈటె). 8. శకునికి పాశము (కట్టుత్రాడు) 9.చతుష్పాత్తుకు అంకుశము, "అంక్యతేఽనేనే త్యంకుశః=దీనిచేత ఏనుగునకు గురుతుపడును." 10. నాగమునకు అస్త్రము (బాకు) "అస్యత ఇతి అస్త్రం, అసుక్షేపణే=దేహాదులమీద చిమ్మబడు ఆయుధము. 11. కింస్తుఘ్నమునకు బాణము.

—♦ ఛత్రధారణ నిర్ణయ ఫలములు. ♦—

శ్లో॥ శ్వేతం రక్తం తథా పీతం నీలం కాంచనవర్ణకం
మయూరగపింఛ సద్భశం జీర్ణం కంబళకం తథా
శూర్పపాలాశపత్రం చ శూన్యఛత్రం బవాదిషు॥



శ్వేతచ్ఛత్రం తథారోగ్యం రక్తచ్ఛత్రం మహాహవం
పీతచ్ఛత్రం తు శుభదం నీలం రోగభయప్రదం
కాంచనం రోగనాశస్స్యాత్ మయూరం మృత్యునాశనం
జీర్ణం శుభకరం చైవ కంబళం దుఃఖనాశనం
శూర్పం పుష్టికరం చైవ పాలాశం శత్రువృద్ధిదం
శూన్యచ్ఛత్రం శుభకరం బవాదిషు యథాక్రమం॥

బవాది క్రమముగా (1) బవకు తెల్లనిగొడుగు. ఆరోగ్యము. (2) బాలవకు ఎఱ్ఱని గొడుగు యుద్ధభీతి. (3) కౌలవకు పసుపుపచ్చనిగొడుగు. శుభదం. (4) తైతులకు నల్లనిగొడుగు. రోగప్రదము. (5) గరకు బంగారపువన్నె గొడుగు. రోగనాశనము. (6) వణిజికి నెమలి కన్నులరంగు గొడుగు. అపమృత్యుభయములను తొలగించును. (7) భద్రకుని చినిగి జీర్ణావస్థలోనున్న గొడుగు. శుభకరము. (8) శకునికి కంబళిగుడ్డగొడుగు. దుఃఖములను తొలగించును. (9) చతుష్పాత్‌కు చేటగొడుగు. బలము నొసంగును. (10) నాగమునకు పాలాశపత్రము (మోదుగాకు) గొడుగు. శత్రువృద్ధిని గలుగజేయును. (11) కింస్తుఘ్నమునకు గొడుగులేదు. శుభదాయకము.

—♦ క్రీడావస్తుధారణ నిర్ణయము :—(ఆటవస్తు నిర్ణయము. ♦—

శ్లో॥ తంత్రీ ఖడ్గః సితం పద్మ కేతుః కుంతస్తులా ధనుః
పాశశ్చక్రస్త్వలాతంచ కులిశంచా క్రీడనం రవేః॥

(1) బవకు వీణాధారణం - పిశాచముల కరిష్టం (1) బాలవకు ఖడ్గధారణము. యుద్ధభయము (3) కౌలవకు సితపద్మధారణం(తెల్లనితామరపుష్పధారణం) శుభప్రదం. (4) తైతులకు కేతు (ధ్వజ) ధారణము - రాజులకు నాశము (5) గరకు కుంత ధారణము (బల్లెము). ప్రజాక్షోభ. (6) వణిజికి తులాధారణము. వ్యాఘ్రమారిష్టం. (7) భద్రకు ధనుర్ధారణము ప్రజారిష్టము (8) శకునికి పాశధారణము, పశుహాని (9) చతుష్పాత్తుకు చక్రధారణం. మతంగజారిష్టం. (ఏనుగులకు హాని). (10) నాగమునకు అలాతధారణం (కొరవి) శుభం. (11) కింస్తుఘ్నమునకు కులిశధారణం (వజ్రాయుధధారణం) ప్రజాక్షేమం

## —♦ దిగ్యాన నిర్ణయము. ♦—

శ్లో॥ బవే పూర్వముఖం యానం బాలవేయమ దిఙ్ముఖం
కౌలవేచోత్తరం యానం తైతులే పశ్చిమం ముఖం
గరజేచ తథాగ్నేయం వణి గ్వాయవ్య దిఙ్ముఖః
భద్రాయామీశ దిగ్యానం శకున్యా మథనైరృతిం
చతుష్పదేచ పాతాళం నాగవే చోర్ధ్వగాగతిః
కింస్తుఘ్నే సర్వదిగ్యానం బవాదిషు యథాక్రమమ్॥

శ్లో॥ యద్దిఙ్ముఖ గతో భానుస్తద్దేశే క్షామడాంబరం
విదిఙ్ముఖ గతో భాను స్తద్దేశస్య శుభప్రదః॥

బవాది క్రమమున (1) బవకు తూర్పుదిగ్యానం. తద్దేశారిష్టం (2) బాలవకు దక్షిణదిగ్యానం. తద్దేశారిష్టం (3) కౌలవకు ఉత్తర దిగ్యానం. తద్దేశారిష్టం (4) తైతులకుపశ్చిమదిగ్యానం తద్దేశారిష్టం (5) గరకుఆగ్నేయ దిగ్యానం, తద్దేశే సుభిక్షం (6) వణిజికి వాయువ్యదిగ్యానం తద్దేశే సుభిక్షము, (7) భద్రకు ఈశాన్య దిగ్యానం తద్దేశే సుభిక్షం. (8) శకునికి నైరుతి దిగ్యానం తద్దేశే సుభిక్షం. (9) చతుష్పాత్తుకు పాతాళ దిగ్యానం తద్దేశారిష్టం (10) నాగమునకు ఊర్ధ్వదిగ్యానం తద్దేశోపద్రవం, (11) కింస్తుఘ్నము సర్వదిగ్యానం - సర్వదేశారిష్టములుండును.

## —♦ అవస్థా నిర్ణయము. ♦—

శ్లో॥ స్యాదుత్థితశ్చ కింస్తుఘ్నే శకునౌ కౌలవే రవిః
సంక్రాన్తిస్తైతులే నాగే ప్రసుప్తస్యా చ్చతుష్పదే
నివిష్టశ్చ గరే విష్ట్యాం బలే వణిజి బాలవే
వృష్ట్యర్ఘ్యాదేః క్రమాదిష్ట మనిష్టం మధ్యమం ఫలమ్॥
—జ్యోతిర్నిబంధే.

శ్లో॥ దుర్భిక్షం రోగబాహుళ్య మూర్ధ్వః సంక్రమణే రవిః
సుప్తః కరోతి కల్యాణ ముపవిష్టః సమం ఫలమ్॥
—రాజమార్తాండే.

శ్లో॥ నాగచతుష్పదతైతులకరణే సుప్తః కరోతి సంక్రమణమ్
కౌలవ శకుని కింస్తుఘ్నే కరణే చోర్ధ్వస్థితో దినకృత్



గర బవ విష్ట్యాం వణిజే సబాలవే సతతం చ నివిష్టః
సతతం జగతాం వృష్టి ర్ధాన్యార్ఘ త్వం విశేషతః క్షేమమ్॥
—వశిష్ఠ సంహితాయాం.

(1) నాగవము. చతుష్పాత్. తైతుల కరణములగుచో సుప్తావస్థ. (2) కౌలవ శకుని, కింస్తుఘ్న కరణములగుచో నిలుచుండే అవస్థ. (ఊర్ధ్వస్థితావస్థ). (3) గర, బవ, విష్టి లేక భద్ర, వణిజి బాలవలగుచో నివిష్ట అవస్థ (కూర్చునియుండుట) సుప్తావస్థయందున్న రవి సువృష్టియు పాడి పంటల సమృద్ధియు నొసంగును. ధరలు తగ్గును. ఊర్ధ్వస్థితియందున్న రవి (అనఁగా తిష్ఠావస్థయందున్న రవి) దుర్భిక్షము. రోగములు, కల్లోలములు సస్యహాని, అల్పవృష్టి, పాడిపంటలు తగ్గుట, ధరలు పెరుగుట కలుగ జేయును. నివిష్టావస్థ (కూర్చునియున్న) యందున్న రవి మధ్యమవృష్టి, పాడిపంటలు మధ్యమము. ధరలు మధ్యమముగా నుండునట్లు జేయును. ఉపవిష్ట మనఁగా కూర్చునియుండుట. సుప్త మనఁగా పరుండియుండుట.

శ్లో॥ పంథాశ్చ భోగా రతిహాస్య దుర్ముఖీ
జ్వరాన్వితా భుక్త సుకంపితామతా
ధ్యానస్థితా కర్కశ వృద్ధరూపా
బవాద్యవస్థా కథితా మునీంద్రైః.
—ముహూర్తచింతామణౌ.

బవాది క్రమమున (1) బవకు నడచుచుండును. (2) బాలవకు సుఖముగా నుండును. (3) కౌలవకు సంభోగించుచుండును, (4) తైతులకు నవ్వుచుండును. (5) గరజికి దుర్భాషలాడుచుండును. (6) వణిజికిజ్వరముతో నుండును. (7) భద్రకు తినియుండును. (8) శకునికి వణకుచుండును. (9) చతుష్పాత్తుకు ధ్యానము జేయుచుండును. (10) నాగమునకు కోపముతో నుండును (11) కింస్తుఘ్నమునకు ముసలివాడై యుండును. కొందరీరీతిగా అవస్థలను వ్రాయుదురు.

## —♦ చేష్టా నిర్ణయ ఫలములు. ♦—

శ్లో॥ కించి త్స్మితః క్రోధముఖః సలజ్జో వైరాగిణీవిస్మయలోలచింతా
అథోముఖీ చోర్ధ్వముఖీ విషణ్ణో చోన్మాదినీచాపి బవాదిచేష్టాః

శ్లో॥ స్మితే సూర్యే ప్రజాపీడా క్రోధాఖ్యే జననాశనం
లజ్జా సూర్యే ప్రజాసౌఖ్యం వైరాగీతు సువృష్టిదం
విస్మయేత్వ శుభం దద్యాల్లోలే క్షుద్భయ కారకమ్
చింతా సూర్యే ప్రజాసౌఖ్యం అధోభాగేతు డాంబరం
ఊర్ధ్వభాగేస్థిత స్సూర్యే దుర్భిక్షం క్షామడాంబరం
నిషణ్ణే శుభదం ప్రోక్తం ఉన్మాదేతు శుభప్రదం॥

బవాది క్రమమున (1) బవయగుచో కించిత్స్మితచేష్టా, ప్రజాపీడ, (2) బాలవయగుచో క్రోధచేష్టా, జనహాని. (3) కౌలవయగుచో లజ్జా చేష్టా, ప్రజాసౌఖ్యం. (4) తైతులకు వైరాగ్యచేష్టా, సువృష్టిదము. (5) గరయగుచో విస్మయచేష్టా, అశుభం (6) వణిజి యగుచో చపల చేష్టా, క్షుద్భయం. (7) భద్రయగుచో చింతాచేష్టా, ప్రజాసౌఖ్యం. (8) శకునియగుచోఅధోముఖచేష్టా, దుర్భిక్షం. (9) చతుష్పాత్తగుచో ఊర్ధ్వముఖచేష్టా, క్షామడాంబరములుండును. (10) నాగమగుచోదుఃఖిత చేష్టా, శుభదం. (11) కింస్తుఘ్నమగుచో ఉన్మాదచేష్టా, శుభప్రదం.

—♦ వయోనిర్ణయము. ♦—

శ్లో॥ బాలా కుమారికా రండా మధ్య ప్రౌఢా ప్రగల్భికా
వృద్ధావంధ్యాఽతి వంధ్యాస్యాదసూతా యోగినీవయః॥
—గణపతౌ.

బవాది క్రమముగా (1) బాలా (2) కుమారికా (3) గండా (4)మధ్యమా (5) ప్రౌఢా (6) ప్రగల్భికా (7) వృద్ధా (8) వంధ్యా (9) అతివంధ్యా (10) అసూతా (11) యోగినీ అని మకరసంక్రాంతికి వయోనిర్ణయము చేయబడెను.

శ్లో॥ క్రమశస్త్వనిష్టమిష్టం మధ్యమరూపం భవేదతులమ్
నానావిధాః రోగానప్యేవం జ్ఞాతవ్య మేవం బవాదీనామ్॥

శ్లో॥ శిశుః కుమారీ విధవా తథాయువా ప్రౌఢా ప్రగల్భాచ తతశ్చ
వృద్ధా । వంధ్యాతివంధ్యాచ సుతార్థినీచ ప్రవ్రాజికాచేతిబవాది
కానామ్॥ —ముహూర్త చింతామణి వ్యాఖ్యాయాం.



—♦ జాతి నిర్ణయము. ♦—

శ్లో॥ దేవభూతోరగాః పక్షిపశు రేణో ద్విజః క్రమాత్
క్షత్రియో వైశ్యకః శూద్రః సంకరో జాతయస్త్విమాః॥
—ముహూర్త గణపతౌ.

శ్లో॥ దేవభూతాహి విహగాః పశవో మృగ ఏవచ
బ్రాహ్మణ క్షత్రియో వైశ్యాః శూద్రా మిశ్రా బవాదిషు॥

1. బవకు దేవత 2. బాలవకు భూతము 3. కౌలవకు సర్పము 4. తైతులకు పక్షి. 5. గరజికి పశువు. 6. వణిజికి లేడి. 7. భద్రకు బ్రాహ్మణుడు 8. శకునికి క్షత్రియుడు. 9. చతుష్పాత్తుకు వైశ్యుడు. 10. నాగమునకు శూద్రుడు. 11. కింస్తుఘ్నమునకు సంకరుడు.

—♦ వాహనాది ఫల వివేకము. ♦—

శ్లో॥ ఆయుధం వాహనాహారా యజ్జాతీయా ధనంచ యత్
సుప్తోపవిష్టతిష్ఠం తస్తే లోకాః క్షయ మాప్నుయుః॥ నారదః

శ్లో॥ వాహజాత్యాయుధాహారాదీనాం తద్ధృత జీవినామ్
వినాశః స్యాచ్చ సంక్రాంతే ర్వస్త్రాదీనాం మహార్ఘతా
స్థితోపవిష్ట సుప్తానాం తథాజ్ఞేయం వినాశనమ్॥ —గణపతిః.

శ్లో॥ ఆయుధం వాహనాహారా యజ్జాతీయ నరస్య యత్
వినాశో జాయతే తస్య వస్త్రాదీనాం మహార్ఘతా
యదన్నం సంక్రమే ప్రోక్తం తదన్నైః ప్రీణయేద్విమ్
ఆయుధం యచ్చ తద్రాజ్ఞా పూజనీయం జయార్థినా॥

సంక్రాంతి పురుషునికిగల వాహనము ఆయుధము, హారము, వస్త్రము, గంధ పుష్పములను ధరించువారు విశేషముగా నష్టపడుదురు వాడు భుజించు అన్నముచే సంక్రమణమున బ్రాహ్మణులను తృప్తి జేయవలయును. వాడు ధరించిన ఆయుధమును రాజులు తప్పక పూజింపవలయును. వాడు కట్టుకొనిన వస్త్రములకు సుగంధాది ద్రవ్యములకు ధరలు పెరుగును. ఈ రీతిగా సంక్రాంతిఫలమును (!6) విధములుగా విమర్శించి వ్రాయవలసియుండగా కొందరు 1, వాహన 2. వస్త్ర 3. శస్త్ర

4. భత్య 5. లేపన 6. జాతి 7. పుష్ప 8. వయః 9. అవస్థాదులను వ్రాసిన చాలు ననుచున్నారు. కాన సిద్ధాంతులీ విషయములను గుర్తెరుగవలెను,

—♦ ప క్ష ఫ ల ము. ♦—

శ్లో॥ శుక్లపక్షే యదా పౌషే మకరస్థో దివాకరః
పజానాం వ్యాధిపీడాచ నృపాణాం సమరం భవేత్.

మకర సంక్రాంతి శుక్లపక్షమునం దగుచో ప్రజలకు వ్యాధిపీడ, రాజులకు యుద్ధము కలుగును.

శ్లో॥ పుష్యమాసే యదా శుక్లే మకరస్థే దివాకరే
హాహాకారం జగత్సర్వం దుర్భిక్షం క్షామ డాంబరమ్.

మకర సంక్రాంతి పుష్యమాసమునందు శుక్లపక్షమున సంభవించినచో దుర్భిక్ష క్షామ డాంబరములచే ప్రపంచమందంతటను హాహాకారములు ప్రబలును.

శ్లో॥ కృష్ణపక్షే యదా పౌషే మకరస్థో దివాకరః
సువృష్టిః క్షేమమారోగ్యం భవేయు స్సస్యసంపదః.

మకర సంక్రాంతి పుష్య కృష్ణపక్షమునం దగుచో సువృష్టియుండును. లోకమునకు క్షేమమును కలుగజేయును. పాడిపంటలుసమృద్ధియుండును.

—♦ తి థి ఫ ల ము లు. ♦—

శ్లో॥ క్షామం సుభిక్షం శుభదం చ దుఃఖం
జయం భయం రోగవినాశనం చ
ధరాభివృద్ధి ర్నృపతిశ్చ యుద్ధం
జనానురాగం సుఖదం చ సౌఖ్యమ్.

పాడ్యమి మొదలుగ 1. క్షామం 2 సుభిక్షం 3. శుభదం 4. దుఃఖం 5 జయం 6. భయం 7. రోగనాశనం 8 ధరాభివృద్ధి 9. నృపవృద్ధి 10. యుద్ధము 11. జనానురాగము 12. సుఖము 13. సౌఖ్యము.

శ్లో॥ భూతే వృష్టి ర్వినాశశ్చ పూర్ణేపూర్ణ ఫలప్రదం
అమాయాం సస్యనాశస్స్యా త్తిథీనాం ఫల మీదృశం॥

14. వర్షాభావము 15. పూర్ణశుభఫలములు 30, సస్యహానియు కలుగును.



—♦ వా ర ఫ ల ము లు. ♦—

శ్లో॥ పౌషే మృగేఽర్కే శనినాథయాయ
ప్రభాకృతా క్షత్రకుల క్షయాయ
బుధే ముధా యుద్ధ ముశంతి శేషా
గురౌ విరోధం స్వకులే ద్విమాసయోః
కుజేన దుఃఖం భవతి ప్రజానాం
భృగౌతు ధాన్యస్య మహార్ఘతాస్యాత్
యుగంధరీ మల్లమ సూర ధాన్యే
హిమా ద్వినాశశ్చణకోపి సోమే.

పౌషమాసమందలి మకర సంక్రాంతి ప్రవేశము శనివారమునాడైనచో భయోత్పాతములు. ఆదివారమునాడైనచో క్షత్రియకులనాశనము కలుగును. బుధవారమునాడైనచో నిష్ప్రయోజనముగా యుద్ధము చేయుట సంభవించును. గురువారమునాడైనచో రెండుమాసములవరకు స్వకులముల వారలతో విరోధము. సోమవారమునాడైనచో కాటికి పనికి వచ్చెడి కర్రలు, ఆవాలు, చిరుమినుములు, చిరుసెనగలు, శనగలు నల్లపెసలు మొదలగునవి. అధికమైన మంచువల్ల నష్టమగును. మంగళవారమగుచో ప్రజాదుఃఖము, శుక్రవారమగుచో వరిపంటకు హాని కలుగును.

శ్లో॥ సంక్రాంతిస్స్యా ద్యదా పౌషే రవివారేణ సంయుతా
ద్విగుణం ప్రోక్తమాధాన్యే మూల్య మాహు ర్మహాధియః
శనౌ త్రిగుణతామూల్యే మంగళేచ చతుర్గుణం
సమానం బుధ శుక్రాభ్యాం మూల్యార్థం గురుసోమయోః.

మకరసంక్రాంతి పుష్యమాసమునందు ఆదివారమునందగుచో ధాన్యాదుల ధరలు రెట్టింపగును. శనివారమునందగుచో మూడు రెట్లు ధరలు పెరుగును. మంగళవారమందైనచో నాలుగురెట్లు పెరుగును. బుధశుక్రవారములైనచో సరసమైన ధరలుగల్గియుండును, సోమగురువారములయినచో ధరలు చాల దిగక నిలబడియుండును.

శ్లో॥ తిలమాషకులుత్థాశ్చ గోధూమ శ్శాలి తండులాః
మకరస్థా ద్భానువారాత్ ప్రియంగుశ్చ మహార్ఘతా.

మకర సంక్రమణ ప్రవేశ వారము ఆదివారమగుచో నువ్వులకు మహా

ర్ఘము అనఁగా నువ్వులపంట తగ్గును. ధరలు పెరుగును. సోమవారమగుచో మినుముల పంటకు హాని. మంగళవారమగుచో ఉలవపంటకు హాని బుధవారమగుచో గోధుమపంటకు హాని. గురువారమగుచో ఆహారధాన్యములకు హాని. శుక్రవారమగుచో బియ్యమునకు హాని. శనివారమగుచో కొఱ్ఱపంటకు హాని.

“మూల్యే పూజా విధావర్ఘః” అర్ఘ శబ్దము వెలకును, పూజ చేయుటకును పేరు. “అర్హా తీత్యర్ఘః” అర్హా పూజాయాం అనగా పూజించుటకు తగినదని శబ్దార్థము. మహార్ఘము అనఁగా ధర పెరుగునని శబ్దార్థమగును.

శ్లో॥ మృగేఽర్కే కర్కి శీతాంశుః పాంసులానాం వినాశకః॥

మకరసంక్రాంతి ప్రవేశకాలమునకు చంద్రుడు కర్కాటకమునందున్నచో కులటస్త్రీలకు (వ్యభిచారస్త్రీలకు) హాని కలుగును. “స్వైరిణీ పాంసులా చ స్యాత్” ఇత్యమరః. “పాంసుః దుశ్చరితమస్యా అస్తీతి పాంసులా” అనఁగా దుశ్చరితముగల స్త్రీ. (అంకులాడి.)

శ్లో॥ క్షామం సుభిక్షం జగతోఽస్య దుఃఖం సువృష్టి రత్యంత సుఖం
మహార్ఘం। యుద్ధం నృపాణాం యది సంక్రమస్స్యాత్సూర్యాది
వారేషు ఫలం క్రమాత్స్యాత్.

సంక్రాంతి ఆదివార క్రమమున 1. క్షామము 2. సుభిక్షము 3. జగద్దుఃఖము 4. సువృష్టి 5. అత్యంత సుఖము 6. మహార్ఘము 7. రాజకీయ ఒడిదుడుకులు, రాజకీయ కలతలు, రాజయుద్ధము సంభవించును.

—♦ కాల ఫలములు. ♦—

శ్లో॥ పూర్వాహ్ణే నృపతిభయం మధ్యాహ్నే హంతి భూసురానఖిలాన్
అపరాహ్ణే వైశ్యగణం శూద్రానఖిలాన్ హంతి చాస్తమయే
రాత్రి చరాన్నిశి సమయే సంధ్యా సమయే పిశాచగణాన్
నటనర్తకానపరనిశి పశుపాన్నిఖిలాన్నిహంత్యుషసి
కేవల సంధ్యాసమయే లింగివ్రాతంచ నిఖిల సన్యాసీన్
శుభఫలదా సంక్రాంతి రనుక్తకాలే నృణాం సతతమ్॥

పూర్వాహ్ణకాలమున రాజులకు నాశము. మధ్యాహ్నకాలమున బ్రాహ్మణులకు హాని. అపరాహ్ణకాలమున వైశ్యులకు హాని. సాయంకాలమున శూద్రులకు హాని. రాత్రియందు రెండు జాములకు లోపుగానైనచో



రాత్రించరులకు అనగా చోరులు, రాక్షసులు, విటులు వీరలకు హాని. రాత్రి రెండుజాములు దాటిన కాలమునందైనచో నటులకు, నర్తన చేయువారికి నష్టము. ఉషఃకాలమునందగుచో పశువుల కాపర్లు, గొల్లవాండ్రకు నష్టము. సంధ్యాసమయే అనగా ప్రదోషకాలమందగుచో పిశాచాది గణమునకు నష్టము. కేవల సూర్యోదయాస్తసంధ్యాసమయమునందగుచో లింగివ్రాతమునకు అనగా మనుష్యాకారము మాత్ర ముండి జ్ఞానములేని శిశ్నోదర పరాయణులకు హాని. మరియు లింగధారులకు సన్యాసులకున్ను హానిని కలిగించును. మిగతా కాలములందనఁగా చెప్పబడనట్టి కాలమందగుచో శుభఫలములు కలుగును.

—♦ లగ్న ఫలములు. ♦—

శ్లో॥ జగత్ప్రమోదం సుఖదుఃఖలోలం పుంసఃప్రమోదం వ్యసనం స్త్రి
యస్తథా। జలప్లవాభూస్తు మహావనస్య చానర్ఘవాక్స్వాల్ప
సుఖం తథైవ। యుద్ధం నృపాణాం పరిపూర్ణధాత్రీ జనక్షయో
రోగసముద్భవ స్స్యాత్। మహార్ఘతా సంక్రమణం యదిస్యా
న్మేషాది లగ్న క్రమశః ఫలం స్యాత్.

మకర సంక్రాంతి మేషాదిలగ్నములం దగుచో మేషాది క్రమముగా ఫలములు:— 1. జగదానందం 2. సుఖదుఃఖాసక్తి (సంసారాసక్తి) 3. పురుషసంతోషము 4. స్త్రీచింత 5. జలప్రళయము (వనభంగము) 6. అనర్ఘవాక్కు (దుర్వార్తలు) 7. అల్పసుఖము 8. రాజయుద్ధము 9. భూమియందంతటను సుభిక్షక్షేమారోగ్యములు 10. ప్రజలు, పశువులు క్షయించును. 11. అనేక రోగోపద్రవములు 12. ధాన్యాదులకు మహార్ఘము యివి గలుగును.

—♦ ముహూర్త ఫలములు. ♦—

శ్లో॥ ముహూర్తం ప్రథమం యత్ర ప్రవేశో మధ్యమం ఫలమ్
ద్వితీయం శుభదం బ్రూయా త్తృతీయేతు మహార్ఘకృత్
చతుర్థే డాంబరం ప్రోక్తం పంచమేతు సువృష్టిదమ్

షష్ఠే. ముహూర్తే యుద్ధాని రోగాని వివిధానిచ
సప్తమే చార్ఘనాశం స్యాదష్టమే త్వీతితోభయమ్
నవమేవ్య యశస్సర్వం దశమే శోభనప్రదమ్
లయమేకాదశే ప్రోక్తం సుభిక్షం ద్వాదశస్తథా
త్రయోదశ ముహూర్తేతు జగదానంద వర్ధనమ్
చతుర్దశే పంచదశే మహార్ఘం రాజపీడనమ్
ముహూర్తే షోడశే యత్రి భయం రోగం వినిర్దిశేత్
తురగాశ్వగజాదీనాం హంతా సప్తదశే స్థితా.
అష్టాదశే మహాసౌఖ్యం శుభం త్వేకోన వింశతౌ॥
వింశత్యా విగ్రహం లోకే ఏకవింశేవ్య నిష్టదః
ద్వావింశే రాజనాశస్స్యాత్ త్రియోవింశతికే తథా
పశుహాని శ్చతుర్వింశే తత్వేచైవ గజక్షయః
షడ్వింశే జలనాశస్స్యా త్సర్వహా సప్తవింశతౌ॥
అష్టావింశ్యేకోన త్రింశే దుష్టం రాజ్యవినష్టదమ్
త్రింశన్ముహూర్తే శుభదం సుభిక్షం వ్యాధినాశనమ్.

మకర సంక్రాంతి ప్రవేశ ముహూర్తముల ఫలములు :—1. మధ్యమ ఫలం 2. శుభం 3. ధరలు పెరుగును 4. మోసము 5. సువృష్టి 6. యుద్ధం రోగములు 7, ధరలు తగ్గును. 8. ఈతిబాధలు 9. అపకీర్తి 10. శుభం 11. జనక్షయం 12. సుభిక్షం 13. జగదానందము 14. మహార్ఘం 15. రాజపీడనం 16. రోగభయాదులు 17. గుర్రములు, యేనుగులు మొదలగువానికి హాని 18. మహాసౌఖ్యం 19. శుభం 20. ప్రజాకలహములు 21. అనిష్ట ఫలములు 22, రాజనాశనము 23. రాజయుద్ధము, రాజ్యములకు హాని 24. పశువులకు హాని 25. గజాదులకు క్షయము 26. వర్షాభావము 27, సమస్తమునకు హాని 28. దుష్టం 29, రాజ్యనాశం 30. శుభదం, సుభిక్షం, ఆరోగ్యములు కలుగజేయును.

—♦ సంక్రాంతి సమయమున దానవస్తు నిర్ణయఫలములు. ♦—

శ్లో॥ విషువ త్యయనే గ్రహణే సంక్రాంతౌ పుణ్యదివసేవా
పితృతృప్తిం యో నకరోతి దత్వాశాపం వ్రజంతి తేఽస్య సదా॥



విషువత్సంక్రాంతులు మేష, తులా సంక్రమణములు, అయన సంక్రాంతులు, కటక, మకర సంక్రాంతులు, యీ నాల్గు సంక్రమణములుముఖ్యములు, ఇందులకు ";అజఘటసంక్రాంతిద్వయం విషువత్ప్రకీర్తితంనిత్యమ్। ద్వాదశసంక్రాంతీనాం చతుష్టయం తద్విశిష్టతమం। మృగకర్కట సంక్రాంతీహ్యుదగయనం దక్షిణాయనం చైవ" అను వసిష్ఠ సంహితా వచనము ప్రమాణము. మిగతా సంక్రాంతులు అంత ముఖ్యము గాకున్నను పుణ్యదములే యగును. ఆ యా సంక్రాంతికాలములందును, గ్రహణకాలములందును పితృదేవతల తృప్తికి స్నాన దాన శ్రాద్ధాదికముల నాచరింపఁదగును. అట్లుగ ప్రవర్తింపనిచో పితృదేవతలు శపింతురు. దానిచే వంశవృద్ధికి భంగము కలుగును.

శ్లో॥ ఆగత గత సమయేఽపిచ కరోతి దానం జపంచ హోమార్చా
ఊషరవాపిత బీజం యద్వత్తద్వచ్చ నిష్ఫలం భవత్యేవ॥

ఆయాకాలములకు ముందుగాగాని, ఆయాకాలములు దాటిపోయిన తరువాత గాని చేయబడు స్నాన, దాన, జప, హోమ, శ్రాద్ధాదులు, ఊసరక్షేత్రమందు నాటిన బీజము లెట్లు క్షయించుచున్నవో అటులనే నిష్ఫలములగుచున్నవి. కనుక ఆయా పుణ్యకాలారంభమునుండి పుణ్యకాలాంతమగు లోపల స్నానదానాదికము లాచరించిన సఫలములగునని భావము,

శ్లో॥ సంక్రాంతి పురుషోత్పత్తికాలే దానం స్వశక్తితః
ఫలం కాంస్యాది ధాన్యాది దీయతే దోషనాశనం॥

శ్లో॥ ఫలాని మూలాన్యజినం సువర్ణం గ్రామాంశు కాజ్యం సతిలేక్షు
గావః। ధాన్యం ఖరాంశో ర్మకర ప్రవేశే ఏతాని దానాని
విశేషకాని॥

శ్లో॥ యశ్శృణోతి మధు శుక్లపక్షకే వర్షనాథ సచివాదికం ఫలం
ప్రాప్నుయా ద్దురితముక్త విగ్రహ శ్చాయు రర్థ మతులం యశ
స్సుఖం॥

శ్లో॥ సంక్రాన్త్యు పరాగా దీనుక్త్వా పుణ్యాని కారయేద్యస్తు
తేషా మంశం దశమం నియమే నాప్నోతి దైవజ్ఞః॥

శ్లో॥ ఆయుర్వృద్ధిం పుత్రపౌత్రాభివృద్ధిం
నిత్యారోగ్యం మంగళం నిర్వ్యపాయమ్

విచ్ఛిన్నానా ముత్సవానా మవాప్తిం
యచ్ఛం త్యేతే వత్సరాధీశ ముఖ్యాః॥

## —♦ కందాయ నిర్ణయము. ♦—

ఖం=ఆకాశమందున్న నక్షత్రములు, దాయఫలం = ఇచ్చునట్టి ఫలం, "దాయం విభజనీయం" అని శబ్దోత్పత్తి. "ఖందాయఫలం"అనునది వాడుకలో "కందాయ ఫలం" అని మారెను. "కంసుఖేవ్యోమ్ని" అని యుండుటచే కం=సుఖమును, దాయం=ఇచ్చునట్టిది (విభజించునట్టిది). నక్షత్ర క్రమమున సుఖాసుఖములు ఆయా సంవత్సరములందెట్లుండునో తెలిసికొనుటకుగాను పూర్వులు కందాయఫలముల నేర్పరచియుందురు, సంవత్సరాదినాటి తిథి వార నక్షత్రయోగకరణముల సంఖ్యలో జన్మనక్షత్ర సంఖ్యను గూడి మూడుచోట్ల నునిచి గుణనహరణములు చేయగా వచ్చిన శేషములు కందాయము లనంబడును. అవి అశ్విన్యాధి నక్షత్రములకు వరుసగా మొదటి కందాయము ౧-౪-౭-౨-౫-౦-౩-౬ అనియు, రెండవ కందాయము ౧-౨-౦ అనియు, మూడవ కందాయము ౧-౪-౨-౦-౩ అనియు వచ్చుచుండును. ఇట్లు వచ్చునని పూర్వ సంవత్సర రేవతీనక్షత్ర కందాయశేషము పర సంవత్సర అశ్వనీ నక్షత్రమునకు ప్రారంభము కానేరదు. అశ్వనికి గణితమున వచ్చిన అంకెలమీదవరుసగానీయంకములువచ్చుటస్వభావము. కందాయములలో ౧ కందాయం(౭)మించిగాని, ౨కందాయం (౨) మించిగాని (౩)కందాయం (౪) మించి గాని యెన్నడు కలుగనేరవు. ఇవి నాలుగేసి మాసముల కొక్కొక్క యంకె ఫలము నిచ్చుచుండును, అనగా మొదటి కందాయము చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢమాసములందు ఫల మొసంగును. రెండవ కందాయము శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజ, కార్తికమాసములందు ఫల మొసంగును. మూడవ కందాయము మార్గశిర,పౌష,మాఘ ఫాల్గుణమాసములందు ఫల మొసంగును. అధికమాసమునందు వేరుగ కందాయము పుట్టదు. అధిక మాసము ఏ మాసమునందు కలుగునో ఆ నెలగల కందాయమునకు ఐదు నెలలు అధికారముగల్గియుండి ఫలమొసంగును. ఒక్కొక్క కందాయమునకు నాలుగు నెలల పేర్లు కావలసియున్నం



దున "అధిక, నిజ" అను విశేషణముల యావశ్యకము లేదనియైన తలంచుట దోషము కానేరదు.

సరి యంకెలుగల స్థానమునకుగల నాల్గు నెలలలో ఫలములన్నియు సమానముగ నడచును. బేసి యంకెలుగలిగిన స్థానమునకు చెప్పిన నాల్గు మాసములందు ధనలాభముండును. సున్నగల స్థానమునకు చెప్పిన నాల్గు మాసములు నిష్ఫలము. సున్నకు ప్రత్యేక ఫల మేమనఁగా మొదటి కందాయములో సున్నయున్నచో మహావ్యాధిగాని, భయముగాని కలుగును. రెండవ కందాయములో సున్నయున్నమనోవ్యథగాని, ఋణాధిక్యతగాని కలుగును. మూడవ కందాయమున సున్నయున్నచో ఫలము స్వల్పమని కొందరు. ధననాశమని కొందరు, హానిసంభవించుననికొందరు. దరిద్రము సంభవించునని కొందరు చెప్పుట గలదు. మూడు కందాయములందును సున్నలే వచ్చినవు డానక్షత్ర జాతకులు జీవించరని కొందరు. వారి కా సంవత్సరమునం దంతయు ఏ కార్యము చేయదలపెట్టినను నిష్ఫలమగునని కొందరు జెప్పుట గలదు.

ఈ కందాయములను చూచుటలో కొందరు నక్షత్రమునకు చెప్పబడిన మూడు కందాయములను మొత్తముచేసి చూడగా బేసి సంఖ్యయగుచో ధనలాభమనియు, సరిసంఖ్యయగుచో సమఫలమనియు చెప్పుచున్నారు. అట్లగుచో "శూన్యే శూన్యం విజానీయాత్" అను వాక్యముండుట కవకాశమే లేకపోవుచున్నది. కనుక మూడు కందాయములను కూడగా వచ్చిన మొత్తమును మూడింట పంచనగునని చెప్పవలెను. ఇట్లుగ చేయవలెననుటకు ప్రమాణ వచనము మృగ్యము. కందాయములలోని అంకులకు ప్రత్యేక ఫలము లుండవచ్చును. అట్టి ఫలములున్నచో విజ్ఞులు వివరముగా ప్రమాణ శ్లోకములతో తెలియజేయుదురని నమ్ముచున్నాను.

## —♦ కందాయములను కనుగొను పద్ధతి. ♦—

శ్లో॥ చైత్రాది తిథివారర్క్షం యోగం కరణ సంయుతం
జన్మనక్షత్ర సంయుక్తం ఇత్యేతే ధ్రువలక్షణం॥
గుణశైల పురా నిఘ్నం వసు వహ్ని శరైర్హృతం
లబ్ధం విమృశ్య తచ్ఛేషం కందాయత్రయ ముచ్యతే॥

సంవత్సరాదియందుగల తిథి వార నక్షత్ర యోగకరణముల సంఖ్యతో అనఁగా పాడ్యమి మొదలుకొని సంవత్సరాదినాటి తిథి సంఖ్య, ఆదివారము మొదలుగ సంవత్సరాదినాటి వార సంఖ్య, అశ్విన్యాదిగ సంవత్సరాదినాటికున్న నక్షత్ర సంఖ్య, విష్కంభాదిగ సంవత్సరాదినాటికున్న యోగ సంఖ్య, బవాదిగ సంవత్సరాదినాటికున్న కరణసంఖ్య వీటినన్నిటి మొత్తముచేసి, ఆ మొత్తముతో అశ్విన్యాదిగ ఎవరి జన్మ(నామ) నక్షత్రము ఎన్నవ సంఖ్యగల నక్షత్రమగునో ఆ సంఖ్యనుకూడా చేర్చగానైన మొత్తమును మూడు ప్రతులుగా పెట్టి అందు మొదటి ప్రతిని ౩ చే గుణించి ౮ చే భాగించవలెను. రెండవ ప్రతిని ౭ చే గుణించి ౩ చే భాగించవలెను. మూడవ ప్రతిని ౩ చే గుణించి ౫ చే భాగించవలెను. అట్లు భాగింపగా వచ్చు లబ్ధములను వదలి శేషసంఖ్యలను గ్రహించవలెను.

ఉదాహరణము :—

సర్వధారి సం॥ర చైత్ర శుక్ల పాడ్యమి శనివారమున, అశ్వినీ నక్షత్రము, వైధృతియోగము: కింస్తుఘ్న కరణము గలదు.

| | | |
|---|---|---|
| పాడ్యమి మొదలుకొని తిథి సంఖ్య | ... | ౧ |
| ఆదివారము మొదలుకొని వార సంఖ్య | ... | ౭ |
| అశ్విని మొదలుగ నక్షత్ర సంఖ్య | ... | ౧ |
| విష్కంభము మొదలుగ యోగసంఖ్య | ... | ౨౭ |
| బవ మొదలుగ కరణ సంఖ్య | ... | ౧౧ |
| మొత్తము | ... | ౪౭ |

ఇదియే సంవత్సర ధృవసంఖ్య.

సంవత్సరాది ధృవసంఖ్యయగు ౪౭ తో జన్మనక్షత్ర సంఖ్యను చేర్చవలయును జన్మనక్షత్రము అశ్విని యనుకొనుడు. జన్మనక్షత్ర సంఖ్య ౧ అగుచున్నది. దీనిని సంవత్సర ధృవముతో చేర్చగానైన మొత్తము ౪౮. దీనిని మూడుప్రతులుగా పెట్టవలయును.



| మొదటి ప్రతి. | రెండవ ప్రతి. | మూడవ ప్రతి. |
|---|---|---|
| ౪౮ | ౪౮ | ౪౮ |
| ౩ గుణకము | ౭ గుణకము | ౩ గుణకము. |
| ౮)౧౪౪(౧౮ | ౩) ౩౩౬(౧౧౨ | ౫)౧౪౪(౨౮ |
| ౮ | ౩ | ౧౦ |
| ౬౪ | ౩ | ౪౪ |
| ౬౪ | ౩ | ౪౦ |
| ౦ శేషము. | ౬ | ౪ శేషము. |
| | ౬ | |
| | ౦ శేషము. | |

శేషసంఖ్యలనే గ్రహించవలయును గనుక అశ్వినీనక్షత్రము వారికి మొదటి కందాయము సున్న, రెండవ కందాయము సున్న, మూడవ కందాయము ౪ అగును.

ప్రతి నక్షత్రమువారికి యిట్లు గణితముచేసి చూపుట కొలది ప్రయాసమైయున్నందువలన సులభముగా కందాయముల నేర్పరచుటకుగాను అశ్వనీ నక్షత్రమునకు వచ్చిన మూడు కందాయముల సంఖ్యలను చూచుకొని ఆ సంఖ్య తరువాత నగు సంఖ్యలతో భరణ్యాది రేవతీనక్షత్రములవరకు కందాయములను వ్రాయుటకుగాను పెద్దలు యీదిగువరీతిని కందాయ క్రమమున సంఖ్యలను నిరూపించియున్నారు. ఆయా కందాయ సంఖ్యలు నియతములై యున్నవి. ఎట్లనగా :—

శ్లో॥ చంద్రాబ్ధిశైలనేత్రాణి బాణా కాశాగ్ని శాస్త్రకం
చంద్రనేత్ర వియ చ్చంద్ర వేదలోచ నఖాగ్నికం
త్రిషు స్థానేషు సంయోజ్య కందాయజ ఫలం వదేత్॥

మొదటి కందాయ సంఖ్యాక్రమము ౧-౪-౭-౨-౫-౦-౩-౬ రెండవ కందాయ సంఖ్యాక్రమము ౧-౨-౦ మూడవ కందాయసంఖ్యాక్రమము ౧-౪-౨-౦-౩ యీ విధముగానున్న వాటిలో సంవత్సరాదినాటికి అశ్వనీ నక్షత్రము వారికి సాధించిన మూడు కందాయములలోని మొదటిసంఖ్యలను గుర్తించుకొని దాని తరువాత నున్న సంఖ్యలను భరణ్యాది నక్ష

త్రిములందు వ్రాయదగును. ఒక కందాయములోని సంఖ్యాక్రమము ముగియుటతోడనే మరల ఆ కందాయమునకు చెప్పబడిన మొదటి సంఖ్య వ్రాయవలయును. సర్వధారి సంవత్సర కందాయములు చూపబడుచున్నవి.

| అశ్వ | భ | కృ | రో | మృ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్రే | మ | పూఫ | ఉఫ | హ | చి | స్వా |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ |
| ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ |
| ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ |

| విశా | అనూ | జ్యే | మూ | పూషా | ఉషా | శ్రి | ధని | శత | పూభా | ఉభా | రే |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ |
| ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ |
| ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ |

### —♦ కందాయ ఫల వివేకము. ♦—

శ్లో॥ ఆది శూన్యే మహావ్యాధి (భీతి)
మధ్యశూన్యే మనోవ్యథా (ఋణాధికం)
అంత్యశూన్యేర్థనాశస్స్యాత్ (ఫలంస్వల్పం)(భవేద్ధానిః) (నిర్ధనం
త్రిశూన్యే నిష్ఫలం భవేత్ (తునజీవతి) (స్యాత్)

మొదట సున్నయున్నచో మహావ్యాధి (భయము). మధ్య సున్నయున్నచో మనోవ్యథ (ఋణాధికము). చివర సున్నయున్నచోఫలముస్వల్పము. (అర్థనాశము, హాని, దరిద్రము కలుగును). మూడుచోట్ల సున్నలే యున్నచో ఫలమే లేదు. (జీవించుటలేదు). ఫలమే లేదనిగాదు. ఏ పనిచేసినను నిష్ఫలనుగునని భావము. కాని "త్రిశూన్యే నిష్ఫలం భవేత్" అనుచోట "కందాయఫల మీరితం" అని పూర్వపాఠమున్నట్లు తెలియవచ్చుచున్నది.

కందాయ క్రమముగా సంఖ్యా నిర్ణయమున కొందరు అక్షర సంజ్ఞా క్రమమున వ్యవహరించుట గలదు, ఎట్లనిన :—



| మొదటి కందాయము. | రెండవ కందాయము. | మూడవ కందాయము. |
|---|---|---|
| అవసరమానగతా | పేరన. | కంభంరానాగా |
| ౧౪౭౨౫౦౩౬ | ౧౨౦ | ౧౪౨౦౩ |

"కాదిర్నవో, టాదినవో, పాతిపంచ, చయాష్టకమ్" అని అక్షరసంఖ్యా నిర్ణయం. ఈ విషయము యీ గ్రంథమునందే సంక్రాంతుల అర్ఘనిర్ణయమున చూపఁడెను. అచ్చోటనున్న వివరములు చూచుకొని ప్రవర్తించవలెను.

### —♦ కందాయ ఫల విశేషము. ♦—

శ్లో॥ విషమే వ్యర్థలాభస్స్యాత్సమేతు సమతా భవేత్
శూన్యేతు శూన్య మాప్నోతి కందాయఫల మీదృశం॥
శూన్యే శూన్య మవాప్నోతి కందాయస్య ఫలం విదుః
ఏకైకస్య చతుర్మాసం కందాయానాం ఫలం భవేత్॥

కందాయములను మూడింటిని మొత్తముజేసి 3 చే భాగించగా వచ్చు శేషసంఖ్య విషమ సంఖ్య (బేసిసంఖ్య) యగుచో అర్థలాభమున్ను, సరి సంఖ్యయగుచో సమఫలమున్ను, శేషసంఖ్య సున్నయగుచో నిష్ఫలము నగునని గ్రహించవలెను, ఇది సంవత్సరఫలము లేక ఒక్కొక్క కందాయములోని సంఖ్య బేసి సంఖ్య, సరి సంఖ్య, సున్నయైయున్నను ఇట్లే ఫలమగునని గ్రహించవలయును. ఈపక్షమున ఒక్కొక్క కందాయము నాలుగుమాసములవరకు ఫలమిచ్చును.

### —♦ ఆదాయ వ్యయ నిర్ణయ వివేకము. ♦—

సంవత్సరాధిపతియగు రాజునకు జన్మలగ్నాధిపతికిని గల ధ్రువకముల సంకలన హారణములవల్ల కలిగిన శేషములు ఆదాయవ్యయములు అగును. ఇందు సున్న యెన్నఁడును కలుగనేరదు. సంవత్సరమున కంతకును రాజు ఫలదాయకుడు గనుక ఆదాయవ్యయఫలములున్ను సంవత్స

రమునందంతటను ఒకే తీరున నుండును. మార్పుకలుగ నేరదు. ఆదాయ వ్యయములకు ఏకాధిపత్యములనియు పేరు, వీటివలన ఆదాయ వ్యయములే గాక రోగారోగ్యములు, సుఖదుఃఖములు, వృద్ధిహానులనుకూడ తెలిసికొనవచ్చును.

జన్మలగ్నాధిపతి తెలియనివారికికూడా ఉపకరించవలెననియే జన్మనక్షత్రరాశ్యధిపతిని (గోచార లగ్నాధిపతిని) గ్రహించుటకుగాను, జన్మనక్షత్రము ఉపయోగపడుచున్నది. జన్మనక్షత్రముకూడ లేనివారికి నామనక్షత్రమే గతి కావున ఆ నామనక్షత్ర మేదియో తద్రాశిని తదధిపతిని గ్రహించవలెను. జన్మ (నామ) నక్షత్రమువలన యేర్పడిన రాశిని పత్రిక్క వ్రాసిన ఆదాయము వ్యయముకన్న హెచ్చుగా నున్నచో ఆయేడు ఆదాయమెక్కువయనియు ఆదాయముకన్న వ్యయము హెచ్చుగా నున్నచో ఆయేడు ఆదాయమునకుమించిన ఖర్చుయుండుననియు తెలుసుకొనవలెను. ఆదాయ వ్యయ గణితములో పరమఫల భాగములు ౧౫ కావున ఆ ౧౫ భాగములలో ఆదాయము ఎన్నవపాలుగ నున్నది. వ్యయ మెన్నవపాలుగ నున్నది, చూచుకొనవలయును.

ఆదాయ వ్యయ గణితమున మన పంచాంగ కర్తలు అష్టోత్తరీ దశా పద్ధతిలో గ్రహముల కేర్పరచిన సంవత్సర సంఖ్యనే గ్రహించి ప్రవర్తించుచున్నారు. వింశోత్తరీ దశాపద్ధతిలో గ్రహములకు చెప్పబడిన సంవత్సర సంఖ్యను వదలుటకు కారణమేమియో తెలియ వచ్చుటలేదు. వింశోత్తరీ పద్ధతిలో చెప్పబడిన గ్రహసంఖ్యను వదలుటకు కారణము చెప్పదలచినవారున్నను వారు చెప్పునది, యుక్తిదూరము, శాస్త్రవిరుద్ధమగు దురాచారమునై యుండుననుట కెట్టి సందియములేదు. ఈ విషయమునుగూర్చి బాగుగా విచారణచేసియే పూర్వ సాంప్రదాయమును విడువలేనివారికి వీలుగ నుండునట్లును, అనాదిసిద్ధముగ, మన దేశమున వ్యవహరించుచుండెడి వింశోత్తరీ దశాపద్ధతిలో చెప్పబడిన గ్రహపరిమిత సంఖ్యను గ్రహించి సత్యమును వెల్లడింపవలెనని తలంచు అస్మదాదులకు సహకరించునట్లును రెండుపద్ధతులచే (అనగా అష్టోత్తరీ, వింశోత్తరీ పద్ధతులచే (ఆదాయ వ్యయ గణితములుచేసి చూపఁబడినవి. విజ్ఞులిందలి గుణదోషములను గ్రహించి దోషమున్న సహేతుకముగా



తెలియజేసిన సవరించుకొనదలచియే యింతగా వ్రాయబడినదని గ్రహించవలయును.

## ఆదాయ వ్యయ గణిత పద్ధతి.

శ్లో॥ స్వస్వామి వర్షాధిప వత్సరైక్యం
త్రిఘ్నంశరాఢ్యం తిథి భక్త శేషమ్
ఆయోఽథ లబ్ధిస్త్రి గుణాశరాఢ్యా
తిథ్యుద్ధృతా శేష మితో వ్యయస్స్యాత్॥

జన్మలగ్నాధిపతిగాని,జన్మనక్షత్ర రాశ్యధిపతిగాని,నామనక్షత్రరాశ్యధిపతిగాని ఎవరగుదురో అతడే స్వస్వామి యనబడును. స్వస్వామియగు గ్రహమునకును, సంవత్సరాధిపతి గ్రహమునకును చెప్పబడిన సంవత్సర సంఖ్యలను కూడి, దానిని ౩ చే గుణించగా వచ్చు మొత్తములో ౨ చేర్చి, దానిని ౧౫ చే భాగించగా వచ్చు శేషసంఖ్యయే ఆదాయసంఖ్య. లబ్ధమును మరల ౩ చే గుణించగా వచ్చు సంఖ్యలో ౫ చేర్చి, దానిని ౧౫ చే మరల భాగించగా వచ్చు శేషసంఖ్యయే వ్యయమును తెలియజేయు సంఖ్యయని గ్రహించవలయును.

## గ్రహసంఖ్యా నియమము.

శ్లో॥ ఆదిత్య షట్కం దశపంచ చంద్ర
భామాష్ట సంఖ్యా దశ సప్త సౌమ్యే
ఏకోన వింశ త్యమరాధి మంత్రీ
శుక్రైక వింశంచ శనిర్ద శైవ॥

రవికి ౬, చంద్రునకు ౧౫, కుజునకు ౮, బుధునకు ౧౭, గురునకు ౧౯, శుక్రునకు ౨౧, శనికి ౧౦ అని గ్రహములకు సంఖ్యా నియమముగావించియున్నారు. అబ్దాధిపతియొక్కయు, స్వస్వామియొక్కయు సంఖ్య. ఇట్లే గ్రహించవలసియున్నది. ఇయ్యది అష్టోత్తరీ దశాపద్ధతిలో చేరిన దనుటకు ప్రబలకారణము యీ దిగువ శ్లోకమువల్ల పాఠకులకు విశదమగుననెడి యాశయములో చూపఁబడుచున్నది.

—♦ అథాష్టోత్తరీ దశామాహ. ♦—

శ్లో॥ సూర్య శ్చంద్రః కుజః సౌమ్యః శని ర్జీవ స్తమోభృగుః
ఏతే దశాధిపాః ప్రోక్తా వినా కేతుం నవగ్రహాః
రసాః పంచేందవో నాగాః శైలచంద్ర నఖేందవః
గోబ్జాః సూర్యకునేత్రాశ్చ సమాః ప్రద్యోతనాదయః॥

—బృహత్పరాశర హోరాయాం పూర్వఖండే ౨౧౭ పుట,

అష్టోత్తరీ దశా పద్ధతి క్రమ మియ్యది యని బృహత్పరాశర హోరా సారాంశమను గ్రంథములో పూర్వఖండమున, అనేక దశాభేదకథనాధ్యాయమగు ౩౫ అధ్యాయములో ౨౧. ౨౨ శ్లోకములుగా పై శ్లోకములు వ్రాయబడియున్నవి. కనుక మన పంచాంగ కర్తలు ఆదాయ వ్యయములు, రాజపూజ్యావమానములను సాధించుపట్ల అష్టోత్తరీ దశా పద్ధతినే యవలంబించుచున్నా రనుట కింతకంటె ప్రబలకారణము వేరే చూపనక్కరయే లేదు. అష్టోత్తరీ దశాపద్ధతిలో రవి ౬ చంద్రునకు ౧౫ కుజునకు ౮ బుధునకు ౧౭ శనికి ౧౦ గురునకు ౧౯ రాహువునకు ౧౨ శుక్రునకు ౨౧ దశా పరిమిత వర్షములుగా చెప్పబడియున్నవి. అష్టోత్తరీ దశాపద్ధతిలో కేతువును వదలివేసిరి, మిగతా గ్రహములకుదశలుకల్పించబడెను. రాహువునకు చెప్పబడిన భాగమును వదలివైచినచో మన పంచాంగకర్తలు ఆదాయ వ్యయములందును, రాజపూజావమానములందును గ్రహించు సంఖ్యలయొక్క బండారము బయటపడుచున్నది.

మన పంచాంగకర్తలు మన దేశములో మిగులప్రచారమందున్న వింశోత్తరీ దశాపద్ధతిని ఆదాయ వ్యయములను, రాజపూజ్యావమానములను సాధింపక వదలుచున్నారని పాఠకులకు స్పష్టముగా తెలియుటకు వింశోత్తరీ దశాపద్ధతిలో గ్రహములకు చెప్పబడియున్న సంవత్సర సంఖ్యనుకూడా వ్రాసి చూపఁబడుచున్నది.

—♦ అథ వింశోత్తరీ దశామాహ. ♦—

శ్లో॥ ఆనయన ప్రకారంచ శృణుష్వ ద్విజపుంగవ
నామనక్షత్ర పర్యంత మాధారః కృత్తికాదితః॥



దహనా త్సర్క్ష పర్యంతం గణయే న్నవభిర్హ్రా రేత్
సూర్యేందు భూమ్యజ తమసో వాక్పతి ర్మంద చంద్రజా
కేతు శుక్రా క్రమా దేతే విజ్ఞేయాశ్చ దశాధిపాః॥
రసాశా ముని ధృత్యబ్దా భూపతి ర్ధృతి వత్సరాః
సప్తేం దవోనగా వ్యోమబాహవో భాస్కరాదితః॥

వింశోత్తరీ దశాపద్ధతిలో నవగ్రహములకు దశలు కల్పించి దశాపరిమిత సంవత్సరముల కూడా నిర్ణయింపఁబడెను. ఎట్లనిన :—రవికి ౬, చంద్రునకు ౧౦, కుజునకు ౭, రాహువునకు ౧౮, గురునకు ౧౬, శనికి ౧౯, బుధునకు ౧౭. కేతువునకు ౭, శుక్రునకు ౨౦ దశాపరిమిత సంవత్సరములుగా చెప్పబడియున్నవి. మన దేశమందు వింశోత్తరీదశా పద్ధతియే మిగుల ప్రచారము నందియుండెను. అట్టిదానిని త్రోసిపుచ్చి అష్టోత్తరీ పద్ధతి నవలంబించుటకు హేతువు కాన్పింపకున్నది కాని జాగ్రతగా ఆలోచించినచో గడ్డరికా ప్రవాహ న్యాయమున మన దేశ పంచాంగ కర్తలు ప్రవర్తించుచున్నటుల తెలియవచ్చుచున్నది, ఏలనన :—ఉత్తర హిందూస్థానమున అష్టోత్తరీదశా పద్ధతియు ప్రచారమునందుండెను. వారు వ్రాసిన గ్రంథములలో అష్టోత్తరీ దశాపద్ధతి ననుసరించియే ఆదాయ వ్యయములు సాధించవలసియున్నట్లు కానవచ్చుచున్నది. ఆ గ్రంథముల నాధారముగా గ్రహించియే మనవారును వ్రాయుట పరిపాటైనది. ఇట్టి స్థితి యేర్పడినందులకు చాల విచారము గలుగుచున్నది. ఉత్తరహిందూ దేశవాసులు తమచే వ్రాయబడిన గ్రంథములందుగాని, పంచాంగములందుగాని ఆ దేశమందున్న అష్టోత్తరీ పద్ధతిచే ఆదాయ వ్యయములను చూపుచున్నపుడు మన మేల మన దేశమున వాడుకలోనున్న వింశోత్తరీ పద్ధతిచే ఆదాయవ్యయములను చూపరాదు ? ఇందు దోషమేమియు లేదే ! పూర్వమునుండియు మన పంచాంగ కర్తలు అష్టోత్తరీ దశాపద్ధతి చేతనే ఆదాయ వ్యయములు వ్రాసి చూపుచున్నారు గనుక మేమున్ను అట్లే ప్రవర్తించుచున్నా మనుట న్యాయమేనా ? అట్లుగ వ్రాయుటయే అనాదిసిద్ధమైన యాచారమందురు గాబోలు ? శాస్త్రవిరుద్ధమైన ఆచారము దురాచారమగునే గాని సదాచార మెట్లగును ? మీదుమిక్కిలి మన పెద్దలు "యద్యపి శుద్ధం లోకవిరుద్ధం నాచరణీయం నాకలనీయం"

అన్నారు గదా! లోకములో మనము వింశోత్తరీదశా పద్ధతిచే జాతకములను వ్రాసి చూపుచు, తద్విరుద్ధముగా అష్టోత్తరీ పద్ధతి నవలంబించి ఆదాయ వ్యయ, రాజపూజ్యావమానములను పంచాంగములో వ్రాసి చూపుట, లోకవంచకము గాదా? "పర ప్రతారణేన పాండిత్యం" అను నార్యోక్తి ననుసరించి పంచాంగకర్తలు వ్యవహరించుట సమంజసము గాదని యిప్పటికైనా తెలిసికొని న్యాయముగురీతిని ప్రవర్తించుచు, తప్పు లున్న పెద్దల నడిగి తెలిసికొని సవరించుకొందురనెడి విశ్వాసముతో ఇంతగా వ్రాసి చూపఁబడినది. దోషములున్న తెలియజేయుచు గుణమునే గ్రహించి ప్రవర్తింపవలెనని విబుధులను వేడుచు యింతటితో యీ విషయము ముగింపఁబడినది:

ఈ క్రింది పట్టిక ననుసరించి సులభముగా ఏసంవత్సరమునకైనను ఆదాయ వ్యయములను గ్రహించవచ్చును. సంవత్సరాధిపతి (రాజ గ్రహము) ని తెలుసుకొన్న చాలును. రాజు ఎవరగుదురో ఆ గ్రహమునకు ఎదురగా ఆ సంవత్సరమున మేషాదిరాసులవారికి ఆదాయ వ్యయములు ఏవో చూచుకొని అట్లుగ పంచాంగమును చూడవచ్చును,



అష్టోత్తరీ పద్ధతిచే ఆదాయ వ్యయ నిర్ణయ చక్రము.

| రాజగ్రహములు (సంవత్సరాధిపతులు) | మేషవృశ్చిక రాసులవారికి | | వృషభతులా రాసులవారికి | | మిథునకన్యా రాసులవారికి | | కటకరాశి వారికి | | సింహరాశి వారికి | | ధనుర్మీన రాసులవారికి | | మకరకుంభ రా॥ వారికి | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఆదాయము | వ్యయం | ఆదాయము | వ్యయం | ఆదాయము | వ్యయం | ఆదాయము | వ్యయం | ఆదాయము | వ్యయం | ఆదాయము | వ్యయం | ఆదాయము | వ్యయం |
| రవి | ౨ | ౧౪ | ౧౧ | ౫ | ౧౪ | ౨ | ౮ | ౨ | ౧౧ | ౧౧ | ౫ | ౫ | ౮ | ౧౪ |
| చంద్రుడు | ౧౪ | ౨ | ౮ | ౧౧ | ౧౧ | ౮ | ౫ | ౮ | ౮ | ౨ | ౨ | ౧౧ | ౫ | ౫ |
| కుజుడు | ౮ | ౧౪ | ౨ | ౮ | ౫ | ౫ | ౧౪ | ౨ | ౨ | ౧౧ | ౧౧ | ౫ | ౧౪ | ౧౪ |
| బుధుడు | ౫ | ౫ | ౧౪ | ౧౧ | ౨ | ౧౧ | ౧౧ | ౮ | ౧౪ | ౨ | ౮ | ౧౧ | ౧౧ | ౫ |
| గురుడు | ౧౧ | ౫ | ౫ | ౧౪ | ౮ | ౧౧ | ౨ | ౧౧ | ౫ | ౫ | ౧౩ | ౧౧ | ౨ | ౮ |
| శుక్రుడు | ౨ | ౮ | ౧౧ | ౧౩ | ౧౩ | ౧౧ | ౮ | ౧౧ | ౧౧ | ౫ | ౫ | ౧౪ | ౮ | ౮ |
| శని | ౧౪ | ౧౪ | ౮ | ౮ | ౧౧ | ౫ | ౫ | ౫ | ౮ | ౧౪ | ౨ | ౮ | ౫ | ౨ |

## వింశోత్తరీ పద్ధతిచే ఆదాయ వ్యయ నిర్ణయ చక్రము.

| రాజ గ్రహములు (సంవత్సరాధిపతులు.) | మేషవృశ్చిక రాసులవారికి | | వృషభ తులా రాసులవారికి | | మిథున కన్యా రాసులవారికి | | కటక రాశి వారికి | | సింహరాశి వారికి | | ధనుస్సుమీన రాసులవారికి | | మకరకుంభ రాసులవారికి | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఆదాయము | వ్యయం | ఆదాయము | వ్యయం | ఆదాయము | వ్యయం | ఆదాయము | వ్యయం | ఆదాయము | వ్యయం | ఆదాయము | వ్యయం | ఆదాయము | వ్యయం |
| రవి | ౧౪ | ౧౧ | ౮ | ౫ | ౧౪ | ౨ | ౮ | ౧౪ | ౧౧ | ౧౧ | ౧౧ | ౨ | ౫ | ౫ |
| చంద్రుడు | ౧౧ | ౧౪ | ౫ | ౮ | ౧౧ | ౫ | ౫ | ౨ | ౮ | ౧౪ | ౮ | ౫ | ౨ | ౮ |
| కుజుడు | ౨ | ౧౪ | ౧౧ | ౫ | ౨ | ౫ | ౧౧ | ౧౪ | ౧౪ | ౧౧ | ౧౪ | ౨ | ౮ | ౫ |
| బుధుడు | ౨ | ౫ | ౧౧ | ౮ | ౨ | ౧౧ | ౧౧ | ౫ | ౧౪ | ౨ | ౧౪ | ౮ | ౮ | ౩ |
| గురుడు | ౧౪ | ౨ | ౮ | ౧౧ | ౧౪ | ౮ | ౮ | ౫ | ౧౧ | ౨ | ౧౧ | ౮ | ౫ | ౧౧ |
| శుక్రుడు | ౧౧ | ౫ | ౫ | ౧౪ | ౧౧ | ౧౧ | ౫ | ౮ | ౮ | ౫ | ౮ | ౧౧ | ౨ | ౧౪ |
| శని | ౮ | ౫ | ౨ | ౧౪ | ౮ | ౧౧ | ౨ | ౮ | ౫ | ౫ | ౫ | ౧౧ | ౧౪ | ౧౧ |

(36)

## అష్టోత్తరీ పద్ధతిచే రాజపూజ్యావమాన నిర్ణయ చక్రము.



| మేషాది రాసులవారికి | రాజు రవి యైనపుడు | | రాజు చంద్రుడైనపుడు | | రాజు కుజుడైనపుడు | | రాజు బుధుడైనపుడు | | రాజు గురుడైనపుడు | | రాజు శుక్రుడైనపుడు | | రాజు శని యైనపుడు | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | పూజ | అవ | పూజ | అవ | పూజ | అవ | పూజ | అవ | పూజ | అవ | పూజ | అవ | పూజ | అవ |
| మేషము | ౫ | ౬ | ౪ | ౫ | ౪ | ౩ | ౩ | ౧ | ౨ | ౪ | ౧ | ౬ | ౩ | ౭ |
| వృషభము | ౧ | ౩ | ౬ | ౫ | ౬ | ౩ | ౭ | ౧ | ౫ | ౪ | ౪ | ౬ | ౭ | ౭ |
| మిథునము | ౪ | ౩ | ౩ | ౧ | ౩ | ౭ | ౨ | ౪ | ౧ | ౬ | ౬ | ౬ | ౨ | ౨ |
| కటకము | ౬ | ౩ | ౭ | ౧ | ౭ | ౭ | ౫ | ౪ | ౪ | ౬ | ౩ | ౩ | ౫ | ౨ |
| సింహము | ౩ | ౭ | ౨ | ౪ | ౨ | ౨ | ౧ | ౬ | ౬ | ౬ | ౭ | ౩ | ౧ | ౫ |
| కన్యా | ౭ | ౭ | ౫ | ౪ | ౫ | ౨ | ౪ | ౬ | ౩ | ౩ | ౨ | ౭ | ౪ | ౫ |
| తులా | ౨ | ౨ | ౧ | ౬ | ౧ | ౫ | ౬ | ౬ | ౭ | ౩ | ౫ | ౭ | ౬ | ౫ |
| వృశ్చికము | ౫ | ౨ | ౪ | ౬ | ౪ | ౫ | ౩ | ౩ | ౨ | ౭ | ౧ | ౨ | ౩ | ౧ |
| ధనుస్సు | ౧ | ౫ | ౬ | ౬ | ౬ | ౫ | ౭ | ౩ | ౫ | ౭ | ౪ | ౨ | ౭ | ౧ |
| మకరము | ౪ | ౫ | ౩ | ౩ | ౩ | ౧ | ౨ | ౭ | ౧ | ౨ | ౬ | ౨ | ౨ | ౪ |
| కుంభము | ౬ | ౫ | ౭ | ౩ | ౭ | ౧ | ౫ | ౭ | ౪ | ౨ | ౩ | ౫ | ౫ | ౪ |
| మీనము | ౩ | ౧ | ౨ | ౭ | ౨ | ౪ | ౧ | ౨ | ౬ | ౨ | ౭ | ౫ | ౧ | ౬ |

రాజపూజావమానములను కూడా సంవత్సరాధిపతి ఏ గ్రహమో తెలిసికొన్న చాలును. ఆ గ్రహమున్న బుజా రేఖలందు మేషాది క్రమముగా వ్రాయ బడియున్న రాజపూజావమానములు కానవచ్చును. వీటినే పంచాంగమునందును వ్రాసికొనవచ్చును. గణితము చేయవలసిన పనియే లేదు.

వింశోత్తరీ పద్ధతిచే రాజపూజావమాన నిర్ణయ చక్రము.

| మేషాదిరాసులవారికి | రవిరా జైనపుడు | | చంద్రుడు రాజుగా నున్నపుడు | | కుజుడు రాజైనపుడు | | బుధుడు రాజైనపుడు | | గురుడు రాజైనపుడు | | శుక్రుడు రాజైనపుడు | | శనిరా జైనపుడు | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | పూజ | అవ | పూజ | అవ | పూజ | అవ | పూజ | అవ | పూజ | అవ | పూజ | అవ | పూజ | అవ |
| మేషము | ౭ | ౪ | ౩ | ౨ | ౬ | ౩ | ౩ | ౬ | ౪ | ౭ | ౭ | ౫ | ౧ | ౫ |
| వృషభము | ౬ | ౩ | ౨ | ౨ | ౫ | ౩ | ౨ | ౬ | ౩ | ౬ | ౬ | ౪ | ౭ | ౫ |
| మిథునము | ౫ | ౩ | ౧ | ౧ | ౪ | ౩ | ౧ | ౫ | ౨ | ౬ | ౫ | ౪ | ౬ | ౪ |
| కటకము | ౪ | ౩ | ౭ | ౧ | ౩ | ౨ | ౭ | ౫ | ౧ | ౫ | ౪ | ౪ | ౫ | ౪ |
| సింహము | ౩ | ౨ | ౬ | ౭ | ౨ | ౨ | ౬ | ౪ | ౭ | ౫ | ౩ | ౩ | ౪ | ౪ |
| కన్యా | ౨ | ౨ | ౫ | ౭ | ౧ | ౧ | ౫ | ౪ | ౬ | ౪ | ౨ | ౩ | ౩ | ౩ |
| తులా | ౧ | ౧ | ౪ | ౭ | ౭ | ౧ | ౪ | ౪ | ౫ | ౪ | ౧ | ౨ | ౨ | ౩ |
| వృశ్చికము | ౭ | ౧ | ౩ | ౬ | ౬ | ౭ | ౩ | ౩ | ౪ | ౪ | ౭ | ౨ | ౧ | ౨ |
| ధనుస్సు | ౬ | ౭ | ౨ | ౬ | ౫ | ౭ | ౨ | ౩ | ౩ | ౩ | ౬ | ౧ | ౭ | ౨ |
| మకరము | ౫ | ౭ | ౧ | ౫ | ౪ | ౭ | ౧ | ౨ | ౨ | ౩ | ౫ | ౧ | ౬ | ౧ |
| కుంభము | ౪ | ౭ | ౭ | ౫ | ౩ | ౬ | ౭ | ౨ | ౧ | ౨ | ౪ | ౧ | ౫ | ౧ |
| మీనము | ౩ | ౬ | ౬ | ౪ | ౨ | ౬ | ౬ | ౧ | ౭ | ౨ | ౩ | ౬ | ౪ | ౧ |



## —♦ ఆదాయ వ్యయ ఫల విశేషము. ♦—

ఉభయ లాభ వ్యయ చక్రా ద్విశేష విచారః.

శ్లో॥ రోగారోగ్యే వృద్ధిహీనే ధనాగమన నాశనే
మేషా ద్యేకాధిపత్యేతు నిర్ణేయ మితిసూరిభిః॥

ఆదాయ వ్యయములకు ఏకాధిపత్య ఫలములని పేరు. వీటివలన ఆదాయ వ్యయములే గాక రోగారోగ్యములు, వృద్ధిహానులు తెలియును.

శ్లో॥ లాభవ్యయౌ సమౌ కృత్వా ఏకసంఖ్యాంతు యోజయేత్
అష్టభిస్తు హరే ద్భాగం శేషాంకే ఫలమాదిశేత్
లాభం సౌఖ్యం తథా క్లేశం రోగం లోకాపవాదకం
సన్మానం విజయం హానిం కథితం పూర్వసూరిభిః॥

ఆదాయ వ్యయములను రెంటిని కలిపి రెండుచే భాగించగా వచ్చిన సంఖ్యలో ఒకటి చేర్చి ఆ మొత్తమును ఎనిమిదిచే భాగించగా వచ్చు శేషము (1) లాభం (2) సౌఖ్యం (3) క్లేశం (4) రోగం (5) లోకాపవాద (6) సన్మానం (7) విజయం (8) హాని కలుగును. సున్న శేషము వచ్చినపుడు ఎనిమిదిగా భావించవలెనే గాని సున్నగా భావించరాదు. ఒకవేళ సున్నగా భావించినను 8 వ శేషసంఖ్యకు చెప్పఁబడిన ఫలమునే గ్రహించవలసియుండును.

అన్యదపి :—ఉభయ లాభాంకైక్యం లాభః
వ్యయైక్యంచ వ్యయ మితి విచార్య
తత్రవిభాగే౽oకాధికం
తత్ఫల మప్యధికం జ్ఞేయమ్॥

## —♦ సంవత్సర ఫల నిర్ణయము. ♦—

సంవత్సరాది తిథి వార నక్షత్ర యోగకరణములలో అశ్విన్యాది జన్మ లేక నామనక్షత్ర సంఖ్యనుకూడి ౭ చే భాగించగా వచ్చు శేషక్రమమున ఫలములు కలుగును. ఇందు అభిజిత్తునకును ఫలము కలుగును. ఇందు అభిజిత్తునకును ఫలము చెప్పబడెను. ఇదియును

కందాయ ఫలమువంటిదే గాని స్థూలఫలమును చూపునదై యున్నది. కందాయము దీనికన్న సూక్ష్మఫలమును తెలియజేయునదై యున్నది. ఏలనన, సంవత్సరఫలము ఏ నక్షత్రమున జన్మించినవారికైనను ఆ సంవత్సరమంతయు అదే ఫలము కలుగునని బోధించుచున్నది. కందాయఫలమైనచో నాలుగేసి మాసములకు ఫలమందు మార్పును సూచించుచున్నది.

శ్లో॥ చైత్రాది తిథివారర్క్ష యోగం కరణసంయుతం
జన్మనక్షత్ర సంయుక్తం ఇత్యేతే ధ్రువలక్షణం॥

శ్లో॥ అబ్దాది ధ్రువజన్మర్క్ష యుక్త స్సప్తవిభాజితా
అర్థలాభం మనస్తాపం రాజమాన్యంచ యుద్ధతః
భూషణం రోగ మాయుష్యం సంవత్సరఫలం స్మృతమ్॥
(ఏవం వర్షఫలం స్మృతం)

శేషసంఖ్యాక్రమమున సంవత్సర ఫలములు :—(1) అర్థలాభం (2) మనస్తాపం (3) రాజపూజ్యత (4) యుద్ధము (కలహము) (5) భూషణం (అలంకార ప్రాప్తి) (6) రోగము (7) ఆయుష్యము కలుగును.

## —♦ అగస్త్యాస్తమయోదయములు. ♦—

శ్లో॥ అగస్త్యాస్తమయం ప్రాహు స్సప్తశైలై ర్మనీషిణః
ఉదయం గిరినందైశ్చస్ఫుట సూర్య సమాంశకైః
స్వదేశాత్ ప్రభాష్టఘ్నా హీనయుక్తా తదంశకైః
అగస్త్యాస్తమయోంశా స్స్యురుదయాంశాస్స్వ దేశజాః॥
—గణకానందే.

శ్లో॥ అష్టాహతాత్ పళభయో వయుక్తాః
కరిమా న్మతంగాద్రిభి రష్టనందైః
లవైః సమే సంప్రతి తీక్ష్ణభానా
వస్తోదయా గచ్ఛతి కుంభజన్మా॥
—కరణరత్నే.

గణకానంద రీతిచే :—అగస్త్యాస్తమయము స్ఫుటసూర్యుడు ౭౮ భాగలుగా నున్నపు డగుచున్నదనియు, స్ఫుటసూర్యుడు ౯౮ భాగలుగా నున్నపుడు అగస్త్యు డుదయించుచున్నాడనియు స్థూలముగా చెప్పెను. అగస్త్యాస్తమయములు స్పష్టముగా తెలిసికొనవలెనన్నచో స్వదేశ విషువచ్ఛాయాంగుళ వియంగుళములను ౮ చే గుణించగా వచ్చు లిప్తాదికమును అగస్త్యాస్తమయ ధ్రువమున తీసివేయవలెననియు అగస్త్యోదయమున చేర్చవలెననియు సంస్కారము చెప్పెను. అట్టి సంస్కారము చేసినచో అగస్త్యాస్తమయోదయ స్ఫుటకాలము వచ్చును. అట్టి స్ఫుటకాలమును సూర్యస్ఫుటము ననుసరించి ఘటికాదినిసాధింపగా అగస్త్యోదయాస్తమయకాల స్పష్ట ఘటికాదికము వచ్చును.

కరణరత్నగ్రంథము ననుసరించి అగస్త్యాస్తమయకాల ధ్రువము ౭౮ భాగలుగను, ఉదయ ధ్రువము ౯౮ భాగలుగను చెప్పెను. దేశాంతర సంస్కారమునకు స్వదేశ విషువచ్ఛాయాంగుళ వియంగుళములను ౮ చే గుణించగా వచ్చునదై యున్నదని చెప్పెను. అగస్త్యాస్తమయ ధ్రువములో దేశాంతరముగా వచ్చిన లిప్తాదిఫలమును తీసివేయవలెననియు, అగస్త్యోదయధ్రువములో చేర్చవలెననియు చెప్పెను. అట్లు చేయగా వచ్చు స్ఫుటధ్రువములకు సమానముగా సూర్యుడు సంచరించుచున్న కాలములో అగస్త్యులవారికి అస్తోదయములు సంభవించుచున్నవని చెప్పబడెను.

ఉదాహరణము :—బందరునకు విషువచ్ఛాయాంగుళాదికము 3-౨౬-౨౪ కరణరత్నము ననుసరించి చూపఁబడుచున్నది.

3-౨౬-౨౪
౮
———
౨౭-౩౧-౧౨ దేశాంతరం భాగాదికం.
———

అగస్త్యాస్తమయధ్రువమురాశ్యాది ౨-౧౮-౦-౦ దేశాంతర భాగాదికం
౦-౨౭-౩౧-౧౨
———
అగస్త్యాస్తమయస్ఫుటధ్రువము ౧-౨౦-౨౮-౪౮
———

అగస్త్యోదయధ్రువము రాశ్యాది ౯-౮-౦-౦
౨౭-౩౧-౧౨ దేశాం॥ భాగాదికం.

అగస్త్యోదయస్ఫుటధ్రువము ౪-౫-౩౧-౧౨

స్ఫుటసూర్యుడు అగస్త్యాస్తమయస్ఫుటధ్రువాసన్నుడైన కాలమునకును, అగస్త్యోదయ స్ఫుట ధ్రువాసన్నుడైన కాలమునకు ఘటికాదిని సాధించగా అగస్త్యాస్తోదయకాలములు వచ్చును.
గణకానంద రీతిచే అగస్త్యాస్తమయ ధ్రువము రాశ్యాది ౬-౧౭-౦-౦
౦-౨౭-౩౧-౧౨

అగస్త్యాస్తమయస్ఫుటధ్రువము ౧-౧౯-౨౮-౪౮ దేశాంతరం.

అగస్త్యోదయధ్రువమురాశ్యాది ౩-౭-౦-౦
౦-౨౭-౩౧-౧౨ దేశాంతరం

అగస్త్యోదయస్ఫుటధ్రువము ౪-౪-౩౧-౧౨

—♦ అగస్త్య ఉదయాస్తమయ ఫలములు. ♦—

శ్లో॥ రాత్రా వుదయం శ్రేష్ఠం నేష్టశ్చాస్తంగమో మునేః
దివసేఽస్తంగమః శ్రేష్ఠో నేష్టశ్చాభ్యుదయ స్తథా
యద్యుదేతి దినే ప్రాప్తే కుంభజో మునిపుంగవః
దుర్భిక్షం కారవం ఘోరం రాష్ట్రభంగం తదాదిశేత్॥

రాత్రియం దుదయించుట మంచిది. అస్తమించుట మంచిదికాదు. పగటియం దస్తమించుట మంచిది. ఉదయించుట మంచిదికాదు. అగస్త్యుడు పగటికాలమం దుదయించిన దుర్భిక్షము. ఘోరవిపత్తులు, రాజకీయ కల్లోలములు, రాష్ట్రభంగము కలుగును,

శ్లో॥ రవౌవా పూర్వఫల్గున్యాం ప్రాప్తేచైవాష్టమేఽహని
అగస్త్యస్యోదయోలోకేన శుభాయ క్వచిన్మతే॥

రవి పూర్వఫల్గునియందు ప్రవేశించినది లగాయతు ఎనిమిదవ రోజున అగస్త్యు డుదయించినచో మంచిదికాదు.



శ్లో॥ కృత్తికాయాం రవౌ జాతే సప్తమేవాష్టమేఽహని
ఋషేరస్తంగతిః శ్రేష్ఠా దివసే యది జాయతే॥

సూర్యుడు కృత్తికానక్షత్రమున ప్రవేశించిన ౭వ రోజునగాని, ౮వ రోజున గాని అగస్త్యులకు పగటికాలమునం దస్తమయము సంభవించిన శుభమే కలుగును.

శ్లో॥ యద్యగస్త్యోదయే వారే వర్షా హర్షాయ జాయతే
సర్వధాన్యస్య నిష్పత్తి ర్నచే ద్భిక్షాపి దుర్లభా।

అగస్త్యు డుదయించు రోజున వర్షము కురిసిన సంతోషమును కలుగజేయును. సమస్త సస్యములు బాగుగా ఫలించును. సర్వధాన్యములకు వృద్ధియు, పశువులకు వృద్ధియుండును. వర్షము కురియకయున్నచో భిక్షమెత్తుకొన్నను ధాన్యము లభించదు. అనగా దుర్భిక్షభయము. సస్యహాని. ప్రజాక్షయముండునని భావము.

—♦ నదీపుష్కరకాల నిర్ణయము. ♦—

శ్లో॥ మేషే గంగా వృషే రేవా మిథునేతు సరస్వతీ
కర్కటే యమునాప్రోక్తా సింహే గోదావరీస్మృతా
కన్యాయాం కృష్ణవేణీచ కావేరీ ధటకే స్మృతా
వృశ్చికే తామ్రపర్ణీచ చాపే పుష్కరవాహినీ
మకరే తుంగభద్రాచ కుంభే సింధునదీస్మృతా
మీనే ప్రణీతానదీచ గురో స్సంక్రమణే స్మృతా
పుష్కరాఖ్యో మునీనాంహి ప్రవేశోఽత్ర బుధై స్స్మృతః॥

ఈ శ్లోకమునందు కొన్నిచోట్ల పాఠక్రమము సరిగా లేనందున పాఠకుల సౌకర్యార్థము తాత్పర్యము వ్రాయవలసియున్నను వ్రాయక వదలివేయబడెను. సరియైన పాఠము లభించినపుడు తాత్పర్యము వ్రాయబడును.

—♦ చాంద్రమానార్ఘ్య నిర్ణయ విశేషములు. ♦—

శ్లో॥ యమేంద్రాహికతోయేశ మారుతా నక్షత్రారకా
ధ్రువాదితిద్విదైవత్య మత్యర్ఘాశ్చ వరాస్సమాః॥

—నిర్ణయ కౌముద్యాం.

భరణి, జ్యేష్ఠ, ఆశ్లేష, ఆర్ద్ర, శతతార, స్వాతీనక్షత్రములందు చంద్రోదయమగుచో శూన్యార్ఘ్యమనియు, ఉత్తరాత్రయం, రోహిణి, పునర్వసు

విశాఖ నక్షత్రములయందు చంద్రు డుదయించినచో అత్యర్ఘమనియు, కృత్తిక, మృగశిర, పుష్యమి, మఖ, పూర్వాత్రియం, హస్త, చిత్ర, అనూరాధ, మూల, శ్రవణం, ధనిష్ఠ, రేవతి, అశ్వనీనక్షత్రములం దుదయించినచో సమార్ఘమనియు చెప్పవలెను.

## గ్రహచారప్రకరణము.

### —♦ గురురాశిచారఫలములు. ♦—

శ్లో॥ మేషస్థితే దేవగురౌచ మేషవినాశనం సస్యమహార్ఘవృద్ధిః
భూపాలకానాం కలహ స్తథాపి భవంతిచాన్యే సుఖినోజనాశ్చ॥
—దైవజ్ఞ విలాసే.

శ్లో॥ మేషరాశిగతే జీవేత్వతి ర్మేష వినాశనమ్
సస్యవృద్ధిః ప్రజారోగ్యం వృష్టిః కర్షకసమ్మతా॥
—నారదః జ్యోతిర్నిబంధే.

శ్లో॥ మేషగతే సురసచివే మేష వినాశో భవే దచిరాత్
అతులిత సస్యసమృద్ధిః క్షితిపతికలహః ప్రజాసు తేక్షోభః॥
—వసిష్ఠః.

మేషమందు గురుడున్నచో మేకలు, గొఱ్ఱెలు నశించును. సస్యవృద్ధి, అర్ఘవృద్ధి, ప్రజారోగ్యం. సస్యానుకూలవర్షములుండును. దేశభేదమున ఈతిబాధలు, రాజకలహము, ప్రజాక్షోభ యుండును.

శ్లో॥ వృషరాశిగతే జీవే శిశూ స్త్రీ పశునాశనం
మధ్యవృష్టి స్సస్యహాని ర్నృపాణాం సమరం మహత్॥

వృషభమందు గురుడున్నచో శిశువులు, స్త్రీలు, పశువులకుహాని. మధ్యవృష్టి, సస్యహాని, రాజయుద్ధము కలుగజేయును. "మధ్యమ సస్యార్ఘదా ధరణీ" మధ్యమ సస్యార్ఘలను కలుగజేయును.

శ్లో॥ కలహరతా క్షితిపతయో వారిధరాశ్చాపి కుత్రచిజ్జలదాః
సస్యానాం భవతిభయంత్వాంగి రసే మిథునరాశిస్థే॥ —వసిష్ఠః.

మిథునమందు గురుడున్నచో రాజులు యుద్ధనిరతులగుదురు. మేఘములు దేశభేదమున వర్షాధిక్యమొసంగును. సస్యములు మధ్యమఫలదములు. ఈతిబాధలు, భయోత్పాతములు కలుగజేయును.



శ్లో॥ ప్రభూత పయసో గావః సుజనాః సుఖినః స్త్రియః
మదోద్ధతాః కర్కిణీజ్యే సస్యవృష్టి యుతా ధరా॥
—జ్యోతిర్నిబంధే.

కటకమునందు గురుడున్నచో ఆవులు చక్కగా పాలొసంగును. సుజనులు సుఖింతురు. స్త్రీలు మదించియుందురు. సస్యసమృద్ధి, సువృష్టి యుండును.

శ్లో॥ విలయం యాంత్యవనీశాః సంయతి సుజనావనీ సురానిస్వాః
అనుపమవృష్టిభి రఖిలం ధరాతలం వారిపూరితం హరిగే॥
—వసిష్ఠః.

శ్లో॥ సింహారాశిగతే జీవేనిస్స్వా భూసురసజ్జనాః
అతివృష్టి ర్వ్యాధిభయం నృపా యుద్ధే లయం యయుః॥
— జ్యోతిర్నిబంధే.

సింహమందు గురు డున్నచో రాజులు, సజ్జనులు, బ్రాహ్మణులు దరిద్రులగుదురు. అత్యధిక వర్షములు, వ్యాధులు కలుగును. రాజులు యుద్ధమునందు నశించెదరు.

శ్లో॥ జీవే కన్యాగతే పుష్టావృష్టిః స్వస్థాః క్షితీశ్వరాః
మహోత్సుకాః క్షితిసురాః స్వస్థాస్స్యు ర్నిఖిలాజనాః॥

కన్యయందు గురుడున్నచో సువృష్టి, రాజులకు స్వాస్థ్యము, బ్రాహ్మణులు కర్మనిరతులై యుందురు. ప్రజలు సుఖసౌఖ్యముల ననుభవించెదరు.

శ్లో॥ జీవే తులాగతే సర్వం ధాతుమూలా కులం జగత్
తథాపి ధాత్రీ సంకీర్ణా ధనధాన్య సువృష్టిభిః॥—జ్యోతిర్నిబంధే.

శ్లో॥ తులయోద్ధతవస్తుచయం దుర్లభ మఖిలం తులాగతేంగిరసి
సులభం త్వితరద్రవ్యం తూత్తమ సస్యార్ఘవృద్ధిస్స్యాత్॥
—వసిష్ఠః.

తులయందు గురుడున్నచో రాగి, యిత్తడి మొదలగు ధాతువులకు ధరలు పెరుగును. సువృష్టి, ధాన్యముల పంట విశేషముగా నుండును.

శ్లో॥ మదోద్ధతానాం భూపానాం యుద్ధే జనపదక్షయః
అతులా వృష్టిరత్యుగ్రం డామరం కీటగే గురౌ॥
—జ్యోతిర్నిబంధే.

శ్లో॥ సర్వేపి వర్ణా సుఖినోభవంతినాశం గతా స్సంకరజాతయస్యుః
—దైవజ్ఞవిలాసే.

శ్లో॥ వృశ్చికరాశౌ జీవే సర్వే సుఖినోఽంత్యజాతివిలయస్స్యాత్ ॥
—వసిష్ఠః.

గర్వముగల రాజులకు యుద్ధముగలిగి పల్లెటూరులు నశించును. వృశ్చికమునందు గురుడున్నచో సంకరజాతివారు, మ్లేచ్ఛులు, నశించుదురు. అతివర్షములచే పంటలు చెడి కరవు గలుగును.

శ్లో॥ సంకరశబర నిశాచర నిధనం సుఖినః పరే గురౌ ధనుషి
అచలాచల సదశాంబుద నికరైః సంపూర్ణవారిణ యీ॥
—వసిష్ఠః.

శ్లో॥ జీవే చాపగతే భీతి రీతి ర్భూపావహం మహత్
అతులా వృష్టిరత్యుగ్రా పీడానిస్స్యాః క్షితీశ్వరాః॥
—జ్యోతిర్నిబంధే.

ధనుస్సునందు గురుడున్నచో సంకరజాతివారు, ఆటవికజనులు, దొంగలు నశించుదురు, వర్షములు చక్కగా పడును. రాజులకు యుద్ధము, ఈతిబాధలు, రాజులు దరిద్రులగుదురు. ప్రజాపీడ గలుగును.

శ్లో॥ అశత్రవోజనా ధాత్రీ పూర్ణా సస్యార్ఘ వృష్టిభిః
వీతరోగభయా స్సర్వే మకరస్థే సురార్చితే॥
—జ్యోతిర్నిబంధే.

మకరమునందు గురుడున్నచో భూమి సంపూర్ణ సస్యములచేశోభించును. సర్వజనులును భయములేక ఆరోగ్యవంతులై యుందురు.

శ్లో॥ సురస్పర్ధిజనై ర్ధాత్రీ ఫలపుష్పార్ఘ వృష్టిభిః
సంపూర్ణా కుంభగే జీవే త్వీతిరోగయుతా ధరా॥

కుంభమునందు గురుడుండగా సజ్జనులతో విరోధించు జనులు హెచ్చుగానుందురు, ఈతిబాధలు రోగములు విశేషించును. ఫలపుష్పములకు ధరలు పెరుగును.

శ్లో॥ ధాన్యార్ఘ వృష్టిః సంపూర్ణా క్వచిత్క్షేమం క్వచిద్భయం
న్యాయమార్గరతాభూపాః సర్వేమీనస్థితే గురౌ॥
—జ్యోతిర్నిబంధే.

మీనమునందు గురుడున్నచో రాజులు న్యాయముగా రాజ్యము నేలు



చుందురు. కొన్ని ప్రదేశములలో సుభిక్షము. కొన్ని స్థానములందు భయము వుండును.

—♦ గురుని రాశిత్రయ సంచార ఫలములు. ♦—

శ్లో॥ ఏకస్మిన్ వత్సరే జీవే రాశిత్రయ ముపాగతే
తదా వసుంధరా కీర్ణా కుణపై స్సప్తకోటిభిః॥

ఒకే సంవత్సరమున గురుడు మూడురాసులయందు సంచరించుట సంభవించినచో ఆ సంవత్సరమున ఏడుకోట్ల జనులు మరణించెదరు. (గురుని రాశి సంచార దేశములందు కలుగునని గ్రహించేది.)

—♦ గురుని నక్షత్ర చార ఫల విశేషములు. ♦—

శ్లో॥ ఉదగారోగ్య సుభిక్ష క్షేమకరో వాక్పతిశ్చరన్ భానాం
యామ్యే తద్విపరీతో మధ్యేనతు మధ్యఫలదాయీస్యాత్ ॥

గురుడు నక్షత్రములకు ఉత్తరదిశయందు సంచరించుచున్నచో లోకమున ఆరోగ్యము, సువృష్టి, శుభములు చేకూరును. దక్షిణదిశయందు సంచరించుచో విపరీత ఫలముల నొసంగును. మధ్యమభాగమున సంచరించుచో మధ్యమఫలములు కలుగజేయును.

శ్లో॥ విచరన్ భద్వయమిష్ట స్తత్సార్ధం వత్సరేణ మధ్యఫలదః
సస్యానాం విధ్వంసీ విచరే దధికం యది కదా చిత్ ॥
—వరాహః,

గురుడు ఒక సంవత్సరమున రెండు నక్షత్రములందు సంచరించుచున్నచో శుభము. ఒకటిన్నర నక్షత్రములందు సంచరించిన మధ్యమఫలదుడగును. మూడు నక్షత్రములు గాని, అంతకు మించి గాని సంచరించుచో ధాన్యనాశనము కలుగజేయును.

—♦ గురుని రంగునుబట్టి ఫలములు. ♦—

శ్లో॥ అనలభయ మనలవర్ణే వ్యాధిః పీతే రణాగమః శ్యామే
హరితేచ తస్కరేభ్యః పీడా రక్తేతు శస్త్రభయం

ధూమాభేఽనావృష్టిస్త్రిదశగురౌ నృపవధో దివాదృష్టే
విపులోఽనులే సురగురౌ రాత్రౌ దృష్టే ప్రజాః స్వస్థాః॥

గురుడుఅగ్నివర్ణముగల్గియున్నచో అగ్నిబాధలు, పసుపుపచ్చగానున్నచో వ్యాధిభయం, శ్యామలవర్ణముగానున్నచో యుద్ధభీతి, హరిత (చిలుకపచ్చ) వర్ణముగల్గియున్నచో చోరభయములు, రక్తవర్ణముగానున్నచో శస్త్రాస్త్రభయములు, ధూమ్రవర్ణముగల్గియున్నచో అనావృష్టిని కలుగజేయును. పగటివేళ గురుడు కన్పించినచో రాజులు నశింతురు. రాత్రియందు సుందరవర్ణము (నిర్మలుడై) గల్గి చక్కగా పెద్దదిగా కన్పించినచో ప్రజలకు సుఖసౌఖ్యములుండును.

శ్లో॥ రోహిణ్యాఽనలభంచ వత్సర తనుర్నాభి స్త్వాషాఢాద్వయం
సార్పం హృత్పిత్రుదైవతంచ కుసుమం శుద్ధైశ్శుభం తైః ఫలమ్॥
దేహే క్రూరనిపీడితేఽగ్న్యనిలజం నాభ్యాంభయం క్షుత్కృతం
గుహ్యే మూలఫలక్షయోఽథహృదయే సస్యస్యనాశో ధ్రువం॥
—వరాహః,

కృత్తికా,రోహిణీనక్షత్రములు సంవత్సరమునకు దేహము పూర్వాషాఢ ఉత్తరాషాఢనక్షత్రముల సంవత్సరమునకు నాభిప్రదేశము. ఆశ్రేషానక్షత్రము సంవత్సరమునకు హృదయము. మఘానక్షత్రము సంవత్సరమునకు కుసుమము. ఈ నక్షత్రములు పాపగ్రహములచే పీడింపఁబడినచో అగ్ని వాయు పీడలు కలుగజేయును. నాభినక్షత్రములను పాపులు పీడించినచో క్షుదాభయము కలుగజేయును. గుహ్యనక్షత్రమును పీడించినచో ఫలక్షయము కలుగజేయును. హృదయనక్షత్రమును పీడించినచో ధాన్యనాశనము తప్పక కలుగజేయును.

—♦ గురు డతిచారమందుండగా శని వక్రించియున్నచో
కలుగు ఫలము. ♦—

శ్లో॥ అతిచారగతే జీవే వక్రశ్చాపి శనైశ్చరః
హాహాకారం జగత్సర్వం దుర్భిక్షం స్యాదవాగ్దిశి॥

గురు డతిచారగతుడై యుండగా శని వక్రించుట సంభవించెనేని లోకమున హాహాకారధ్వనులు, దుర్భిక్షభయము కలుగును. దక్షిణదిశయందు ప్రజానష్ట మధికమగును.



—♦ కుజ గురు శనుల సమస్తక స్థితి ఫలములు. —

శ్లో॥ యదారసౌరీ సురరాజ మంత్రి యద్యేకరాశౌ సమస్తగేవా
అవంతి లంకాపురమధ్యదేశేక్షుధాభయంశస్త్రభయంనరాణాం॥
శ్లో॥ అర్కజేచ సురాచార్యే సమస్తక మాశ్రితే
కావేరీవింధ్యయోర్మధ్యే నిర్మనుష్యం భవే జ్జగత్॥

కుజ,శని,గురులు ఒకేరాశియందున్నను,వీరిలోఏఒక్కనికైనను సమస్తకస్థితి సంభవించినను అవంతి (అయోధ్య) మొదలుకొని లంకాపట్టణము వరకుగల మధ్యదేశమందు ఆకటి బాధలు, భయము, శస్త్రాస్త్ర భయములు, రాజయుద్ధము కలుగజేయును.

శని గురులకు సమస్తకస్థితి సంభవించినచో వింధ్యాద్రి మొదలుకొని, కావేరీనదీతీర ప్రాంతమువరకు గల మధ్యప్రదేశమున ప్రజాక్షయ మధికము.

శని చార ఫలములు.

—♦ నక్షత్రచార ఫలములు. ♦—

శ్లో॥ తురగతురగీ ప్రచారకకవివైద్యామాత్యహార్కజోఽశ్విగతః
యామ్యే నర్తకవాదకగేయానాం క్షుద్రనౌకికానాం హానిః॥

అశ్వినియందు శని సంచరించుచున్నపుడు గుఱ్ఱములు, అశ్వవాహకులు, అశ్వములను అమ్మేవారు, కవులు, వైద్యులు, మంత్రులకు హాని కలుగును. భరణియందు సంచరించుచున్నపుడు నాట్యముచేయువారికి, వాదించువారికి (న్యాయవాదులకు) వాద్యగాండ్రకు, గాయకులకు, చిన్న నావలు, పడవలమీద జీవించువారికి హాని కలుగును.

శ్లో॥ బహులాస్తే పీడ్యంతేసారేఽగ్న్యుపజీవిన శ్చమూపాశ్చ
రోహిణ్యాం కోసల మద్రకాశి పాంచాల శాకటికాః॥

కృత్తికయందున్నపుడు అగ్నివల్ల జీవించు కమ్మరులు, అగసాలెవారు, రైల్వే ఇంజన్‌యందు పనిచేయువారు, సేనానాయకులకు హాని కలుగజేయును. రోహిణియందు సంచరించుచున్నపుడు కోసల (అయోధ్య

ప్రాంతం) మద్రి (మధురప్రాంతం) కాశీ, పాంచాల (తూర్పు పశ్చిమ పంజాబు ప్రదేశము) దేశములకును, శకటోపజీవనముగలవారికిన్నీ హాని.

శ్లో॥ మృగశీర్షేవత్సయాజకయజమానార్యజన మధ్యదేశాశ్చ
రౌద్రిస్థే పారతరామఠ తైలిక రజక చౌరాశ్చ॥

మృగశిరయందు శనియున్నచో వత్సదేశము యాజకులు, యజమానులు, ఆర్యులు, మధ్యదేశమందలి ప్రజలుపీడింపఁబడుదురు. కొందరు "చాంద్రస్థార్కి-వత్సచీనమత్స్యయావనదేశహా" అని చెప్పిరి. అనఁగా వత దేశము, చీనా దేశము,మత్స్య దేశము,యవన దేశములందున్న వారికిహానిని జేయును. ఆర్ద్రయందు శనియున్నచో రామఠదేశము తెలుకులవాండ్రు చాకలికి, చోరులకు, పారతులకు (పారసీకులు) హాని కలుగజేయును,

శ్లో॥ ఆదిత్యే పంచనద ప్రత్యంత సురాష్ట్ర సింధుసౌవీరాః
పుష్యే ఘాంటికఘోషిక యవన వణిక్కితవ కుసుమాని॥ ।

పునర్వసుయందు శనియున్నచో పంజాబు, ప్రత్యంత సురాష్ట్రం, సింధు, సౌవీరదేశములందలి జనులకు గొప్ప పీడలు కలుగజేయును.

పుష్యమియందు శనియువ్నచో ఘంటను వాయించువారికిన్ని, ఘోషికులకు (దాడోరా వేయువారికిన్నీ) యవనులకు, వర్తకులకు, విటులకు, పుష్పములకు పీడలు కలుగజేయును.

శ్లో॥ సార్పే జలరుహా సర్పాః పిత్ర్యే బాహ్లీక చీన గాంధారాః
శూలిక పారత వైశ్యాః కోష్ఠాగారాణి వణిజశ్చ॥

ఆశ్రేషయందు శనియున్నచో పద్మములకు, సర్పములకు హాని. మఖయందు శనియున్నచో బాహ్లీకము చీనా, గాంధారం, శూలిక, పారత, వైశ్యులకు, ధనాగారములు వాణిజ్యముచేయువారికి, కష్టనష్టములు కలుగజేయును.

శ్లో॥ భాగ్యే రసవిక్రయిణః పణ్యాస్త్రీ కన్యకామహారాష్ట్రాః
ఆర్యమ్ణే నృపగుడలవణ భిక్షుకాం బూని తక్షశిలా॥

పుబ్బయందు శనియున్నచో రసవస్తువులను విక్రయించువారికిన్నీ, వేశ్య కన్యలకు, స్త్రీలకు, మహారాష్ట్రదేశమునకు విఘ్నములు కలుగజేయును.



ఉత్తరయందు శనియున్నచో రాజులకు, బెల్లం, ఉప్పు, భిక్షుకులకు, జలమునకు, తక్షశిలానగరమునకు విఘ్నములు కలుగజేయును.

శ్లో॥ హస్తేనాపితచాక్రికచౌరభిషక్సూచిక ద్విపగ్రాహాః
బంధక్యః కౌశలకా మాలాకారాశ్చ పీడ్యంతే॥

హస్తయందు శనియున్నచో మంగళ్ళు, శిల్పులు, చోరులు, వైద్యులు, దర్జీలు, గజములను పట్టుకొనెడివారు రంకులాడి స్త్రీలు బంధించెడి నేర్పుగలవారు, మాలాకారుల, మొదలగువారికి పీడలు కలుగజేయును,

శ్లో॥ చిత్రాస్థే ప్రమదాజన లేఖక చిత్రజ్ఞ చిత్రభాండాని
స్వాతౌ మాగధ చరదూత సూతపోతప్లవనటాద్యాః॥

చిత్రానక్షత్రమందు శనియున్నచో స్త్రీ, లేఖకులు, చిత్రవిచిత్రవిద్యలయందు నేర్పుగలవారికి విచిత్రవస్తువులకును హాని. అనేక ప్రకారముల ధనహానిని కలుగజేయును. స్వాతియందు శనియున్నచో మగధ; దూత, సారధి, నావికులు, నావికా ప్రయాణముచేయువారు, నటకులు, మొదలగువారికి హాని కలుగజేయును.

శ్లో॥ ఐంద్రాగ్న్యాఖ్యే త్రైగర్త చీనకౌలతకుంకుమం లాక్షా
సస్యాన్యథ మాంజిష్ఠం కౌసుంభంచ క్షయం యాతి॥

విశాఖయందు శనియున్నచో తిగర్త, చీనా, కూలూత దేశములకు, కుంకుమ, లక్క, ధాన్యము, మంజిష్ఠ (పసుపు), కుసుంభవర్ణము (కుంకుమపువ్వు) మొదలగువానికి క్షయము కలుగజేయును,

శ్లో॥ మైత్రే కులూతతంగణ ఖస కాశ్మీరాః సమంత్రి చక్రచరాః
ఉపతాపం యాంతిచ ఘంటికా విభేదకశ్చ మిత్రాణాం॥
జ్యేష్ఠాసు నృపపురోహిత నృపసత్కృతశూరసస్యాసకులశ్రేణ్యః
మూలేతు కాశి కోసల పాంచాల ఫలౌషధీ యోధాః॥

అనూరాధయందు శనియున్నచో లూత, తంగణ, ఖస, కాశ్మీర దేశములకున్ను, నగర రక్షకభటులకు, ఘంటను వాయించువారికి, మంత్రులకు, దేశద్రిమ్మరులకు మిత్రద్రోహమును కలుగజేయువారలకు సంతాపమును కలుగజేయును. జ్యేష్ఠయందు శనియున్నచో రాజపురోహితులకు,

రాజాదరణను పొందేవారికి, శూరులకు, సన్యాసుల మఠములకు, దేవమందిరములకు, పీడను కలుగజేయును. మూలయందు శనియున్నచో కాశీ, కోసల, పాంచాల దేశములందు విఘ్నములున్ను, ఫల, ఓషధులు, యోధులకు హాని కలుగజేయును.

శ్లో॥ ఆప్యేఽంగ వంగకోసల గిరివ్రజా మగధపుండ్రమిథిలాశ్చ
ఉపతాపం యాంతిజనావసంతియే తామ్రలిప్త్యాంచ
విశ్వేశ్వరేఽర్క పుత్రశ్చరన్ దశార్ణా న్నిహంతి యవనాంశ్చ
ఉజ్జయనీ శబరాన్ పారియాత్రికాన్ కుంతిభోజాంశ్చ॥

పూర్వాషాఢయందు శని యున్నపుడు అంగ, వంగ, కోసల, గిరివ్రజం, మగధ, పుండ్ర, మిథిలా, తామ్రలిప్తి మొదలగు దేశములందు నివసించు జనులకు పీడలు కలుగజేయును. ఉత్తరాషాఢనక్షత్రమందు శని యున్నపుడు ఉజ్జయినీ, పారియాత్రికా, దశార్ణ, కుంతిభోజదేశములందలి జనులకున్ను, యవన, శబరజాతికిన్ని కష్టనష్టములు కలుగజేయును.

శ్లో॥ శ్రవణే రాజాధికృతాన్విప్రాగ్ర్య భిషక్పురోహిత కలింగాన్
వసుభే మగధేశజయో వృద్ధిశ్చ ధనేష్వధికృతానామ్॥

శ్రవణమందున్న శని రాజాధికారముగల బ్రాహ్మణులు, శ్రేష్ఠవైద్యులు, పురోహితులు, కళింగదేశ జనులకు గొప్ప కష్టనష్టములను కలుగజేయును. ధనిష్ఠయందు శని యున్నపుడు మగధేశ్వరుడు జయించును. ధనాధికారులకు వృద్ధి కలుగజేయును.

శ్లో॥ సాజేశతభిషజిక్భిషి శౌండిక పణ్యనీతి వార్తానామ్
అహిర్బుధ్న్యే నట్యోనటయానకరాః స్త్రీ హిరణ్యంచ॥
రేవత్యాం రాజభృతాః క్రౌంచద్వీపాశ్రితాః శరత్సస్యమ్
శబరాశ్చని పీడ్యంతే యవనాశ్చ శనైశ్చరే చరతి॥

శతభిషమందు శనియున్నపుడు వైద్యులు, కవులు, మద్యమాంసాదుల నమ్మువారు, పడుపువృత్తిచే జీవించువారు, నీతికుశలులు, మొదలగువారికి కష్టములు కలుగజేయును. పూర్వాభాద్రయందు శనియున్నపుడు శతభిషానక్షత్రస్థితిఫలము లేయొసంగును, ఉత్తరాభాద్రయందుశనియున్నపుడు నటీ, నటకులు, సవారీలను మోయువారు, స్త్రీలు, బంగారము,



మొదలగువానికి నాశము కలిగించును. రేవతీనక్షత్రమందు శనియున్నపుడు రాజసేవకులు, క్రౌంచద్వీపవాసులు, శరదృతువునందు ఫలించెడు ధాన్యములు, శబరజాతులకు యవనదేశస్థులకు పీడలు కలిగించును.

—♦ నక్షత్ర సాధారణ ఫలములు - విశేష ఫలదములు కానేరవు. ♦—

శ్లో॥ మైత్రాఖ్య సంక్రందన పౌష్ణభేషు చరం స్తథా సూర్యసుతః
కరోతి । ఈతే ర్భయం వ్యాధిభయం ప్రజానాం కళింగబాహ్లీక
జనాభివృద్ధిమ్॥ —వసిష్ఠః.

శ్లో॥ ఆహిర్బుధ్నిగతో మందశ్చ స్త్రీ చోరాగ్నిభీతికృత్
క్షుద్వ్యాధి శస్త్ర చోరాగ్నిభయ మంత్యర్క్ష గేశనా।

శ్లో॥ శ్రవణానిల హస్తార్ద్రా భరణీ భాగ్యభేషుచ
చరన్ శనైశ్చరో నృణాం సుభిక్షారోగ్యసస్యకృత్॥
నారదః.

శ్లో॥ జలేశసార్పమాహేంద్రనక్షత్రేషు సుభిక్షకృత్
క్షుచ్ఛస్త్రావృష్టిదో మూలేఽహిర్బుధ్న్యేంత్యభయోర్భయమ్.
—నారదః.

శ్లో॥ యదావిశాఖాసుమహేంద్రమంత్రీసుతశ్చభానోర్ధహనక్షయాతిః
తదా ప్రజానామనయోఽతిఘోరః పురప్రభేదో గతయోర్భమేకమ్॥ —వరాహః.

గురుడు విశాఖయందుండగా శని కృత్తికయందున్నచో ప్రజాహాని, అవినీతి ప్రబలును. గురుడు శని ఒకే నక్షత్రమునందు సంచరించుచున్నపుడు సమస్తపట్టణములను నాశనముచేయుట సంభవించును.

—♦ శని కేతు యోగ ఫలము. ♦—

శ్లో॥ సధ్వజే తురగారూఢే వంగా పాంథ జనాహతిం
వింద్యాత్కిరాత చండాలమ్లేచ్ఛ సాంకర్యజం కలిమ్॥

శని కేతువులు అశ్విని నక్షత్రమునందు కలియుటచేత మార్గస్థులకుహాని. కిరాతులు, చండాలురు, మ్లేచ్ఛులు, సంకరజాతులు ప్రబలుదురు. ధన మాన ప్రాణహానులు కలుగజేయుదురు,

శ్లో॥ శౌదార్క్ష వారీశ మరుద్ద్విదైవముకుంద క్షేమ్యార్కసుతః కరోతి చరన్ సుభిక్షం విపులం పృథివ్యాం గౌడాశ్మ కాశ్మీర పులింద హానిః॥ —వసిష్ఠః.

—♦ శనిరాశి చార ఫలములు. ♦—

శ్లో॥ మేషస్థే భానుపుత్రే త్రిభువనవినితే యాతి ధాన్యం వినాశం
నూనం త్రైలింగ వంగే హయ ఖురదళితం విగ్రహ స్త్రీవ్ర ఏవ
పాతాళే నాగలోకే దిశి విదిశిగతాః భీతిభీతాన రేంద్రాః
సర్వేలోకానిలీనాః ప్రథమగతఘనాయాచమానాప్రజంతి॥

మేషమందుశనియున్నచో ధాన్యహాని, త్రిలింగదేశము, వంగ (తూర్పు బెంగాల్) దేశములందు అశ్వములయొక్క పాదధూళిచే కప్పబడి, యుద్ధతీవ్రతను కలుగజేయును. రాజులు భయోత్పాతములచే పీడింపఁబడుదురు. సమస్త లోకములందును రాజకీయాది పరివర్తనలు, రాజ్య భ్రంశము కలుగజేయును.

శ్లో॥ మేషస్థితే మందగతౌ నృపాణాం మతంగజానాంచ తురంగమాణాం। కవీశ్వరాణామపిగాయకానాం వైశ్యోత్తమానామపి నైష్కృతిస్స్యాత్॥ —గార్గిః,

శని మేషమందు సంచరించునపుడు రాజులు, ఏనుగులు, గుర్రములు, కవీశ్వరులు, గాయకులు, వైశ్యులకు హాని కలుగజేయును.

శ్లో॥ గోసంస్థితేసూర్యసుతేత్వమాత్యధాన్యార్ఘభూపాశ్రితవృత్తినాశః అవంతిపాంచాలక కోసలాదిదేశావినష్టాః కురు వత్సమద్రాః॥ —గార్గిః.

శని వృషభమందు సంచరించునపుడు మంత్రులు, ధాన్యము, ధరప్రతులు రాజాశ్రితులు, నశింతురు. అవంతి, పాంచాల (పంజాబు), కోసల, కురు, వత్స, మద్రదేశములందు ప్రజాక్షయ ముండును.

శ్లో॥ వైరావర్తాజనానాం ధనసుఖహరణం సర్వదేశే మహార్ఘం
దుఃఖం వైరాగ్యయోగః సకలజనహృదిస్యాన్వినాశః పశూనాం
ధాన్యం సేవార్థనాశే రసకససహితం సర్వశూన్యం జనానా
మిత్యేతే సర్వదేశాః పరిజనవికల్మా స్సూర్యపుత్రే వృషస్థే॥



వృషభమందు శని సంచరించునపుడు వైరావర్తదేశమునందలి జనులు ధనము, సుఖమును కోల్పోదురు. సమస్త దేశములందును ఆహారధాన్యముల ధరలు పెరుగును. దుఃఖము, వైరాగ్యస్థితి, ఆహార పదార్థముల కొఱత, పశునాశము, ధాన్యహాని, వ్యవసాయదారులకు కష్టనష్టములు, రసవస్తువులు, గడ్డి దొరకకపోవుట, దుర్భిక్షము, సమస్త దేశవాసులు ఆకటిబాధలచే అల్లాడిపోవుట సంభవించును.

శ్లో॥ యుగ్మస్థితేర్కతనయే ప్రమదో నృపాణాం
జాయేత సస్య బహులా వసుధా సువృష్టిః
నష్టాశ్చ తైలికయుతా రజకాశ్చ చోరా
స్స్యుః పారదాశ్చ దరదాశ్చ సురాష్ట్రదేశాః॥

మిథునమందు శనియున్నచో రాజులు మదించియుందురు. సస్యానుకూల వృష్టి, పాడిపంటల సమృద్ధియుండును: తెలకులవారు, రజకులు(చాకళ్ళు) చోరులు నశించెదరు. పారద, దరద, సురాష్ట్రదేశములందు ప్రజా క్షోభయు జననష్టము కలుగజేయును.

శ్లో॥ రోగానిత్యం గ్రసంతి ప్రచురపరిభవో విత్తనాశ స్తథైవ
కార్యేహాని ర్విరుద్ధైః సకల భయజనైః దేశచింతా విషాదః
ఆరావోవాంబుపాతశ్చలతిచపృథివీ సర్వలోకప్రనాశః
సర్వస్మి న్రాజయుద్ధం పశుధనహరణం కర్కటే సూర్యపుత్రే॥

కటకరాశియందు శని సంచరించుచున్నప్డు లోకమున రోగములు ప్రబలును. పరాభవములు ధనధాన్యహాని, కార్యహాని, ద్వేషములు, సకల జనులు భయభ్రాంతులగుట, దేశమందు దుఃఖములు, విషాదములు, పశు నష్టము, తుపానులు, దేశక్షోభము, రాజయుద్ధము, పశుధనాపహరణములు కలుగజేయును.

శ్లో॥ మృగేంద్రసంస్థేర్కసుతేఽశ్వనాగజనాస్స్యు రన్యాయపథానుగాశ్చ। బాహ్లీక గాంధారక చీనకోష్ఠసద్మాని కన్యాగణికాశ్చ నష్టాః॥ —దైవజ్ఞవిలాసే.

శ్లో॥ భూమాహ్యం నాశశ్చతుష్పాద్గజహయ వృషభాయ్యుద్ధ దుర్భిక్ష రోగైః। పీడ్యంతే సర్వదేశా ఉదధిపురపథే దుర్గదేశేషుభంగః

శ్లో॥ కాదార్కివారీశ మరుద్విదైవముకుంద భేష్వర్కసుతః కరోతి
చరన్ సుభిక్షం విపులం పృథివ్యాం గౌడాశ్మ కాశ్మీర పులింద
హానిః॥ —వసిష్ఠః.

—♦ శనిరాశి చార ఫలములు. ♦—

శ్లో॥ మేషస్థే భానుపుత్రే త్రిభువనవినితేయాతిధాన్యం వినాశం
నూనం త్రైలింగ వంగేహయ ఖురదళితం విగ్రహ స్త్రీవ్ర ఏవ
పాతాళే నాగలోకేదిశి విదిశిగతాః భీతిభీతాన రేంద్రాః
సర్వేలోకానిలీనాః ప్రథమగతధునాయాచమానావ్రజంతి॥

మేషమందుశనియున్నచో ధాన్యహాని, త్రిలింగదేశము, వంగ (తూర్పు బెంగాల్) దేశములందు అశ్వములయొక్క పాదధూళిచే కప్పబడి, యుద్ధతీవ్రతను కలుగజేయును. రాజులు భయోత్పాతములచే పీడింపఁ బడుదురు. సమస్త లోకములందును రాజకీయాది పరివర్తనలు, రాజ్య భ్రంశము కలుగజేయును.

శ్లో॥ మేషస్థితే మందగతౌ నృపాణాం మతంగజానాంచ తురంగ
మాణాం। కవీశ్వరాణామపిగాయకానాం వైశ్యోత్తమానామపి
నైష్కృతిస్స్యాత్॥ —గార్గిః,

శని మేషమందు సంచరించునపుడు రాజులు, ఏనుగులు, గుర్రములు, కవీశ్వరులు, గాయకులు, వైశ్యులకు హాని కలుగజేయును.

శ్లో॥ గోసంస్థితేసూర్యసుతేత్వమాత్యధాన్యార్ఘ భూపాశ్రితవృత్తినాశః
అవంతిపాంచాలక కోసలాది దేశావినష్టాః కురు వత్సమద్రాః॥
—గార్గిః,

శని వృషభమందు సంచరించునపుడు మంత్రిలు, ధాన్యము, ధరప్రతులు రాజాశ్రితులు, నశింతురు. అవంతి, పాంచాల (పంజాబు), కోసల, కురు, వత్స, మద్రదేశములందు ప్రజాక్షయ ముండును.

శ్లో॥ వైరావర్తాజనానాం ధనసుఖహరణం సర్వదేశే మహార్ఘం
దుఃఖం వైరాగ్యయోగః సకలజనహృదిస్యాన్వినాశః పశూనాం
ధాన్యం సేవార్థనాశే రసకససహితం సర్వశూన్యం జనానా
మిత్యేతే సర్వదేశాః పరిజనవికలాస్సూర్యపుత్రే వృషస్థే॥



వృషభమందు శని సంచరించునపుడు వైరావర్త దేశమునందలి జనులు ధనము, సుఖమును కోల్పోదురు. సమస్త దేశములందును ఆహారధాన్య ముల ధరలు పెరుగును. దుఃఖము, వైరాగ్యస్థితి, ఆహార పదార్థముల కొఱత, పశునాశము, ధాన్యహాని, వ్యవసాయదారులకు కష్టనష్టములు, రసవస్తువులు, గడ్డి దొరకకపోవుట, దుర్భిక్షము, సమస్త దేశవాసులు ఆకటిబాధలచే అల్లాడిపోవుట సంభవించును.

శ్లో॥ యుగ్మస్థితేర్కతనయే ప్రమదో నృపాణాం
జాయేత సస్య బహులా వసుధా సువృష్టిః
నష్టాశ్చ తైలికయుతా రజకాశ్చ చోరా
స్స్యుః పారదాశ్చ దరదాశ్చ సురాష్ట్రదేశాః॥

మిథునమందు శనియున్నచో రాజులు మదించియుందురు. సస్యానుకూల వృష్టి, పాడిపంటల సమృద్ధియుండును: తెలుకులవారు, రజకులు(చాకళ్ళు) చోరులు నశించెదరు. పారద, దరద, సురాష్ట్రదేశములందు ప్రజా క్షోభయు జననష్టము కలుగజేయును.

శ్లో॥ రోగానిత్యం గ్రసంతి ప్రచురపరిభవో విత్తనాశ స్తథైవ
కార్యేహాని ర్విరుద్ధైః సకల భయజనైః దేశచింతావిషాదః
ఆరావో వాంబుపాతశ్చలతిచపృథివీ సర్వలోకప్రనాశః
సర్వస్మి న్రాజయుద్ధం పశుధనహరణం కర్కటె సూర్యపుత్రే॥

కటకరాశియందు శని సంచరించుచున్నపుడు లోకమున రోగములు ప్రబలును. పరాభవములు ధనధాన్యహాని, కార్యహాని, ద్వేషములు, సకల జనులు భయభ్రాంతులగుట, దేశమందు దుఃఖములు, విషాదములు, పశు నష్టము, తుపానులు, దేశక్షోభము, రాజయుద్ధము, పశుధనాపహరణ ములు కలుగజేయును.

శ్లో॥ మృగేంద్రసంస్థేర్కసుతేఽశ్వనాగజనాస్స్యు రన్యాయపథాను
గాశ్చ। బాహ్లీక గాంధారక చీనకోష్ఠసద్మాని కన్యాగణికాశ్చ
నష్టాః॥ —దైవజ్ఞవిలాసే.

శ్లో॥ భూమ్యాం నాశశ్చతుష్పా ద్గజహయ వృషభాయ్యుద్ధ దుర్భిక్ష
రోగైః। పీడ్యంతే సర్వదేశా ఉదధిపురపథే దుర్గదేశేషుభంగః

మ్లేచ్ఛాంతో ధాన్యనాశో ధనసుఖమవనీశేంద్రభంగః ప్రతాపం
సర్వేయాంతీతికాలే భ్రమతియుగమిదం సింహగే సూర్యపుత్రే॥

శని సింహమందు సంచరించుచున్నపుడు గుఱ్ఱములు, ఏనుగులు, అడవి జాతులవారు అన్యాయముగా ప్రబలుదురు. బాహ్లీకము, గాంధారము, చీనాదేశములందు ధనాభావము (ధనాగారములు కొల్లగొట్టబడును.) స్త్రీలు, వేశ్యలు కష్టనష్టములకు లోనగుదురు. భూములకు నష్టము, పశువులు, ఏనుగులు, గుఱ్ఱములు, ఎడ్లు నశించును. యుద్ధము, దుర్భిక్షము, రోగములచే ప్రజలు పీడింపఁబడుదురు. సముద్రతీరప్రాంతములందుగల దేశములకు భంగము, మ్లేచ్ఛులు ప్రబలి నశింతురు. ఆహారధాన్యముల కొఱత, ధనము, సుఖము లేకుండుట, రాజులు పరస్పర యుద్ధాభిలాష గలిగియుందురు. లోకక్షోభ, పాటక జనము యితర దేశములకు లేచి పోవుట సంభవించును.

శ్లో॥ కాశ్మీరం యాతినాశం హయరవదళితం విగ్రహం తత్రకుర్యా
త్త్రత్రస్థం ధాతురూప్యం గజహయవృషభంఛాగలం మాహిషంచ
మంజిష్ఠా కుంకుమాద్యం రసకససహితం యాంతిసర్వే సమర్ఘం
కన్యాయాం సూర్యపుత్రే సకలజనసుఖంసంగ్రహేత్సర్వధాన్యం

శ్లో॥ సూర్య పుత్రావళౌజాతే వహ్న్యుపద్రవ మాదిశేత్
సర్వధాన్యం మహార్ఘంస్యా న్మేదినీ నష్టకారకః॥

శ్లో॥ ఆలిస్థితే రోగభయం ప్రజానాం భవే త్పశూనాం మృతి రర్కపుత్రే। శ్రేణీకులానాంచ గణస్య నాశో మహీపతీనాం మువ జాపనం స్యాత్। —దైవజ్ఞవిలాసే.

శని వృశ్చికమందున్నచో రోగభయం. ప్రజామరణములు, పశుక్షయము కులములకు, గణములకు, రాజులకు భేదబుద్ధిని గలుగజేయును.

శ్లో॥ మందేస్థితేధన్విని వృష్టిహానిస్స్యాద్భూపతీనాంకలహోఽతిచార్ఘం
పాంచాలకాశీకురు కోసలాశ్చ నష్టాశ్చ కాశ్మీరకళింగవంగాః॥
—దైవజ్ఞవిలాసే.

ధనుస్సునందు శనియున్నచో వర్షాభావము, రాజకలహము, ధాన్యాదుల ధరలు పెరుగుట, పాంచాల (పంజాబు), కాశీ, కురు (ఢిల్లీ) కోసల, కాశ్మీరం, కళింగదేశము, వంగదేశము (తూర్పుబెంగాలు) లకు నష్టము కలుగజేయును.



శ్లో॥ ధనూరాశి స్థితో మందః భూపానా మాహవప్రదః
జనానాం వ్యాధిపీడాచ క్షుత్పీడా జాత్రుబాధకః।

ధనుస్సున శనియున్నకాలములో రాజయుద్ధము, జనులు ఆకటిబాధల చేతను, వ్యాధులచేతను, శస్త్రాస్త్రభయములచేతను పీడింపఁబడుదురు.

శ్లో॥ నక్రస్థితే భానుసుతేచ భీతిస్స్యాదర్ఘవృద్ధి ర్మహతీచవృష్టిః
దశార్ణదేశాయవనాశ్చనష్టాఃపురోహితావిఃప్రభిషజ్నృపాలాః॥
—దైవజ్ఞవిలాసే.

మకరమందు శనియున్నపుడు భయోత్పాతము లధికము. ధరలు పెరుగును. అధిక వర్షములు, దశార్ణదేశము, యవనదేశములందు కష్టనష్టము లధికము. పురోహితులకు, బ్రాహ్మణులకు, వైద్యులకు, రాజులకు హాని కలుగజేయును.

శ్లో॥ మందే ఘటస్థే సతివృష్టి నాశో రాజ్ఞాం భయం సస్య లయో నరాణాం। భిషగ్వరాణాం చ కవీశ్వరాణాం కోశాధిపానాంచ మహాభయం స్యాత్॥ —దైవజ్ఞవిలాసే.

శని కుంభమందున్నచో వర్షాభావము. రాజభయము, సస్యహాని, ప్రజాక్షయమును కలుగజేయును.

శ్లో॥ మీనస్థితే సూర్యసుతే ధరిత్రీ వినష్టసస్యా వివిధాపమృత్యుః
నద్యశ్చగావోవనితాహిరణ్యంమృగ్యంభవేద్దారుణకర్మభూయాత్
—దైవజ్ఞవిలాసే.

శని మీనమందున్నచో సస్యహాని, అపమృత్యు రోగపీడలు, నదులు, గోవులు, స్త్రీలు, బంగారము వృద్ధియుండదు. భయంకరములగు చేష్టలు ప్రబలును. దుర్మార్గులు ప్రబలుదురు.

శ్లో॥ పృథివ్యాం కంపమాత్రం ప్రచలతిపవనః కంపతే నాగలోకః
సప్తద్వీపాస్సముద్రా గిరివనగహ నాన్యన్య వృక్షాదిహానిః
నాశః పృథ్వీపతీనాం జనయతి విలయో యాంతి మేఘాః ప్రణాశం। చక్రావర్తై స్సమస్తం భ్రమతి జగదిదం మీనగే సూర్యపుత్రే॥

శని మీనమందు సంచరించుచున్నపుడు భూకంపము, తుపానుగాలులుండును. నాగలోకముకూడా కంపించును. సప్తద్వీపములు, సముద్రములు, పర్వతములు, అడవులు, వృక్షములు తుపానుగాలులచే నశించును. రాజులకు నష్టము. ప్రళయము కలుగజేయును, మేఘములు దేశభేదముచే వర్షాభావ మొసంగును, సమస్త ప్రపంచము చక్రావర్తముగా తిరుగును. ప్రజాక్షోభ యుండును.

—♦ శని ఫల విశేష శ్లోకములు. ♦—

శ్లో॥ కీటాజ పంచానన కర్కటేషుచరన్ తదా మధ్యమ వృష్టిదః
స్యాత్ । వృష్టేర్భయం క్షుత్ర చిదామయశ్చ తథాపి జీవంతి
జనాః కథం చిత్ ॥ —వసిష్ఠః.

వృశ్చిక, మేష, సింహ, కటకములందు శని సంచరించునపుడు మధ్యమ వర్షము లొసంగును. కొండొకచో అధిక వర్షములచే భయము, వరదలు రోగములు కలుగజేయును. అట్లయ్యును జనులు ఎట్లో జీవించెదరు.

శ్లో॥ కన్యానృయుగ్గోఘటచాపసంస్థః స్వక్షేత్రసంస్థోఽపి శుభప్రద
స్యాత్ । వంగాంగ కాశ్మీర కళింగ గౌడసౌరాష్ట్రదేశేష్వ శుభ
ప్రదః స్యాత్ ॥ —వశిష్ఠః.

కన్య, మిథునం, వృషభం, కుంభం, ధనుస్సులందు శని సంచరించునపుడు వంగ(తూర్పుబెంగాల్)అంగ, కాశ్మీరం, కళింగ (ఒరిస్సారాష్ట్రం) గౌడ (ఓఢ్ర దేశం) సౌరాష్ట్ర (కథియవాడ్ ప్రాంతము) దేశములందు ప్రజారిష్టములు కలుగజేయును. కాని స్వక్షేత్రములగుమకర, కుంభరాసులందు శని సంచరించుచున్నపుడు శుభమును కలుగజేయును.

శ్లో॥ ప్రక్షుభ్యంతి క్షితీశాః ప్రచలిత వసుధా మోదతేదస్యువర్గో
ధీభ్రంశో బుద్ధిభాజాం జనపదహరణం చిత్రవర్షీ పయోదః
చంద్రార్కౌ మందచారి గ్రహగణసహితో వాంతివాతాః ప్ర
చండా । శ్చక్రాకారం సమగ్రం భ్రమతి జగదిదం మీనగే
సూర్యసూనౌ ॥ —వసిష్ఠః.

శని మీనమందు సంచరించుచున్నపుడు రాజులు క్షోభించెదరు. భూకంపము కలుగును, దస్యులు (దుర్మార్గులు) ప్రబలుదురు. బుద్ధిమంతులకు



మతి దప్పును. (భ్రాంతిచిత్తులగుదురు). పల్లెవాసుల క్షోభ, స్త్రీధనపశుహరణములు, విచిత్ర వర్షములు కలుగజేయును. చంద్రరవులతోగూడ శని చేరియున్నను సుడిగాలులు, తుపానుగాలులు వీచును. ప్రపంచము చక్రాకారముగ తిరుగుట సంభవించును. ప్రపంచమునందలి జనులు క్షోభచే దేశాటనము చేయుదురని భావము.

శ్లో॥ యావన్మార్తాండసూనౌ ప్రవిశతి ధనుషం యుగ్మకం మీనకన్యే
తావద్రాజేంద్రపీడాం జనయతిమరణం క్షుత్పిపాసాతిఘోరం
ఉర్వీ నిశ్శబ్దతోయా శివకరపటహై స్సంచరంతే పిశాచా
గ్రామాశ్శూన్యాభవేయుర్నరశిరనివహా తాన్యస్తకంకాళమాలాః
—శౌనకః.

శ్లో॥ యావన్మార్తాండసూనౌ వృషభతులగతే వృశ్చికేమీనసింహే
రాశావన్యేక్షయంతః సురగురుసహితో భూమిపుత్రయుతోవా
తావద్దుర్భిక్షకాలం నరపతి మరణం క్షుత్పిపాసాదిఘాతం
గ్రామారణ్యే శ్మశానే నరశిర సహితా న్నృత్తయంతే పిశాచాః॥

శ్లో॥ మీనం ధనుర్యువతి యుగ్మగతోర్కపుత్రస్సౌమ్యైర్యుతో భవతి
యద్యవలోకితోవా । దుర్భిక్షశస్త్ర గదచోర భయాని యాని
ప్రోక్తాని తాని నభవంతి భవంతి పాపైః॥
—శౌనకః.

మీనం, ధనుస్సు, కన్యా, మిథునరాసులందు శని సంచరించుచు బుధునితో (సౌమ్యులతో) చేరియున్నను, చూడబడినను, దుర్భిక్షము, శస్త్రభయము, రోగములు, చోరభీతి కలుగనేరవు. పాపులతో చేరియున్నపుడు చూడబడినపుడు తప్పక కలుగును.

—♦ శని వక్రత్వ ఫలములు. ♦—

శ్లో॥ పూర్వాత్రయ మఘేషు రవిపుత్రో నక్షత్రేషు తథా
కరోతి వక్రం । దుర్భిక్షం కురుతే భయ ముగ్రం మిత్రాణాంచ
విరోధ మవృష్టిః॥

శ్లో॥ వక్రం గతో రవిసుతోథ ధరాసుతోవా
మూలర్క్ష హస్త మఖ రేవతి పౌష్ణభేషు

ఛత్రోపభోగశయనానిచ సైనికానాం
నాశాని లోక మరుజం ప్రకరోతి దేశం॥ —పృథుః.

శ్లో॥ ఇంద్రాది త్రితయే వక్రం కరోతి రవినందనః
అవంతి యవనాధీశ మృతిం కుర్యా ద్విత్రుత్రయే॥ —చ్యవనః

జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ నక్షత్రములందు సంచరించుచు శని వక్రించినచో అవంతి (ఉజ్జయినీ) యవన దేశాధిపతులకు ఆరుమాసములలో మరణమును కలుగజేయును.

శ్లో॥ కన్యాయాం మీనసింహే వృషధనుషియదావక్రగామందభావా
పృథ్వీ సంరుద్ధభూపా ఖురపుటదళితావిగ్రహైరా దుస్థితిశ్చ,
దుర్భిక్ష స్సస్యనాశం ప్రభవతిభయదం పిత్తరోగం ప్రజానాం
పీడ్యంతే చాతిగోశ్వా మృగ మహిష గజాస్తన్నివృత్తౌతు
యావత్ ॥ — దేవలః.

శ్లో॥ తౌళీ నక్రగతౌ మందమాహేజౌ గురువీక్షితౌ
మందే నక్రగతే రాజ్యం యవనస్య వినాశనం॥ — దేవలః.

శ్లో॥ కన్యాయాం మిథునే మీనే వృషే ధనుషివాస్థితః
శనిః కరోతి దుర్భిక్షం రాజ్ఞాం యుద్ధం పరస్పరం॥

శని కన్య, మిథున, మీన, వృష, ధనుస్సులందు సంచరించుచున్నపుడు దుర్భిక్షము, రాజుల కన్యోన్య యుద్ధము కలుగజేయును.

—♦ కూర్మచక్రే శని స్థిత రాశిఫలములు. ♦—

శ్లో॥ మేషే మాళవదేశఘ్నః కర్నాటం వృషభే హరేత్
మిథునే కుండికాం హన్యాచ్చోళం కర్కటకే హరేత్
సింహస్థః పాండుదేశఃకా కన్యాయా మాంధ్రనాశకృత్
తౌళ్యాం సింహళ దేశఘ్నర్వాళ్యం మాగధదేశహృత్
ధనుష్టో ధనపాన్ హంతి ఆర్యఘ్నో మకరస్థితః
కుంభే కోసల రాష్ట్రఘ్నో మీనే చోత్తరదేశజాన్
నరాన్ పశుమృగాదీని నాశనం కురుతేర్కజః॥

శని మేషమందున్నచో మాళవదేశమునకు, వృషభమందున్న కర్నాటదేశమునకు, మిథునమందున్న కుండికాదేశమునకు, కటకమందున్న



చోళదేశమునకు, సింహమందున్న పాండుదేశమునకు, కన్యయందున్న ఆంధ్రదేశమునకు, తులయందున్న సింహళదేశము (లంక) నకు, వృశ్చికమందున్న మగధదేశమునకు, ధనుస్సునయందున్నచో ధనవంతులకు, మకరమందున్న పూజ్యులగు ఆర్యులకు, కుంభమందున్న కోసలదేశమునకు, మీనమందున్నచో ఉత్తరహిందూస్థానమందున్న దేశములకున్ను హాని కలుగజేయును. మరియు మనుష్యులు, పశువులు, మృగములు మొదలగు వానిని నశింపజేయును. ఇంతకంటె వివరముగా కూర్మచక్రఫలములను చూచుకొనదగును.

—♦ నక్షత్ర కూర్మచక్ర ఫలములు. ♦—

శ్లో॥ కృత్తికాద్యైస్త్రి నక్షత్రై ర్భవర్గై ర్నవభిః క్షితిః
కల్పితా మధ్య దేశాదా ప్రాగాది క్రమయోగతః
కృత్తికాద్యాస్త్రి నక్షత్రం మధ్యదేశే గణోయదా
పాపై రుపహతో హంతి మధ్యదేశాఽఖిలం తదా॥
రౌద్రాదికో హంతి పూర్వాం సార్పాద్యః పూర్వదక్షిణామ్
అర్యమ్ణాద్య స్తథాయామ్యాం స్వాత్యాద్యో దక్షిణాపరామ్
జ్యేష్ఠాద్యః పశ్చిమామాశాం వైశ్వాద్యశ్చాపరోత్తరామ్
వారుణ్యాద్యోహంతి సౌమ్యాం పౌష్ణాద్యః శూలినోదిశమ్॥
—గర్గః.

కృత్తికాది మూడేసి నక్షత్రము లొకవర్గుగా నేర్పరచి తొమ్మిదిదిక్కులకు పంచబడినవి కృత్తిక, రోహిణి, మృగశిర నక్షత్రములు మధ్యదేశ నక్షత్రములు. ఆర్ద్ర, పునర్వసు, పుష్యమీనక్షత్రములు తూర్పుదేశ నక్షత్రములు. ఆశ్లేష, మఘ. పుబ్బ నక్షత్రములు ఆగ్నేయదేశనక్షత్రములు. ఉత్తర, హస్త, చిత్తనక్షత్రములు దక్షిణదేశనక్షత్రములు. స్వాతి, విశాఖ, అనూరాధా నక్షత్రములు నైరుతిదేశనక్షత్రములు. జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ నక్షత్రములు పశ్చిమదేశ నక్షత్రములు. ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠానక్షత్రములు వాయవ్యదేశనక్షత్రములు శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రములు ఉత్తరదేశ నక్షత్రములు. రేవతి, అశ్వనీ, భరణీనక్షత్రములు ఈశాన్యదేశ నక్షత్ర

ములు. పాపగ్రహములు పై నక్షత్రములందు సంచరించుచున్నప్పుడాయా దేశ జనులకు కష్టనష్టములు సంభవించును.

—♦ మధ్య దేశములు (జనపదములు) ♦—

శ్లో॥ భద్రారిమేదమాండవ్యసాల్వనీపోజ్జిహాన సంఖ్యాతాః
మరువత్సఘోషయామునసారస్వత మత్స్యమాధ్యమికాః॥
మాథురకోపజ్యోతిషధర్మారణ్యాని శూరసేనాశ్చ
గౌరగ్రీవోద్దేహిక పాండుగుడాశ్వత్థపాంచాలాః॥
సాకేత కంకకురుకాలకోటి కుకురాశ్చ పారియాత్రనరాః
ఔదుంబరకాపిష్ఠల గజాహ్వయాశ్చేతి మధ్య మిదమ్॥

—♦ తూర్పు దేశములు (జనపదములు). ♦—

శ్లో॥ అథ పూర్వస్యా మంజన వృషభధ్వజ పద్మమాల్యవ ద్గిరయః
వ్యాఘ్రముఖ సూక్ష్మకర్వట చాంద్రపురాః శూర్పకర్ణాశ్చ॥
ఖస మగధ శిబిరగిరి మిథిల సమతటోడ్రాశ్వవదన ద్దంతురకాః
ప్రాగ్జ్యోతిషలౌహిత్య క్షీరోదసముద్ర పురుషాదాః॥
ఉదయగిరిభద్రగౌడక పౌండ్రోత్కలకాశీమేఖలాం బష్ఠాః
ఏకపద తామ్రలిప్తికకోసలకా వర్ధమానాశ్చ॥

—♦ ఆగ్నేయ దిశి దేశములు - (జనపదములు). ♦—

శ్లో॥ ఆగ్నేయాం దిశి కోసల కళింగ వంగోపవంగ జఠరాంగాః
శౌలిక విదర్భవత్సాంధ్రచేదికాశ్చోర్ధ్వ కంఠాశ్చ॥
వృషనాళికేర చర్మద్వీపా విధ్యాంతవాసినస్త్రిపురీ
శ్మశ్రుధర హేమకుడ్యవ్యాలగ్రీవా మహాగ్రీవాః॥
కిష్కింధ కంటకస్థల నిషాదరాష్ట్రాణి పురికదశార్ణాః
సహనగ్నపర్ణా శబ రాశ్చాశ్లేషాద్యా త్రికే దేశాః॥

—♦ దక్షిణదిశి దేశములు - (జనపదములు). ♦—

శ్లో॥ అథ దక్షిణేన లంకాకాలాజిన సౌరికీర్ణా తాలికటాః
గిరినగర మలయదర్దుర మహేంద్రమాలింద్య మరుకచ్ఛాః॥



కంకట టంకణవనవాసి శిబిక ఫణికారకొంకణాభీరాః
ఆకార వేణావర్తక దశపురగోనర్ద కాశ్చ కేరలకాః॥
కర్ణాటక మహాటవి చిత్రకూట నాసిక్యకోల్లగిరిచోళాః
క్రౌంచద్వీప జటాధర కావేర్యో ఋష్యమూకశ్చ॥
వైడూర్యశంఖముక్తాఽత్రి వారిచర ధర్మపట్టనద్వీపాః
గణరాజ్యకృష్ణవెల్లూరా పిశికశూర్పాద్రి కుసుమనగాః॥
తుంబవనకార్మణేయా యామ్యోదధి తాపసాశ్రమాఋషికాః
కాంచీ మరుచీపట్టణ చేర్యార్యక సింహలా ఋషభాః
బలదేవ పట్టనం దండకావన తిమింగిలాశనా భద్రాః
కచ్ఛోఽథకుంజరదరీ సతామ్రపర్ణీతి విజ్ఞేయాః॥

—♦ నైఋతిదిశయందున్న దేశములు - (జనపదములు). ♦—

శ్లో॥ నైఋత్యాం దిశి దేశాః పల్లవ కాంభోజసింధు సౌవీరాః
బడబాముఖాఽరవాంబష్ట కపిలనారీముఖాఽఽనర్తాః॥
ఫేణగిరి యవనమార్గర కర్ణప్రాలేయ పారశవశూద్రాః
బర్బర కిరాతఖండ క్రవ్యాదాఽఽభీర చంచూకాః॥
హేమగిరి సింధుకాలక రైవతక సురాష్ట్ర బాదరద్రవిడాః
స్వాత్యాద్యా భత్రితయే జ్ఞేయశ్చ మహార్ణవోఽత్రైవ॥

స్వాతి, విశాఖ, అనూరాధ నక్షత్రగతములగు దేశములు - జనపదము లెవ్వియన :—

పల్లవ, కాంభోజ, సింధు (సింధురాష్ట్రము) సౌవీర. బడబాముఖ అరవాః (తమిళదేశము), అంబష్ట, కపిల, నారీముఖ. ఆవర్తాః, ఫేణగిరి, యవన, మార్గరాః, కర్ణప్రాలేయ, పరాశవాః, శూద్ర, బర్బరా, కిరాత, ఖండ, క్రవ్యాద, ఆభీర, చంచూక, హేమగిరి, సింధునదీప్రాంతము, కాలక, రైవతక, సురాష్ట్రం, బాదరా, ద్రవిడాః (అరవదేశము), మహార్ణవ ప్రాంతము.

—♦ పశ్చిమదిశయందున్న దేశములు - (జనపదములు). ♦—

శ్లో॥ అపరస్యాం మణిమాన్ మేఘవాన్ వనౌఘః క్షురార్పణాస్త గిరిః । అపరాంతక శాంతిక హైహయప్రశస్త్రాద్రివోక్కాణాః

పంచనద రమఠ పారత తార క్షితిజృంగ వైశ్య కనక శకాః
నిర్మర్యాదా మ్లేచ్ఛాయే పశ్చిమ దిక్ స్థితాస్తేచ॥

మణిపర్వతప్రాంతం మేఘవా, వనౌఘ, క్షురార్పణ, అస్తగిరి ప్రాంతం, అపరాంతకం, శాంతిక, హైహయ, ప్రశస్తాద్రి, వొక్కాణ, పంచనద (సింధునదియొక్క ఉపనదులు ప్రవహించు ప్రదేశము), రమఠ పారత, తారక్షితి, జృంగ, వైశ్యాః, కనకాః. శకాః, మ్లేచ్ఛులు, నిర్మర్యాద ప్రవర్తకులు, గిరివనవాసులు మొదలగువారికి హాని కలుగ జేయును. ఇవి జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢా నక్షత్రగతములగు దేశములు - జనపదములని గ్రహించవలెను.

—♦ వాయువ్యదిశయందున్న దేశములు - (జనపదములు), ♦—

శ్లో॥ దిశి పశ్చిమోత్తరస్యాం మాండవ్య తుషార తాలహలమద్రాః
అశ్మక కులూతహలడాః స్త్రీరాజ్య నృసింహవనఖస్థాః॥
వేణుమతీ ఫల్గులుకా గులుహా మరుకుచ్ఛ చర్మరంగాఖ్యాః
ఏకవిలోచన శూలిక దీర్ఘగ్రీవాస్య కేశాశ్చ॥

ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠా నక్షత్రగతములగు దేశములు - జనపదము లెవ్వియన :—మాండవ్య, తుషార, తాలా, హలా, మద్రి, అశ్మక, కులూతదేశం, హలడా, స్త్రీరాజ్యం; నృసింహవనం, ఖస్థ, వేణుమతీనదీప్రాంతం, ఫల్గులుక, గులుహాః, మరుకుచ్ఛ, చర్మరంగాఖ్య, ఏకవిలోచన, శూలికా, దీర్ఘగ్రీవ, దీర్ఘాస్యులు, దీర్ఘకేశులు.

—♦ ఉత్తరదిశయందున్న దేశములు - (జనపదములు). ♦—

శ్లో॥ ఉత్తరతః కైలాసో హిమవాన్ వసుమాన్ గిరిర్ధనుష్మాంశ్చ
క్రౌంచో మేరుకురుఃత్సతథోత్తరాః క్షుద్రమీనాశ్చ॥
కైకయవసాతి యామున భోగప్రస్థార్జునాయనాగ్నీధ్రాః
ఆదర్శాంత ద్వీప త్రిగర్త తురగాననః శ్వముఖాః॥
కోశధర చిపిటనాస్తిక దాసేరక వాటధాన శరధానాః
తక్షశిల పుష్కలావత కైలావత కంఠధానాశ్చ



అంబర మద్రకమాలవ పౌరవకచ్ఛారదండ పింగలకాః
మాణహాలహూణ కోహాల శీతకమాండవ్య భూతపురాః॥
గాంధార యశోవతి హేమతాల రాజన్య ఖచర గవ్యాశ్చ
యౌధేయ దాసమేయాః శ్యామాకాః క్షేమధూర్తాశ్చ॥

శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రగతములగు దేశములు - జనపదము లెవ్వియన :—కైలాసపర్వతప్రాంతము, హిమవత్పర్వత ప్రాంతము, వసువులుండెడి పర్వతప్రాంతములు, ధనుష్మంతులుండెడి పర్వతప్రాంతము, క్రౌంచద్వీపము, మేరుశిఖరప్రాంతము, కురువత్స దేశమునకు ఉత్తరముగా నుండెడి ఉత్తర కురుదేశము, క్షుద్రమీన భక్షకులు, కైకయరాజ్యం, వసాయతి, యమునానదీప్రాంతము, భోగప్రస్థ (ఇంద్రప్రస్థము లేక ఢిల్లీకి సమీప ప్రాంతము) అర్జునాయనం అగ్నీధ్రి, ఆదర్శా, అంతర్ద్వీపవాసులు, త్రిగర్తదేశము, తురగాననులు, శ్వముఖులు, కోశాగారులు, ధనవంతులు, చిపిటనాసికలుగలవారు, దాసేరకులు, వాటధానులు, శరధానులు, తక్షశిలా, పుష్కలావతం, కైలావతం, కంఠధానులు, అంబరావతులు, మద్రిక, మాలవ, పౌరవ, కచ్ఛార, దండపింగలకులు, మాణహాలులు, హూణులు, కోహాలులు, శీతకులు, మాండవ్యులు, భూతపురవాసులు, గాంధార, యశోవతినగర ప్రాంతీయులు, హేమతాల ప్రాంతీయులు, రాజులు - ఖచరులు - గవ్యులు - యోధులు - దాసమేయులు - శ్యామకులు క్షేమధూర్తులు మొదలగువారికి కష్టనష్టములు కలుగజేయును.

—♦ ఈశాన్యదిశయందున్న దేశములు - (జనపదములు). ♦—

శ్లో॥ ఐశాన్యాం మేరుక నష్టరాజ్య పశుపాల కీర కాశ్మీరాః
అభిసారదరత తంగణ కులూత సైరంధ్రి వనరాష్ట్రాః॥
బ్రహ్మపుర దార్వడామర వనరాజ్య కిరాత చీన కౌణిందాః
భల్లాః పటోల జటాసుర కునట ఖస ఘోష కుచికాఖ్యాః॥
ఏకచరణానువిద్ధాః సువర్ణభూర్వసు ధనం దివిష్ఠాశ్చ
పౌరవ చీరనివాసి త్రినేత్ర ముంజాద్రి గాంధర్వాః॥

రేవతి - అశ్వనీ - భరణి నక్షత్రగతములగు దేశములు - జనపదము లెవ్వియన :—మేరుపర్వత ప్రాంతము - నష్టరాజ్యం - పశుపాలా - కీరాః - కాశ్మీరం - అభిసార - దరదా - తంగణ - కూలూతదేశం - సైరంధ్రాః - వనరాష్ట్ర - బ్రహ్మపురం - దార్వాః - డామర - వనరాజ్యం - కిరాతదేశం - చీనాదేశం - కౌణిందా - భల్లా - పటోలదేశం - జటాసురదేశం - కునటదేశం - ఖస - ఘోష - కుచికాఖ్య దేశం - ఏకచరణ - అనువిశ్వాః - సువర్ణభూ - వసుధానం - దివిష్ఠ పౌరవ - చీరనివాసినః - త్రినేత్రులు - ముంజాద్రి - గాంధర్వ.

—♦ విశేష శ్లోకములు. ♦—

శ్లో॥ భత్రయ మాగ్నేయాద్యం మధ్యం ప్రాక్ ప్రభృతిచ ప్రదక్షిణతః
కథయామి ప్రవిభాగం రౌద్రాత్ప్రాగాది దేశానామ్॥
మధ్యముదక్పాం చాలావంగా యమునాంతరం కురుక్షేత్రం
ఉదగపిచ పారియాత్రా త్పరమథవాఽయోగ్య మాత్స్యాశ్చ॥
సారస్వత యామునవత్సఘోష సంఖ్యానసీప మాండవ్యాః
భద్రారిమోద నైమిష సాల్వాః పజ్యోతిషాశ్వత్థాః॥
ఔదుంబరోఽథ కుకురో జ్జిహాన గజసాహ్వ కంకపాండుగౌడాః
మధ్యమకో ద్దేహికకాలకోటి కాపిష్ఠ లాశ్చేతి॥
మధ్యేఽయం ప్రవిభాగః శేషర్క్షాణాం తథా దిశే ద్దేశాః
ప్రఖ్యాత దేశమధ్యానన్యాం శ్చైవాభిధాస్యామి॥
ఆర్ద్రాదికాశికోసల మిథిలోత్కల వర్ధమానపౌండ్రోడ్రాః
లౌహిత్య మగధ సమతట మేకకలాంబష్ట తామ్రలిప్తాఖ్యాః॥
ఆశ్లేషాద్యే త్రిపురీ నిషాద రాష్ట్రాణి చేదిక దశార్ణాః
శూలిక విధ్యాంత స్థాన తాన్ధ్ర విదర్భ కలింగాః॥
ఆర్యమ్ణాద్యే చేదిక కొంకణ వనవాసి కోల్లాగిరి మలయాః
ఉజ్జయినీ భరుకచ్ఛాదికాశ్చ యామ్యార్ణవో యావత్॥



స్వాత్యాద్యే వింధు సౌవీర కాపిల వనితాస్య మార్గకా నర్తాః
బర్బర యవన సురాష్ట్రిక కాంభోజ ద్రవిడ రైవతకాః॥
జ్యేష్ఠాదితోఽపరాంతకశక హైహయజృంగ పాంచనదకతకాః
నిర్మర్యాదా మ్లేచ్ఛాః శాంతిక వోక్కాణ వైశ్యాశ్చ॥
విశ్వేశ్వరాది శూలికతాల తుషారైక నేత్ర మాండవ్యాః
స్త్రీరాజ్యచర్మరంగాశ్మక లడహారుహక ఫాల్గులుకాః॥
శతభిషగాద్యే కేకయ గాంధారాదర్శ యామునాగ్నీధ్రాః
దాసేయ చిపిటనాసార్జునాయనా దండ పింగలకాః॥
పౌష్ణాద్యే కాశ్మీర త్రిగర్త దరదాభిసార చీనఖసాః
తంగణకిరాత కీరా బ్రహ్మపుర జటాసురాశ్చేతి॥

—ఆచార్యః.

—♦ కృత్తికాది నక్షత్రదేశ ప్రయోజనము. ♦—

శ్లో॥ వర్గైరాగ్నేయాద్యైః క్రూరగ్రహపీడితైః క్రమేణ నృపాః
పాంచాలో మాగధికః కాలింగశ్చ క్షయం యాతి॥
ఆవంత్యోఽథానర్తో మృత్యుంచాయాతి సింధుసౌవీరః
రాజాచ హారహౌరేశా మద్రేశోఽన్యశ్చ కౌణిందః॥

ఆగ్నేయాదిగా కృత్తికాదివర్గ నక్షత్రములందు క్రూరగ్రహసంచారము గాని, క్రూరగ్రహ వేధలుగానియున్నచో (రవి, కుజ, శనులు క్రూరగ్రహములు) క్రమముగా రాజులు నశింతురు. కృత్తికాదివర్గమందు క్రూరగ్రహస్థితి, వేధలున్నచో పాంచాలదేశాధిపతి. ఆర్ద్రాదివర్గమందున్నచో మగధదేశాధిపతి. ఆశ్రేషాదివర్గమందున్నచో కళింగదేశాధిపతి, ఉత్తరాదివర్గమందున్నచో అవంతిదేశాధిపతి. స్వాత్యాదివర్గమందున్నచో దుర్మార్గులు చోరులు ప్రబలుదురు. (ఆనర్తులు) జ్యేష్ఠాదివర్గమందున్నచో సింధు, సౌవీరదేశాధిపతులకు మరణము కలుగజేయును. ఉత్తరాషాఢవర్గమందున్నచో హారహారవంశరాజులు మరణించెదరు. శతభిషవర్గమందున్నచో మద్రదేశాధిపతి మరణించును. రేవతీవర్గమందున్నచో మిగతా దేశాధీశులు (కోణిందులు) మరణింతురు.

రెండవ అధ్యాయము సమాప్తము.



# సిద్ధాంతసరళి.

## ద్వితీయ భాగము

ఆంధ్రావనిలో అధిక ప్రఖ్యాతివహించినవారిలో యే కొద్దిమందియో యుందురు. అందులో గణితశాస్త్రములో నిమ్మగడ్డవారు అందె వేసినచేతులు. ఆ నిమ్మగడ్డవారిచే యీ గ్రంథమును వ్రాయించితిమి. అనేక వ్యయప్రయాసలకోర్చి మీకొఱకు దీనినిప్పుడు వెలువరించితిమి. పాశ్చాత్యులు కోటానకోట్లువెచ్చించి కాలమానగతులే తెలుసుకోలేక పోయారు. మన పూర్వఋషులు వారి తపోమహిమచే గ్రహణము పట్టుట, సూర్యుడుదయించుట, వర్షములుకురియుట, పంటలుపండుట, ధనాభావముగలుగుట, లోకోత్పత్తి, సృష్టిక్రమము, జంతుజననము, తన్నాశము, మొదలగునవెన్నియో భరతఖండమునకు భాగ్యరాసులగు మహాఋషులు గీర్వాణభాషలో మన కనుగ్రహించినారు. దానికి తెనుగుసేత యీ 'సిద్ధాంతసరళి' పండితపామర హృదయానురంజకముగా వ్రాయబడినది. ముఖ్యముగా పంచాంగకర్తలకు ముఖ్యావసరము. నేడే ఒక ప్రతి తెప్పించుకోండి.

పంచాంగమంటే మామూలుమాట కాదు. గ్రహముల మీకట్టెదుట గన్పరచుట. అట్టి పంచాంగము వ్రాయుపద్ధతి యిందులో యున్నది. ఏకారిలో ధాన్యములధరలు యెట్లుండునూ అంటే యీ పుస్తకమును చూస్తే మీకే తెలిసిపోతుంది. ఇంతెందుకు? దీనిని చదివిన తర్వాత నీ గ్రామానికి నీవొక అపరబృహస్పతివే.

వెల రు. 2—0—0

వలయువారు:—

# కొండా శంకరయ్య

**బుక్‌సెల్లర్స్ అండ్ పబ్లిషర్స్**

**శికంద్రాబాద (దక్కన్)**

బ్రాంచి:—మెయిన్‌రోడ్, వరంగల్.

TOTAL Rs.

E. & O. E.

R/R Through

C. Form

Case No.

T.R. or RR. or Challan No.

Dated

Checked by